శ్రీ రస్తు.

# విజయాశ్వచరిత్రము

## పద్యకావ్యము.

ఇది.

బ్రహ్మశ్రీ, పురాణం - పిచ్చయ్యగారిచే
విరచింపఁబడె

మద్రాస్ చాకలపేట

వీరభారతీ అండు కంపెనివారిచేఁ

ప్రకటితము.

 1928. వెల 1-8-0.



## ప్రకటన.

ఈ గ్రంథమును ముద్రించుటకై అసలుప్రతిఁ జూచి ఎత్తి వ్రాసి యిచ్చినవారలోపములవలనను, అచ్చువేయునపుడు పరిష్కరించినవారి పొరబాటులవలనను గొన్ని వ్యాకరణలోపములు కలిగినవి. వానిని పునర్ముద్రణమున సవరించి ముద్రింపించుచున్నాఁడను, కావున పాఠక మహాశయులు మన్నింపవలయు నని ప్రార్థించెద.

ఇట్లు గ్రంథకర్త.

పురాణం - పిచ్చయ్య.

# విజ్ఞప్తి.

మహాశయులారా !

విజయాశ్వచరిత్ర మనెడి యీ ప్రబంధమును నేను బహుకాలము క్రిందటనే వ్రాసితిని. ఇది మదీయపాండిత్యమును నిరూపించుటకై వ్రాయఁబడినది కాదు. భక్తివలననే వ్రాసినాఁడ. మావంశమునం దింతకుఁ బూర్వము కవులుండినది కాని, కావ్యములు రచించినది కాని లేదు. ఈ భాగ్య మెట్లింత నాయం దంకురించినది. శ్రీమద్వేంకటేశ్వరునియనుగ్రహమునం గలిగిన కవితాధారనడంపఁజాలక ప్రబంధరచనకుం దగిన సామర్థ్యము నాకు లేకపోయినను, దేవునికరుణచేఁ గలిగిన యూహయే యూఁతగాఁ గొని సాహసించి విచిత్రమైన యీ ప్రబంధమును రచియించి శ్రీయఃపతియైన వేంకటేశ్వరున కర్పణముఁ జేసితి. ఇది పూర్వకవులమార్గము ననుసరించి వ్రాయఁబడిన ప్రబంధము. ఇందుఁ జదువుటకింపుగా నుండు నూతనవిషయములు పెక్కులు కల్పించి క్రొత్తదారిం ద్రొక్కియున్నాఁడ. ఇందలి గుణావగుణంబులు చక్కఁగా విమర్శించు భారమును బాఠకులమీఁదనే యుంచితి. దయయుంచి తప్పుల నెఱింగించినవారికిఁ గృతజ్ఞుఁడనై భక్తితోఁ గైకొని పునర్ముద్రణమున సవరించి యచ్చొత్తించెద. కొంత కాలము క్రిందట వ్రాయఁబడినను ముద్రించుటకు ద్రవ్యోపపత్తి లేమిచే నిలిచియున్న యీగ్రంథమును, నిటీవలఁ జెన్నపురి వీరభారతీ అండు కంపెనీవారికి నామనఃపూర్తిగా ముద్రించుటకు నిచ్చితిని. ఇంతియగాక రిజిస్టర్డ్ కాపీరైట్ హక్కునుగూడా వీరి కొసంగితిని. వీరు నాయాశీర్వాదమునకును శ్రీమద్వేంకటేశ్వరుని యనుగ్రహమునకును బాత్రులైరి. వీరికి దేవుఁ డాయురారోగ్యభాగ్యముల నొసంగుఁగాత! నే నీగ్రంథమును బండితాభిప్రాయము నభిలషించి చూపఁగా దయతోఁ గడవఱకును జదివించి విని యిందలి నెఱసులను దిద్ది నన్నుఁ గృతార్థునిగాఁ జేసిన మహోపాధ్యాయ బ్రహ్మశ్రీ, వేదము వేంకటరాయశాస్త్రులుగారికిని గ్రంథమును బఠించి యచ్చటచ్చటఁ దగిన మార్పులను సూచించి మహోపకారము నొనర్చిన, నెల్లూరు నివాసులగు బ్ర. శ్రీ. దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారికిని సదా కృతజ్ఞుఁడనై హృదయపూర్వకవందనములను సమర్పించుచున్నాఁడను.

ఇట్లు విన్నవించు గ్రంథకర్త.

# వి జ్ఞ ప్తి.

---

బుధజనవరేణ్యా!

తమచేఁ బండితపామరుల పఠనమున కెంతయు ననుగుణంబుగ నుండునట్లు తేట తెనుఁగున మృదుమధురశైలిని వ్రాయఁబడిన "విజయాశ్వచరిత్ర" మనెడి గ్రంథము నా మూలాగ్రముగాఁ జదివి యందలి సారాంశము గ్రోలి యానందాబ్ధిని దేలినాఁడ. కథాంశము మిక్కిలి వినోదకరమై చదువఁ జదువఁ జవులూరుచుండెడిని. మఱియు నయ్యది, కవి దిగ్గజములని కీర్తిగడించిన కవులలో నొక్కరుఁడగు నల్లసాని, పెద్దనామాత్యులచే రచింపఁబడిన "స్వారోచిషమనుసంభవ"మను మహాప్రబంధమునకుఁ జాటియగు నని తలంచెద. తమకుఁ గల లోకజ్ఞానమును, భాషావైదుష్యమును, కల్పనాచాతుర్యమును నేతద్గ్రంథమే తెలియఁజేయుచున్నది. కావున భాషాలోకము నుద్ధరించుటకై తమరిట్లే కొన్ని కబ్బములు రచింపఁ గలరని ప్రార్థితుఁడను.

విన్నవించు.

బుధజనవిధేయుఁడు.

జక్కుల. స్వామినాథుఁడు.

ముత్యాలపేట హైస్కూల్. ఆంధ్రోపాధ్యాయుఁడు, మద్రాసు.

ఆర్యా!

నేను దమ విజయాశ్వచరిత్రమును బోలంగాంచి యానందలహరిం దేలితి. తొమ్మిదాశ్వాసముల ప్రబంధమును స్వకల్పనాకథగా రచించిన నిరాఘాటమగు నీయూహను వర్ణింపవలెనని యెంచిన నొకవేళ సహస్రవక్త్రుఁడగు శేషునకగునేమో తక్కిన వారికిఁ దరంబుకానేరదు. పూర్వభాగ మెంతయు నవరసాలంకారభూయిష్ఠమై యుప్పొంగుచుఁ జదువరుల డెందముల కెంతయు నానందమును గలిగించెడిని. ఉత్తరభాగము భక్తిరసాలవాలమై పామరుల మనంబున భక్తిలతనంకురింపఁ జేయుచున్నది. రచన మృదుమధురముగా నుండుటయేగాక పూర్వకవులదారి ననుసరించియున్నది "ప్రమాదోధీమతామపి" అనునట్లచ్చటఁ గొన్ని లక్షణవిరుద్ధములు తటస్థించెడిని. ఐనను నేతత్ప్రబంధము మహాకవులు రచించిన లక్ష్యగ్రంథములలో నొకటి యగునని, పండితమండలిచేఁ బొగడొందఁ గలదని యూహించెద.

ఇట్లు తమమిత్రుఁడు,

చం. మల్లయ్య.

శ్రీరస్తు

# విజయాశ్వ చరిత్రము.

## పూర్వ భాగము.

---

### ప్రథమాశ్వాసము.

శా. శ్రీకల్యాణ గుణావళీకలితుఁడై - శేషాద్రిపైఁ జేరి ప
ద్మాకాంతామణి సంతతంబు నలమే - ల్మంగాఖ్యతోఁ గొల్వ న
స్తోకానంద మెలర్పఁగా సుజనసం - దోహంబుఁ బాలించు నా
శ్రీకాంతుండగు వేంకటేశ్వరుఁడు మే - ల్చేకూర్పు మాకుం గృపన్. 1

సీ. క్షీరసాగరముయే - చెలువకుఁ బుట్టిని - ల్లంబుజం బేరామ - కాటపట్టు
కలువలరాయఁడే - కాంతకు సోదరుం - డఖిలసంపదలకే - యతివవోటు
పుష్పాస్త్రుఁ డేమించు - బోఁడికి నూనుండు - భక్తులకే కొమ్మ - పట్టుఁగొమ్మ
యుర్వరారమణియే - యువతిసపత్నియా - దైత్యారియే యువి - దకు విభుండు

గీ. అట్టిపద్మాపరాకృతి - యైనయంబు । జాక్షి యలమేలు మంగద - యాంతరంగ
పుణ్యగుణ నికరోపేత - భువనమాత । సిద్ధవిఖ్యాత మమ్ముర - క్షించుఁగాత. 2

ఉ. తోయరుహాక్షి యైన తన - తొయ్యలి భారతి పల్కుతోడుగా
శ్రేయ మెలర్ప లోకములు - సృష్టి యొనర్చుచు నేర్పు మీఱినా
మ్నాయ చతుష్టయంబుఁ దన - నాలుగుమోములఁ దాల్చు ధాత దీ
ర్ఘాయురభీష్ట సౌఖ్యముల - నాదట మాకు ఘటించుఁగావుతన్. 3

చ. చెలువలరారఁగా విభుని - చెంగటఁ జేరి శుభాయతాంగుళీ
కలనవిపంచి మీటుచుఁ బ్ర - గాఢమనోహర లీలగానముల్
సలిపిని జేశు మెప్పుఁగొను - సన్నుతబంభరవేణి వాణితా
వెలయ నొసంగుమాకు సుక - విత్వమహత్త్వము వాక్పటుత్వమున్. 4

ఉ. పాయని కూర్మి పెంపున స - పత్నికి మేనసగంబొసంగుటన్
మాయెడ నీమ హెంగలుగు - మక్కువ నేటికిఁ గాననయ్యె మే
లాయె నటంచు నీర్ష్యతోలు - కాడఁగఁబల్కెడు గంగ నాదలం
గాయువు మీఱఁ జేర్చిన జ - గత్పతి శర్వుఁడు ప్రోచు మమ్మొగిన్. 5

చ. పతి నెడఁబాయలేమి సగ - పాలు శరీరమునన్ వసించి యం
చితగతి లోకరక్షణము - సేయఁగఁ దోడ్పడి తానిజేశు స
మ్మతిభజియించు భూధరకు - మారిబలారి ముఖాదితేయ వం
దిత దయసేయుమాకు సము - దీర్ణమతిన్ సతతంబభీష్టముల్. 6

మ. గిరిజాంకస్థలిఁజేరి బాల్యమున రా - గిల్లంగఁ దాఁదొండమున్
సురవంద్యుండగు చంద్రశేఖరు జటా - జూటంబు పైఁజాఁచి య
బ్బురమాభంగిని నీరుఁ బీల్చికొని తా - ఘూత్కారముంజేసి తుం
పరముత్తెంబులురాల్చు విఘ్నపతివే - వారించు విఘ్నంబులన్. 7

క. అనయంబును సద్భక్తిన్ । వినుతించెద నేలటూరి - వేంకటరామా
ర్యుని మద్గురువర్యుని పా । వనునిన్ విద్యావిశాలు - వరగుణజాలున్. 8

చ. వెలయఁగ నామదిందొలుత - వేంకటనాథుని మంత్రబీజమున్
మెలఁకువ నాటిభక్తియను - నీరిడి బోధమొనర్చి ప్రేమ్మిడిన్
మొలకజనింపఁజేసి ఫల - ముంగొను లాగెతీఁగించినట్టి స
ద్విలసితలోక సన్నుత వి - వేకను సజ్జననిన్ స్మరించెదన్. 9

సీ. ప్రాకటవిలసద్వి - వేకివాల్మీకిని - నఖిలశాస్త్రార్థవి - న్యాసువ్యాసు
విరచితశబ్దప్ర - వీణానిబాణుని - కాకవివ్యాళశి - ఖండిదండి
సజ్జనస్తోమవ - శంకరుశంకరు - కావ్యరసోల్లాసుఁ - గాళిదాసుఁ
బ్రతిపక్షపండిత - వనహేతిభవభూతి - లలితప్రసంగావ - లంబుసాంబు

గీ. మఱియు భారవిమల్హణ - మాఘముఖ్యు । లైన సంస్కృతకవులన - త్యంతఘనుల
నతులితంబైన భక్తిమై-నభినుతింతు । మత్కవిత్వంబు నిరతంబు-మహినివెలయ. 10

క. వినుతింతు నిలఁగవిత్రయ । మనికీర్తి వహించినట్టి - యమలమతుల నో
లిని నన్నయతిక్కనవె । ఱ్ఱనలన్ సరిలేని గరిమ - నందినఘనులన్. 11

ఉ. సన్నుతిఁ జేసెదన్ సుకవి - చంద్రులనన్ భువిఁబేరుగొన్న పె
ద్దన్నను దిమ్మనార్యునన - నంతునిమూర్తిని రామభద్రు సూ
రన్నను సోమభాస్కరుని - నయ్యన మంత్రిని రామకృష్ణు జ
క్కన్నను భట్టుధూర్జటిను - పోతన్నలకేతనమల్లయాద్యులన్. 12

చ. తమకు కడింద్రియైనయది - తప్పని చెప్పుదు రుర్విఁగాకవుల్
సుమతులు సద్గుణోజ్జ్వల వి - శుద్ధవచో మధురార్థభావము
ల్కమియముగఁ గాంచి చాలమని - రక్తివహింతురు కుక్కుటంబు ర
త్నముగని గింజగాదనుచు - తాఁచినదాని ఘనుల్ధరింపరే. 13

ఉ. క్షీరము నీరముం గలిపి - చెంగట నుంచిన నందు హంసము
క్షీరములం గ్రహించుఁ బరి - కించు బకంబులు నీచునత్తలా
తీరునఁ గావ్యముల్గని సు - ధీమణులొప్పులు గొందురు కాకవు
ల్నేరము గల్గమిన్ బరిగ - ణింతురు తప్పుల నెల్లవేళలన్. 14

గీ. పరగ సందర్భ సముచిత - భావరసగు | ణాదు లెఱిఁగి సంతోషింతు-రలఘుమతులు
కాకవులు గానఁగాఁజాల-రాకు మీఁద | తేనె యని వ్రాసి రుచిచూచి- తెలియవశమె. 15

ప్రబంధ ప్రశంస

ఉ. ఉత్తమ కావ్యకల్పనకు - యోగ్యత చాలదటంచు నిస్పృహా
యత్తమతిం దలంకఁ బగు - నాయిది బాగది యోగటంచు దాఁ
జిత్తమునం దలంపక న - చింపఁబడుం గృతి యెట్టిదైన నా
నిత్తడి సంటకుండుదురె - హేమము గల్గిన వారలిద్ధరన్. 16

ఉ. ఎక్కుడు తత్సమోక్తులెన - యింపక దీర్ఘసమాస కల్పనల్
దక్కు విశేష వర్ణనల - దవ్వొనరించి నిగూఢశబ్దము
ల్చిక్కటి లంగనీయక న - వీనముగాఁగను పట్టుభంగి నే
నిక్కృతి సల్పి వేంకట గి - రీశ్వరునిం దదధీశుఁ జేసెదన్. 17

ఉ. నీచుల సల్పులన్ ఖలుల - నిచ్చలు దీనత నాశ్రయించియున్
యాచన చేసియుం బొగడి - యర్థితముం బడయంగలేక వాం
ఛాచలితాత్ములై మదివి - షాదము నొందుట కన్న నచ్యుతున్
దోఁచిన భంగి నెంచి పరి - తోషము గాంచుట యొప్పుదే భువిన్. 18

సీ. పరులకావ్యములశ-బ్దంబులు దొంగిలి - నేర్పుఁ జూపఁగ వానిఁ-గూర్పలేదు
ప్రజలకు నాప్రౌఢిఁ-బ్రకటించి కీర్తివ - హింపఁగా మదిని భా-వింపలేదు
కవిమండలంబునఁ గడు మేటియను ఖ్యాతిఁ - గొనుటకు నేఁ గోర్కెఁ-గొనఁగలేదు
ప్రతిఫలాపేక్షచేఁ-బ్రబలులౌ విత్తవం - తులకంకితము సేయఁ-దలఁపలేదు

గీ. సత్యమిది పూని వేంకటే - శ్వరప్రప | సాదలబ్ధనిరాఘాట-సహజశక్తిఁ
దనర రచియించి యీకృతి-ఘనతమీఱ | నర్పణం బొనరింతున-య్యచ్యుతునకు. 19

చ. కలవు మహాకవీంద్రకృత - కావ్యములెన్నియొ యైన నన్నియున్
సలలితభంగి మున్నుగల - సంస్కృతమాతృకలం గ్రహించి యిం
పలరఁ దెలుంగు చేయఁబడి - నట్టివి కావున నిష్ఠుపూన్కిమై
సలుపుదు నే స్వతంత్రమగు - సన్నుత హృద్యనవప్రబంధమున్. 20

చ. ఇలను మహాప్రవీణుల న - నెన్నిక కెక్కిన కాళిదాసము
ఖ్యులు సయితంబు దాము జన - కోటికి నెల్లమనఃప్రియంబుగాఁ
బలుకఁగ లేకపోయి రట - పండిత సంతతి తృప్తిఁ జెందఁగాఁ
బలుకుట కింక నాతరమె ? - పామరుడన్ రహితావధానుఁడన్. 21

ఉ. ఐనను వేంకటేశ్వర ద - యాపరి లబ్ధకవిత్వధార నా
లోననడంపలేక కవి - లోకము మెచ్చిన మెచ్చకున్న నే
మైనను నయ్యోనంచిటు మ - హాకవియుంబలె యీప్రబంధమున్
పూని రచించినాఁడను న - పూర్వ మనోగతచాపలంబునన్. 22

గీ. సూతుఁడిది శౌనకాది ఋషులకుఁ జెప్పె । ననియు నెందో పురాణంబు-నందుఁగలుగు
ననియుఁ గొండటీ కథఁ జెప్ప-గినిగనకుఁ । బూనితదియయాధారంబు-దీనికరయ.

చ. ఇదిగని యీకవిత్వమున - నెంతని చుల్కనఁ జేసి నాపయిన్
బదరి నిరాకరింపకుఁడు - పండితులార ! కవీంద్రులార ! స
మ్మదమున నిందుమీరు గుణ - ముల్గొని తప్పులు దిద్దిచాలనిం
పొదవఁగఁ జేయుఁడయ్య దయ - యుంచి మిమున్ వినుతించి మ్రొక్కెదన్. 23

క. ఇదిచదివిన మఱియొక కథ । మదికింపుగఁ దోఁపఁ దట్టి - మనుజునకైనన్
ముదమున రేలుంబవలులు । నదలక యిదెరలఁచుచుండ - వలయుంజుండీ. 24

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును సుకవిజన నమస్కారంబును కుకవినికర తిరస్కారంబునుంగావించి సముచిత నవీనకావ్య కల్పనానూన కుతూహలాయత్తచిత్తుండనై, యలమేలుమంగాధినాథకరుణాకటాక్షవీక్షాసమాసాదిత కవిత్వమహత్త్వంబు విలసిల్ల సల్లలితపల్లవారుణ చరణారవిందుండగునమ్మకుందున కభివందనముగావించి మించిన భక్తిషష్ఠ్యంతంబులువివరించెద. 25

షష్ఠ్యంతములు.

క. అబ్జారి ధరునకున్ ద్రుహి । ణాబ్జారి నుతాంఘ్రి నిర్మ - లాంభోజునకున్
కుబ్జాలం పటునకునుగ । కుబ్జాల వరాశ్రయునకుఁ గుబ్జాకృతికిన్. 26

క. పరునకు మురహరునకు శుభ । కరునకు ధరధరున కభయ - కరునకుభక్తా
దరునకు సుభరునకును । స్థిరనపు సుందరునకప్ర - తిప్రవరునకున్. 27

క. రక్షోవర శిక్షాపర । దీక్షానిరతునకు సత్కృ-తి క్షేమమునకున్
సాక్షాన్మద మోక్షప్రద । సాక్షిపదస్థలున కార్య-జనపాలునకున్ 28

క. పరిశుద్ధ చరిత్రునకున్ । గిరిశిఖరాగ్ర ప్రదేశ - గేహునకుదయా
శరధి కపవర్గమార్గ । స్ఫురణోదయ సత్త్వభావ - శోభాకృతికిన్. 29

క. సమరాహతామరాహిత। సమరహిత మహాప్రసిద్ధ - శౌర్యానకులస
ద్రమణీయ వేషునకు భూ। రమణునకున్ పావనునకు - రాజ ముఖునకున్. 30

క. ధీరునకున్ భీకరకుం। భీరహారునకున్ జలధిగ - భీరునకఖిలా
ధారునకున్ సజ్జనమం। దారునకు ననర్ఘ రమ్య - తరహారునకున్. 31

క. మతిమంతునకున్ శాంతున। కతులితునకు దాంతునకును - జ్ఞానరతునకున్
చ్యుతదోషునకు సమంచిత। యతిపోషునకు స్మరణీయ - యవిభూషునకున్. 32

క. అంగజితాంగజునకు మా। తంగాధిప సంధ్యునకుఁ బ - తంగ నిభునకున్
సంగవిదూరున కలమే। ల్మంగాపతి కఖిలలోక - మాన్యోన్నతికిన్. 33

క. ప్రతిరహిత మహితనుతికిన్। సతతాహితకావ్య కర్తృ - జనధికృతికిన్
శ్రితనుత భవ్యాకృతికిన్। హతకల్మష గతికి వేంక - టాచలపతికిన్. 34

వ. అంకితంబుగా నా యొనర్పంబూనిన విజయాశ్వ చరిత్రంబను నవీన విచిత్రకావ్య
కల్పనంబునకు ప్రారంభంబున మదీయవంశక్రమం బెఱింగించెద నెట్లనిన. 35

కవివంశక్రమము

క. అజముఖ సంభవులై భువి। ద్విజులున్నతిఁ గాంచిరతివి - వేకస్ఫురణన్
యజనాదిక షట్కర్మల। సుజనిం బ్రాపించి నిత్య - శుభవర్తనులై. 36

క. వారలు తమలోన సదా। చారంబుల ధర్మములను - సంబంధములన్
వేరై నానాటికి వి। స్తారంబగు భేదములను - దనరిరిధాత్రిన్. 37

ఆ. అటుల భిన్నజాతు - లైనట్టి విప్రుల। యందు వైదిక క్రి - యాభిరతిని
మించి వన్నెకెక్కి - రంచిత సుజ్ఞాన। విభవ మమరఁ గాద్ర - విడులుమహిని. 38

క. వెలయం ద్రావిడులగు వి। ప్రులునుం దమలోన భేద - ములఁ జెందిరి వా
రలలోనఁ గంద్రమాణి। క్యులను బృహచ్చరణ వంశ - మున్నతిఁ జెందెన్. 39

గీ. కంద్రమాణిక్యులం దొక్క-కాలమందు। ఘనతనొందిన పదియు నొ-క్కండుగోత్ర
ముల కుటుంబులు తమదేశ-ముఁద్యజించి। సిరికి నెలవగు నెల్లూరు-సీమఁజేరి. 40

క. అప్పటి కాలపు నృపులన్। విప్పుగ శాస్త్రప్రసంగ - విద్యామహిమన్
మెప్పించి యొక్కగ్రామము। నొప్పుగఁ గొనియందు నిలిచి-యున్న తిదనరన్. 41

క. అదినూతనముగఁ గొనుటన్। విదితముగఁ బుదూరటంచు - పేరిడిరి జనుల్
పుదుశబ్దము నూతనమను। పదమై ద్రావిడుల పల్కు - బడివర్తిలుటన్. 42

క. ఆవిద్యాధికులుః పుదూ। ద్రావిడులను పేరునొంది - తగనది మొదలెం
తేవై భవంబు మీఱం। గా విఖ్యాతిని గడించి - కనిరూర్జితమున్. 43

సీ. అసమానవేదశా-స్త్రాభ్యసనానంద - ధౌరేయమతులు పు-దూరువారు
రమ్యేతిహాసపు-రాణనుసాహిత్య - పారగులుర్వీఁబు-దూరువారు
వేదవేదాంగస-ద్విషయ ప్రసంగాది - యోగ్యతాధనులు పు-దూరువారు
సంతతభూవరా-స్థానసమ్మానమ - హోత్సవాస్పదులు పు-దూరువారు
గీ. స్నానసంధ్యాద్యనుష్ఠాన-సత్క్రియాంచి । తోత్తమోద్యోగ రతులు పు-దూరువారు
సహజ సత్యాభిమాన ప్ర-శాంతధర్మ । గౌరవోదార ధృతులు పు- దూరువారు. 44

క. భావింపఁగ నసమాన । శ్రీవైభవ కలితులగుచుఁ - జెన్నొంది బుధా
ద్రావిడులు వృద్ధిఁ జెందిరి । వారిరి సమ్మోద మెసఁగ - వారలలోనన్. 45

సీ. శ్రీవత్సగోత్రవ-ర్ధిష్ణుఁడాపస్తంబ - సూత్రుఁడంచితకీర్తి-సుగుణమూర్తి
ధాత్రీసురాన్వయో-త్తముఁడు సుస్థిర కరు - ణాకరుండు చిర-గుణాశ్రయుండు
ప్రకట సదాచార-వర్తనానూన ప్ర - తిష్ఠాపరుండును-ధీగురుండు
సన్నుత శాస్త్రప్రసంగ నిరాఘాట - చాతుర్యయుతుఁడుస-జ్జనవినుతుఁడు
గీ. అభినవ వరేణ్యుఁడసమప్ర-త్యాగగణ్యుఁ।డధిక ధర్మప్రియుండు పు-ణ్యాశ్రయుండు
సంతతోదారుఁడనఘుఁడు-సద్విచారుఁ। డర్థి జనపోషకుఁడు కృష్ణ-యార్యఘనుఁడు.

క. రాణన్ రాజులకడఁ జౌ । రాణికుఁడై యుండి యాధ - రానుగమణి య
క్షీణోన్నత దశనొంది బు । రాణము కృష్ణయయనంగఁ - బ్రస్తుతి వడసెన్. 47

ఉ. ప్రాకటభోగశాలి మృదు - భాషి పురాణము కృష్ణయాఖ్యుఁడ
స్తోకవివేక శీల పరి - శుద్ధగుణాదులఁ జాలమించిని
ష్ఠాకరులైన విప్రులని - రంతరముం దనయింటనిల్పి తా
వీకున నాదరించు నయ - వేదులకార్యము లిట్టివే కదా. 48

క. దానంబు నిదానంబభి । మానంబ సమానబుద్ధి - మహిమయుఁ దనరం
గా నిఖిలజనులు వొగడం । గా నతఁడుర్వీసురాగ్ర - గణ్యుండయ్యెన్. 49

శా. నిర్జించెన్ దనపాండితీ మహిమఁరా - ణింపన్ విపశ్చిత్తతిన్
వర్జించెన్ మదినిందిత క్రియలపై - వాంఛన్; జనుల్మెచ్చఁగా
నార్జించెన్ విలసద్దిగంతగతవి - ఖ్యాతిన్ ముదంబొప్పఁగాఁ
బర్జన్యాభుని కృష్ణయార్యుని నుతిం - పం జెల్లదే నిచ్చలున్. 50

శా. ఆదోషజ్ఞవరుండు దాబరిణయం — బయ్యెన్ వివేకించి సౌ
మ్యాదిశ్రేష్ఠ గుణప్రయుక్తయగు మం - గాంబన్ దయాలంబ స
మ్మోదాలంబను భూసురాననజితాం - భోజారిబింబన్ మహా
వైదగ్ధ్యాన్వితఁ బోషితార్థినికరం - బన్ సత్కుటుంబోద్భవన్. 51

ఉ. ఆలుడియున్ వివేకమును – సంచితకార్యచయాభిలాషయుం
దాలిమి సత్యముం బ్రియము - దైవతభక్తియు విప్రపూజనం
బేలిద మెందనట్టి మతి - యిష్టజనాదరణంబుఁ దృప్తియున్
జాలియు లక్షణంబులు ని - జంబుగ మంగమకుందలంపఁగన్. 52

క. పతిభక్తి గలిగి తనసరి | సతు "లౌరా" యనుచు మెచ్చి - సంస్తుతిసేయన్
ప్రతిలేని సౌఖ్యముల స | మ్మతి నున్నతిఁ జెందిమించె - మంగాంబభువిన్. 53

క. ఆజంపతులకు మురహర | పూజాఫల సిద్ధికతన - పూర్ణేందు సమ
భ్రాజిత యశుఁడై చాలఁబ్ర | యోజకుఁ డగు కేశవాఖ్యుఁ - డుద్భవమయ్యెన్. 54

క. ఆకేశవార్యుఁ డభినవ | లోకేశుఁడటంచు సుజన - లోకము పొగడన్
శ్రీకిరవై విఖ్యాతిం | జేకొనియెన్ బ్రాకటముగఁ - జిరతరలీలన్. 55

ఉ. రాజితకీర్తిశాలి గుణ - రాశి పురాణము కేశవార్యుఁ డ
వ్యాజ కటాక్షదృష్టుల ని - రంతరముంగని యాశ్రయించు కృ
ష్ణాజిన ధారులౌ ద్విజుల - హాటక వస్త్రిలఁజేయునౌగ పం
కేజదళాక్షుఁడై వెలయు - కేశవుసత్కృప కడ్డుగల్గునే ? 56

సీ. తనధాటికేనాటి-కినిసాటిగాలేక - విప్రులబ్బురమంది-వినుతిఁజేయ
తనతీర్పు నుడినేర్పు-దయయోర్పుఁ - జర్చించి సజ్జనుల్చాలఁగా-సంతసింప
తనధైర్యమౌదార్య-మనుకార్యనైపుణి - వింతగాఁ గనిజను-ల్సంతసింపఁ
దనశక్తి సురభక్తి-యనురక్తి - యునుజూచి-శిష్టులుసంతృప్తిఁ-జెందిమెచ్చ.

గీ. ధాత్రినెంతయు నున్నతిఁ-దావహించె | సతతధర్మాను వర్తియ-క్షయసుకీర్తి
పుణ్యలక్షణ వనమాలి-భోగశాలి | యర్థి జనజీవనుఁడు కేశ - వార్యఘనుఁడు. 57

మ. వనజాతాక్షుఁడు దీనపోషకుఁడు స - ర్వజ్ఞుండుఁ బీతాంబరుం
డును లక్ష్మీనిలయుండు నుత్తమగుణా - ఢ్యుండుఁ దయాశాలియున్
వినుతుండున్ వరమిత్రుఁడున్ ఘనుఁడును - ర్వీదేవతారాధ్యుఁడౌ
టనుదాఁ గేశవుభంగిఁ గేశవుఁడు వే - డ్కన్ రాజిలెన్ సుస్థితిన్. 58

క. ఆకీర్తిమంతుఁ డతివిభ | వాకరుఁడై వన్నెకెక్కి - యార్యానుమతిం
జేకొనెఁ దనకిల్లాలుగ | నాకాంక్షన్ గుణకదంబ - యగు లక్ష్మాంబన్. 59

చ. పలుకదుకల్ల నెన్నఁడును - బంధువులన్ నిరసింపదన్యులన్
బులకగఁజూడ దర్థులను - జోకదుకోపముఁ బూనదెప్పుడున్
సలుపదు దుష్క్రియాల్వైతలు - సంధిలినన్ మదిలోనొకింతయున్
గలఁగదు కేశవార్యకుల – కాంతకులక్ష్మమ కన్యులుద్దియే ? 60

మ. వితతానూన పరోపకార మతిసా - ధీవ్రముఖ్యు లక్ష్మాంబకుం
బ్రతిలేరెందును నన్నదానమున సం - భావించియభ్యాగత
ప్రతతిక్ మన్ననఁ జేసి పల్లభునకుం - బ్రఖ్యాతిఁ జేకూర్చు చే
వ్రతమాసద్గుణ పూర్ణకుక్ సతులమా - గ్గం బిట్టిదౌ నేకదా. 61

క. అతులితు లాదంపతులకు । సుతులుద్భవమైరి సకల - శుభలక్షణ శో
భితులై మున్నురు మూర్తి । త్రితయంబును బోలె నధిక - తేజములూ అక్. 62

ఉ. ఆనయశాలులౌ ముగురి - యందును నగ్రజుఁడై నయట్టి ల
క్ష్మీనరసింహ నాముఁడు ప్ర - సిద్ధివహించి సమంచితస్థితిన్
బూనియనూన భావ హిత - భోగ సమన్వితుఁడై దయాపరి
జ్ఞానము లుల్లసిల్ల సువి - చారమతిన్ బ్రతిలేకవర్ధిలెన్. 63

శా. సర్వజ్ఞుండు పరోపకార మతిదు - ష్టద్వేషి యవ్యాహతా
పూర్వానేక విభూషణుండు గుణసం - పూర్ణుండునై సంతతా
ఖర్వానంద సముద్రుఁడీతఁడనఁ బ్ర - ఖ్యాతిన్ గొనెన్ ధారుణీ
గీర్వాణాశ్రయుఁడైన కేశవుని ల - క్ష్మీనారసింహుండిలన్. 64

క. అతనికి సముఁడతఁడే యని । మతిమంతులు వినుతిసేయ - మన్నించి యభీ
ప్సితముల నొసఁగున్ యాచక । తతులకు నిరంతంబు నవధుఁ-ధారాళముఁగాన్. 65

సీ. విద్యాసమృద్ధివి-వేకవిస్ఫూర్తుల-నజపుత్రు నజపుత్రు- నపహసించు
సదమలలక్షణ-సౌందర్యమహిమల-మాధవుమాధవు - మగపుగొలుపు
చాతుర్యకలనఁ దే-జంబు పెంపునసల - భాస్కరుభాస్కరుఁ-బ్రతిసుటించు
తులలేనిశుభభోగ-ములఁగల్మి చెలువున - రాజరాజును రాజ - రాజుఁదెగడు

గీ. ఔరసునుఁడంచు జనులన-యంబుఁబొగడ । వాసికెక్కెను మిగుల వి-లాస లీల
సత్క్రియా వర్తిభూసుర-చక్రవర్తి । స్థిరవినుతకీర్తి లక్ష్మీనృ - సింహమూర్తి. 66

సీ. అతఁడు భూసురభర్త-యితఁడు భూసురభర్త - యగుట నిర్వురుసముల-నఁగవచ్చు
నతఁడుమాసంయుక్తుఁ-డితడుమాసంయుక్తుఁ - డగుటనిర్వురు సము-లనఁగవచ్చు
నతఁడుభాషాప్రియుం-డితఁడుభాషాప్రియుం - డగుటనిర్వురుసము-లనఁగవచ్చు
నతఁడబ్రభవాహనుం-డితఁడబ్రభవాహనుం-డగుట నిర్వురుసము - లనఁగవచ్చు

గీ. ననుచు తనలక్షణంబుల-నరసిలోకు । లబ్జజాబ్జశరాబ్జశ-రాద్రిరిపుల
సాటిగాఁబోల్చి వర్ణింపఁ-జాలనొప్పె । శ్రితజనోద్ధారి లక్ష్మీనృ - సింహసూరి. 67

సీ. ఆశ్రితజనచకో-రానీకసమ్మోద - కరపూర్ణిమాసుధా-కరుఁడనంగ
నర్థిజనప్రక-రాభీష్టదాయక - క్ష్మాతలమందార-శాఖియనఁగ

ప్రాకటవిద్యా వివేకవాక్చాతుర్య - సంశీలనిర్జరాచార్యుఁడనఁగ
నిత్యాన్నదానాదికృత్యానుమోదవి - స్ఫూర్జితకుంతీసుపుత్రుఁడనఁగ

గీ. సర్వవిధములఁ జేరొందె - సార్థకముగ। భవ్యగుణపాళి బాంధవా - బ్జవనహేళి
సమయసముచిత నుతవేషి-సత్యభాషి। యంగజనిభుండు లక్ష్మీనృ-హరిఘనుండు. 68

క. ఆవిమలాత్ముఁడు ముదమునఁ। దావరియించెను జగన్ను-తంబుగ సతిగా
సావిత్రీ సన్నిభయగు సావిత్రిన్ బుణ్యవతిని - సదమలగాత్రిన్. 69

సీ. పతిమేనిలోఁ సగ - బాలుగైకొనిగౌరి - నలుగురినోళ్లలో-నానివాణి
నిలిచినచోటఁదా-నిలువనేరకలక్ష్మి - యస్థిరభోగంబు-లమరిశచియు
భర్తృపంచకముఁజేఁ-బట్టిపాంచాలియు - నన్యసంగతిఁబ్రియుఁ-బందితార
కాయలాకులుదిని-కరఁగియరుంధతి - ప్రియుఁబాసివెతనొందె-భీమపుత్త్రి

గీ. తనకుసరిగాక యుండ నెం-తయును మించి। యఖిలశుభలక్షణాన్విత - యై చెలంగె
నుభయవంశప్రకీర్తిత-యుచితచరిత। యైనసావిత్రి సుబ్బరా-యార్యపుత్త్రి. 70

క. సత్యంబు వీడదెన్నఁడు। వ్యత్యస్తంబైనమాట - పలుకదు పతితోఁ
బ్రత్యహమును మఱవదు స। త్కృత్యంబుల మీఁదిపూనికఁ-గినియదుపరులన్. 71

క. పేదలకుఁ గాంక్షితార్థము। నాదరమున నొసఁగితుష్టి - నందఁగఁజేయు
న్మోదమున నన్నదానము। లేదనకొనరించు నర్మి-లిన్ నిరతంబున్. 72

మ. విమలానూన గుణావళీకలిత సా - విత్ర్యంబసద్భక్తిఁ జి
త్తమునన్ నించి నిదేశునట్లు నయముల్ - దానున్ భుజంగాచలా
గ్రమనోజ్ఞాలయ వాసుసేవకడు ము - ఖ్యంబంచు భావించి ని
త్యముఁబూజించు నుతించు సమ్మదము నిం - డారంగ నిచ్ఛావిధిన్. 73

క. ఆసాధ్వి వేంకటాచల। వాసుని భజియింపకున్న - వత్సరమునొగిన్
మాసమ్మును బక్షమ్మును। వాసరమును జాముగడియ - వాటిలదరయన్. 74

క. ఆమిధునమునకు ఫణిగిరి। ధాముని విలసత్కృపాసు - ధాపరిపూర్ణ
శ్రీమహిమను జన్మించితిఁ। దామరసదళాక్షుభక్తి - దనరినవాఁడన్. 75

చ. కలిమిఘటిల్లియున్ సుతులు - గల్గమిఁ దల్లియుఁదండ్రియున్ వ్రతం
బుల నొనరించి తత్ఫలముఁ - బొంది ననుంగని లేకలేక నేఁ
గలుగుటఁజేసి యొండభి ధ - గాదని పిచ్చయయంచుఁ గూరిమిన్
బిలువఁ దొడంగిరయ్యది య - పేరుగ నేర్పడె నాకునిత్యమై. 76

క. తలిదండ్రులు కూరిమినిడి। పిలిచినదే ముఖ్యమైన - పేరనిమదిలోఁ
దలపోసి నాదుకృతులను। నలువొప్పఁగనదియునిలిపి - నాఁడనువెలయన్. 77

ఉ. అదఁదలంగినే జనన - మైనది యాదిగ నాలుగేండ్లకున్
గాదిలిమద్దురుండిహా ను - ఖంబుల పైఁదమి నుజ్జగించి స
మ్మోదమ మెలర్పఁగాదివికిఁ - బోయిన సర్భకుఁడైననన్ను నెం
తో దయమీఱ మజ్జనని - దుఃఖములొందఁగ నీకపెంచెతాన్. 78

మ. కరుణన్ నాదగుపంచమాబ్దమునయో - గ్యంబైన శ్రీవేంకటే
శ్వర మంత్రంబును జెప్పివత్స! యదిక - ష్టంబు ల్దొలంచున్ యశ
స్కరమానీకు జపంబుఁ జేయుమని యాజ్ఞాపించె నాసాధ్వి ; సు
స్థిరబుద్ధిన్ జపియించితిన్ ముదము సం - ధిల్లంగ నాకంతటన్. 79

చ. పరువడి వేంకటేశ్వరు కృ - పామహిమన్ జనియించె నాత్మలో
విరివిగ సద్భుతంబగు గ - విత్వపుధోరణి యంతపత్తవ
త్సరములు నిండనున్నతఱిఁ - జయ్యనఁబ నన్నుం బ్రియంబుతో
గురువులయొద్దకుం జదువు - కొమ్మని పంచెవివేకి నాటనన్. 80

క. అదియే ప్రభావమోఁ దోఁ | పదు నామదిమిగులవింత - పరికింపంగాఁ
గొదుకక బడికింజేరిన | తదనంతర మొదవ పెక్కు - తలఁపులు నూహాల్. 81

సీ. ఒకదినంబున నెత-ప్పక నేర్చితినిసంశ-యము లేక యాంధ్రభా - షాక్షరములు
రెన్నాళ్లలో నెగు-త్రించిలిఖించితిఁ - గొదలేక చెప్పిన - గుణితమెల్ల
పైదారుప్రొద్దుల-కభ్యసించితిసల్ప - వాక్యముల్సక్కఁగా - వ్రాయఁజదువ
వారంబునకుసల-వాటుఁగావించితి - నెక్కముల్పలుకఁగా- లెక్కవేయ

గీ. చూచువారబ్బురమున-సంస్తుతి యొనర్పఁ | బఠనఁజేసితి నెలలోన - భారతమును
పిదపనొకవత్సరమునకిం-పొదవనొక్క | నాటకంబును రచియించి-నాఁడఁదొలుత.

క. అదిమొదలుగ నానేర్చిన | పదములు గదియించి పెక్కు - పద్యంబులు నిం
పొదవఁగఁ జాటులు హితులుం | జదువరు లౌనన రచించి-సంస్తుతిఁ గొంటిన్. 83

చ. అనయము వేంకటేశ్వరు ప - దాంబుజ ముల్మదిలోన నమ్మినే
దినదినమున్ మదంబయుప - దేశముచేఁ గడుభక్తిమీఱఁగా
వినుతియొనర్చుచుంటినిగ - విత్వపచోర చనాచమత్కృతిన్
వినిన గుణజ్ఞులందఱు వి - వేకివిగాఁగల వింకపైనన్. 84

క. ఎత్తిన వేడుకచే నా | చిత్తము నిలువమి నిసేర - చించుచునుంటిన్
గ్రొత్తలగు చాటువులఁ బలు | వృత్తంబులు చదివివాని - విధమున నెఱుఁగన్. 85

ఉ. అంతటఁ గొంతకాలమున - కార్యులు కొందఱు మత్కవిత్వమున్
వింతగ నాలకించి విన - వేడుక నీరచనంబుకాని యొ

క్రాంతియు శాస్త్రఫక్కి రచితయింపవు ఛందములం బఠించివి
క్రాంతులు ప్రాసలుం దెలిసి - సల్పుట మేలని పల్కి రేర్పడన్. 86

క. అదిమొదలుగ ఛందంబులఁ । జదువుటకును వ్యాకరణముఁ - జదువుటకును నా
మదివాంఛ గలిగి గురువున్ । వెదకితిఁ గొన్నాళ్లుపూని - వేసటఁగొనకన్. 87

క. తుదకెవ్వారును "రా" తె । ల్పెదమని యనకుండి రెంత - వేడిన నదయుల్
తదనంతర కర్తవ్యం । బెదఁదోఁపక నేనువగచి-యెవ్విధిసేతున్. 88

చ. కడఁకఫలింపదయ్యె నిఁకఁ - గావ్యము లెట్లురచింప నేర్తునే
వడువుననింక నాకెఱుఁగ - వచ్చుఁ దదీయ విశేషముల్ కనం
బడఁడొకఁడేని ఛందమును - బల్కెడి యోగ్యుఁడటంచు బుద్ధినె
క్కుడువగఁ జెందియుండు తఱిఁ - గొన్నిదినంబులు చెల్లినంతటన్. 89

వ. ఒక్కనాఁడే తద్విచారంబు మనంబున ఘనఁబుగాఁ బెనంగ నాత్మీయ గేహబహి
ర్ద్వారపార్శ్వనిర్మిత వితర్దికోపరి నేకతంబయుపవిష్టుండనై నిరంతరమున స్వస్వాన్త
సాంభోజ పీఠంబున నిలిపి సంస్మరించు వేంకటాచల నివాసుండగు వాసుదేవుని
మదీయవాంఛావాప్తిగావింపుమని వేడుచుంటి నప్పుడు. 90

క. పగలది మూడవయామం । బగుఁ గావున నపుడు తరణి - యపరాంబుధికిన్
దిగుచుండె మెల్లమెల్లన । నొగిఁ దనకిరణములవేఁడి - యుడుపడి మాయన్. 91

ఉ. అత్తఱిఁ గర్ణరంధ్రముల - యందున "హా"యని యొక్కనాదము
ద్వృత్తిజనించె బాహ్యరవ - వేగములెల్ల నడంగెనంతలోఁ
జిత్తము నిశ్చలత్వమును - జెందెను వేముకుళించెఁ గన్నులు
వ్వృత్తుగ నింద్రియంబుల జ - యించిన యోగివిధంబువాటిలెన్. 92

క. అదిజాగర్య యొకలయో । నిదురయొ మఱియెద్ది యొకో - నే నెఱుఁగనులో
నొదవెన్ విభ్రమమంతనె । పొదలెన కారణమ మేనఁ - బులకాంకురముల్. 93

వ. ఆ సమయంబున. 94

సీ. నీలమేఘచ్ఛాయ-నెగడు దేహము మిన - మినలఁగన్నులు-మిఱుమిట్లుగొనఁగ
బూర్ణేందుబింబంబుఁ-బోలు నెమ్మోమునఁ - జిఱునవ్వువెన్నెల-చెంగలింప
చెలువంబు మీఱరా-జిలునట్టి గాంగేయ - వసనంబఱతవలె-వాటుఁగాఁగ
పంకేజదళసన్ని-భంబులై మెఱయు నే - త్రంబులఁగరుణార-సంబుదొలుక

గీ. విమల నవరత్నభూషణ-వితతివెలుఁగ । కరములందొగి శంఖచ - క్రములుతనర
నఖిలశుభలక్షణాన్వితుఁ-డైనయొక్క । పుణ్యపూరుషుఁ డపుడునా-ముందుదోఁచె. 95

గీ. అటులఁ బ్రత్యక్షమైన మహానుభావుఁ । డెవ్వఁడోయని కడుసంశయంబు భయము
హర్ష మాశ్చర్యమును భక్తి - యాత్మఁ బెనఁగ । మ్రొక్కి నిల్చితిఁ జేదోయి - మో
[డ్చియంత. 96

క. గడగడమై వడఁకఁగ నే । వెడగురు పడినోటమాట - వెడలక ధృతిఁ బో
విడిచి పరికించుటం గని । కడుదయ నయ్యనఘుఁ డింపు - గా నిట్లనియెన్. 97

చ. వలదు భయంబు శేషగిరి - వాసుఁడ నేను కుమార! నీకు మే
ల్దలఁచి వరంబొసంగఁగ ము - దంబున వచ్చితి; నన్ను నెప్పుడుం
దలఁచు మదీయ భక్తులకుఁ - దార్కొను చింతలు మాన్చి వాంఛితం
బులు సమకూర్చుచుండుదును - భూరికటాక్ష నిరీక్షణంబులన్. 98

క. నీవును మద్భక్తుండవు । కావున నీకును శుభంబుఁ - గావింతును నీ
భావంబున సమ్మోదము । తావుకొనున్ సంకటములు - తలఁగును వత్సా. 99

చ. అనుపమ దివ్యసౌరభ స - మన్విత వస్తువితాన మేళనం
బున నిలనన్యవస్తువులు - పొల్చు విధంబున మత్కృపార్ద్ర దృ
ష్టి నిజనియించినట్టి పటు - చిత్రకవిత్వ మహత్త్వసిద్ధిచే
ఘనత వహించి మించెదవు - కావుత మీవని పల్కి యర్మిలిన్. 100

గీ. ప్రమద మెసఁగించి యతఁడు నా - భయము మాన్చి । భవ్యరేఖాకలిత పల్ల - వసమ రమ్య
మృదులమగు హస్తమున నాదు - మేను నిమిరి । హితవు రెట్టింప వెండియు - నిట్టు
[లనియె. 101

క. ఛందో వ్యాకరణంబుల । యందును గావ్యములఁ బరిచ - యము లేదనిలో
సందియ మొందకు; నీకృతి । ఛందోబద్ధంబు గాఁగ - జరుపుదు నెపుడున్. 102

ఆ. శబ్దసంధు లెఱుఁగ - సాహిత్య మొదవదు । శాస్త్ర మరయ ననుచు - జడియవలదు;
నీవు పల్కు కవిత - నిర్మలమై యుండు । నటులు చేయుచుందు - ననయ మేను. 103

క. అకలంకుఁడవై తివి బా । లక నిను రక్షింతు ననుచు - లలితములగు వా
క్ప్రకరంబులఁ దనియఁగ వే । డుక నానతియిచ్చుటయుఁ గ - డున్ ముద మొదవన్. 104

క. మఱియపుడు నాకుఁ దోఁచిన । గతి సన్నుతిఁ జేసి నీవ - గతియనుచు నమ
స్కృతి సల్పితిఁ జల్లని మా । రుత మొలసె జనార్దనుఁడు తి - రోహితుఁడయ్యెన్. 105

ఉ. వీడెను కన్నుదోయి వెస - వీనులకున్ వినవచ్చె వారు వా
రాడెడి మాటలంతఁ బుల - కాంకుర కోటియడంగె నంత నేఁ
గూడిన మైవడంకుడిగె - గొబ్బున ధైర్యము సంఘటిల్లెఁ దో
త్తోడవఁ బల్కు లెప్పటి వ - టుత్వముఁ గాంచెను డిందె భ్రాంతియున్. 106

ఉ. చిత్రముగాఁగ నేనపుడు - చేకురినట్టి నవీనమైన చా
రిత్రము నెంచి లోఁగనిక - రించి జగత్పతియైన భోగిరా
డ్గోత్ర పవిత్రధాముఁడు ము - కుందుఁడె పోపాదనూపినన్ గృపా
పాత్రునిఁజేసె నానిదిశ - భంబని భక్తియు మోదమొప్పఁగన్. 107

క. సారెకు నుతిఁజేసిన మ । స్కారంబు లొనర్చి గతవి - చారుఁడనై నే
ధారాళంబుగ సత్కవి । తారచనకుఁబూనియ గణి - తంబగు కడఁకన్. 108

ఉ. ఈమహిలోన మత్కవిత - నెవ్వరు మెచ్చిన మెచ్చకున్న నా
కేమి కొఱంత లోకముల - కెల్ల విభుండగు వేంకటేశ్వర
స్వామికి భక్తినంకిత మొ - సంగెద నంతియ చాలులోపమిం
కేమిటఁ గల్గు మేలుగడి - యించి వహించితి నుత్తమత్వమున్. 109

క. అని నిశ్చయించి హృదయం।బునఁ దత్కాలమున మించు - పూన్కిని వాతా
శన వరగిరివాసునిపా । వనచరణద్వయము నెంచి - భక్తిదలిర్పన్. 110

ఉ. సంతసమొప్పఁగా కృతులు - చాలరచించియుఁ దృప్తిగల్గమి
న్వింతల కాస్పదంబయిన - వీనముగాఁ గనుపట్టుగాథ నే
నెంతయు భక్తిమీఱఁ గృతి- నేర్పడఁజేసి వృషాద్రివాసి క
ర్పింతు నటంచు నెంచి వివ - రింపఁగఁ బూనితి నీప్రబంధమున్. 111

వ. ఇంక నేతత్కథావిధానంబు నెఱింగించెద నది యెట్లని న. 112



## కథాప్రారంభము.

క. పుణ్యాముకుసుమఫలవ్రజ । పణ్యాము సకలావనీజ - భాసురము మరు
ద్గణ్యాము తాపసలోక శ। రణ్యాము భువి నైమిశంబ - రణ్యాంబులలోన్. 113

క. ఆవనము సకల ఖగమృగ । జీవనమన వరతసాధు - సేవనము మహా
పావనము దేవతాసం। భావనము సదానుశ్రుత - వర్ధన మరయన్. 114

ఉ. అచ్చటి సత్రయాగ సమ - యాగతమౌని వరప్రతానమిం
పెచ్చఁగ సూతునిందఁజేసి - హృద్యముగా నొకపుణ్యగాథ మా
కచ్చుపడంగఁ దెల్పుమన - ఘాత్మ వినంగఁ దలంపుగల్గెడిన్
సచ్చరితంబులం బలుకఁ - జాలరునీవలె నన్యులెవ్వరున్. 115

క. అనియడిగిన మునివరులం। గని సంతోషమున రమ్య - గాథాతటి నీ
వనధియగు సూతుఁడపు డి । ట్లనియె మహోరచన వెలయ-నందఱు వినఁగన్. 116

క. అడుగఁదగు విషయమును మీ । గడిగితిరౌఁగాకఁ దెలిపి - నట్టిది మీకున్
నుడివెద నొకచిత్రంబును । కడుఁబుణ్యాకరంబునైన - కథవినుఁడుతగన్ 117

వ. అని పలికి పుణ్యచరిత్ర శ్రవణ కుతూహలాయత్తచిత్తులై తనవైఁజూడ్కులు నిలిపి శ్రద్ధావధానంబులెసంగనిరీక్షించు నిరుపమాగణ్య పుణ్యక్రియాశరణ్యులగు తాపస వరేణ్యులకు సన్నుతవిచిత్ర గాథాశతాంగసూతుండగు సూతుండిట్లనియె. 118

### పురవర్ణనము.

ఉ. సారవిచిత్ర రత్నమయ - సౌధశిరోగృహ భర్మహర్మ్యశృం
గార తరాంబరాంత పరి - కల్పిత గోపురకేత నాంచిత
శ్రీరమణీయమై కడుఁబ్ర - సిద్ధిని మాళవదేశమందుఁ జె
న్నారుచునుండు శ్రీపురము - హర్షకరంబుగ రాజధానియై. 119

క. ఆపురము రమారమణికిఁ । గాపురము తిరస్కృతాల - కాపురముధరా
నూపురము పుణ్యములకుం । దాపురము సురేంద్రపురముఁ-దాఁబురణించున్. 120

మ. తతనిష్ఠాపరు లుత్తమవ్రతసము - త్సాహో న్విశాత్మల్పమా
ర్జిత పుణ్యుల్నిరతాహితాగ్నులును వి - చ్ఛేదాఘులధ్యాపకుల్
సుతయాగ ప్రచయార్చితామరుల గ - ణ్యుల్పూజ్యు లార్త్రావనుల్
చతురాస్యోపములప్పురిన్ శ్రుతియుతుల్ - ధాత్రీదేవతాసత్తముల్. 121

మ. అసమోద్దండ భుజాబలాన్వితులు శౌ - ర్యక్షాత్రధరుల్ధైర్యసా
హసగాంభీర్య వివేకమూర్తులు ప్రమో - దాత్ముల్వదాన్యుల్మనో
జసమానాంగులు సత్యవంతు లరిశి - క్షాదక్షులాపన్నసా
ధ్వసదూరీ కరణప్రవీణుల నఘుల్ - ధాత్రీశ్వరుల్ తత్పురిన్. 122

చ. తమ కులధర్మవర్తనముఁ - దప్పక గోపరి పోషణంబు చే
రము కృషిఁజేసి నేర్పునఁ గ - రంబు ధనంబును సేకరించి మో
దమునఁగుబేరునింద మకుఁ - దక్కువ వాఁడనిపించు సుస్థితిం
దమసరి తామయై జనహి - తంబుగ నొప్పుదురప్పురిన్ ద్విజుల్. 123

క. గురుదేవతా ధరిత్రీ । సురభక్తి సమర్చలందు - సుస్థిరబుద్ధిన్
బరఁగుదు రాపట్టణమునఁ । జరణజు లనవరత విభవ - సన్నుత మహిమన్. 124

మ. పురినుత్తుంగ మతంగ జావళులు సం - భోగంబులం జూచియుం
బరగంగా జలవీచి కాంతరచల - త్పంకేజ సందోహముం
గరముత్సాహ మెలర్పఁ ద్రుంచి తనరం - గా మావటీల్మెచ్చనా
దరలీలంబయివైచుఁ ద్రోవసలిలా - ర్థం బేగుచో నిచ్చలున్. 125

చ. జవమున వాయువుం గెలువఁ - జాలిమహాసుగుణాన్వితంబలై
ప్రవిమల లక్షణంబులను - భాసిలి మేల్గతులెల్ల నేర్చుటన్
భువనజయావహంబులు న - పూర్వములంచరిపుల్దలంక సైం
ధవములు వేనవేలు వివి - ధంబులు సంతతమొప్పునప్పురిన్. 126

చ నగర బహిఃప్రదేశమున - నాలుగుదిక్కుల గోగణంబులిం
పుగఁ గనుపట్టు మేపునకుఁ - బోవక మున్ను దయంపువేళలన్
బగతురు చేరకుండుగతిఁ - బాల్కడలింజలదుర్గమైతగన్
మగఁటిమిఁ జేసె భూపుఁడన - మందలుమందలుగాన సంఖ్యముల్. 127

చ. విరహిణులప్పురిన్ నిశల - వేఁగుచు వెన్నెల తేనిఁ జూచియు
ప్పరిగల మీఁద నిల్చి చల - పట్టకు కావుమటంచు వేఁడిప
ల్మరునతనిన్ స్పృశించి కను - లందముచేతుల నద్దుకొంట నా
తరుణుల కజ్జలంబు మయిఁ - దాఁకిన నయ్యది చిహ్నమండ్రిలన్. 128

చ. చెలువము మించు తత్పురిఁ - జేరువనింపగు జొన్న చేఁగం
కులు దినవచ్చు పక్షులను - గూతలు పెట్టుచుఁ జోపిపోనిచో
వెలు పటురాల నేటికొని - ప్రేయుటచేఁ దడవౌనటంచు రం
జిలు మణిభూషలుంచి యొడి - సెల్లను వైతురు శాలిపాలికల్. 129

ఉ. మెండగు నెండలంబనుల - మేపరిబాలుకు లుద్దియద్దిగాఁ
గొండొకసేపు పల్వలపుఁ - గూలములంగల చెట్లనీడలం
దుండి మహావినోదముగ - నూదెడి పిల్లనఁగ్రోవినాదము
ల్పండితగానమై చెవుల - పండువుసేయును బాంధకోటికిన్. 130

ఉ. మేలగునట్టి యాపురిని - మేడలపైఁగల సాలభంజికా
జాలముఁగాంచి నిర్జరభు - జంగ వరుల్దమయప్సరోవి నీ
లాలక లక్కఁదమ్ము విడి - యయ్యెడఁజేరి రటంచు భ్రాంతిచేఁ
బాలికిఁబోయి బొమ్మల ని - పాయఁదురెంతయు విస్మితాత్ములై. 131

ఉ. పోటికిమించు వీటివెల - బోటులు ధాటిగనాట పాటలన్
బాటవముం గడించి యల - వాటు తొలంగు నటంచు వీణియల్
మీటుచు నాడుచున్ శ్రుతికి - మేళనమై రహిమించరాగముల్
సూటిగఁ బాడుచుండ విని - సొక్కుదు రబ్బుర మొప్పఁగాఁ బ్రియుల్. 132

చ. అలరులపై పయిన్మెలఁగి - యంబురుహాకరశీతవారిచేఁ
జలువలు తేరి పౌరజన - సంతతి కింపుగ నెల్ల వేళలన్
జిలుజిలుమంచువీచు రమ - ణీయ మణిస్థగితోరుసౌధ ని
ర్మలిన గవాక్షసంతతుల - మార్గమునంబురిఁబిల్ల తెమ్మెరల్. 133

శా. ఆకుందోటలు పుష్పవాటికలు ను - ద్యానంబు లారామముల్
లేకల్గాఁదగు నారికేళములు మే - ల్మిన్ మించు చావళ్లున
స్తోకాక్షాకరపంక్తి గొప్పకృతకా - ద్రుల్ రమ్యమైనట్టికే
ళాకూళుల్గదళీవనంబులును జ - ల్వల్గూర్చుఁ జాలన్ బురిన్. 134

చ. అమరభుజంగసంగమ సు - ఖార్థినులౌ సురవారకామినుల్
సమదరతి క్రియావిధులు - సల్పఁగనేఁగుపు చాలలేమి నే
స్తమున శిరోగృహంబుల స - దావిట సంగతినుండు వేశ్యలన్
క్రమముగఁగాంచి నేరుతురు - రాత్రులు పొంచుచునుండి యప్పురిన్. 135

చ. వరుణపురంబు తన్నగర - వైభవముం గనవచ్చిలోకసుం
దరమగునంచుఁ గన్గొనుచు - నాలుగుదిక్కులఁ జుట్టినిల్చె నా
నరుదుగఁ దోఁచుచుండునట - హార్మ్యవితాన మహాట్టసౌధగో
పురవరణాది బింబముల - భూరిరుచుల్పరి ఖాజలంబులన్. 136

చ. జలజసమూహ మధ్యమున - సంతతమున్ విహరించుచుండు హం
సలుఁ బెనుతమ్మలంచుఁ గర - శాఖలచేఁ జిదుమంగఁబోయి యా

వ్వలఁ జనువానిఁగాంచి తమ - వారునగంగనిలజ్జనొందు తే
లలఁగడుగేలిఁ గొందురు గొ - లంకుల దంప మెలంగు చేడియల్.　　137

సీ. కైదండయొసఁగెదే-కంజాతదళనేత్ర - కైదండఁగొనఁగ రొ-క్కంబుగలదె?
మరువము వెలఁదెల్పు-మత్తేభగామి నీ - మరువమ్ము మాటను-మానుమింక
తావులున్న వెపజ్జఁ - దరుణీశిరోమణీ! - తలపుగల్గినలేవె-తావులిచట
నీయెత్తు పైకంబు-నిచ్చెదఁగొనుమిఁక - నీయెత్తునమ్మనే-నేలయూస
గీ. యనుచుఁ దముఁగాంచి విటజను-లాడునర్మ|మర్మగర్భోక్తులకుఁదగు-మాఱ్కి వేడ్క
సరసముగ మారువల్కు-చు-సంతతంబు | విరులు విలుతురు పుష్పలా-వికలువీట.138

ఉ. సుందరమై మహావిభవ - శోభ నెసంగెడి తత్పురంబువా
రందఱు విష్ణుభక్తియుతు - లందఱు సద్గుణపూర్ణులందఱున్
వందితశీలురందఱును - వర్జితదుర్జన సంగులందఱా
నంద సమగ్రులందఱు స - నాగతధర్మపథప్రవర్తనుల్.　　139

ఉ. ఆనగరంబునేలు రుచి - రాస్య సమాఖ్యవహించినట్టి భూ
జానియనూనధీవి భవ - సత్త్వనిరాకృత పద్మయోని స
ర్వానతవీరవైరి మను - జాధిప వర్గనిరంతరార్హ్య స
మ్మానికొఅంతలేని గరి - మందగ నాత్మజ నాభిమానియై.　　140

క. అతఁడాదృతి నాశ్రితులున్ | హితులుఁ బురోహితులు ధారు-ణీశ్వరతతులున్
యతులున్ ఘనమతులు జన| ప్రతతియు సంతోషమొందు - భంగి మెలంగున్. 141

చ. పలుకులు తేనియల్చిలుకు - భావము చందన శీతలంబు చూ
పులుకరుణా సమగ్రములు - మూర్తి మనోజ్ఞతలోకమోహనం
బలఘుగుణంబు విశ్వజన-తాదృతమా రుచిరాస్యు నుద్దియా
బలియొ నలుండొ ధర్మజుఁడొ - వజ్రియొగావలె పాటిగారొరుల్.　　142

గీ. స్వర్గమునఁ గల్పకంబువాం-ఛలనొసంగు | నంద్రుజనులదియెంత స-త్యంబొతెలియ
దవనిఁబ్రత్యక్షముగఁగోర్కు-లందఁజేయఁ | బొడమివిలసిల్లుమందార-భూజమతఁడు.

క. అతని నుతింపని వారును | నతని దయాపాత్రు లగుట - కాపింపని వా
రతనిం గొలువనివారును | క్షితినొకరునులేరు వేయుఁ - జెప్పగనేలా.　　144

సీ. కరుణించెనాయుప-కారిసైననుశంక - నర్జించితనయంత-వానిఁ జేయుఁ
గోపించెనావైరి-కోటిని భీకర - శైలగహ్వరముల-పాలొనర్చు
వచియించెనామాట-పట్టుదప్పక కార్య - మెట్టిదైననునిర్వ-హించుఁబూని
తిలకించెనాయాచ-కులమానసంబులు - సంతృప్తిఁనొందవాం- ఛలనొసంగు

గీ. సద్గుణగణాభి రాముఁడు-సత్యధాముఁ। డధిక కారుణ్యమూర్తిశి - ష్టానువర్తి
కీర్తిపూర్ణుండు ధర్మప్ర - వర్తనుండు। రాజమాత్రుం డెరుచిరాస్య - రాజమౌళి. 145

సీ. తనదుకోలెమ్మగో-త్రధ్వంసి మేలెంచి - కాదనకొసఁగిన-యాదధీచి
యఖిలసంపదలుమా-యావటువునకిచ్చి - ఘనతఁ జెందినవిరో-చననుతుండు
కపటాండజమునకా-కలిదీర్ప మేని మాం - సంబుఁ బెట్టినశిబి-చక్రవర్తి
కీడెటెంగియుహరి-కింగవచంబుఁ గుం - డలములిచ్చినసూత-నందనుండు

గీ. ఇతనిఁ బోలగటంచుర్వి-నెల్లవారుఁ। బొగడఁగొఱలేని సంపద - ల్బొసఁగిమించి
విజయలక్ష్మి నివాసుఁడై-వేద్య-మీఱ। నతఁడు రాజ్యంబుఁ బాలించు-నధికశక్తి 146

క. అతనికిఁగల డొకపుత్త్రిఁడు। మతిమంతుఁడు నీతిశాలి - మానితవిద్యా
చతురుండు ధైర్యనిధినుత। వితరణ దక్షుండు ఘనుఁడు-విజయుఁడుశక్తిఁ. 147

వ. అతఁడు జననమైనకాలంబున నభ్రవాణి రుచిరాస్యునుద్దేశించి యోనృపాలా! నీకు జన్మించిన కుమారుని సామాన్యునింగాఁ దలఁపకుము. మహాతేజోవంతుఁడగు నొక్క మహాత్ముండు కారణవంశంబున నీకుం బుత్త్రిండై పుట్టినవాఁడు. ఇతఁ డశ్వం బారోహించిన నెట్టివారికిని నజేయ్యుండై యుండఁగలవాఁడు. కావున విజయాశ్వుం డని నామకరణం బొనర్పుమని యానతిచ్చుటయు, సంతసించి యాధరావరుండట్ల కావించె నాబాలకుండంత దినదినప్రవర్ధమానుండై. 148

చ. అతులిత ధైర్యమూర్తి విజ - యాశ్వుఁడు యౌవనశోభిఁతుయి నిజో
ద్ధతియును శౌర్యసంపదయు - ధాత్రిజనంబులు మెచ్చవైరి భూ
పతుల జయించిమించి బల - వంతుఁడనఁ నులిఁగాంచి తండ్రియా
నతి యువరాజ సత్పదవి - నర్మిలిఁ దావహియించెఁ బేరిమిఁ. 149

ఆ. అతని సొబగు మెచ్చు - నట్టికోమలియును। నతని యీవిఁ బొగడ - నట్టియర్థి
యతని నాశ్రయింప-నట్టిభూభర్తయు। నతనిచేతఁ జెడని - యరియు లేఁడు. 150

సీ. సత్యవాగ్జితహరి-శ్చంద్రుండు చంద్రుండు - తతదిశాంతవ్యాప్త-ధవళకీర్తి
మహితోగ్రశౌర్యకు-మారుండు మారుండు - సన్నుతలలితాంగ-సౌష్ఠవమున
ఖలకుపక్షతరువనా-నలుఁడు నలుండుప - ద్ధర్మప్రవర్తనో-త్సాహగరిమఁ
బృథువివేకవిశేష-భీష్ముండుభీష్ముండు - నతజనప్రియకరు-ణాసమృద్ధి

గీ. గతవిచారుండు చతురుండు-సతతభోగి। ప్రణుతవేషుఁడు మృదుతర-భాషణుండు
వినయశీలుండువితరణి-జనహితుండు।హతమదారిచయుఁడురుచి-రాస్యసుతుఁడు. 151

సీ. తనకుమావల్లభుఁ-డెనయంచు జనులెన్న - నిరతమాశ్రితులమ-న్నించుఁబోచుఁ
ధనకుమార్గప్రాఢి-ధాత్రినివిలసిల్ల - వెతఁబెట్టువైరుల-హతముఁజేయుఁ

దనకార్యరంజక-త్వముసువ్రతంబుగా - బుధులఁబోషించు పెం-పునువహించుఁ
దనకుమిత్రాసక్తిఁ-దలఁగించుటగునంచుఁ - దగినపనుల్జేయుఁ-దలఁపుఁదీర్చు

గీ. సర్వసర్వంసహాచక్ర-చటులభూరి | భారధౌరేయ పరిగేయ - బాహుయుగళుఁ
డనఁగనుతికెక్కి-రుచిరాస్య-ననుఁగుపట్టి | యుచితలక్షణములకెల్ల-నునికియయ్యె. 152

క. రూపమున వానిమించిన | చూపరి మఱియొకఁడు లేఁడు - చూచినవారల్
స్త్రీపుత్రాదులకైనను | నీపాంకము గలుగదనుచు - నెన్నుదురవనిన్. 153

ఆ. వానిసొబగుఁ జూచి - వనితలు కామింతు | రనుట వింతగాదు - తనివిలేక
యట్టెచూచి పురుషు-లైననుతనిపైఁ | గలుగు చూపుమరల-కలయుచుంద్రు. 154

వ. అమ్మహీకాంతాత్మజుం డొక్కనాఁటి రేయి సాంద్రతరచంద్రికావిలాస భాసురం
బగువినిర్మలధర్మనిర్మితరమ్యహర్మ్యపరిభాగంబుననతులితవిచిత్రశిల్పకల్పనా సల్పం
బగుమృదులతల్పంబుపై శయనించిసమంచితవైభవంబున నితాంతశాంతిసంకలితస్వాం
తుండై పరిపూర్ణ శశాంకబింబంబు డంబువిడంబించు విమలాస్య రుచిప్రసరణంబున
నోయనంబుజ దళసన్నిభంబులైన నయనంబులు ముకుళింప తనులిప్తసల్లలితాంగ
రాగ పరిమళమిళితంబులగు నూర్పువాయువులంగలిసి యలసతంబ్రసరించు చిఱు
గాలి సోకునంజలించు తరళంబులగు కురుళంబుల చెలువంబు ముఖంబునకునగ్రోత్త
యగు సొంపు నెనయింప నింపుమీఱ నిద్దురఁగూరియున్న సమయంబున. 155

చ. వెసనపు డిచ్చమైగగన - వీధినిఁ బోవుచునుండియొక్క రా
క్షసుఁడు భయంకరుండు లఘు - కాయుఁడు దావిజయాశ్వమైరుచు
ల్దెసలనలంకరింపఁగని - దిగ్భ్రమమొంది బళీ! యటంచుసం
తసమున మేడపైడిగి మ - నంబున నబ్బురపాటుసంధిలన్. 156

వ. విజయాశ్వని డాయంజని యప్పుడు. 157

గీ. అట్టెనిశ్చలుఁడై నిల్చి-యతనిఁగాంచి | కాంచి తలయూఁచి మెచ్చిను-తించి జగతి
నసముఁడితఁడంచుఁ దలపోసి - యచ్చోటువాసి | మరలిపోవంగఁ దొడఁగెనం -
బరపథమున. 158

క. పోవఁగఁ బోవఁగఁ దనకెదు | రైవచ్చు నిశాటునొకని - నలఘునిఁగని "యో
హో! వక్రదేహ కుశలమె ? | యీవెచ్చటనుండి యిచటి-కేఁగెద" వనుఁడున్. 159

క. "వినవోయి వజ్రనఖ ! నే | నునుదిన మొకచోటికేగి-యందొకవింతన్
గనివచ్చుచుండుదుం దగ | వినుపించెదదాని నీకు-వినఁదగు నీవున్." 160

క. అనిన, "నదియంత వింతయె ? | వినినది కనినదియుఁగాదో?-వివరింపుము నే
వినవలతు" ననుఁడు; రెండవ | దనుజుం "డదిపిదపఁ దెల్పె - దనుగాని సఖా ! 161

క. ఎందుండి వచ్చెదవు? యిపు । డెందరిగెద ? నేమి వింత-లీక్షించితివో
ముందెఱిఁగింపుము; వినియా । నందించెద” ననియె వజ్ర - నఖుఁడంతట తాన్. 162

వ. వక్రదేహుం జూచి తొలుత నాకు నీవు చెప్పవలసిన వాఁడవయ్యానను జెప్పుమను చున్న వాఁడ విదియుక్రమంబు సుమీ యైనను నపేక్షించితివి గావున నాయెఱింగిన యది నేనవచియించెద. ముందుగ నెవ్వరుచెప్పిన నేమి లోటువాటిల్లె? మదీయ విలోకితంబగు విశేషంబొకటి కలదు దానిని వినుమని యిట్లనియె. 163

క. వినొక్క జగన్మోహనుఁ । డైన నృపాత్మజునిఁ గంటి - నతనికి సదృశుం
డౌనిమ్మహిననఁ గాఁదగు । వానినిఁ గనివినియు నేఁటి - వఱకెఱుఁగఁజుమీ. 164

సీ. కాంచితి మున్ను నేకులను - గామజయంతుల సోయగంబునన్
మించిన వారివారి నిఁక - మెచ్చుటదోసముధాతయెట్లుని
ర్మించెనొకాని నేనిపుడు - మెచ్చిన రాజకుమారు నెంతవ
ర్ణించినఁ జెల్లునింతయును - నిక్కము వాఁడ సమానుఁడిద్ధరన్. 165

క. శ్రీకట్టణ నాథుండగు । భూపతికిం బసయుఁడతఁడ - పూర్వయశోల
త్కృపరిణేతనుమీ సం । ప్రాపిత శుభలక్షణాభి - రాముఁడు చూడన్. 166

శా. ఆలావణ్యము సౌకుమార్య విభవం - బాయంగ శోభావిశే
షాలంకారము జవ్వనంబుఁగనన - త్యాశ్చర్యమౌ నింక వే
యేలాపల్కఁగనంచుఁ జెప్పవిని యె - ట్లిట్లూ ? యిదావింతమే
ల్మైలేమోనని యుంటినంచునగి ప - ల్కెన్ వక్రదేహుండు తాన్. 167

ఆ. వజ్రనఖరుఁడపుడు - వక్రదేహుఁడుతన । మాట మెచ్చుకున్న - మతమెఱింగి
యింత కంటెమించు-వింతగావలయునే ? । యనుఁడు నతనిఁజూచి-యుపహసించి.

క. నగియూ రెండవ వాఁడనుఁ । దగుఁ దగదనకిటుల నీవు - ధారాళముగా
జగతీ వరనందనునిం । బొగడుటయే చాలవింత - బుద్ధిఁదలంపన్. 169

చ. వినుమొకమాట నీమదికి - వింతగఁ దోఁచినఁ దోఁచుఁగాని నే
విని నిజమంచు మెచ్చుటకు - నెట్టినిగానిటుబట్టువోలెవ
ర్ణన మొనరించె దేమిటికి - రాజకుమారునిఁ బోలువాఁడులేఁ
డని; భువినెందఱో గలర - నల్పశుభాకృతు లొప్పుచూపరుల్. 170

గీ. అరయ నీవల్పుఁడతోషి - వగటఁజేసి । యిట్లుపల్కెద వెఱుఁగక - యింక నేను
దీని వినఁజాల నేఁబల్కు - దానివిన్న । నెంచినీమాట నీవనిందించు కొనవె ?

క. అనివన్ బ్రథముఁడు వానిం । గనుఁగొని తలయూఁచినవ్వి-తనలుననపుడి
ట్లనియె బళీ ! నిరసించెద । వనుపమశుభగాత్రుఁడా నృ - పాత్మజుఁడెన్న న్. 172

గీ. ఊరకనుతియింతు ననుశంక-యొదవెనేని । రమ్ము నావెంటఁ జూతువు - రాజసుతునిఁ
గాంచి నీ వేమిచెప్పినఁ - గానివిందు । నిజమొ కల్లయొ యప్పుడు - నీకుఁదెలియు.

క. దేవతలకు సయితంబా । భూవరనందనుని సొబగు - పొసఁగదు సుమియే
లా వేయిమాట లిచ్చట । నీవటకరుదెంచి కనుము - నిజమో కాదో. 174

గీ. ముఖము సద్దంబునుండగా-ముదము దేల? । చూడఁగారాదె వచ్చి-యిచ్చోటనుండి
యానుకాదనరాదు గ - వ్మచటికనిన । వక్రదేహుఁ డిట్లనియెను వానితోడ. 175

వ. వజ్రనఖా! నీవును నేను నొక్క కులంబువార మంతియకాక యొండొరులము మైత్రిఁ
బాటించువార మగుటంజేసి తాలిమివహించి యింతవట్టు భవద్వికటాలాపంబు
లాలించితిం గాని యన్యు లివ్విధంబునంబలికిన సైరించువాఁడం గాను జమీ! యది
యట్లుండె. మఱియొక్క విశేషం బెఱింగించెద సావధానమానసుండవై యాకర్ణిం
పుము. దానివలన యుష్మన్మనో వైకల్యంబు తొలంగు. నది యెయ్యదియంటివేని
సకలసంపత్పరిపూర్ణంబగుపాండ్యదేశంబునందుదీయరాజధానియైకనకపురంబను పట్ట
ణంబు విరాజిల్లుచుండు. నా నగరంబునందు. 176

క. ఘనుఁడగు శశిబిందుండను । మనుజేంద్రుఁడు ధర్మమెఱిఁగి - మమతఁ బ్రజారం
జనుఁడై శాత్రవసులభం । జనుఁడై పాలించుచుండు-సమ్మదమొప్పన్. 177

గీ. అతని సుకుమారి సుకుమారి - యాత్మభవుని । చిగురుటాకు కటారివి - చిత్రహారి
భూరిలావణ్య సత్కళా-పూర్ణయౌవ । నంబు నిండారియున్న దె-న్నగనొయారి.178

గీ. అటులయీడేఱియున్న యా - యబలనిపుడు । జనకుఁ డొకరవ్యమణిగణ-స్థగితమైన
హర్మ్యమునుంచి పెండ్లిసే-యంగనెంచి।కన్నియకుఁదగువరుఁగాన-కున్నవాఁడు.179

క. మానక యచ్చోటికిఁజని । యానారీమణి మనోహ - రాకృతిఁగనిలో
నానందమొంది మఱియెం । దేనియు నటుమీఁదఁగాని - యేఁజనను సుమీ. 180

క. ఇదిసంతత వ్రతముగా । మదినెంచియ నారతంబు - మగువను గనిస
మ్ముదమొంది పోవుచుండుదు । నదియనిగా నరిగియుంటి - నచ్చటికిపుడున్. 181

ఆ. కనకపురమునుండి - చనుదెంచుచున్నాఁడ । సుందరాంగిసొబగుఁ - జూచిచూచి
నేవచింతుననిన - యావింతయిదియను । మ్మఱిగికనుము సంశ - యంబుతొలఁగు.

క. ఇంతకు మిక్కిలి మఱియొక । వింతభువిం గలదె ? నీదు - వెఱ్ఱితలంపున్
కాంతను గనఁగనె విడివ । ర్ణింతువు సంతసము మీఱ - నీవును వింటే. 183

క. రాసుతుని చక్కఁదనమును । వేసరక గ్గించితివి యు - విదసోయగమున్
వాసియుఁ జూడుము దానికి । దాసుం డగుటకును వాఁడు - తగఁడనిపింతున్. 184

వ. ఇపు డా నారీమణి హర్మ్యోపరిని వెన్నెలబైట పుష్పతల్పంబుపై శయనించి

సుఖంబుగా నిదురించుచున్నయది నాయుపదేశంబువినిచని దానిం గనుఁగొంటివేని నృపాత్మజుని లావణ్యం బధికంబను తలంపుదొలంగు నొక్కచిత్రంబు సెప్పెద నాకర్ణింపుము. 185

చ. చెలియఁగ సుందరాంగి యట - వెన్నెలలో శయనించియుండ యా
చెలువపుకాముదీప్రభలు - చేడియమోమునసుండికల్గెనో
కలువల కేనినుండి మఱి - గల్గెనొయంచుఁ దలంచుచుండఁగా
జలదము మాటుఁజేసె నల- చంద్రుని నామదిశంకి వీడఁగ౯. 186

క. ఆచెలువ చెలువమెన్నఁగ । వాచస్పతి కైనదుర్ల - భమ్మటమనమా
చూచియిఁకఁ బొగడనేర్తుము । నీచుండెగు రాచకొమరు - నిం బొగడకుమీ. 187

ఆ. పెక్కుమాటలేలఁ - బృథ్వీఁబూర్వమునిపు । డింక మీఁదదాని - కెనయనంగ
వనితలెందుఁ గలుగ-రనినఁజాలును; మెచ్చు।కొందువేని మెచ్చు-కొనుము దాని. 188

సీ. రంభయూరువులసౌ - రభ్యంబుఁగని మెచ్చఁ - దనువెల్ల వర్ణింపఁ - దరముగాక
యలతిలోత్తమనాస - యందంబుఁగని మెచ్చఁ - దనువెల్లవర్ణింపఁ - దరముగాక
కుందపల్వరుసబా - గును కోరికి నిమెచ్చఁ - దనువెల్లవర్ణింపఁ - దరముగాక
హరిణికందోయిసొం - పమరఁగాఁగని మెచ్చఁ - దనువెల్లవర్ణింపఁ - దరముగాక.

గీ. ఇటుల నచ్చరలయ్యింతి - పటువిలాప । లలితలావణ్య సంపద-కలరికొంత
కొంతఁదిలకించి వర్ణించి-సంతసించి । యరుగుదురు కాంతనిద్రించు-నపుడు కేలు. 189

వ. నేనా పొలంతి యందంతంబంతయు నెఱింగియుండియు, నది యొక మాటగాఁ బాటించి నీతోడ నింతకుమున్నెప్పుడునుం జెప్పినవాఁడంగాను సుమీ ! ఇపుడు ప్రస్తావంబుగలుగుటం జేసి యింతదూరంబు బలుకవలసివచ్చినది. నీమాటలకడ్డంబుగా విరోధవాదంబుఁగావించితినని యెగ్గుగాఁ నెంచక మైత్రినడపుట శ్రేయంబు. ఇంక నీదురభిప్రాయంబు విడిచి రాజపుత్త్రినిఁ బొగడుటం జాలింపుము. 190

ఆ. రమణి సొగసులాడి - రాజపుత్త్రినకంటె । వలదువాదమనిన - వజ్రనఖుఁడు
వినియనాదరమున - వెడనవ్వునవ్వియు । ట్లనియె వక్రదేహుఁ - గనలిచూచి. 191

ఉ. అంగజ శక్రనందనవ - లావనినాథవ సంతసోముల
న్నంగనతుల్యు లామనుజ - నాయక పుత్త్రినకేమిలాభమీ
వెంగలి మాటలాడిన వి - వేకము గల్గినవారు మెత్తురే
బంగరువీడి యిత్తడినిఁ - బట్టి పెనంగెదవేల ? మానుమీ. 192

ఉ. ఎన్నఁడుఁగాని చూపరుల - నెందును జూడని వాఁడవాటచేఁ
గన్నియ రూపమింత యధి - కంబుగ నెంచెద వంతెకానినీ

కన్నులఁగన్న నిట్లనవు - గట్టిగ నింకొకమారు జెప్పెదన్
మన్నియమేటిపుత్త్రిని స - మానముగాదు లతాంగిసుంతయున్. 193

క. అనుఁడున్ ద్వితీయపలలా | శనుఁడాద్య నిశాటుఁజూచి - చాలుంజాలున్
మనుజేంద్ర నందనుఁడు నే | వినిపించిన లేమకెనయె? - విడుమీమాటన్. 194

క. కోరిక గలిగినచో నో | రారంగానీకు నీవ - యగ్గించుకొనం
గారాదె రాజసుతునకు | ధారుణి సరిలేరనంగఁ - దగునే నీకున్. 195

వ. అని తిరస్కారంబుగాఁ బలికి యొక్కింత యోచించి వజ్రనఖుం జూచి. 196

ఆ. నీవు చెప్పినట్టి - నృపపుత్త్రి పేరేమి? | తెలుపు మనుచు నాద్వి - తీయుఁడడిగె
వినుమువాని పేరు-విజయాశ్వుఁ డంద్రని| పలికె మొదటివాఁడు-ప్రమద మొప్ప.197

క. ఆలించి వక్రదేహుఁడు | హేళనఁ గావించినవ్వి - యిట్లను తెలిసెన్
జాలఁగఁ బొగడితి వతఁడొక | వేలఁగువాఁడనుచు తగునె-మెచ్చఁగవానిన్. 198

ఆ. అనిన వజ్రనఖుఁడు - కినిసివానినదల్చి | నీవుచెప్పినట్టి - నెలఁత పేరుఁ
దెలుపుమనియెనాద్వి-తీయాసురుఁడుయశో| వతియటందురనిన-వజ్రనఖుఁడు. 199

క. అదివిని పకపకనగి నె | మ్మదిఁ బొమ్మికఁ జాలుఁజాలు — మచ్చరమీపే
రొదవిన వారు కురూపలు | ముదితను వర్ణించివాద - ముంజేయకుమీ. 200

గీ. తారతమ్యం బెఱుంగక - తలఁచినట్టి | మాటగెలువఁగ నెంచిపో - రాటమునకుఁ
బూనితివి రిత్తచనువాఁడఁ - గాను నేను | విడువు మిఁక నోరి నీకోఁతి - పిడికిలింత.

వ. అని యుగ్రుండై పలికిన వజ్రనఖునకు వెఱవక వక్రదేహుం డిట్లనియె. 202

క. మదవతి లావణ్యంబునఁ | బదియవ పాలైనఁగాని - పలుకుటకుంగ
ల్గదు నేర్పునన్ను బోంట్లకుఁ | బదరి వచించెదవు నేను - భయమొందుదునే.? 203

వ. అని యివ్విధంబున రాజపుత్త్రిక లావణ్యంబెక్కుడని యొకఁడును రాజపుత్త్రిని సౌందర్యంబెక్కుడని యొకండునుఁ బలికి వివాదంబునకుం జొచ్చి మచ్చరించి పోరునకుం దొడరి యంబరతలంబునం బెనంగుచుండి రాసమయంబున 204

క. భీకర దంష్ట్రిలు నుగ్రా | లోకనములు పల్లమీస- లున్ వికృతంబౌ
నాకారముఁగల రాక్షసుఁ | డాకస్మికముగ నొకండ - హంయువువచ్చెన్. 205

గీ. వచ్చిఘోరంబుగాఁ బోరఁ-జొచ్చియున్న| రాక్షసులఁ జేరి నిల్చికా - రణమెఱుంగ
నెంచివారల నపుడువా - రించి తగవి| దేలయని, వారు చెప్పఁగా-నెల్లఁదెలిసి. 206

ఉ. మిక్కిలి నవ్వివాఁడనియె - మీవలె బుద్ధివిహీనులెందులే
రెక్కడఁజూచి నేనెఱుఁగ - నింతకుమున్నిది చాలవింతసాం

పెక్కువయంచు నొండ్లనుతి - యిచ్చుటయుఁ జగడించుటొప్పునే ?
పక్కన నవ్వరే కనిన - వారలు మీకిదిదోఁచ దాయెనే ? 207

క. ఒకఁడొక్కటిఁ జెప్పినమతి । యొకఁడదివిని యిచ్చలేక - యుండినమూరా
డకపోవుట యుక్తముకో । రికపడి చెప్పిన యెఱింగి ధృతిఁజెప్పఁదగున్. 208

క. పరులనుతిఁ జేసిమీరి । ర్వురుమైత్రిని వీడియిట్లు-రోషించి భయం
కరముగఁ గలహించుట మీ । పరువునకున్ హానియెఱుఁగఁ-బల్కితినుండీ 209

క. ఈరీతి నైకమత్యవి । దూరులమై యుంటఁగాదె - దుర్మతులమరు
ల్గోరిన మనవారికి సుఖ । గోరం తేనియును నిరక - గ్రోలిరిపరుఁగ్. 210

క. మనకసురాఖ్య ఘోసంగుట । మనము సురావళులచేత - మందాత్ములమై
దినదినము నోటుపడుటయు । ననుకూలత లేమిచేర - నైనది కాదే ? 211

గీ. ఎల్లదైత్యుల ప్రాణిక - యేకమైన । నైకమత్యంబు మనలోన - నమరియున్న
మిమ్ము వలెబుద్ధిఁగోల్పోయి-మెలఁగకున్న । విబుధులను గెల్వఁజాలమే వెఱపుఁదక్కి.

ఉ. ఆకులలంబులుందిని మ - హాటవులన్ నసియించుమానులం
దేకువమైనలంచుట ప - త్రివశలం జెఱఁబట్టుటం తెకా
కేకమతంబుగాఁ బసుల - నెన్నఁడొనర్చి సుఖింపఁగంటిమీ
పోకలు మీకుఁజెల్లవిఁకఁ - బొందు వివాదముమాని యిర్వురున్. 213

క. వైరము మీలోమీకుం । గారాదు వివేకయుతులు - గారామీర
లొప్పొనరింపఁగ నంతటి । నేరుపుగలదేని సుజల - నిర్జింపుఁడనిన్. 214

వ. అనిచెప్పి వారలశాంతచిత్తులంజేసి ఘటోదరుండను పేరుఁగల యాత్మీయదనుజుం డిట్లనియె. నేనొక యుపాయంబుఁ జెప్పెద నాకర్ణించి యవ్విధంబునఁ గావింపుఁడు. మీకిపుడు పొసంగిన వివాదంబు నివారణంబు గాఁగలదు. ఎట్లంటిరేని యింతటి తగవునకుం గారణులయిన యాయువతీ యువకుల నాసంజూపుఁడు. ఆలాగొనరించితిరేని. 215

క. మీలో నెవ్వండనినది । మేలోపరికించి వేతి - మినివిడితగనే
నాలోచించి వచించెద । నాలస్యముఁ జేయనలవ - దది యెట్లన్నన్. 216

ఆ. రాజతనయు నిపుడు-రయమునఁ గొనిచని । పల్లవోష్ఠియున్న-పాన్పుమీఁదఁ
జేర్చిమాయనిద్రఁ - జెందింత మొకరికి । యొకరి మేలుకొలుపు - టొప్పఁదొలుత.

క. తెలిసిన వారికి దేహముఁ । దెలియని లాగుననొనర్చి - తెలియని వారిం
దెలివిని బొందింతము మును । వలెఁ నందున భేదమెఱుఁగ-వచ్చున్ మనకున్. 218

వ. వారియం దెవ్వరెక్కువగా వలచి వర్ణించెదరో వారు సౌందర్యమునం దక్కువయని యెఱుంగవలసినది. నాకిప్పటికిది మంచియుపాయంబుగాఁ దోఁచెం గావున. 219

క. తడయక చని కొనితెండి । ప్పుడ రాజకుమారుననుచు - మాఁడవదనుజుం
గడు మెచ్చి వారలిరువురు । నడుగులఁ బడిలేచి రంత - నయ్యసురులలోన్. 220

గీ. వజ్రనఖుఁడేగి యాధరా - వరుని సుతుని । మాయనిద్దురచే మేను - మఱవఁజేసి
వేగిరంబున నంబర-వీథిఁ దెచ్చెఁ । గదలిరంతట మువ్వురుఁ - గనకపురికి. 221

క. చని మేడ మీఁదిభాగం । బున భూవరపుత్త్రియున్న - పూఁబాన్పుపయిన్
తనుదానెఱుఁగని నృపనం । దనుడించి విలాససంప - దను గనిరంతన్. 222

ఆ. వారిలో ద్వితీయుఁ - డౌ గక్కసుండప్పు । డాతృతీయదనుజు-నాజ్ఞవడసి
మాయనిదురఁబూన్చి-మగువకుఁ దొలుతరా । కొమరు నిపుడు మేలు-కొలుపుఁడనుచు.

వ. వజ్రనఖాహ్వయుండునునట్ల యగుంగాక యనివచియించియించుక సేపు మేల్కొలు
పందగు నుపాయంబుఁ జింతించి తత్ప్రకారంబు నిశ్చయించి నిజాకారంబుపసంహ
రించి మత్కుణరూపంబుధరించి. 224

క. త్వరితముగఁ గుఱచకాళ్ళుఁ । గురువిందపుఁ జాయ మేను - గొంచెపు నోరున్
బరగఁ గడునేర్పు మీఱఁగ । గురగురఁజని రాజ పుత్త్రికుని మైఁ గఱచెన్. 225

చ. కఱచిన మాయవీడి పెను - గగ్గురుపాటు జనింపలేచి యా
యొఱపరి మించు మేని నవ - కోర్వఁగ లేక నఖాగ్రసంహతిన్
బఱటుచు నావులించి నిజ - భర్మమయోన్నత రమ్యహర్మ్యమం
దఱమఱలేని శయ్యపయి - నప్పుడు నుండుటఁ గాఁదలంచుచున్. 226

క. కనువిచ్చి నాల్గువైపులఁ । గని తనయున్నట్టిచోటు - కడునూతనమై
కనుపట్టిన నబ్బురపడి । యనుమానము గదురలేచి - యటునిటు నచటన్. 227

వ. నలువంకలం బరికించు తలంపున వెపలి యప్పటి విభ్రమంబువలనఁ జెంగటశయ్యాపైఁ
బరుండి యుండెడు సుందరాంగిం జూడక యచ్చోటి విశేషంబుల వీక్షించుచున్న
యతనికిఁ దత్సౌధాంతరాళంబున యనూనతర చంద్రోపలనికరనిర్మితానల్పశిల్పికల్పనా
భాసురంబులగు కక్ష్యాంతరంబులును, నచ్చటచ్చట నిలిచి మచ్చరంబున ముచ్చులం
గనిపట్టి ప్రచ్ఛతమకంబున విచ్చుకత్తులంబూని కాచికాచి హెచ్చిన బడలిక నచ్చలంబు
డిగి బడిబడిం బరుండి రొండలెఱుంగక గుఱకలిడుచు నిదురించు పష్ఠధరశ్రేష్ఠు
లును, లలితంపుఁ బలుకులుడిగి నయనంబులు ముకుళించి చలింపకఁ దలలు వ్రేలవైచి
తులలేని చెలువంపు మణిపంజరంబులయంతరంబున నిలిచి తూఁగాడు కలకంఠకీర
శారికానికరంబును, నురుచిరమణిభూషణాలంకృతశరీరలై మురజమర్దళడమరుడిండి
మవిపంచీప్రముఖబహుతరవాద్యనికరంబులు కరంబులవహించి పాటవంబున నాట
పాటలం బొద్దుగడపి సోలుచు నలసట పెంపున వివశాంతరంగలై యందందుఁ బవళించి

కూరుకుఁ జెందియున్న సఖీజనంబులును, నానావిధచిత్ర విచిత్రవర్ణంబులుగలిగికనుల పండువుఁగావించుచు జ్వాజ్వల్యమానంబుగాఁ బ్రకాశించుచున్న దీపకలికా సముదయంబును, నలువంకల వాసనలఁ బ్రకటించుచు రమణీయస్ఫటికశిలాకీలితంబులగు గవాక్షమార్గంబులం బహిర్గతంబులై యెగసి యంబరంబున నలుగడలం బ్రసరించు గుగ్గిలాగరు చందనాది ధూపంబులును, ప్రవిమలమణిగణపరికల్పితంబులై యచ్చరల కనయని మెచ్చదగు సజీవంబుల కరణిఁ జెలువొందు సాలభంజికా జాలంబును, వసమంబులగుమిసిమిగలపసిఁడిచట్టంబులపై ముసుఁగువైచి నవపనంబులమీఁది పస మించు జలతారుమిసమిస కాంతులు పార్శ్వంబులందాపిన నిద్దంపుటద్దంబులకు సోఁకి ప్రాకటంబుగాఁ బ్రతిఫలించి వింతసొబగు నాపాదించుదంతంపు కోళ్ళ దోమతెర కీలుమంచంబులును, సుగంధవస్తుసముదయకరండంబులును, కుసుమతాంబూలభరితంబులగు రత్నపుఁబళ్లెరంబులును, నిత్యాదివిశేషంబులు దృగ్గోచరంబైన నాశ్చర్యంబుఁ జెంది తన మనంబున. 228

క. ఇదియేమి మాయ యొక్కో | సదమలమణి సౌధమందు - శయనించితినే
నిదురించి లేచికాంచిన | నదియంతనె చంద్రకాంత - హర్మ్యంబయ్యెన్. 229

క. కలఁగాంచెదనో నిక్కమె | తిలకించెద నొక్కొనిదుర - తెలిసెనొ లేదో
యలవిజ యాశ్వుఁడఁగానో | వలతికడుం గ్రొత్తయెందు - వసియించెదనో. 230

క. శ్రీపురమో కాదోయిది | యేపగిదిని భేదమెంచె - నింతటిలోనేఁ
డేపాటి గాలిసోఁకెనొ | రూపింపఁ దరంబుగాదు - రూఢముగాఁగన్. 231

సీ. శారికాకీరపం - జరయుక్తమగుటచే - హర్మ్యంబునాదిగా - దనుచుఁదోఁచె
ప్రపవంబులను మీఁదఁ - బఱచియుండుటఁజేసి-యాపాన్పునాదిగా - దనుచుఁదోఁచె
నెలఁతలు పెక్కండ్రు - గలుగుటఁదలపోయ-యంతఃపురంబిది - యనుచుఁదోఁచె
నివియెల్ల నామది - కెఱుఁగవచ్చుటనెంచ - మనుపటివాఁడనే-యనుచుఁదోఁచె

గీ. నిదురకాదిది కలగాదు - నిక్కవంబు | చూచుచున్నాఁడ నింతయు-సురలమాయ
యొక్కొగాకున్న జాలమో - యొకముహూర్త | మాత్రమున నన్నియును నెట్లు-
[మాఱునిట్లు. 232

ఉ. ఈహయొకింతలేదు కని - యెన్నఁ డెఱుంగను మున్నదెట్లునే
నీహరువైన హర్మ్యమున - నింతటిలో మృదుపుష్పశయ్యపై
లాహిరి గ్రమ్మ చేరితిద - లంపగ నెట్లునుదోఁపదయ్యొనా
హా ! హరుఁడే యెఱుంగవలె - నన్యు లెఱుంగఁగఁ జాలరీవిధిన్. 233

క. అని పెక్కువగలనపుడా | మనసరియోజించుకొనుచు - మరలనటిగిళ
య్యానుశేరి యచటఁ జెంగటఁ | గనియెన్ నరపాలపుత్త్రిఁ-గాంచనగాత్రిన్. 234

ఆ. వనజముఖియొకర్త - తనయున్నశయ్యపైఁ । బవ్వళించియున్న - భంగిఁగాంచి
నంతవింతమించి - యతఁడు నిర్విణ్ణుఁడై । కొంతవడికిబుద్ధిఁ - గుదురుకొలిపి. 235

ఆ. ధైర్యశాలిగాన - తలఁకకయిట్లని । తలఁచెనెవ్వరీను - తన్వియిచటి
కెవ్విధమున వచ్చె - నింతలోవింతపై । వింతయొకటి యుద్భ- వించెనిపుడు. 236

చ. అనితలయూఁచియట్టె పల - లాళన కల్పితమైన నిద్రపెం
పునఁ బవళించియున్ననన - బోణి విలాసము మాటిమాటికిం
గనుఁగొని మెచ్చిబుద్ధిఁదమ - కంబు జనింపనపూర్వమోహవ
ర్ధనమతినంగసంభవశ - రప్రకరానలతాపతప్తుఁడై. 237

క. ఇదియేమి యెన్నఁడును నా । మదిఁ గలిగి యెఱుంగనట్టి - మక్కువ నేఁడీ
మదిరాక్షిపైనిఁ బొడమెడు । నెదియొక ర్తన్యమింక - నెట్లుంచుఁగడుఁక. 238

క. తహతహపడి యతఁడంతనె । సహజంబగు ధృతియునోర్పు - సమసిననపుడా
యహివేణి కభిముఖుండై । యహహా! యనియిట్లుదలఁచె-నాశ్చర్యముతోఁ. 239

క. వనజారికరస్పర్శన । మున పద్మములట్లు కనులు - ముకుళించియు నీ
కనకాంగి యెప్పెడుఁ సొబ । గున నొక్కింతయును నెందుఁ - గొఱలేకబళీ! 240

మ. తలమేవర్ణనఁజేయుదీని? రతియో - దైత్యారి రాట్కాంతయో
యలకానాధకుమారు నెచ్చెలియొ? స - త్యంబట్టివారే మె గా
వలయుఁ; మానవకామినీ మణులకీ - భవ్యాంగసౌందర్య మీ
విలసత్తేజము నీవిలాసమును నీ - విన్నాణముంగల్గునే? 241

శా. ఈవాలుంగనుదోయి సొంపు బటువౌ - నీగుబ్బచన్దోయి సౌ
రీవిప్పారునుమేనికాంతి చెలువం - బీలేతచెక్కిళ్లబా
గీవక్రాలక పంక్తియందమును నీ - యింపైన కెమ్మోవిగో
మీవేణీరుచి యీముఖంబుకళనే - నెందుఁ గనఁ ధారుణిఁ. 242

ఉ. కారుమెఱుంగునిగ్గుఁగొని - కంజదళంబుల మూసనుంచిచె
ల్వారఁగ మన్మథాగ్నినిడి - యట్టె ప్రవాళపుఁగ్రోవిఁబట్టి తాఁ
గోరికరంగనూది యది - గొబ్బునఁ బుత్తడికర్వునందునఁ
దీరుగఁబోసి యీమదవ - తిఁ సృజియించె విధాత నేర్పునఁ. 243

క. ఇదిమూర్తము శృంగారమొ । జదలుఁ భువిలోఁగొనిరెుడు - సమ్మోహనమో
మృదుజంగమ వల్లరియో । గదలని రుచిమించుమించు - కాంతియొతలఁపఁ. 244

చ, హరిఫణి తారకేశ కమ - లాబ్జ శుభాకృతు లొందు టెంతమా
కరయఁగనంచు నీచెలువ - యల్పపు మధ్యము వేణిమోము నుం

దరమగు కన్నులుం గళముఁ - దత్సమతన్ వహియించెనో యనన్
హరి ఫణి తారకేశ కమ - లాబ్జ శుభాకృతు లొప్పభాసిలున్. 245

క. అందంబులైన లసదర । విందంబులు పదములీయు - విదయూరువులిం
పొందఁగఁ గదళులఁ గేరున్ । కుందనపుం బొమ్మ మేని - కుదిరిక గన్నన్. 246

గీ. అరుచీమలబారు వి - య్యాంబుగోరు । గోరులలతారకంబుల - సౌరు గేరు
చారుముఖి మోము - జందురుఁ జేరఁ జీరు । సారసాక్షికి సరిబోలు- వారు లేరు. 247

చ. జలరుహగంధి నెమ్మొగము - సౌరును, దుమ్మెదగుంపు వోలుకుం
తలముల యందముంగనిన - తాపసుఁడైనను జంచలాత్ముఁడై
వలపును జెంది కుంది తుద - వారిజ బాణునిబారి గొట్టిగా
కెలమిఁ జరింపనేర్చునె ? మ - హీస్థలినిట్టి లతాంగిగల్గునే ? 248

సీ. తరుణిబాహువులతో - సరిగాక కాఁబోలుఁ - జిక్కులఁబడిలత - ల్వెట్లఁ బ్రాకె
తరుణిపిఱుఁదులతో - సరిగాక కాఁబోలు - నడిఁ జక్రములుతిరు - గుడులవడియె
తరుణి పెంజడతోడ - సరిగాక కాఁబోలు - పన్నగంబులు నేలఁ బ్రాకఁ దొడఁగె
తరుణిజంఘలతోడ - సరిగాక కాఁబోలు - వెఱపునఁ గలమంబు - వెన్నుఁ జూపె
గీ. చానపదముల సాటిగా - లేనికతన । పంకజంబులు కుత్తుక - బంటినీట
నిలిచి తపనునిఁ గూర్చి రా-త్రులుఁ బవల్లు । విసుగుఁ జెందక తపముఁ గా-వింపఁ దొడఁగె.

చ. పవలు చరింపనోడె విష - పానముఁ జేసె శిరంబు వాంచెఁ బెన్
గవ్వులను దూటె కూలఁబడెఁ - గాకలఁ జిక్కి తపించెనో లినీ
యువిదముఖాక్షి నాసలకు - నొప్పగు మస్యకుచాంగశోభకున్
సవతుగ లేక సోమ ఝష - చంపక సింహమహీధ్ర హేమముల్. 250

గీ. వాయుభక్షణంబుఁ - గావించి నీటిలో । మునిఁగి తపముఁ జేసి - కనకగాత్రి
జడకుఁ గుత్తుకకును - సరియయ్యె నొక్కింత । యురగమును దరంబు-నుర్విలోన. 251

క. వరమౌక్తికములు రదములు । సరసీరుహ కాండయుగము - చానభుజంబుల్
తెరలువళులొమ్మవి సుధా । పరిపూర్ణము పక్వబింబ - ఫలముం బోలున్. 252

క. కిసలయముల కెనపాణుల । పస; కరశాఖలు దగున్ బ్ర - వాళములనఁగా
కుసుమనిభంబు శరీరము । మిసిమిం దగనద్దములను - మించుం జెక్కుల్. 253

శా. ఈకాంతామణి యామృగాంకముఖి యా - హేమాంగి నాచెంతన
స్తోకాలంకృత రత్నవిగ్రహము నా - జోద్యంబు గాదెట్లకో
శోకం బాఁ బవళించి గాఢతరమౌ - సుప్తిన్ వహించెంబలా !
యేకైలాటములోనఁ జిక్కునడి నే - నెప్పాటనున్నాఁడనో. 254

వ. దీనిం గనినది మొదలు మానసంబున నపూర్వంబగు మోహంబు జనించి వన్నులయించుచున్న యది. ఇది దైవతంత్రంబుగావలయునని యయ్యిందుముఖి సౌందర్యంబభివర్ణించుచుఁ గందర్పశరసందోహసంజనితామందకీలికీలాదందహ్యమానమానసుండై యొక్కింత విచారించి మించిన తమకంబున యానీలవేణిని మేలుకొలిపి తదీయవృత్తాంతంబు సాంతంబుగా నెఱింగి యనంతరంబునఁ గర్తవ్యంబు యోజింతుంగాక యని నిశ్చయించి కోరికలూరం బలుమాఱయ్యంగనం దట్టితట్టి యట్టిట్టుంగదలించియు, నటు సమీపంబునం బవళించి నిదురించుచున్న వన్నెలాడులు మేల్కానకుండునటులఁ దిన్నని యెలుఁగునం జీరియు, మక్కువ పెంపునఁ జెక్కులఁ గీటియు, గాఢనిద్రాపరవశరాయి మేల్కానకున్న విన్నంబోయి చిత్తంబుత్తలపడ మెల్ల మెల్లగా నిట్లనియె. 255

ఉ. ఎక్కడినిద్ర నీకొదవె - నివ్విధిఁ గాంతరో! చాలు లెమ్ము ; నా
దిక్కటు చూడు మింక; పర - దేశిని పూర్వ మెఱుంగ సట్టి నే
నిక్కడికీ నిశీథమున - నెవ్విధి నోచను దెంచినాఁడ; నీ
చక్కదనంబుఁ గాంచి మదిఁ - జాలవిరాళినిఁ గొంటి నిత్తఱిన్. 256

క. నీతల్పముపైఁ జెంగటఁ । జేతోజాతప్రసూన - సాయకనికరో
ద్భూతానల పరితప్తుఁడ । నైతల్లడ మొందుననుద - యంగనవేలా? 257

ఆ. కనులువిచ్చినన్ను-గనుఁగొని నీకథ । నెఱుకఁ జేసి యిచటి - కెటుల నేను
జేరినాఁడ నొక్క-యారీతిఁ దెలిపినా । మమత దీర్పుమబల! - మానఁజాల. 258

క. నిక్కంపు నిదుర యోయిది । విక్కున నాచర్య లెల్ల - వీక్షించుటకై
టక్కుం జేసెదవో మది । నొక్కటియును నాకుఁదోఁచ - కున్నది సుమ్మీ! 259

ఉ. చేడెరో! నోటిముత్తెములు - చిందునె కన్నులు విచ్చి చూచి మా
టాడిన? వేగ మోహపరి - హారముగా నధరామృతంబు నే
వేడుకఁ గ్రోలకున్న మది - వీడదు తాపము; సైఁపఁజాల ; నీ
తోడిది నిశ్చయంబు; పరి - తోషముఁ జెందఁగఁ జేయుమంగనా! 260

క. అలుకా నీకిది మారువల్కు । మొలకా! కపురంపుఁబలుక! - ముద్దుల చిలుకా!
నెలకాక కోర్వ కేనిటఁ । బలుకాఱియ పడఁగ జాలి - పడవకటకటా! 261

క. కలికీ! వలరాయనిపూ । ములికీ! సైరింపజాల - మోహము ; నిలచా
నలకీ తళుకీ బెళుకీ । చెలువంబును గలదె? వినుతిఁ - జేయందగదే? 262

చ. చెలువము మీఱఁగా నిను సృ - జించిన పద్మభవుండు నీకుఁగ
న్నులనిడి చూపొసంగడటె? - నోరిడి పల్కెడి శక్తిఁ గూర్పఁడో?

తెలియదుకానిచో నిటుల - తేటికనుంగొని వేడ్కమీఱఁగాఁ
బలుకకయుండెదేల ? పగ - వాఁడనె ? యీతడవేల ? కామినీ ! 263

క. నినుమున్నెన్నఁడు గానియుఁ । గనియెఱుఁగని వాఁడనయ్యుఁ-గడువలచితిఁజూ
చినయంతనె ; యిదియే నీ । ధనమైతిననంగఁ దగుని - దర్శన మబలా ! 264

మ. అకటా ! సైఁపదు నామనంబు నిమిషం - బైనం ; దలంపంగదు
ర్ఘటమీమోహము ; సత్కృపన్భవదపాం - గ శ్రీవిలాసేక్షణ
ప్రకరంబుం బ్రసరింపఁజేసి ననుసం - భావించి పంచాస్త్రహ
ల్లకబాణానల కీలలార్పు మిఁకరో - లంబాలకా ! వేఁడెదన్. 265

క. నీరూపుఁ గనిన నెంతటి । ధీరుండై నను గలంగి - ధృతిచెడిబాలిం
దారున గైరవబాణుని । బారింబడు; నీకుసాటి - పడఁతులు గలరే ? 266

ఉ. చెంగటనీవు గల్గుతటిఁ - జిత్తజుఁడుత్తలపెట్టఁబూని యి
భ్భంగినురంబుసం బ్రసవ - బాణచయంబును నాటుచుండె నా
యంగద మాన్పకివ్విధిని - హాయిగ గాఢసుషుప్తిఁజెంది యుం
డంగనదేమి ధర్మమక - టా ! యిఁక మేల్కొనరాదె ? జవ్వనీ ! 267

క. వాదా దయలేదా నను । నోదార్పఁగరాద యోప - యోదాభకచా !
నాదాహము మానఁగఁగన । రాదా కనువిచ్చి యోర్వ - రాదాయెఁగదే. 268

ఉ. చెంతకుఁ జేర్పరాదో ? నను - జెక్కులముద్దు లొసంగరాదో ? వి
శ్రాంతునిఁ జేయరాదో ? సర - సంబుగఁ బల్కఁగరాదో ? మోహవి
భ్రాంతిని మాన్పరాదో ? యల - పంచశిలీముఖుకేళిఁదేల్చినా
చింతనడంపరాదో ? ననుఁ - జేకొన నీతడవేల ? సుందరీ ! 269

సీ. కనువిచ్చిచూడవే - కాంతాశిరోమణీ ! - తలఁగిపోవును మోహ - తాపమెల్ల
పలుకవేనోరారఁ - బంకేజదళనేత్ర ! - సమసిపోవునునావి - చారమెల్ల
కౌఁగిలింపవవేగఁ - గనకసన్నిభగాత్రి ! - విడిచిపోవునునను - నిడుమలెల్ల
మన్నింపవేదయ - మధులిట్సమాలక ! - యడఁగిపోవునుమనో - వ్యాధులెల్ల

గీ. మాయురే ! యిట్టినిద్రయే-మాడ్కిఁబొసఁగె । నేర్పడఁగ నామనంబునీ-వెఱుఁగఁదలఁచి
మాటలాడకచూడక - మాయఁజేయు । చున్నదాన వటంచునే-నెన్నుకొందు. 270

చ. అనియిటు పెక్కురీతులఁ బ్రి - యంబునఁ బల్కుచు మేలుకొల్పను
ల్పిన తనచర్యలెల్లన వి - వేకికిఁజేసిన బోధరీతినా
టనుఁగని రాజపుత్త్రిఁ డక - టా ! యిఁక తాళఁగఁజాల నంచుదాఁ
గనక నిభాంగినింబొదివి - కౌఁగిటఁజేర్చి విరాళిమించఁగన్. 271

ఉ. మోమున మోముఁ జేర్చు, నను - మోవి నునుఁజూచి మెచ్చు, గా
రామున నెందుఁ బోయెదిటు - రమ్మని యొత్తు నురంబురంబునన్
జీమచిటుక్కు మన్ననటుఁ - జేడెలు మేల్కొనిరంచునుల్కు, నే
మేమొ వచించు, ముద్దుఁగొను, - నింపుగఁ జెక్కులగీటుమాటికిన్. 272

చ. అసమునఁ బైకొనం దలఁచు; - నంతట నేమివొసంగునా యొడం
బొసఁగునొ కాదటంచుడుగుఁ ; - గాముని దీమమునన్ను బోంట్లకీ
బిసరుహగంధి నిక్కమని - పెక్కువిధంబుల మెచ్చునాత్మలో
గుసగుసమాటలాడుఁ జెవిఁ - గోరిక లీరికలెత్తనత్తఱిన్. 273

మ. ఉడురాజాస్యను కౌఁగిటం బొదివి పై - నొత్తిల్లి చేరంగ మో
మిడి ముద్దాడుచు కోర్కిదీఱ కతఁ డెం - తే వేడ్కనిం కొక్కము
ద్దిడు మింకొక్కటి యింక నొక్కఁ డొకమా - టిం కొక్కమాటీనిచో
విడ నింకొక్కటి యొక్కమాటనుచుఁ జుం - బించుం దమిన్ జెక్కులన్. 274

చ. అతనివిరాళి యెట్టిదియొ - హాళియదెట్టిదొ యంతలోనయా
ధృతిగలవానినంతటికిఁ - దెచ్చినమారుని నేర్పదెట్టిదో
గతిమతి యెట్లొకాని యటు - గాటపు నిద్దురఁ జెందియున్న రా
సుతతనతోడఁ బల్కమికిఁ - జూడమికిన్ మదిశంక జెందకన్. 275

క. రమ్మను గదియంగాఁ జను । విమ్మను నాతమికినీవ - యిమ్మనునీక నా
సొమ్మైతివి కరుణంజే । కొమ్మను సమయమ్మటనును - కొమ్మనుగని తాన్. 276

క. ఈవిధమున కేవలమో । హావిష్టుండై శుభాంగుఁ - డావిజయాశ్వం
డావెలఁదిపై విరాళిన్ । భావజతాపమునను దిల - పడుచున్న తఱిన్. 277

క. అతులిత పలలాశనక । ల్పితగాఢ సుషుప్తి తన్ను - వెసఁబైకొనఁగా
నతఁడటఁ దల్పమున నిమీ । లితనయనుండగుచుఁ బవ్వ - ళించెను బిదపన్. 278

ఉ. వారలలోన లేమదెస - వాఁడొక మత్కుణరూపమొందియా
సారసలోచనంగఱచి - చయ్యనమాయపు నిద్రమాన్చెఁదా
నోరువలేకయయ్యువిద - యుల్కుచు దిగ్గున లేచి కాంచెఁ జె
ల్వారఁగఁ జెంతఁ బాన్పుపయి - నంగజగాత్రుని రాజపుత్త్రునిన్. 279

వ. అని చెప్పిన నవ్వాల వృత్తాంతం బెట్లని యడుగుటయు. 280

శా. స్వర్ణాక్షద్వీప పంచవక్త్ర ! భృతవి - శ్వస్తోమ ! నీలాంబుము
గ్వర్ణభ్రాజితదేహ ! మోహహర ! లోక స్తుత్య ! సత్యప్రియా !

పూర్ణాబ్జాస్య! విముక్తకిల్బిష! మరు - ద్భుగ్వైరిగంధర్వ! దు
ర్వర్ణక్ష్మాధరవాసమిత్ర! బలిగ - ర్వధ్వంస! కంసాంతకా! 281

క. సురసేవ్య! సర్వ! సర్వే । శ్వర! మురహర! భక్తపోష! - శైలనిలయ! సు
స్థిర! సద్గుణశీల! హరీ! । హరనుత! లీలావిశేష! - హరిసువేషా! 282

మాలిని. ద్విజనిచయవిహారా! - దివ్యమాణిక్యహారా!
ద్విజవరసుకుమారా! - దీనమందార! శూరా!
విజయకరకృపాణా! - వేదవాక్యప్రమాణా!
విజయసఖ! ధురీణా! - వేణుగానప్రవీణా! 283

గద్య

ఇది. శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాద లబ్ధానర్గళచతుర్విధ కవిత్వమహత్త్వాభిరామ, భూసురకుల క్షీరపారావారపర్వశర్వరీసోమ, శ్రీవత్సగోత్ర పవిత్రాపస్తంబసూత్ర, సావిత్రీ లక్ష్మీనృసింహార్యపుత్త్ర, సుకవిజనవిధేయ పిచ్చయనామధేయ ప్రణీతంబగు విజయాశ్వచరిత్రంబను ప్రబంధంబునందుఁ బూర్వభాగంబునఁ బ్రథమాశ్వాసము సంపూర్ణము.

శ్రీమద్వేంకటేశ్వరార్పణ మస్తు.



శ్రీరస్తు.

# విజయాశ్వ చరిత్రము

## పూర్వభాగము

---

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీమదలమేలుమంగా । కోమలకుచకుంభలిప్త - కుంకుమ ఘనసా
రామోదాన్విత శుభవ । క్షా! మదనవిలాస - శేషశైలనివాసా! 1

వ. దేవా! అవధరింపుము. సద్గుణగణవిశారదులగు శౌనకాదులకు నిరుపమానసన్నుతసత్క
థాశతాంగసూతుండగు సూతుండిట్లనియె. నవ్విధంబునఁ దల్పంబుపై గాఢనిద్రా
పరవశుండై శయనించియున్న యన్నృపతికుమారునిఁ గన్నులారంగని యాసన్నుతాంగి
స్వాంతంబునసంతోషాశ్చర్యసాధ్వసంబులు పెనంగఁ గర్తవ్యంబు దోఁపక కొంతవడి
నిర్విణ్ణయైయుండి యనంతరంబునఁ బ్రయత్నమ్మున హృదయంబుఁ బదిలపఱచి
కొని మరల నతని నీక్షించి తనమనంబున. 2

క. ఇదినిజమో విభ్రమమో । నిదురయొ మెలకువయొ దేవ - నిర్మితమాయా
భ్యుదయమొ కలయో యెన్నఁడు । నోదవనిదగు క్రొత్తవింత-యొక్కటిగలిగెన్. 3

క. తరమా నామేడకునిసి । నొరుఁడన్యులకెఱుకపడక - యుండఁగ జొరఁగా
నిరతంబును మజ్జనకుఁడు । పరఁగభటులఁ గాపుఁబెట్టి - పాలింపఁగన్. 4

మ. అనిశందేహమునొంది కోమలిమనో - జ్ఞాకారునారాజనం
దనునింగన్గొని యాత్మనిట్లుతలఁచెన్ - దానెవ్వఁడో యీతఁడిం
దనుమానింపకభీతిలేకనడురే-యంతఃపురింజొచ్చె, చొ
చ్చిన యీమాత్రమె కాక చెంత శయనిం-చెన్ నాదుపూఁబాన్పుపై. 5

క. కావలివారల నింతుల । నేఁగఁ గికురించెనొక్కొ - యిది చిత్రంబిం
కేవారునితఁడు వచ్చుట । నీవేళయెఱుంగకుంట - కేమనవచ్చున్. 6

మ. అకలంకాంగ విలాససంపదల మే - లై యున్నవాఁ డెన్నఁ డీఁ
డౌక రాజాత్మజు నట్లుతోఁచె మదినా-నో కాదో యేపోతుటీ
గకునైనం జొరరానిచోటిది చమ - త్కారంబుగా మేడమీఁ
దికిఁ దానెవ్విధివచ్చెనో యిచట ని - ద్రింపంగతం బెద్దిరో. 7

ఉ. వచ్చిరియెటులంగనట్టి నను - వంటి నృపాత్మజ చెంతఁగొంకులే
కచ్చెరువేది శయ్యపయి - హాయిగఁ దాఁబవళించు టెట్లు ? వీఁ
డెచ్చటివాఁడొ ? నేఁడిచటి - కేమికతంబున నేగుదెంచెనో ?
మెచ్చఁగవచ్చు నీ తెగువ; - మిక్కిలి నేర్పటివో తలంపఁగన్. 8

చ. అదియటులుండ వీనిఁగని - నంతనె నామదిలో నపూర్వస
మ్మదమును మోహమున్ గృపయు - మక్కువయుం జనియించె; నేమిసే
యుదునిఁక; నెచ్చెలుల్గనిన - నొప్పమిపుట్టుట నిక్కువంబు; యీ
పదనున నేయుపాయమును - బన్నుట మేలగునో తలంపఁగన్. 9

ఆ. నిదుర మేల్కొల్పి - నేవీనివృత్తాంత । మడిగి తెలిసికొనుట - యగునొ లేక
చెలులఁజేరఁజీరి - తులలేని యీవింత । నెఱుక సేయుటగునొ - యేదిలగ్గొ ? 10

చ. గొనబున మారుడైన నల - కూబరుడైన జయంతుడైన మిం
చినసుకుమారుఁడీతనికిఁ - జేటొడఁగూర్చుట కొల్ల ధాత్రి; నేఁ
గొనకొని విభ్రమాన్వితుట - కుంజజు దెంచిన కారణంబుఁ దే
రునగుల మున్ను వాసమును - దూడిగఁ దొట్టనెటుంగు టొప్పగున్. 11

క. అటుమీరదటఁ గాఁగలయది । యెటులైనను సగుచుఁగాక - యిప్పటికిదిరయే
దిటవగు యోజనయని యా । కుటిలాలక యెంచియతనిఁ-గొలియాడిమదిన్. 12

ఉ. ఎక్కడిదేహసౌష్ఠవమి - దెక్కడిచెల్వమయారె చూడఁగా
నెక్కడిసౌకుమార్యముమ - హీస్థలిసందరిలోనవీని నే
డెక్కుడు నేర్పు చెంచి సృజి - యించిన కాంచనగర్భు నేర్పున
మ్మక్కువఁ బొగడఁగాఁ దరమె - యందమునన్ సరిలేరువీనికిన్. 13

సీ. పరిపూర్ణచంద్రబిం - బంబుమహాసియుండు - మరువుమించినవీని - ముద్దుమోము
ప్రాకటాలంకార - భరితమై యొప్పవి - వాలుమాఁ వీనివ - క్షస్థలంబు
హ స్తితుండసమాన - మైచెలువొందును - పరికింపఁగాఁ వీని - బాహుయుగము
కిసలయచ్ఛవి కినం - కిలిమొత్తఁగాఁ బాలు - తీరుమించినవీని - తీరువాని 14

గీ. బళిబళీ! యిట్టిసౌందర్య - భాగ్యరేఖ । యౌసఁగవలవదె పురుషుఁడై-పుట్టెనేని
వీనిఁగాంచిన యేచాన - విదుష నేర్చు । భామినీజనహృదయాభిరాముఁడితఁడు. 15

చ. అమరఁగవీనిఁగూడి సుఖ - మందకయుండిన జన్మమేల ? రూ
పమును సుఖంబులేల ? సిరులు - ప్రాయముతేల ? - నిరర్థకంబుకో !
ప్రమదమెసంగ పూర్వకృత - భవ్యతరప్రభ పుణ్యపద్ధతిస
త్వమున నితండు దక్కె; సుకృతంబు వృథాజనదుష్టి నేటికిన్. 16

గీ. అనుచుఁ దలఁపోసి సర్వప్ర - యత్నములను । జెలువకోర్కి దీర్చెదనని - చెలులు పలుకు
చెంతఁ జేరఁడని కామిని - చిన్నబోయె । వినికికడపటి సాహస - వృత్తిఁబూని. 17

క. తత్తరపడు సందియంబును । నుత్తలపాటును విరాళి - యును మదిఁ బెనఁగన్
జిత్తజుఁడు జేసిన తూపుల । మొత్తమ్ములు పఱుపఁ దాప - మున నా వేళన్. 18

ఆ. ఎపుడుఁ గనియు వినియు - నెఱుఁగని పురుషునిఁ । దగునుగూడ దనెడి - తలఁపు మాని
కౌఁగిలించె నౌర ! - కామార్తులగు కాంత । లదనుకులము గోత్ర - మరయరొక్కొ ! 19

చ. కరమనురాగ మొప్పఁగ బిగి - కౌఁగిటఁ జేర్చి యెఱుంగుఁగాని, యా
సరసిజగంధి మై పరవ - శత్వము నొందుటఁ జేసి యెంతసే
పటుదుగ నుండెనో యటుల - నాత్మ నెఱుంగదు; మోహ మెంతని
బ్బర మెంచఁగో ! మన్మథవ్యథకు - పాలగు కామిని పైఁ బఁగల్గునే ? 20

ఆ. తరుణి యవ్విధమునఁ - దనుఁ దా నెఱుంగక । కౌఁగిలించి యుండి - కడకుఁ దెలిసి
యకట విడువఁజాల - నరనిమిషంబైన । నెట్టిచెట్టపాసఁగి - యేమిరైన. 21

క. అనినిశ్చయించి కామిని । తనచిత్తము నతనికంకి - తంబొనరించెన్
మనసిజుఁడది దెలిసి "శబా" । సనినగి నెఱవాఁడి పూవు - టమ్ములఁ బఱపెన్. 22

క. ఆఱాగుమారుఁడేసిన । వాలుందూపులకు మై వి - వశమై బాలికన్
సోలిధృతిదూలి యానర । పాలాత్మజునట్టె పొదివి - పట్టెపలుమరున్. 23

ఉ. ముద్దిడి మోవినొక్కి, తన - మోమును మోమునఁజేర్చి గుబ్బలం
దద్దుచు వాని పేరురముఁ - దాఁకఁగ నొత్తుచు, లేఁతచెక్కులన్
బద్దునగోటఁగీటుచుఁ బె - నంగి పెనంగి, యతండు లేశమున్
నిద్దురవీడకున్న, రమ - ణీమణి యబ్బురమంది యిట్లనున్. 24

ఉ. ఔరా! యెక్కడి గాఢనిద్ర యిది బా - గాయెంజు విూలెమ్మ; శృం
గారాకారుఁడ బోటి నిన్వలచితిన్; - నాపైఁ జలంబేల? నా
యారాటంబు నెఱుంగఁగాఁ దగదె నీ - యందంబొప్పఁగాఁ బల్కు? యీ
క్రూరత్వంబును మాని నన్నిపుడుచే - కొమ్మా కృత్తి నొందింపకన్. 25

ఉ. ఇక్కటిశీలత్వమేల ? నిను - నెన్నివిధంబుల వేఁడుకొన్న నీ
చక్కనికన్నులం దెఱచి - సంతసమొప్పఁగ నన్నుఁ గాంచినా
మక్కువదీఱ భంగినొక - మాటయుఁ బల్కవు నిర్దయాత్మ; నన్
బ్రక్కకుఁజేర్పరాదొ ? తమిఁ - బాయఁగ నేలుకొనంగరాదొకో ! 26

క. సురసిద్ధ సాధ్యవిద్యా । ధరగంధర్వాహి యక్ష - దానవఖగకి
న్నరనరులలోన నీవె । వ్వరివాఁడవొ యదిరయెఱుంగ - బలుకుము నాకున్. 27

క. ఘనుఁడగు మజ్జనకునిచే । సనమున నన్యులకుఁ జొరన - సాధ్యంబగునా
ఘనహర్మ్యాంతరమునకే । యనువునఁ జనుదెంచి వాఁడ - వదియుం జెపుమా. 28

క. భూచరులఁ గొదవునేతగ । యోచించిన యిట్టిశక్తి - యనుస్థైర్యంబుల్,
భూచరుఁడవొ ఖేచరుడవొ । లేచికనుల్విచ్చి కనితె - లియఁబల్కు మొగిన్. 29

ఉ. వచ్చినవాఁడ వెగ్గనక - వాసిఁదలంపక సాహసించినీ
యిచ్చమదీయ శయ్యపయి - నెక్కి, యెఱుంగని కన్యనైనన్
ముచ్చటఁదీరనంటి, భయ - మున్విడిచేరికఁ బవ్వళింపఁగా
వచ్చునె? యెట్టికీడు పయి - వచ్చునొ యంచుదలంపవేమదిన్. 30

క. మున్నెన్నఁడు నెఱుఁగను నిను । నన్నును నీవెఱుఁగవెపుడు - నాకచరుఁడవై
యున్నమఱి భూచరుఁడవై । యున్నను నంతఃపురంబు - నొప్పునె చొరగన్. 31

క. ఇలజనులకుఁ బొసఁగుఫలా । ఫలములఁ దెలియంగరావు - పటుసెడిదనుకన్;
తెలిసికొని యనుభవింపఁగ । వలసినతఱి వానికవియ- ప్రాప్తించునొగిన్. 32

క. కానతలంపని తలఁపుగ । నేనినుఁగను భాగ్యమెటనె- నేఁడిట; పూర్వం
బేనోములు నోచితినో । వానిఫలం బిపుడుకూడి - వచ్చెనునాకున్. 33

గీ. వలపుఁజెందినదాని నా - వంటిదాని । మేలుకొనిచూచి మాటాడి - మేనులేని
వానిబారినిఁ బడినట్టి - పడఁతిగనక । గాఢనిద్రనుండుట మేలు-కార్యమగునె? 34

వ. అని యనేకప్రకారంబులం బలుకుచు తనవలననైనంతవట్టు నతనిమేలుకొలుపం బ్రయత్నించి విఫలమనోరథయై కర్తవ్యం బెఱుంగనేరక యిది దైవమాయగావలయుఁ, గాదేని యర్థరాత్రంబున నిట్టివిచిత్రకార్యంబు తటస్థంబగుటయు నితని కింతటి గాఢసుషుప్తి గలిగి యెన్నివిధంబుల మేల్కొలిపినను మేలుకొనకుండుటయుం గలుగునే? యిది స్వప్నంబని తలంతునేని యింద్రియవ్యాపారంబుకొఱఁత పడకుండుటం జేసి యటుల నెంచుట పొసంగదు. సత్యంబుగ నేఁజూచుచున్నదాన. నిందుకుంగల నిమిత్తంబు మాత్ర మెఱుంగరాక యున్నయది. యేమిసేయుదునని చింతాక్రాంతయై కొంతవడియోజించి మంతనంబున నొకయుక్తిదోఁచుటయు నావింత నెఱుంగుట కదియొక యాధారంబుగానుండుంగాకయని నిశ్చయించి యాసమయంబున. 35

ఉ. ఆననబోణి వాని మెడ - కంపముగా విలసిల్లుహారమున్
దానుధరించి యర్ఘమునఁ - దత్సమమౌనిజ కంఠహారమున్
వానిగళంబునం బొసఁగ - వైచి ముదంబున లేఁతచెక్కులన్
దాననికూర్మిముద్దుఁగొని - మారునిబారికిఁ జిక్కివేదనన్. 36

ఆ. సైఁపలేక కెలన - శయనించిమిక్కిలి । తల్లడిల్లుచున్న - తత్క్షణంబ
కాంచనాంగి కసుర-కల్పితంబగుమాయ । బోసఁగుటయును-నిదురబోడ మెనంత. 37

వ. యశోవతీవిజయాశ్వులునిద్రాపరవశులై తల్పంబునశయనించియున్నఁగాంచి రాక్షస త్రయంబువారిం జేరఁ జనుదెంచివిలోకించి తారతమ్యంబు విమర్శింపఁదొడంగి రప్పు డందుఁ దృతీయదనుజుండు తక్కుంగల నిశాచరద్వయముం జూచి తలయూఁచి యిట్లనియె. 38

క. కంటిరె మీకొకనికివా । ల్గంటియు నొక్కనికి మనుజ - కాంతాత్మజుఁడుం
గంటికి నింపుగఁదోఁచెడ । రంటిరిగద యిపుడు తెలియ - నయ్యెనె? మీకున్. 39

క. పోలఁగఁగని యిరువురిలో । మేలెవరో బలుకు-డనిన, మేమది తెలుపం
జాలము, మమ్మేడుగగని । కేలా? యుతుకుట కొకండు - నీలకొకఁడునే? 40

ఆ. నీవుచక్కఁజూచి - నిజమునూహించిమో । మోటలేక జెప్పు - మున్నమాట
నొక్కకంట నున్న - మొకకంట నెన్నయు । విలదునీకు; పక్ష - పాతమేల? 41

వ. అనిన విని ఘటోదరుండు వారింజూచి. 42

చ. వినుఁడెటిగింతు మీకిపుడు; - వీరలలోపలఁ దారతమ్యమున్
గనవలెనన్ననించుకయుఁ - గానఁగరాదు; శుభాంగులిర్వురున్;
గొనబునమాటలందమినిఁ - గూర్మిని నీటున హెచ్చుతక్కువల్
గనఁబడకున్న దెవ్విధినిఁ - గాంచిన; మీరునుఁ జూడుఁడేల్పడన్. 43

క. తగుమగునయితనికన్నిటఁ । దగుమగునకిలెందుతారి - తమ్యములేదీ
జగడమిఁకమాని చనుఁడెం । చగఁదగువీరొకరికొకరు - సరియగువారల్. 44

ఆ. అనిన సంతసించి - యానని యిరువురు । నతనిఁజాలమెచ్చి - నుతియొనర్చి
యచటనుండి కదలి-రపుడు వజ్రనఖుండు । స్వపురమునకుఁజేర్చె - నృపతిసుతుని. 45

క. ఈరీతిని నడురేయి । న్వారలుకడువింతయైన - వాదాడినిజం
బారసియంతటఁ దమతమ । దారింజనిరంబరమున - ధారాళగతిన్. 46

వ. అంత వేగుఁజామగుటయు. 47

గీ. ప్రణయకలహంబు కతమునఁ - బతులరతులఁ । దేల్పకున్నట్టిచెలుల సంధింపుఁడింక
వేగుతటియయ్యె ననిచాటు - విధముఁగాఁగ । గుక్కుటంబులు పెల్లుగాఁ - గూయఁదొడఁగె. 48

ఆ. ఇనుఁడువచ్చునింక - జనులార! మీరుమీ । పనులమిగుల మెలఁకు-వనువహించి
మెలఁగుఁడనుచుమున్న-దెలుపవచ్చినమాత । ఫక్కినపుడుఁ వేగుఁ-జుక్కదోఁచె. 49

చ. కలయిక పెంపునంబడలి - కాంతరో ! నీయుపకాంతుచెంతనై
దెలియకఁ గూర్కెదేర ! మదిఁ-దేకువ యేమనవచ్చు ? లెమ్ము ర
చ్చలఁబడెదంచుదూతి యభి - సారికయాచెలిఁబిల్వ, దానికి
న్వలవలఁబోయి మోమునఁగ - వెల్వెలనయ్యెను తూర్పుచాలఁగన్. 50

క. తరుణీమణులును తరుణులుఁ । సురతశ్రమనొందియున్న - సొలయికఁదొలఁగన్
విరివీవనలను విసరెడి । పరిచరులును వోలెశీత - పవనములాలసెన్. 51

గీ. ఇరులడంగెను రవియుద - యించుననిద । లంచివేగసంకేత స్థలములువెడలి
చెలులవిడిపోవు తఱినివి-టులముఖముల । కరణిగృహదీపసంతతి-కాంతిఁదొలఁగె.

చ. కువలయనేత్రనై మనుజ - కోటికి మెచ్చగురాజనయ్యునే
నవమతినొందఁ గావలసె - నయ్యనుఁడేపున నాదుతేజమున్
జవమునఁ గైకొనంగలఁడు - సాగుటమేలెట కేనినంచుని
క్కవవిడిపోయిడాఁగె ననఁ - గ్రుంకె విధుండపరార్ణవంబునన్. 53

క. అలమారనృపతి గృతిఁబాం । గుల పేరిటి శత్రుకోటి - తోఁబోరిజయం
బెలమిఁగొని రాఁగనేనల । గలకలమన విహగతతుల -కలకలమెసఁగెన్. 54

ఉ. సాహసమొప్ప భాస్కరుఁడు - చయ్యనరాఁగల జింకనంచు మం
దేహముఖానురుల్గడఁగి - ధీరతనోలిని దారిఁగట్టియు
త్సాహము మీఱనిల్చినసె - సంగెనువారలరక్తమాల్యము
ఖ్యాహవవేషకాంతి యన - నత్తఱిశోణిమ మొప్పెఁబ్రాగ్దిశన్. 55

క. పతియుద్యత్నదేశమునకున్ । జతనంబునఁ బోవుటయువి - షాదాత్మకయై
యతఁడరుదెంచిన నలరెడు । సతివలె వికసించె పంక - జాతలతధృతిన్. 56

క. పరభూపతి రాజ్యంబును । హరియించిన భీతిఁగొనిని - జాత్మేశుఁడు తోఁ
బరువిడిపోయినఁ గుందెడి । తరుణీయువలెకైరవ ప్ర - తతియుఁడిచలఁగెన్. 57

చ. [షట్పది]:—తరణినలుండు సాంధ్యకలి - తంత్రమునందగులొంది సోమపు
ష్కరునకు రాజ్యమోటువడి - గాటపుచీఁకటి కానఁబద్మినీ
తరుణిని నిద్రలోవిడిచి - తారజనీ ఘణిదష్టుఁడైయొగిన్
పరిమిత యామకాల ఋతు - పర్ణునిఁగొల్చుచుఁ బ్రాగ్విదర్భలో
సిరియునిజాకృతింబడసి - చేరెను వేయుద యాద్రిదేశమున్. 58

ఉ. ఈచొపురాజు వచ్చెవిభుఁ - డిచ్చటలేఁడిపుడన్యపూరుషున్
జూచుట దోసమంచు తన - సొంపగు కన్నులు మూసిభర్త దా

వేచనుదేఁగాఁగనులు - విచ్చికనుంగొను పద్మినీ ప్రప
న్నోచితదృష్టులట్లు కను - లోదగముల్వెడలెన్ ద్విరేఫకముల్. 59

వ. ఇట్లు సూర్యోదయంబగుటయు యశోవతిసముచితప్రకారంబున మేల్కాంచి లేచి పరికించి రాత్రిఁదనచెంతఁబరుండియుండిన సుందరాంగుఁడగుయావనపురుషునింగానక వెఱఁగంది కుంది సందియంబుగదుగనందున్న మందగమనలనందఱంజేరఁజీరి తమకంబు మీఱి వారితో నిట్లనియె. 60

క. ఓతరుణులార! నాశ । య్యాతలమున రాత్రియుండి-నట్టిశుభాంగుం
డీతఱి నెటకేఁగెను? వాఁ । డేతత్స్థలంబులోన- నెవ్విధిఁజొచ్చెన్? 61

ఉ. వానిమనోహరాకృతియు - వానివిలాసము నేమిచెప్పనా
మానసమున్ హరించెఁ ద్రుటి - మాత్రములోన నతండు; నేను పె
ల్లూనిన నిద్రమైమఱచి - యుండుతఱిం గరుణావిదూరుఁడై
తానెటకేఁగెనో యిపుడు - తద్విధమెయ్యనఁ దెల్పుఁడేర్పడన్. 62

క. మీకెల్ల నెఱుఁగవచ్చుం । గాకుండిన నెవ్వఁడుచేరఁ - గాఁగలఁడిటకున్
భీకరులగు ఖడ్గధరుల్ । కైకొనిరక్షించుచుండ - గానదిచెపుడా. 63

ఆ. అర్ధరాత్రివేళ - నతఁడునామేడలో । నెటులఁజొచ్చెనొక్కొ - యెఱుఁగరాదు
వచ్చియంతఁజోక - వాంఛించియంటినా । పజ్జశయ్యమీఁదఁ - బవ్వళించె. 64

ఆ. చెలియలార! యేమి - సెప్పుదు మేల్కాని । వానిఁజూచినపుడు - మానసమునఁ
బట్టరానివలపు - బుట్టినఁగౌఁగిట । నట్టెచేర్చిముద్దుఁ - బెట్టుకొంటి. 65

క. చయ్యన నత్తఱిలగ్నం । బయ్యెను నామనమువాని - యందుననిఁకమా
యయ్యవరునరయనేలా? । వయ్యము, తగునితఁడె నాకుఁ - బతియనుకొంటిన్. 66

ఆ. అట్టివానిచెట్టఁ - బట్టలేకున్నచో । పుట్టువేల? పూర్వ - పుణ్యఫలము
కతననాకుదక్కెఁ;-గాంతకుపుణ్యంబు । కొలఁదిఁబురుషుఁడనుచుఁ-బలుకవినమె. 67

క. తలఁపఁగ మీరలునాపైఁ । గలకూరిమి కతనమేలు - గావింపంగాఁ
దలఁచితగునంచు పరులకుఁ । దెలియంగానీకయతనిఁ - దెచ్చితిరొక్కో. 68

చ. అనవుడు గుండియల్ పదర - నంగన లొండొరులాననంబులన్
గనుకనిఁజూచుకొంచు వెఱఁ - గాంచవ గాత్రినిఁగాంచిపల్కిరే
మనియెదవమ్మ? నీమదువు - లద్భుతముల్గలపోసిచూడ మా
నినిరో! యిదేమి నీవనుట - నీవయెఱుంగని చాడ్పుతోఁ చెడిన్. 69

ఉ. ఎక్కడిమోహనాంగుఁ డతఁ - డెవ్విధివచ్చెను రాత్రి? యెవ్వఁడా
చక్కనివాఁడు? వాఁడెటుల - శయ్యపయిం బవళించె? నెట్టిదా

మక్కువ ? నీవువల్కినది - మాకెఱుఁగంబడనట్టి వింత; య
మ్మక్కమతిభ్రమంబొయిది- మాయయొ వెఱ్ఱితనంబొ కోమలీ ! 70

ఉ. పూరుషమాత్రుఁ డీస్థలముఁ - బూని చొరందరమా ? సదాభటుల్
ద్వారముఁగాచియుండ సత - తంబును మేమును సప్రమత్తతన్
జేరువనుండ నెవ్వఁడొని - సిన్ బరుఁడొక్కఁడు వచ్చెనన్న నె
వ్వారలుగాని నమ్ముదురె? - వంచన మాటలు గాక సుందరీ! 71

వ. అని పలికి వారొక్కింత సంకోచంబడర యోచించి మరల నిట్లనిరి 72

చ. సరిసరి! యింకనీవనెడి - చందము మాకెఱుఁగంగవచ్చె; రా
తిరికలఁగంటి వాభ్రమము - దీరకయున్నదినీకు ; నిక్కమి
ద్ధరఁగలవారికెల్లరకుఁ - దార్కొనుచుండు నిజంబువోలె ; వి
ద్దురగొదయైనఁ దోఁచునవి; - తోయజపత్ర విశాలలోచనా ! 73

క. అనయము నృపనందనులం । గని లిఖియించిన పటములఁ - గనుచుండుదువం
దునవొక రూపము కలలో । నొనరంగా నీకుఁదోఁచె - నోబింబోష్ఠీ! 74

క. ఈవఱకు నొకఁడు వచ్చుట । పోవుట మేమెఱుఁగమిటకుఁ - బొలతిరొ! మమ్మ
న్నాభవరుఁడు నమ్మినీకుం । గావలిగా నుని చెనిచటఁ - గలుగునెతప్పుల్. 75

క. మమ్ముదుగు టేల? యననా । కొమ్మమనంబుననుమించు - కోపంబున మైఁ
జెమ్మటలూరఁగవారల । నమ్మకసదలించివెఱద - నరనిట్లనియెన్. 76

శా. ఔనా నే యిఁక నేమనందగును మి - మ్మారితి రేయెల్లనా
తోనున్నట్టి శుభాంగు డాఁచి యిపుడెం - దున్ నిష్కళంకంబుగా
మీ నేర్పేర్పడ మాటలాడెదరు మే - ల్మేలాయెఁజాల్చాలు నెం
తైనంజేయరె? యింతకుం దెగిన వా - రౌరాసఖుల్మీరలే ? 77

ఉ. ఖ్యాతిగ నేకొఱంతయునుఁ - గానకచాలసుఖించు మత్రపమో
దాతిశయంబు గాంచి హృద - యంబుల నోర్వఁగలేక యేపఁగా
నీతెఱఁగొప్పనంచు నను - నివ్విధిఁజింతవహింపఁజేయఁగాఁ
గైతవముల్ రచించితిరి - కానము మేమని నంతబోవునే? 78

క. కలతెఱఁగును దెలుపకయిది । కలయని సాధింపఁదగునె? - కటకట ! మిమ్మున్
జెలులుగదాయని నమ్మితిఁ । బొలుపొందిన మేకవన్నె - పులులని యెఱుఁగన్. 79

ఉ. నాకొగిఁగూర్చువారలని - నామది నెంచితిఁ గానలేకమీ
రేకముఖంబుగా నెఱుఁగ - మీ విషయంబని పల్కినేఁడున
న్నేకడవెట్టఁజేయుటకు - నెంచితిరేమనవచ్చునింక మం
షాకరవాఘులార ! యెవఁ - డుంజను దేరఁగలేదె పల్కఁడా. 80

ఆ. అనియదల్పఁజెలుల - కందటికినిఁబెద్ద। యైనచంద్రికాఖ్య - యనియెనిట్లు:
వెలఁది, నీవుపల్కు - వృత్తాంతమిందెవ్వ । రెఱుఁగరమ్మ, కోప - మేలనమ్మ? 81

క. కలగంటి వనినఁగాదని । యలిగిమముఁ దూలనాడి - యదలించెదవే
వలనికిఁ జనియెయ్యదియుం । దెలియనిమే మెవనినింక - దత్తుము చెపుమా? 82

గీ. పడతిరో! వినవమ్మ, నీ - పాదమాన । మాకుఁదెలియదు, నిక్క-మీ - మాటనిజము;
గాలిసోఁకెనొ లేకున్నఁ - గలయొకాని । యెందుగాదిది వింతగా-యున్నదౌర! 83

క. అనవుఁడునుడురాజానన । కనలును వెఱవగపు శంక - గదురఁగఁదనలోఁ
దనరఁగయోజించినిజం । బునుదెలియఁగలేక మిగులఁ - బొలుపఱియంతన్. 84

ఆ. నిజగళస్థమైన - నేవళంబుఁదలంచి । మరలస్మృతి వహించి - మగువసఖుల
డాయఁజీరిపలికె - మాయకత్తెలుమీరు । నన్నుమోసగింప - న్యాయమగునె? 85

చ. కలయని గాలియంచుఁ బలు - కందగునే? యిదె, రాత్రివాఁడునా
కలనశయించియున్నపుడు - గెంటనికూరిమి వానిహారమున్
గళమున నేఘరించితిని - గంటిరె? నాదగురత్నహారమున్
వెలయఁగవాని కంఠమున - వేసితిఁ; గూరుకువచ్చెనంతలోన్. 86

మ. ఇవియున్ స్వప్నములో లభించెనొ నిజం - బేయానొ యోజింపఁగా
మదికిందోఁపదె? మీరెఱుంగకతఁడే - మాడ్కిన్ననుంజేరెనో
నిదురంజెందినవేళ నెందుజనెనో - నిక్కంబుగాఁదెల్పఁడీ
సుదతీరత్నములార! యిట్లదయతన్ - స్రుక్కింపఁగా నేటికిన్. 87

చ. సురగునసేవరించినర-సాధగవృత్తి సమాంగుఁదెచ్చినా
సరసనుజేర్పరమ్మ, మిము - సన్నుతిఁజేసి బహూకరించెదన్;
బరవశబుద్ధినైతిని గృ - పారహితుండగు మీనకేతనుం
డరమరమాని నన్నుఁగుసు - మాంబకసంహతిచేనలంచెడిన్. 88

క. అనియిట్లు సైఁపఁజాలక । వనటమెయిన్ వేఁడుచున్న - వనితవెతన్ గ
న్గొనివెల్లబోయి చంద్రిక । యనుమానము మదినిఁగదుర - నపుడిట్లనియెన్. 89

చ. చిలుకలకొల్కి! నీవిపుడు - చెప్పినచొప్పు దలంచిచూడఁగాఁ
గలయనిచెప్పఁగా తగదు; - కంటిమినీ మెడనుండుహారమున్
గలవిధమెట్టిదోఁ దెలియఁ-గాఁబడదీశ్వరుఁడే యెఱుంగుఁబో
తెలియఁగలేరు దక్కొరులు; - దీనిని మేము వచింపనేర్తుమే? 90

క. కలరైనఁగాలిసోఁకినఁ । దలఁపున విభ్రమమెసంగఁ - దగుఁగానిమహో
జ్జ్వలరత్నహారమెవ్విధిఁ । గలుగున్? గలగాదు నిజమె - కావలయుంజుమీ. 91

క. ఎన్నఁడును వినని వింతను । విన్నారము నేఁడు మేము - వెలఁదిరొ! నీచేఁ;
గన్నారమొక నిదర్శన । మిన్నియు నెట్లొదవెనొక్కొ - యేమాయంబో. 92

క. ఇంతటిలో నబ్బురముగ । నింతటి చిత్రంబుపొసఁగె - నేమనవచ్చున్
నుంతైన నమ్మరీవు । త్వాంతమ్మను నెవరువిన్న - నంబుజవదనా. 93

క. ఎన్నఁడునుగల్లలాడక । యున్నది యున్నట్లుపలుకు - చుండుదు, మిఁకనీ
కన్నుగలరే యాప్తులు । కన్నెరొ! మే మెఱిఁగిదాఁప - గాఁగలమటవే. 94

ఆ. అనినవారిమాట - లాదరింపకఁదన । వలపుకానిమీఁద - వాంఛమీఱ
భోగరక్తిమాని - పొలఁతితోనదిమొదల్ । పెంపుఁదక్కిపరిత - పింపదొడఁగె. 95

చ. పలుకదు కామినీమణులు - పల్మఱుఁ జెంగటఁజేరి వేఁడినన్
నిలిచినచోట నిల్వదు గు - ణింపదు నూతనగీత, మెవ్వరి
న్బిలువదు చేరదన్యులను - బెంచినముద్దుల చిన్నిచిల్కకుం
జెలువచెలంగిపద్యమును - జెప్పదు త్రిప్పదులోనిభావమున్. 96

చ. కుడుపదు షడ్రసోదనముఁ - గోమలివేణి ఘటింప, దింపుగా
ముడుపదు పూవుబెత్తులను - భూషణముల్ధరియింపదెప్పుడున్
విడువదుయోజనన్ జెలుల - వేఁడదురమ్మనియాటలాడగా ;
నడువదుకోరికన్ వగఁగ - నుంగొను నూఱటఁ జెందదాత్మలోన్. 97

క. జలకంబాడదు మేలగు । వలువను ధరియింప దబ్జ - వదనముఖమునం
దిలకముదిద్దదు ముకురము । దిలకింపదు కజ్జలమును - దీర్చదుకనులన్. 98

క. మగువలఁగనినగు నలుగున్ । దిగులొందును వెగటుఁ జెందు - దెగడుహసించున్
వగచును సోలున్ వెలవెల । నగువిభ్రాంతిన్వహించి - యలయుఁగలంగున్. 99

సీ. శ్రుతిఁగూర్చివీణియ - నతివయందిచ్చిన - నదియేలనిపుడంచు - నవలయుంచుఁ
పరిహాసముగఁజెలు - ల్పలుకరించినఁజాలు - నేమిమాటలటంచు - నీసడించు
వెలఁదిపెంచినముద్దు - చిలుకపైవ్రాలిన - వినుకునదవ్వగా - విసరివేయు
వేళకుభుజియింప - వేగరమ్మనిబిల్వ - వెగటుగాఁగనిమాఱు - మొగముపెట్టు
ఆ. తలఁపులోననేమొ - తలపోసితలయూఁచుఁ । కనులనీరునించుఁ-గలతనొందు
దిక్కులరయునట్టె - చెక్కిటఁ జెయిసేర్చు । మదివిరాళిమించి - మందగమన. 100

సీ. చేడెయొక్కతె నెరుల్ - చిక్కుడలించికీ - ల్జడసంఘటింపనో - చ్చంబువలుకు
బోటియొక్కతెమంచి - పూవులుదెచ్చిన - నిపుడొల్లనవియని - యొడసిపోవుఁ
జానయొక్కతె మేనఁ - జందనంబునలంద - వచ్చినకోపించి - వాదులాడు
కాంతయొక్కతెరత్న - ఖచితభూషలనిడ - ముదుకసొమ్ములటంచు-మోముద్రిప్పు

తే-గీ. కసరునదలించు బెదరించుఁ - గామినులను । దిట్టు పెనురట్టుఁ బెట్టుఁ గ్రో-ధించు మోహ
భరము సైరింపఁ గాఁదన - తరముగాక । పంచశరశరపంచక - ప్రహతిఁ దూలు. 101

వ. ఇవ్విధంబుననవ్వీరిబోణిపువ్వువిలుతునిసునిశితంబులగుసలరు టమ్ములకుఁగురియై యారా
టంబుఁ జెంది పరితపింపుచుండ నయ్యవసరంబున. 102

క. కనిచంద్రికాది యువతులు । కనుఁగొలఁకుల శోకభాష్ప - కణములు దొరఁగన్
బనిదోఁపక కడుఁదత్తర । మునని0కెట్లనుచు భీతిఁ - బొందికడువడిన్. 103

క. నెమ్మనమున నీకివ్విధి । నుమ్మలికం జేల ? చేల ! - యోజింపఁగ నేఁ
డెమ్మయినోదుష్టపిశా । చమ్మునినున్ సోఁకియుండు - చందముతోఁచెన్. 104

ఉ. దానికతంబునందొడరెఁ - దాపము, చిత్తవికారమేర్పడెన్
బూనికనద్దియే యటులఁ - బూరుషునింబలె దోఁచెనికు గాం
తా ! నిజమింతయున్ వయసు - దానవుగావున నిన్నుసోఁకెనే
మో నడురేయి; నిట్లువిన-మో కనమొక్కొ పిశాచచేష్టలన్. 105

క. వినుమదియే యొకహారం । బునుఁగైకొనివచ్చి కంఠ-మునఁదాఁదగిలిం
చెనుగాఁబోలును కాదన । మనమేడకు నెవఁడువచ్చు - మగువరో చెపుమా ? 106

చ. అదితెలియంగలేక మన - మందఱమున్ భ్రమమొందితోఁచిన
ట్లిదియొదలంచి నారమిది-యేనిజమేటికిశంక యింకనీ
మదివెఱగందకమ్మ తగు - మార్గము యోజనఁజేసియైన, ని
య్యాదిచని తొనికిం దెలిపి - యైనను మాన్చెదమీవికారమున్. 107

వ. అనిపలికిన చెలులపలుకులు సెవ్వులకుములుకులపగిదిఁదోఁచిన నాదరింపక యాచెలువ
వారిమాటలఁ బెడచెవినిడి తనమనోహరునిపయిం దగిలినమనంబు మరల్పఁజాలక మించిన
విరాళినతనిందలంచి యిట్లనియె. 108

ఉ. ఏవగఁదాళియుందు నిఁక - నెవ్వరునా వెతమాన్చువారు నే
నేవిధిఁగాంతు నాప్రియుని - నెన్నఁడునామదిశాంతిఁబొందు హా !
దైవమ ! దిక్కునీవ పరి-తాపముఁబాపి సముద్ధరింపు మె
ట్లీవిరహాబ్ధినీఁదఁగల - నెట్లుతరింతును దోఁచ దక్కటా ! 109

క. ఇరుపురము నేకశయ్యన్ । బరుండియున్న పుడదేమి - పాపమొ చెడు ని
ద్దురబొసఁగిమేను మఱచితి । వెరఁగది; గాకున్నఁబోవ - విడుతునె వానిన్. 110

వ. అని తనకుఁదాన మాటలాడుకొనుచు, కలంగినతలఁపు నిలుపుకొనఁజాలక యావరా
రోహమోహావేశంబునఁజిత్తప్రియునిస్మరణంబుదక్కఁదక్కినవిషయంబులఁ బ్రియంబు
విడిచి విరక్తివహించి యప్పుడు. 111

సీ. జలతారుపేటంచు - చలువచేలమువిచ్చి - చినిఁగినమలినంపుఁ-జీరఁగట్టి
సొరుగఁగ్గినకుతి - నీరైకవిడఁదీసి - వికృతంపుముదుకకం - చుకముదొడిగి
దిద్దినమృగమద - తిలకంబుదుడిచివే - పచ్చకప్పురమును - బట్టువెట్టి
తలధరించినపుష్ప - ములనూడ్చివెదచల్లి - నిడుకురుల్వ్రేగటుగా - ముడిసుటించి

గీ. తొడవులొకకొన్ని విడఁదీసి - విడెమునుమిసి । పజ్జఁగలయాటవస్తువు-ల్పారవైచి
కలపమునునీటఁగడిగి యా-గ్గలపుఁదమిని । బట్టుజిలుగంచు తెరచాటు - పాన్పుఁజేరి. 112

ఆ. తరుణిచిత్త హరునిఁ - దలఁచితలంచియో । ర్వఁగఁదగంబుగాని - బాళినలయు
టరసియచటికాంత - లత్తటిశైత్యోప । చారముల నొనర్ప - సాగిరపుడు. 113

సీ. కడుఁజల్లనైయుండు - గంధంబుఁబూసిన - పెటిలిపెళ్లలుగాఁగఁ - బేటులెత్తె
పల్లవంబులుదెచ్చి - పాన్పుగావించిన - తోపనేవేఁడిచే - వాడిపోయె
పన్నీరుఁగొనిమేని - పైఁజిల్కరించిన - భుగభుగమనిరేగ - లెగయఁదొడఁగె
విరులవీవనలచే - విసరినముండటి - యంతకన్నుతాప - మతిశయించె

గీ. మున్నెపూక్తికహారంబు - సున్నమయ్యె । సొంపుడిందెఁగనుంగవఁ - గెంపుదోఁచెఁ
జిడిముడిరొసంగె వేనఁబె -జ్జెమటవొడమె । రమణికావేళ మదనజ్వ-రంబుకతన. 114

క. అవెగనిచెలులు భయంబున । నిదియేమి విచిత్రమనుచు - నెంచఁగనపుడా
మదనతియార్పులు నిగుడఁగ । మదినింబ్రియుఁ దలఁచివిభ్ర-మంబుగదురఁగన్. 115

ఉ. రా! యనుఁజక్కవేమి పగ-రా! యను, నోసుకుమార! సైఁపలే
రా! యను, నెందుడాఁగితివి-రా! యను, నీహృదయంబు నెన్నఁగా
రా యను, నన్ను నేలుకొన-రా! యను, నావెతఁబాపకుంటమే
రా! యను, నమ్మియుంటిఁగద-రా! యను, నార! మనోహరా! యనున్. 116

ఉ. హా! యను, నేమిటింతయహహ-హా! యను, నన్నలయించు టేల? మే
లా! యను, మోసపోయితిబ-లా! యను, మారునిబారిఁద్రోయనా
నా! యను, నన్నలంచనద-నా! యను, నోర్వఁగఁజాలరామరా
మా! యను, నీకుదక్కితి నుమా! యను, నక్కట! దైవమా యనున్. 117

వ. ఇట్లక్కాంతామణి విభ్రమంపువలుకులుపలుకుచు విరహవేదనంబరాయత్తచిత్తయై యుత్తలపడుచున్నఁగనిత త్తజపాటుగదుర చెలులావృత్తాంతంబు సత్వరంజనిభూపాలునకుఁదెలుపుట కర్తవ్యంబనితలంచియు, నది యన్యపురుషసంబంధజనితంబగు మనఃక్లేశంబగుటఁబుట్టియట్టిదివినినపుడది తమయజాగ్రత్తవలనబుట్టిననేరమనియెంచి యతండు కోపంబువహించెనేని యొప్పుమిగులుగుట తప్పదనుశంక దమలోముప్పిరిఁగొనఁజెప్ప నోడియింకనదనువలననైనవట్టుఁబరితాపనివారణోపాయంబునఱయుటశ్రేయంబనియు,

నప్పటికిని దెప్పిరిలకున్న రాజునకుం జెప్పవదమనియు, నటమీఁదదైవసంకల్పప్రకారం బుగా నెట్లుజరుగవలసియుండిననట్లుజరుగఁగలదనియు నిశ్చయించివారావిషయంబు బయల్పడనీయక పలువిధంబులనుపచారంబులుగావించుచుండ కొలఁదిదివసంబులు గడ చుటయును. 118

వసంతఋతువర్ణన.

ఉ. అంతదినాంతకాంతికలి-తాంతవనాంతరకాంతసంతతి
ప్రాంతనితాంత సౌరభల-తాంతరజఃపటలీనిరంతరా
క్రాంతదిశాంత, మక్షయజ-గత్ప్రియశాంతము, పాంథసర్గవి
భ్రాంత, మనంగసైన్యబల-సంతము పొల్చెవసంతమింపుగన్. 119

క. కొమ్మలకున్ బల్లవరా । గమ్మొదవెన్ ద్విజవితతికిఁ - గౌతుక మెసఁగన్
తుమ్మెదలఝంకృతికిఁదల । దిమ్మడరెనుపాంథులకుఁ గ-దిరెవిరితావుల్. 120

వ. మఱియు నవ్వసంతసమయంబు, నులయ సమీరపరంపరాసమాగమ నిమిత్తసముద్భూత కదళీకర్పూరపరాగపటలపరిచ్ఛాదితవ్యోమభాగంబును, భానురవిలాసావాసితకేసరకు సుమమధూళీధూసరితదిగంతరంబును, బాలరసాలారుణకిసాలయఖాదనకౌతూహలకలితకల కంఠజాలకోలాహలంబును, ననంగరాజాంగీకృతభృంగీగణసంగీతనాదశ్రవణవివశాంత రంగ భుజంగపుంగవసముదయంబును, కీరశారికానఖముఖక్షతపరిపక్వఫలవిగళితమధుర రసబిందుసందోహపతనపంకిలతరుగణపరిసరప్రదేశంబును నైవిలసిల్లెనాసమయంబున. 121

ఉ. ఓరిమిలేకచాలవెత-నొందు నృపాత్మజఁజూచి నెచ్చెలుల్
కూరిమిజాలియున్మిగులఁ - గోమలితాపముఁ బాయులాగునో
ప్పారఁగ నెంచివేసవి-హారము సేయుట లగ్గటంచులోఁ
గోరికలూర నేగిరిని - గూఢపథంబున వారలంపెలున్. 122

క. తామరసనయనలతనుని । దీమంబుల పగిదిఁగాము - దేవతలగతిన్
భూవిభుసుతనుదోడ్కొని । సోమరినడలెనయపనముఁ -జొచ్చెడివేళన్. 123

ఉ. వారలగారవించికొని - వచ్చుటకామనిపేరిరత్నగ
ర్భారమణుండు మున్నెదురఁ-బంపినయట్టి భటుండువోలెళ్ళం
గారవనాంతరప్రసవ - గంధఘుమంఘుమితానుకూలవి
స్ఫారమనోజ్ఞమారుతము - చానలపైనొలసెన్ బ్రియంబుగన్. 124

క. అనుతపరిమళయుతశ్రీ । తానిలమంద ప్రచార-హారితఁబొగడం
గానేరకఁ బొగడుచువా । రానందము మీఱఁజనిరి - నాంతరసీమన్. 125

క. విహరింపఁదొడఁగి రామని । మహిమఁగని మెచ్చినిరుప-మానప్రమదా
వహమివ్వనమనితమకుఁ । సహజంబగు కులుకునడల - సౌరొదవంగన్. 126

వ. అప్పుడావనంబునవీనవిలాసభాసురంబై, నూతనకాంతాసమాగంబునుంబోలె, సరాగ సల్లలితపల్లవోల్లాసభరితంబును, సరోవరంబునుంబోలె, కలకంఠప్లవంగసారంగ జీవనాధారంబును, కైలాసంబునుంబోలె, కుమారీనీలకంఠవినాయకశుకభరద్వాజనారదాది సంయుతంబును, నింద్రసదనంబునుంబోలె, రంభానుమంజరీ కుందహేమాభిరామంబును; సుజనవచనంబునుంబోలె, నతులితమధుర సరసఫలప్రదార్థంబును, వేశ్యాగృహంబునుంబోలె, బహుతరకుసుమసుగంధ బంధురమనోజ్ఞాలంకార సహితంబును, సుకవికావ్యంబునుంబోలె, ప్రవిమలశబ్దలక్షణప్రసిద్ధంబును, నైయొప్పుచున్నంగని వనితా ముకాలు స్వేచ్ఛావిహారంబునకుంగడంగి రట్టియెడ. 127

సీ. బోటియొక్కతె వేడ్కఁ - బూవులుకోసిన - నతివయొక్కతెవాని - నపహరించె
భామయొక్కతెకోరి - బంతులుగూర్చిన - నింతియొక్కతెకొని - యెగరవైచె
కాంతయొక్కతెలీల - గానంబొనర్చిన - గరితయొక్కతెదాని-బరిహసించె
చానయొక్కతెయంచ - జతలరఁజీరిన - మగువయొక్కతెవాని - నెగిచిలోలఁగె

గీ. మందయాన యొకర్తుపం-డ్లందికోయు । టెటఁగియొకలేమ గిలిగింత - నిడినగించెఁ
బూవుటీరంబులో నొక్క-పొలఁతిడాఁగ । వెదకికనిపట్టెనందొక్క-విద్రుమోష్ఠి. 128

సీ. ఈసత్త్వసూనంబు - లేకదావాఁడియకా - శంబరాంతకునిఘో - రాంబకంబు
లీపల్లవంబుల - నేకదాభక్షించి - గర్వంబునొందుపి - కవ్రజంబు
లీసుగంధానిల - మేకదాకామినీ - తతికిసంతాపంబుఁ - దనరఁజేయు
నీసరోజాతంబు - లేకదామత్తభృం - గావళులకుఁగేళి - కాలయములు

గీ. ఇచటిపూఁదేనెవాకల - కిరుగెలఁకుల । పాదపచ్ఛాయలేకదా - బర్హితతికి
కౌతుకప్రదనాట్యరం-గస్థలములు । వర్ణనాతీతమీవన - వైభవంబు. 129

సీ. రమణీయసుమనోవి - రాజితంబీలత - యామోదసంపద - నలరుటరుదె
మధురఫలావాప్తి - మడఁగెనీశాఖలు - వేడ్కఁజిల్కలువిట్టు - వీఁగుటరుదె
విరితేనెవర్షంబు - కురియునీపొదరింట - ముదముమీఱఁగనళుల్ - మూఁగుటరుదె
కర్పూరపరిమళా - కరములీకదళులు - పొలివోనివిఖ్యాతిఁ - బొదలుటరుదె

ఆ. ప్రవిమలాంభోజ నికరవి-రాజమాన । మీసరోవరమింపెస-యించుటరుదె
యావనశ్రీమనోజ్ఞత్వ-మెటఁగిపలుక । మాధవుండొక్కరుఁడనేర్చు-మనకుఁదరమె? 130

ఆ. అనుచుఁ బలుకుకొనుచు - వనితలవ్వనమున । విరుల పొదల వాక-దరులతరుల
నీడలందుఁజాల - వేడుకఁజరియించు । చున్నయవసరమున - వన్నెఁదలఁగి. 131

క. రాజాత్మజ తాఁ నశోకక్రమ | హీజముకడ నిలిచి మదిని - హెచ్చినచింతన్
దాజడత నుండగ న్గొని | రాజాననయొకతె సామ-రస్యంబొప్పన్. 132

క. ఇందుండు చేలరమ్మట | కుందరలుదమనుచుఁదోడు-కొని చనివనమం
దందందుఁగలవిశేషము | లందెలుపుట కపుడుదాఁద-లచియిట్లనియెన్. 133

సీ. అబ్జాకరముఁజేర - నరుగకే కోమలి! - మోము దామరసలు - ల్మసరునేమొ
క్రీసలయంబులఁద్రుంపఁ - 'గేల్సాపకేలేమ! - కోకిలయలరంచుఁ - గొలుకునేమొ
హృద్యబింబఫలంబు - లీక్షింపకే చెలీ! - మొఱకుకీరము మోవిఁ - గఱచునేమొ
చనుదోయిఁబయ్యెద - సవరింపవే బేల! - కలికిజక్కవ లట్టె - కదియునేమొ
గీ. మెల్ల నడుగుల నిడగదే - మీననేత్ర! | యందియల చప్పుడైన రా-యంచపిండు
వెంటఁబడునేమొ ననుఁబాసి-యొంటినపుడఁ | బోవకే బాల! యేచెట్ల-పొసఁగునేమొ.

ఉ. పువ్వుల నెల్ల గోసిరని - బోటులపైఁ గనలొందకమ్మ! నీ
కివ్వనమందుమంచి విరు - లింకలభింపవె? వాంఛయున్నచో
నవ్వఁగరాదొ గానమునొ-నర్పఁగరాదొకొ యంటరాదొయీ
మవ్వపుఁబొన్న మొగటియు - మావియు వేననలొత్తునట్లుగన్? 135

చ. పొలఁతిరొ! చూడుమీలతల - పొంకము, నీపెనుకప్పురంపుది
న్నెలచెలువంబు, నీతరుల - నిగ్గును, నీపొదరిండ్లయంద, మీ
యలరులబాగు, నీచిగురు-టాకులరంగు పసందుఁ, దేనెవా
కలవడిఁ, జూడ నెంతయును - గన్నులపండువు సేయునిచ్చటన్. 136

క. మునుచెలువపుఁ గొమ్మలతోఁ | బెనఁగిన మాధవవిలాస - విభవముఁగంటే?
మునుచెలువపుఁ గొమ్మలతోఁ | బెనఁగిన మాధవవిలాస - విభవము నోఁచున్. 137

చ. హరికమలాఖగేశ్వర శు-కార్జుననీలగళాబ్జచక్రభా
నుకముని నాగరంభలను-జూచితె? విష్ణుపురంబునాఁదగున్.
హరికమలాఖగేశ్వర శు-కార్జున నీలగళాబ్జచక్రభా
సురముని నాగరంభలకుఁ - జోటగుటన్ వన మబ్జలోచనా! 138

గీ. ప్రోదిఁబన్నీటి సెలయేటి - పొంతనుండు | కోరకాన్వితమగుపొన్న-గున్నఁగంటె?
మెఱయు వనలక్ష్మి ముత్యాల-మేడయనఁగ | నంగజునికొల్వుకూటంబ- నంగనొప్పు.

గీ. కొమరుదీపించు పన్నీటి - కొలనుదరిని | వెలయుపొదరింటి చెంగట - నిలిచియున్న
యాంచగమిదండు వెడలెడి-పంచశరుని | వెలిగుడారపుమడుపుల-ట్లలరుఁగనుము. 140

క. వనితరొ! యాదెపద్మభ్రాం | తిని గేదఁగియందుఁజొచ్చి - తేఁటిపరాగం
బునఁ జూపుచెడియలయుటను | గనుమీ; మత్తులకు సుఖము-గలుగుటయున్నే? 141

గీ. ఇందుముఖీ! తిలకింపుమా - యిట ననంగ । విజయ సహకార సహకార - కుజము పైనిఁ
దేటిగములు, వసంతమాం - త్రికుఁడు మావి । యందు నేరేళ్లు పండించె - ననఁగ మూఁగె.

ఉ. ఈవిరజాజి పుష్పలత - లిచ్చట సంపెఁగ తీవె తోడనిం
పావహిలం బెనంగు టన - యం గడు నబ్బుర మింతిరో! ద్విరే
ఫావళి మూఁగి గర్వమున - నట్టి సుమంబుల నీరసత్వమున్
మోవఁగఁ జేయు నంచలికి - పోయిముఖుంగును జొచ్చెనే మొకో. 143

గీ. విరహిణుల మారుఁ డేచెడి - వేళఁ గొనెడి । కఱకుటంచుల కత్తుల - యొఱలనంగ
నుంత మొనవిచ్చి బంగారు - కాంతి మించి । వరుసఁగను పట్టు గేదంగి - విరులు గనుము. 144

సీ. సితపద్మనికరరా - జితసరోవరముల - విహరించు కలహంస - వితతిఁ జూడు.
పూపుగుత్తుల మూఁగి - పొదలు తేనియఁ గ్రోలి - సొదసేయు కొదమతు - మ్మెదలఁ జూడు.
మటునిటుఁ బొదలచెం - గట గంతులిడుచుండు - కొమరైన మృగశాబ - కములఁ జూడు.
పరిపక్వమగు రస - త్ఫలవర్గముల మెక్కి - వెలయఁ బల్కెడి శుకం - బులను జూడు.
గీ. సొంపు మీఱంగఁ జిలుగాలి - సోఁకి రాలి । నట్టి పుప్పొడి దిన్నెల - హరువుఁ జూడు.
మల్లె చెంగల్వ కొలనికి - నవలిదరినిఁ । దనరఁ బూచిన పున్నాగ - తరువుఁ జూడు. 145

మ. కొమరారంగ రసాలమండపమున - న్గొల్వున్న వాసంతభూ
రమణున్ గొల్చెడి గాయకాదిపరివా - రంబో యనన్ దుమ్మెదల్
రమణన్ గాన మొనర్చె, నాడె శిఖి, కీ - రంబుల్ప్రశంసానులా
పములం బల్కె, బరాబరుల్ సలిపె రే - వన్ శారికల్ జూచితే? 146

శా. ఎంతే వేడుక మీఱ రాజసుత నేఁ - డేతెంచె మర్యాదఁగా
వింతున్ భక్తి నటంచు నెంచి వెస - న్వేషించి నీకై నికుం
జాంతరాగ్రమునన్ వనేందిరలతాం - తాలంకృతిం జేసి తా
వింతౌ పుప్పొడి గద్దె వెట్టెఁ; గనుమా - విన్నాణమున్ భామినీ! 147

ఆ. అనియనేకగతుల - నతులవనాంతర । వైభవంబుఁ గాంచి - వర్ణనంబు
సలిపి తెలిపి కొంత - సైగణఁ బొసఁగించి । లలనరాజసుతను - చెలులఁ జేర్చె. 148

క. అట్టియెడ వారు తమలోఁ । దొట్టిన మోదమున ముసరు - తుమ్మెదగమిఁ బోఁ
దట్టుచు మిట్టుచు నెట్టుచు । తెట్టువగాఁ గూడి యచటఁ - దిరగెడు వేళన్. 149

రగడ

కొమ్మకొమ్మను వంపకేలత - కూనకూనము మీఁదికల్లెను
నిమ్మనిమ్మది రాక్షివీఁడదు - నీడనీడనె యునిచెమల్లెను
తావితావిది నిల్తమిటకొం - తా! వితావితఁ దియగ నేటికి

మావిమావిడి గున్నలెక్కకు - మానుమా ! నుడివితినిమాటికిఁ
బొగడఁబొగడఁగ వచ్చినీవటు - పోకపోఁకలలోననుంటివి
పగటుపగటుచు వచ్చెశిఖియదె-పట్టు పట్టుము వేడ్కఁగొంటివి
పొదలుపొదలురువడినిఁజొచ్చెక - పోతపోతము సొంపుఁజూడుము
కదియకదియచ్చెలువ కీరము - గానఁగానవదేమొ వీడుము
కప్పుఁగప్పుర ఫుందుమారము - కదలుకదలులఁజేరినిలువకు
గుప్పుగుప్పున పుప్పొడమా - గోరగోరట నెక్కెఁబిలువకు
దాఁగెఁదాగెడ వీడియాచెలి - దానిదానిమ్మలనువంచకు
వీఁగవీగరు వంపునెమ్మలు - వీటివీటికిఁ డెమ్మలంచకు
తేఁకుఁదేఁకువనెక్కె మదిభీ - తిలకతిలకము వీడియుంగన
మాఁకుమాఁకునుఁ జట్టితమినే - మరలమరలను మోటంగన
కదుపుకదుపుగఁగలుగునళులిటఁ - గలికి ! కలికిమృగంబుఁజూతము
పదనుపదదర్పకునిపాటలు - పాడి పాడిగఁబూజనేతము. 150

క. రావేకోమలి నీవిటు । రావేకలహంసగమన - రావేతరుణీ !
రావేయని వారొండొరు । లావనమునఁ జీరికొనుచు - నందరుగుమిర్యై. 151

సీ. ఒకచోటమధురమా - పికకూజితంబును, నొకచోటనింపైన - శుకరవంబు
నొకచోటశారికా - నికరనిస్వనమును, నొకచోట నెమళుల - యొక్కనినద
మొకచోటరోలంబ - నికురంబఝంకృతి, యొకచోటసారస - ప్రకరశబ్ద
మొకచోటరాజహం - సికలక్రేంకారంబు, నొకచోటచక్రవా - కికలయులివు

గీ. లలగనలరులతావులు - గలయఁబర్వఁ । బర్వమైకన్నులకుఁదోఁచు-ప్రవిమలస్థ
లములజొంపగుపూవుటీ-రములగుములఁ । జేరిచెలరేఁగి కోరిన - తీరుగాఁగ. 152

క. ఆడుచుఁబాడుచునుద్దిని । వీడుచు వెసఁగూడుకొనుచు - వేమఱుమరుఁగొం
డాడుచుఁ బోఁడిమిఁదమలో । వేడుకనిండారఁదిరిగి - వేసరియంతన్. 153

గీ. కోరినవమల్లికాకుంద - పారిజాత । జాతిపున్నాగ చంపక - సరళవకుళ
పాటలములంది యొక్కక్రొత్త - నీటుదనర । విరులుగోసిరిచెలువుగా-నరులఁగూర్చి. 154

క. వారవలనవలఁగలచె । ల్వారుసరోవరముఁజేర - నరిగిమహోత్సా
హారూఢలగుచునచ్చట । వారిక్రీడానుకూల - వసనాన్వితలై. 155

వ. హ్రదంబుఁబ్రవేశించిరాసమయంబునఁదత్సరోవరంబుకిరంబువినోదాకరంబై, నిరంతరా నిమిషసంతానవాసంబగుటంజేసినాకపురంబును, ననంతశంఖచక్రపద్మాన్వితంబగుట పలనవైకుంఠంబును, కలకంఠప్లవంగసారంగ జీవనంబగుటఁబట్టి కాననంబును, విలసిత

కువలయానందంబగు కతంబున నుత్తమకావ్యంబును, బాలతరంగవిభ్రాజితంబగుటచేత కృష్ణలీలాకథనంబును, బురణించుచున్నఁగని సంతసముమీఱ యొక్కనవబోణి రాజపుత్త్రికంజూచి యిట్లనియె. 156

సీ. శైవాలకేశయు - శకులలోచనయును - హల్లకపాణియు - నబ్జముఖియుఁ
గంబుకంధరయును - కలహంసగమనయుఁ - జక్రస్తనియునుగిం - జల్కరదయు
బిసబాహుయుగళయు - వీచికావళిసమ - న్వితయుమధుకర - నికరదృశయు
గంభీరనాభియు - ఘనపులినశ్రోణి - యునుశాంతరసపూర్ణ - యునువిమలయు

గీ. నైనయావనవతివోలె - హ్రదముపొల్చు। చున్నయదిగనుఁగొంటివే - వన్నెలాడి!
యన్నిలక్షణములునిందు - నమరుకతన। వర్ణనాతీతమగుదీని - వైభవంబు. 157

క. ఒకచక్రవాకియుదినా। యకుఁగానక వెదకుతటిజ - లాంతరవిదిత
స్వకబింబముపతియనిచెం। తకుఁజనఁగానెగసినీటఁ - దాఁబడిలేచెన్. 158

గీ. పరగవికసించియున్నట్టి - పంకజాత। మందుఁదేఁటులుమూఁగియు - న్నట్టివిధము
నరయ జలదేవతా విమ - లాస్యవిలసి। తాలకప్రకరమువూలె - నమరుఁగంటె. 159

చ. ఉడుగకనేకచక్రవిభ - వోన్నతి మాన్పుచుదావనస్థలిన్
విడువకవేచియుండి తన - వీఁకుఁగనుంగొని యంతనంతనే
యడలు వహించి వేయనిమి - షావళిపర్వెడజంతుకోటిఁజ
క్కడఁచిభుజించుచుండెడు బ-కానురవర్తన మార! జూచితే? 160

మ. ఒకఁడాత్మన్ దనధర్మపత్నిరతియం - దుత్సాహముల్ వీడిబా
యకఁదావేలోకపద్మినీ మహితసౌ - ఖ్యానందుఁడైనట్టినా
యకునింగానకఁ జాలరోసికుముద - వ్యాసంగయైయున్న యిం
తికిసామ్యంబుగ నొక్కతేఁటియదెవ - ర్తించున్ విలోకించితే? 161

క. అనివర్ణించుచు మెచ్చుచు। వనజాకరమందుఁ జొచ్చి - వారందఱునొ
లినొండొరులు కరంబుల। నమవొందఁగఁగూర్చి మునుఁగు - లాడెడివేళన్. 162

ఉ. చేడెయొకర్తువేడ్క - సర - సీరుహముంగొని యొక్కలేమపైఁ
గోడిగమాడుచున్ విసరి - కొట్టినఁదప్పఁగ మున్గిలేచియా
ప్రోడతటాలునన్ సలిల - ముం బయిఁజల్లెను తక్కుకామిను
ల్వేడకువీడకింతినని - వేమరుకేకిసఁగొట్టినవ్వఁగన్. 163

క. చెలువుగ జలములలోనొక। కలకంధర చెలఁగియీఁదెఁ-గనిదానిసఖుల్
చెలువా! కుంభద్వయమూం। గలవారీఁదుటయదేమి - కష్టంబనఁగన్. 164

గీ. వారిలోనొక్క చంద్రాస్య - వారిలోన | మునిఁగినంత నె చెంగటి - వనితదాని
నిడుదకురులందు శైవల - మొడిసితిగిచె | నంతలోలేచి యాకాంత - యపహసించె. 165

చ. నెలఁతలు రెండుబంతులుగ - నిల్చి తొలంగకొకళ్లొకళ్లపై
సలిలములట్టె చల్లుకొన - సారసపత్రములందుతజ్జలం
బులుపడి పాల్చెభూవిభుని - పుత్త్రికిఁ బచ్చనిపట్టెరంబులన్
వెలయఁగ వారిదేవతలు - వెట్టినముత్తెపుకానుకన్నియాయనన్. 166

వ. ఇవ్విధంబున జలక్రీడఁగావించి తృప్తివహించి సరోవరంబువెలువడి ప్రవిమలవస్త్రాభర
ణంబులుధరియించి ప్రస్పందనాదులనలంకరించుకొని యాసమయంబున. 167

క. ఏరీతినైనరాజకు | మారికిఁ గలచింత తొలఁగి - మదినెమ్మదిగా
మారునిఁ దగఁబూజింతము | మారామనుగావుమనుచు - మనమిటభక్తిన్. 168

మ. అనియాబోటులు నీటుమీఱఁజనిర - మ్యంబైన పూఁదోటయం
దునిరూఢిందగు తేనెవాకదటిజా - దుల్ప్రాకిలేమర్వపుం
గొనలన్ సోకినతావి తెమ్మెరలుఘుం - ఘుమ్మంచు వీతెంచుచ
ల్లనిదట్టంపు నికుంజమధ్యమునను-ల్లాసంబు నిండారఁగన్. 169

క. వావిరిఁబుష్పాడివేదికఁ | గావించి సరోజశరునిఁ - గడుభక్తినిదా
మావేదికపైనిల్పియ | థావిధిఁబూజావిశేష - తత్పరలగుచున్. 170

గీ. ధ్యానమొనరించి గంధపు - ష్పాక్షతాంబ | రాభరణములచేఁ దగు-నట్టిరీతి
గానలంకృతుఁజేసి సం - కల్పసిద్ధి | మాకుసమకూర్పుమనుచుస - మ్మదమెలర్పి. 171

క. సమ్మతిఁగంకేళీకుసు | మమ్ములఁ గెందమ్ములనుగ్ర - మంబొప్పఁగఁగుం
దమ్ముల మల్లెలఁబలుచం | దమ్ములఁ బూజించి రపుడు - తరుణులువేడ్కన్. 172

వ. తదనంతరంబున ధూపదీపనైవేద్యతాంబూలాదులుసమర్పించి నీరాజనంబునివాళించిదండ
ప్రణామంబులాచరించికించిన్నిమీలితలోచనలైయభీష్టవరాపేక్షావిశేషసంకలితస్వాంతు
లగుచు కరకమలంబులు ముకుళించి. 173

సీ. శ్రీధరపుత్త్రాయ - శృంగారగాత్రాయ - యరవిందలోచనా - యాంగజాయ
ఇక్షుకోదండాయ-హిమధామమిత్రాయ - హరివిభూషణా - యాంగజాయ
సురుచిరవేషాయ - శుకరాజవాహాయ-భృంగమార్వీయుతా - యాంగజాయ
ప్రవిమలతేజాయ - పంచేషుహస్తాయ - యధికమోహప్రదా - యాంగజాయ

ఆ. శంబరాంతకాయ - సన్నుతచరితాయ | మత్స్యకేతనాయ - మన్మథాయ
తేనమోస్తువటంచు - చానలాయ్యనరాజ | పుత్త్రిఁగూడిమ్రొక్కి-పొగడిరపుడు. 174

ఆ. అటులఁ మ్రొక్కి వారలందఱుఁ జేతులు । మోడ్చి వరుసగాఁగ - ముందునిలిచి
మరల సంస్మరించి - శరణు శరణుమార । శరణు శరణనంగ - శరణు శరణు. 175

క. మాకుఁ బ్రసన్నుఁడ వగుమిఁక । లోకస్తుత రాజతనయ - లోఁదొడరినయా
వ్యాకులముఁ దొలఁచి కావుము । నీకుం దాసీలమనుచు - నిశ్చలమతులై. 176

క. శిరములను సరోజంబులు । ధరసోఁక నమస్కరించి-తగనందఱు న
త్తరుణులు మంగళగీతము । లరుసమునఁ బఠించిరోలి - నగణితఫణితిన్. 177

వ. ఇట్లప్పద్మగంధులు తమతమమనోవృత్తుల కనుగుణంబులైన వరంబులఁ బ్రసాదింపుమని ప్రార్థించి, యథావిధింబునఁ బూజనంబు నిర్వర్తించి రాసమయంబున యశోవతితత్కార్యంబులవలన నంతరయేని శాంతివహింపక మేరలేనివిరాళింజిక్కి మిక్కిలియడలునబడలువడి పడతులిరువంకలఁ దమకై దండయొసంగియు నడుగిడలేక తడఁబాటుగదుర, తమ్మియని విభ్రమమ్మున జుమ్మని తెమ్మొమునముసరుతుమ్మెదతుటుమును గసటునసటు నిటుఁజోపుచు, వికీర్ణంబులైనకుంతలంబులనఖాంతంబులచేఁ దొలంగఁద్రోసికొనుచుఁ, గలకంఠప్రముఖవిహంగంబులు కిలకిలం జెలఁగిపలుకుపలుకులు చెవులకుములుకులక్రియఁ దోఁచిన నులికిపడిరోసంబున నీసడించుచు, నైసెఁపరానితాపంబున వెలవెలంబోయి, సొమ్మసిల్లి మెల్లనం దెలివినొంది, మందగమనంబున వనంబు వెలువడి పాలతులుపరివేష్టించి చనుదేర నిజహర్మ్యంబునకుం బోవుచుండు సమయంబున. 178

సీ. వెలయఁ బూచినయట్టి - విరులనుగనుఁగొని - మరునితూపులటంచు - మదిఁదలంకుఁ
గలకంఠశుకశారి - కాధ్వనులాలించి - స్మరభటార్భటులంచు - సంచలించుఁ
బూవుటీరంబులు - పొంతఁదోఁచినయవి - యతనునివేశ్మంబు - లనుచుతొలఁగుఁ
జెలువైనలేమావి - చిగురుటాకులు చూచి - యలరువిల్తునిబాకు - లంచుబెదరు
గీ. నిలుచుఁగూర్చుండుఁదలయూఁచు-నలుగునవ్వు । నుస్సురని లేచియటునిటు-నురకఁజూచు
నీశ్వరాయను సోలునే-మేమొ తలఁచు । నడువఁజాలకఁ దడఁబడుఁ-బడఁతివడఁకు. 179

వ. ఇవ్విధంబునఁ బ్రయాసమించి సఖులసహాయంబున మెల్లగాఁజనుచు నతిశయించినబాళి కతంబున నప్పుడు. 180

గీ. అళులఝుంకారమునువిని - యళికియళికి । చిలుకలరవంబు నాలించి - యులికియులికి
లలితపికకూజితమునకుఁ - దలఁకితలఁకి । కలికివలరాజు విరిములు-కులకుజళికి. 181

వ. శుకపికాదులపై నలుకవహించి వానినుద్దేశించి యిట్లనియె. 182

మ. ఒనరంగా నవరత్నపంజరములం-దున్పించి రేలుంబవ
ళ్లను వౌసత్ఫలశర్కరాదు లిడినె - య్యంబొప్పమీజాతివా
రినిమన్నించెడి నన్నలంచెదరు - ధాత్రిన్ మెత్తురేమిమ్ము గ్ర
ద్దనవెన్నంగొని పైచువారలను రాతన్ వైతురే ? కీరామా! 183

క. ఓరువఁజాలక వెతపడు । నారిగదా, యనక కలని - నాదంబులచేఁ
గారించుట గారమె సహ । కారములఁ జిగుళ్లుదినిన - గర్వమె? పికమా! 184

క. సుగుణంబులుదుర్గుణములు । జగతిని సహవాసమునఁబొ - సఁగునండ్రిపుడె
చ్చగు శుకపికముల చెలిమిం । దగిలెనె చెడుబుద్ధినీకుఁ - దప్పకబర్హీ! 185

మ. విరహోగ్రాగ్ని శిఖాపరంపరలనా - విర్భూతమైనట్టి దు
స్తరసంతాపము మించికుందుతతిఁ జెం - తంజేరినీవారినె
ల్లరినింగూడి మదంబుమీఱఁగదుసు - ల్లాసంబుతోనిట్లు ని
ర్భరఝంకార వికారగానమొనరిం - పంబాడియే? షట్పదా! 186

వ. అనితూలనాడి యాయెమ్మెలాఁడి మెల్ల మెల్లఁగాఁజను నవసరంబున. 187

చ. ఒకవకుళద్రుమూలమున - కొయ్యనఁబోయి తదీయశాఖనూ
నికఁగొనియట్టె కొంతవడి - నిస్పృహఁ గోఁచిన నిల్చె; నంతలో
నికటనికుంజపుష్పచయ - నిర్గతగంధయుతానిలంబటన్
సకిపయివీఁచె మోహశిఖిఁ - జక్కఁగఁగుల్కొలిపెన్ మరుండనన్. 188

ఉ. హల్లకపాణిమీఁద నపు - డాపవనాహతిచేతనింపుగా
జల్లునరాలె నవ్వకుళ - సత్ప్రసవవ్రజమక్కటా! మరుం
డెల్లెదవచ్చె నేసెకుసు - మాంబకముల్ పయినంచువిభ్రమన్
దల్లడమంది మూర్ఛిలెని - తంబిని చయ్యనఁబట్టిరంగనల్. 189

గీ. పట్టియుంకెట్టులమ్మ యీ - చెట్టుచెంత । కేలవచ్చితి మెట్టిదు - ష్కాలమొక్కొ
వ్యసనమెఱుఁగని దెపుడునీ - పసరుమొగ్గ । కెంతకష్టంబు వాటిల్లె-నింతలోన. 190

క. అనిదైన్యంబును నెఱయున్ । గనికరమును చింతయడరఁ - గాఁబలుకుచునే
ర్చిన యుపచారంబులఁజ । య్యనఁజేయఁగఁ గొంతవడికి - నంగన తేఱెన్. 191

ఉ. ఆవడియయ్యె నీవనవి - హార సుఖంబిఁకఁ జాలుఁజాలునా
రా! విరహానలంబునఁగ - రంబుఁ గఱంగెనుబోలతాంగియి
చ్చోఁ బ్రవలవంతమించుఁ జెడు - చోటిదియుండఁగరాదు పోదమం
చావిరిబోణులప్పుడు ర - యంబున రానుతఁగూడిపోవఁగన్. 192

క. ఇరువంకల నెచ్చెలులా । దరమునఁ జేయూఁతయొసఁగఁ - దరళాక్షిమద
ద్విరదగతి నున్నతములగు । మురువుపిఱుందులు చలింప - మోముచమర్పన్. 193

క. తాలిమిచెడివగ మీఱఁగఁ । బాలార్చకఁగూర్మిచెలులు - పలుకుహితోక్తుల్
చాలవెగటైన వినకొక । లీలందనమేడకరిగె - లేమవిరక్తిన్. 194

వ. ఇట్లప్పల్లవాధరయుల్లంబుతల్లడిల్ల మెల్లననిజమందిరంబుజేరుటయు. 195

సూర్యాస్తమాన వర్ణనము.

ఆ. వనితపద్మవదన - నారిజాప్తుఁడుతాను । గానలోడునుకొంత - గలుగుకతన
నడలుఁజూడలేక - యరిగెమాటునకన । నపరవార్థిగ్రుంకె - నపుడుతరణి. 196

సీ. అంతసంధ్యారాగ - కాంతులుసమకూరె - నమగఁబక్షులుకులా - యములఁజేరెఁ
గలువలకధికవి - కాసంబునిండారె-నీరజాతంబుల - సొరుమాలెఁ
జక్రవాకములకుఁ - జాలఁగానగనూరె-గృహదీపకళికల - కాంతిమీరెఁ
దారొక్కన్నజంతుసం - తతులతాపముతీరె-వెసఁజీకటులుగుహ - ల్వెడలఁబారె

గీ. జారచోరుల వెఱయువి - చారమారె । నులుకుచాతకవితతులు - కలఁకఁదేరెఁ
గాముకులమానసంబులఁ - గాంక్షలూరెఁ । బంచబాణుఁడు పాంథులఁ-గాంచికేరె. 197

గీ. అంధకారాంబు పరిపూర్ణ - మైనయట్టి । వ్యోమకాసారమునఁబూచి-యొప్పుతెల్ల
గలువలననంబరమున న-క్షత్రసమితి । పొలిచెనంతట నెంతయు-పొలుపుమీఱ. 198

గీ. విరహిణీస్త్రీలు రాతిరి - వేళమరుని । మ్రొక్కుదీర్పుటకై వన - మునకుఁదరలి
పరగఁగొనిపోవు పిండిదీ-పములనంగ।మిణుగురులు మంజరులమీఁద-మెఱయఁదొడఁగ.

చ. బలిమిఁబరాంగనామణుల పైఁ - బడిదుష్టులుమోవి తేనియల్
దొలఁగక గ్రోలి నారనెడు - దోషముఁబూనిచి రాజశిక్షగా
శిలుగుపడంగనొక్క నిశి - చీకటియింట వసింపఁజేసెనా
నళితతిచిక్కఁజేరిమధు - వానుచుఁబంకరుహోదరంబులన్. 200

ఉ. రాజిటు రాగలండనుచు - రాతిరిపేరిటి నేస్తకాఁడుదా
రాజిలఁజాల నెత్తయిన - రమ్యపుఁబందిరివెట్టిదానికిన్
బాజుగనంధకారమను - నల్లనియుల్లడఁగట్టివెండిపూ
లోజఁదగిల్చికట్టినన - నుప్పుర మొప్పెనుడుప్రయుక్తమై. 201

వ. అంత. 202

చంద్రోదయ వర్ణనము.

గీ. చంద్రుఁడుదయించు సమయమా-సన్నమైన । తూర్పుదిక్కునఁ బాండుర-ద్యుతిజనించి
యంతకంతకునది యొప్పు- దలిశయించె । గర్భవతియగుయువతి ము-ఖంబువోలె. 203

మ. సిరితోఁబుట్టువు కైరవప్రియుఁడు రా-జీవారి శీతాంశుఁడీ
శ్వరుమౌళిన్ జెలువొందుపుష్పము సుప - ర్వాళికెంగూడు సా
గరసంజాతుఁడు తారకాధిపుఁడు లో - కస్తుత్యుఁడబ్జుండు భా
నురలీలంబొడిచెన్ ప్రకాశసితరో - చుల్ దిక్కులన్ బర్వఁగన్. 204

గీ. అటుల చంద్రోదయంబైన - యబ్బురంబు । పొసఁగనంతటఁ బిండారఁ-బోసినటుల
నప్పటప్పటికినిఁ గాంతు - లతిశయించి । వెల్లనై కనుపట్టెను - విశ్వమెల్ల. 205

క. వెలిమించె జారచోరుల । కటిమటిఁ బడఁజొచ్చిరపుడు - హర్షంబటిని
వ్వేఁపడివిరహిణులు కడుం । జాలునై వెన్నెలలమీఁద - సోఁకుటకతనన్. 206

క. ఆసమయమున యశోవతి । వేసటమించిన కతమున - వెలవెలనైయు
ల్లాసంబుడింది యుష్ణో । చ్ఛ్వాసంబులుపొదలఁ గడు వి-షాదాత్మకయై. 207

క. విరిశరములు హృదయంబున । నిరతంబును నాటుచుండ - నివ్వెఁపడియా
సరసీరుహాక్షియతనుని । దురుసునకుంగలఁగియిట్లు-దూషించెఁగడున్. 208

క. అదనాగని పదనారిన । తుదనావిరి పొగలువెడలు - తోయజశరముల్
యెదనాటెదవోగ! మదా । స్పద! నాయమెనీకు దోష-సదనా! మదనా! 209

మ. కరుణాదూరుఁడ వీవుగాననెపుడున్ - గాంతాజనశ్రేణిన
ద్దిర! మోహవ్యథనొందఁజేయుటకు సం-దేహింపవబ్జాస్త్ర! దు
ష్కరకార్యంబిది; చచ్చిపుట్టితివిముక్ - జర్చింపుమీసారియొ
వ్వరిచే నెట్టిదొసంగు చేకుఱునొ గ - ర్వంబేలరా దుర్మతీ! 210

శా. ఘోరప్రక్రియఁగాముకీ హృదయసం - క్షోభావహోపాయసం
చారానర్గళబుద్ధివీడవెపుడున్ - చాల్చాలుఁ బోనాఁడుని
న్నారుద్రుండుదహింప నీతరుణి పు - ణ్యాస్వాంత ప్రార్థించియో
మారా! నిన్ బడసెన్ సుమీ! మరల భ - స్మంబౌదువిట్లేఁచినన్. 211

ఉ. ఆర్తజనావనాది సుగు - ణాశ్రయుఁ డెన్నభవద్గురుండు సం
కీర్తితమంగళప్రదగ - ణింపఁగ నీదగుమాత సత్కళా
కర్తదలంప మాతులుఁడు - గౌరవహాని ఘటిల్లనీదు దు
ర్వర్తనచేత వారలక-వశ్యము దౌష్ట్యము మానుమంగజా! 212

ఉ. మోహలతానిబద్ధలగు - ముద్దియలన్ ముదమేదఁబూనిసం
దేహముమాని యొక్క మొగిఁ-దీవ్రతర ప్రసవాంబకాహతిన్
దాహమునొందఁ జేసెదవు - దర్పక! దుర్బలులందెకాని నీ
సాహసమంధకారి కడ - సాగునె? నీవటు బోవనేర్తువే?

మ. ప్రమథాధీశ్వరు ఫాలలోచన మహో - గ్రజ్వాలకీలా సమూ
హమునన్ డింది పునర్భవుండవగుటన్ - హా! తద్గుణంబిట్లునీ
కమరెన్ గావుననిర్దయన్ సతులఁబు - ష్పాస్త్రోర్చులన్ ముంచెద
క్రమమీకార్యము పంచబాణ! చెడుసం - కల్పంబు నీకేటికిన్. 214

ఉ. అంచితులైన దంపతుల - కాత్మభవుండవటంచు లోకుల
గ్గించెదరంతె కాని పరి - కింపఁగ వారలకీర్తిఁ దప్పవ
ర్తించు ఖలుండవీవు భువి - దేవర పీఠముపైఁ బిశాచివా
సించిన భంగినీవిధ మిఁ-సీ! నినుమెచ్చఁగరాదు మన్మథా! 215

ఉ. ముత్తెపుపంట విల్లు నళి - మూఁకలనారియుఁ బూవుటమ్ములున్
మెత్తగఁబల్కు బంట్లుఁగల - మేనటిపోయినయట్టి యోధుఁడీ
చిత్తజుఁడేమి సేయునని - చెప్పఁగరాదధికంబుసుమ్మ నీ
యొత్తడిసైఁపరాదు విష - మూరకఁబోవునె సుంతరైనఁబోన్? 216

క. వలదన్న నబలనగున । న్నలమటఁ బెట్టెదవుతగునె? - యకటా! నాపైఁ
జలమేల విరహిణీజన । ములనేఁచినఁ గిల్బిషంబు-పాపఁగదె? కామా! 217

వ. అని దూరనాడి యామించుఁబోఁడి మిగులవేఁడియైతోఁచు సాంద్రచంద్రికలఁగలయ వెదజల్లుచుంగుముదంబులకుఁ బ్రమదంబొదవనుదయించిచను దెంచుతుషారకిరణునింగాంచి సంచలించి మించినతాపంబునఁ గోపంబువహించి యిట్లనియె. 218

ఉ. ఓరి! శశాంక! సంకటము - నొందు మహావిరహార్తులైనపం
కేరుహపత్రలోచనలు - ఖేదమునం దపియింపఁగౌముదీ
ఘోరతరాగ్నికీలలను - గొబ్బునఁబైఁ బ్రసరింపఁజేసెదౌ
కౌర! యిదేమి గొప్పతన - మంచుఁదలంచితి వక్కటక్కటా! 219

ఆ. చందమామనీదు - చందమామరుని పెం । పెఱుఁగనట్టివార - లెందుగలరు?
గోని ఘూదనులకుఁ - గులవేల్పువగుదీవు । కామినీజనాప - కారియతఁడు. 220

శా. నీవబ్ధిన్ జనియించువేళ బడబా - గ్నిజ్వాలికామాలికో
ప్లావాప్తిన్ జెడఁగాలవై తివదియే - యాశ్చర్యమెన్నంగ; రా
జీవామిత్ర! యటంజనించిన సుధా - సిద్ధప్రభావంబదే
మో! వహ్నాజుమిమంచికాలమునబా - మువ్వోయి వాటిల్లినన్. 221

గీ. ఆడువారల విరహమ-హాబ్ధినోల । లాడువారలఁ గ్రాగింపఁ - గూడదవక
వేఁడివెన్నెలలనుగాసి - వెతలుగుడుపు । వాఁడవాలింతువేహిత - వాడసోమ! 222

ఉ. ఈహాజనించి మ్రింగుటకు - నేత్తెఱవచ్చినవేళఁ దాగురు
ద్రోహియితండు వీనిఁదిన - దోసమటంచుఁ దలంగిపోవుచో
రాహువుఘోరదంతనిక - రక్షతదేహునిఁజేసి పెంపును
త్సాహము మాన్చుచుండినను - ధార్ష్ట్యము మానవుగాసుధాకరా! 223

వ. అని చందమామను నిందించి మందానిలునుద్దేశించి యిట్లనియె. 224

మ. ప్రసవామోద పరంపరానహుఁడవై - వ్యాపించు నీవిప్పుడీ
యసమాస్త్రాంబక సంభవానలమహో - ష్ణాపాదనోద్యోగివై
ప్రసరింపందలకొంటి వాగ! నినుసం - భావింపఁగారాదు నా
దెసకున్ వీవకుమింకఁజాలుఁ గడుఁగం - దెన్ మేను మందానిలా! 225

ఉ. రూపవిహీనునిం గొలువ - రూపవిహీనుఁడు నేర్చుఁగాని యె
ట్లోపుదు గన్య? లావుఁగని - యోగ్యతనుం దగువాఁడవె నన్న నీ
వ్యాపనచాలుమాను మన - గాళనశేషముగా నసహ్య నేఁ
తాపము నొందెడేనెదవు - తన్వొషసుర్గ్గసిద్ధినాశుగా! 226

మ. అనిమారాబ్జ సమీరులు దెగడి దై - న్యంబొప్పనంతంతకున్
దనలో మించు మనోవ్యథానలము సం - తాపంబుఁ జేకూర్పవే
దనకున్ సైఁపఁగలేక దానఁ బుమకా - ర్తన్యంబు యోజించి యి
ట్లని నిర్ధారణసేయనేరక కటా! - యం చార్తి నర్థిల్లఁగన్. 227

సీ. మెప్పుగాఁ బనులలో - మెలఁగెడియుడిగంపు - టింతులసందఱి - నిండ్లకనిచి
హేవాక మొప్పఁగా - హితవాక్యములువల్కు - లలనలతో డస - ల్లాపముడిగి
వీణియల్ మీటుచు - వేడ్కగానము సేయు - పొలఁతులమన్నించు - బుద్ధిమాని
కడుభక్తిఁ దనమాటఁ - గాచి చెంగటనుండు - వనితలనిఁకజనుం - డనుచువలికి

గీ. మన్ననకు నర్హులైన కో-మలులు దెలుపు । కొనెడి మనవులఁ జెవియొగ్గి-వినుటమాని
యన్నపానాదులప్రియం-బగుటవాని । విడిచి క్రైసేయుటుడిగి ని-ర్వృతిని మఱచి. 228

చ. జిగిఁగడుమించు బంగరపుఁ - జిల్కలుచెక్కిన జీవదంతపుం
బిగువగు కోళ్లపై మణులు - విప్పుగఁదాఁపిన సాలభంజికల్
దగపగడాల పట్టెలకుఁ - దార్చిన పూసమెఱుంగుకుచ్చులన్
మిగులఁగ హించు శయ్యపయి - మేనటువైచి లతాంగి వేదనన్. 229

క. పొగముఁగానకఁ దొలఁగని । ఘోరవికారంబు మించి - కుందుచు నిజహృ
చ్చోరుని దలఁచుచు మారుని । క్రూరత్వంబునకు వెఱపుఁ - గొని పొరలుతఱిన్. 230

మ. ప్రమదంబేదియు నిర్నిమిత్తముగ సం - ప్రాప్తించి యున్నట్టిహా
రముఁగంఠంబుననుండి చేతఁగొనిగా - రాముప్పఁజిత్తేశుసం
గమభాగ్యంబు ఘటిల్లినట్లపుడు సం - కల్పించి వర్ణించి వి
భ్రమమాటంతనె యాత్మలో నెఱిఁగి యా-హా! యంచు దైన్యంబునన్. 231

క. ఆహారముఁ గనియిట్లను । నాహా! రమణీయరత్న హారమ! నేని
ట్లాహారనిద్రలుడిగి మ । నోహరునిఁ గానకలయ - నుడువఁగరాదే? 232

ఉ. గ్రీవమునందునన్ నినుప - రించి పొసంగను స్థలావతే
పావిరతప్రమోద విభ - వాతిశయస్థితి నాదరించునే
భావజతుల్యుఁడైన పతిఁ - బాసియుటన్ ననుదేరుకొల్పునే?
నేవళమా! వచింపుమిఁక - నిక్కముగా నతఁడెవ్వఁడౌటయున్. 233

క. అనియామణి హారమ చే । తసవస్తునటంచు మదినిఁ - దలఁపక యెంతో
వినయమున వేసుచుండఁగ । మనసిజుఁడే దమ్ము లేసి - మ్రాన్పడఁజేసెన్. 234

వ. ఈప్రకారంబున నాచిలుకలకొలికి యలరువిల్తుని యలుగులకులుకుచు, నిలుపోపక భ్రమసి కలవరించుచు, నిమిషంబొక యుగంబుగాఁ గడపుచుండెనని చెప్పుటయును. 235

శా. క్షీరాంభోనిధి పుత్త్రికాహృదయ రా - జీవార్క! జీవార్కమా
రారి శ్వేతగరుత్తురంగనుత! మా - యాయోగసంయోగ! వి
స్ఫారస్వాంత! యనంత! పన్నిజనరా - ట్సంతాన సంతాన! సం
సారక్లేశ వినాశ! కిల్బిషతమ - స్సాంగ! సారాంగదా! 236

క. ధరణీధరధర! ధరణీ । భరణ! గుణాభరణ! నిత్య! - పావనగుణగణా
చరణ! భవాంబుధితరణా! । శరణాగతపాల! విబుధ - సంకటహరణా! 237

మత్తకోకిలావృత్తము.

పుండరీకవి శుద్ధమానస - పుండరీకనివాకరా!
పుండరీకహరా! ద్విషన్మృగ - పుండరీక! గదాధరా!
కాండవాహవి నీలవిగ్రహ! కాండసంభవ! పావనా!
కాండదూర! నిరంజనా! సుర - కాండసేవ్య! నరాయనా! 238

గద్య.

ఇది. శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాద లబ్ధానర్ఘళచతుర్విధ కవిత్వమహత్త్వాభి
రామ, భూసురకుల క్షీరపారావారపూర్వశర్వరీసోమ, శ్రీవత్సగోత్ర
పవిత్రాపస్తంబసూత్ర, సావిత్రీలక్ష్మీనృసింహార్యపుత్త్ర,
సుకవిజనవిధేయ, పిచ్చయనామధేయ ప్రణీతంబగు
విజయాశ్వచరిత్రంబను ప్రబంధంబునందుఁ
బూర్వభాగంబున ద్వితీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీమద్వేంకటేశ్వరార్పణమస్తు.

---

శ్రీరస్తు.

# విజయాశ్వ చరిత్రము

## పూర్వభాగము



## తృతీయాశ్వాసము.

క. శ్రీకర! సద్గుణగణ । తాప్నకర! కరుణావిశాల! - యబ్జారిధరా!
భీకరరిపుహర! భక్తవ । శంకర! శేషాద్రివాస! - సిద్ధవిలాసా! 1

వ. దేవా! అవధరింపుము. సద్గుణగణవిశారదులగు శౌనకాదులకు సన్నుతపుణ్యకథాశతాం గసూతుండగు సూతుండిట్లనియె. నట్లు యశోవతినిశాపతిముఖ్యులనిందించుచుఁ బరితపించుచు మహాప్రయాసంబున నారేయిఁగడపి మరునాటియుదయంబున నరుసంబుడిగిబర వసంబులేనితలంపులకుఁజొచ్చి వచ్చినూర్పుచుహర్మ్యపరిభాగంబునకుఁజనియొంటరిగా నటునిటుందిరుగుచుండె నాసమయంబున. 2

క. అణిమాదిసిద్ధులొప్పఁగ । మణిమంత్రౌషధము లెఱిఁగి - మాయమహాత్మ్యం
బెనఘుండొక సిద్ధుఁడునైఁ । జనువాఁడా వనిపురోచి - జయ్యనడిగియెన్. 3

చ. అటుడిగి ముందునిల్చుటయు-నబ్బురమందు లతాంగిదెచ్చెన్
గటపుగ్రమొక్కి- పీఠమిడి - తృప్తివెయిఁదగఁ బూజఁజేసియం
తటనొక తాళవృంతమును - దానుముదంబునఁగేలఁబూనిచెం
గటనొకయోరనిల్చి కర-కంకణముల్మ్రోయఁగవీచెఁగన్. 4

క. ఆసన్నగాలిదేహము । పైసోఁకిన శాంతినొంది - పరిహృతమార్గా
యాసుండై సంతసమున । నాసిద్ధుఁడు మెచ్చి యిట్టు - లనియెన్ బ్రీతిన్. 5

క. ఓరాజవదన నీపగు । నోరిమియును భక్తిశక్తి - యోగ్యతయును నిం
కేరికిని నెందుఁగలుగదు । కోరినకోరికలు నీకుఁ-గొనసాగుఁజుమీ! 6

మ. ఇదివాంఛాఫలదాయకంబనఁబడున్ - హృత్ప్రీతిప్రదంబంచుఁ జె
ప్పదురాధిక్యముగాఁగ దీనినొగిబా - ముల్మాన్పుపద్మాద్రిసం
పదమింపొందఁగఁజేయు సౌఖ్యమొసఁగున్ - భాగ్యంబుఁగల్గించునే
కొదవల్ జేకుటియున్నఁ దీర్చుఁగొను మో-కుంభీంద్రకుంభస్తనీ. 7

క. ఇదె యనియొకమణి నతినకుఁ । బదిలంబుగఁ జేనొసంగి - పరగుశుభంబుల్
ఎదలకును దీనినటయు । నదిగొని కడుభక్తినింతి - యపుడిట్లనియెన్. 8

మ. ఓసిద్ధేశ్వర మీరు సన్నుతగుణా - ఢ్యుల్ యోగవిద్యామహో
ల్లాసాధారమనీషు లుత్తములు పో - లంజాలరెవ్వారు మి
మ్మాసక్తిన్ మిమువంటి పావనులపా - దాంభోజముల్గొల్చిని
శ్వాసంబొప్పఁగ భక్తిమైమనుటయే - సౌఖ్యంబు మాబోఁట్లకున్. 9

క. తొలిబాముస నేఁజేసిన । పాలివోనియ నూనమైన - పుణ్యముకతనన్
దలఁపనితలఁపుగ మిముఁగని । సెలయఁగఁ బూజింపఁగలిగె - విరిసెనసుంబుల్. 10

చ. అనుపుగ మిమ్ముబోఁటుల మహాత్త్వము నేవినియుందుఁజెప్పఁగా
ఘనులటసిద్ధులెంతయును - గైనప ఘనటవారికీజగం
బనఘ ! దలంచుచుంటిమది - యందపుడైనను నట్టివారి ద
ర్శనము లభించునోయనుచు; - సత్యము నేటికివాంఛనేకు రెన్. 11

వ. అనిపలికియతనినలనఁ దనపరితాపాపనోదనోపాయం బెఱుఁగఁదలంచి యోజించి యట్టి మాటఁబ్రస్తావించుటకుం దెంపుసాలక యానీలాలకప్రసంగనశోఁటునఁ దేటపరచుట యుక్తంబని నిశ్చయించి మాటలకుందార్చి సిద్ధునితో నిట్లనియె. 12

క. వినసలతును మీచరితలఁ । గనవలతును మిమ్మువంటి - ఘనులనుభక్తిన్
మననలతు మాకవిమానే । వనమే ముఖ్యంబటంచు-భావింతుమదిన్. 13

క. ఏయేభూములు జూచితి । రేయేపురములనుగంటి - రేయేగిరులెం
దేయే కానలు మెట్టితి । రేయెడనేమేమివింత - లెఱిఁగింపఁగదే ! 14

మ అనిప్రార్థించిన సిద్ధుఁడిట్లనియె: చే-లా! మేముమాకిచ్చగ
ల్గినయప్పొటికిఁబోయి రాఁగలము సం - క్షేపించి యిట్లంచుఁగాం
చినవింతల్ విహరించినట్టి యడవు - ల్నీమల్గిరుల్గాహినుల్
వినుపింపందరమా నే? యొక్కటియె ? యా-వృత్తాంతముల్ జెప్పఁగన్. 15

క. నిమిషమున సంచరింతుము । క్రమముగజగమెల్లఁ గలియఁ-గలమెల్లవిశే
షము లున్నచోటనుండియ । మముఁబోఁట్ల కెఱుంగరాని - మర్మముగలదే ? 16

చ. అనవుఁడు నోమహాత్మ! యిది - యద్భుతమెంతయు మీప్రభావమున్
దనరనెఱుంగ నాతరమె? - ధన్యులు మీరు కృపన్ వహించినా
మనమునఁ గల్గు దుఃఖమును - మానఁగఁజేసి సుఖించురీతియో
జనయొనరించిపల్కుఁడప - చారముఁగా మదినెంచకిత్తఱిన్. 17

క. కడుఘనులు మీరుమిమ్ము । ట్లడుగఁగఁ దగదైనఁగొంక - కడిగితిపెఱబో
విడిచి; కినుకనువహింపకుఁ । డిడుమతఱిందెలుపకున్న - నెట్లగుఁజెపుఁడా 18

క. మీవంటివారి నూరక । భావంబున విసుకుఁ జెందఁ - బలికింపఁగరా
దీవిధి నెటు వెగటగునో । యావలనని పొడముచున్న - దరమగనాలోన్. 19

ఉ. తా మెదనాదు విన్నపముఁ - దప్పఁగ నెంచకయున్న యున్నమా
టేమది దాచకింక వచి-యించెదనన్న, నతండు నవ్వి నీ
వేమియుఁ గొంకులేకడుగు - మేర్పడఁ జెప్పెద నెగ్గులేదు సు
మ్మీ! మమువంటివారలకు - మేదినిఁ గోపము నీర్ష్యగల్గునే? 20

క. నేఁడు భవత్సద్గుణములు । పోఁడిమి నెఱుఁగుట నె మింటఁ - బోయెడివానిన్
వేఁపకయే నచ్చితివగ । లాఁడిరో నినుఁ జూచిపోన - సగునని వేడ్కన్. 21

ఉ. ఇంతకుమున్నె నీచరిత - మెల్ల నెఱుంగుదు; నొక్కచూపరిన్
గంతునిఁ బోలు వానిఁగని - కాంక్షవహించి, యతండు గానరా
కంతటిలోనె పోవుటయు - నగ్గలపుం దమి సైఁపలేక నీ
వెంతయు నాత్మఁ జింతిలెద - వీనుడి నిక్కమొ కాదొ తెల్పుమా ? 22

క. ఇదియే కద నన్నడుగఁగ । మదినిఁ దలంచినదె యింక - మఱుఁగేలా?
ఎదకవచియింపుము నేఁ । బొదలిన నీచింతమాన్చి - పోయెద నబలా ! 23

గీ. అనినఁ దనలోనఁ గలమాట - నతఁ డెఱింగి । నలుకుటకు విస్మయంబంద - కులుకులఁ డి
యాననంబునఁ జిఱునగ - నంకురింప । నపుడు సిగ్గునఁ దలవాంచి - యదియ, యనియె. 24

క. అత్తఱి నతఁడింతిరో! విను । చిత్తంబునఁ గలుగుమాటఁ - జెప్పుట యనఁగిం
చిత్తు మహత్త్వముగాదది । యుత్తములగు సిద్ధు లెఱుఁగ - నోపుదురెపుడున్. 25

వ. అనిన సంతసించి యాచంచలాక్షి యది యట్లయగు. మీరగ్నమానయోగవిద్యాప్రభావ సంపన్నులరు. మఱియు మణిమంత్రౌషధంబులఁ గలమహాత్ములరు. త్రికాలవేదులరు. మీకుఁ గోచరింపనివృత్తం బెద్దియుం గలుగదు. కాన, కరుణించి యస్మన్మనోహరుం డెవ్వఁడొ గుటయు, నెచ్చోటనుండుటయును ముహూర్తకాలంబున నతండిచ్చటి కరుదెంచి నాచిత్తంబు హరించికొని కానరాక పోవుటకు నిమిత్తం బెయ్యదియైనదియుఁ దెలిపి నాయెడ రువారించి రక్షింపుఁడని ప్రార్థించి యభినవమారుండైన యాసుకుమారుని రూపయౌవన శుభలక్షణవిశేషంబుల శేషంబుగా వర్ణించి చెప్పిన నాలించి శోకంపం బొనర్చుచుండి యంత నాబోటిమాటలు వారించి మోమునఁ జిఱునగ వంకురింప నించుక సేపు యోజించి తదనంతరంబున. 26

క. తనదుకకపాలలోనొ । య్యనహస్తంబునిచి వింత - యైనకరాటం
బును గొని యందలి కాటుకఁ । దనకనులకు రాచికొని య - తఁడు కనియనియెన్. 27

మ. వింటే! యోకనకాంగి! నేనిపుడు మ - ద్విద్యాప్రభావంబుచేఁ
గంటిన్ సర్వము; వాఁడె నీదగు మనః-కాంతుండు నీవైఁదమిన్

గొంటె మాయని బారిఁ జిక్కి యకటా! - ఘోరస్థితిన్ వాంఛల
న్నింటిన్ మాని, విరక్తిఁ బూని యెపుడున్ - నిన్నెంచుచున్నాఁడ పేన్. 28

గీ. అనుచుఁ దలయూఁచి, కడుజాలి-నభినయించి। చూడుమ దెయదె, యని వ్రేల-జూపియతఁడు
మఱలనిట్లను బహుసుకు-మారుఁడతని । కెంతకష్టంబు వాటిల్లె - నిపుడు గంటె. 29

క. నీమీఁది వలపుకతమునఁ । గోమలమగు మేనువాడి - కుందుటఁ జూడం
గా మదిని జాలిగలిగెడు । నేమనివచియింతు వలని - యిప్పటిరీతిన్. 30

క. అనవుఁడు విని యామాటకు । వనజాయత నేత్రి మిగుల-వగగదురఁగనో
యనఘా ! యెటఁ డెవ్వఁడో । వినవలతుం దెలియఁబల్కు - వే కృపననుఁడున్. 31

క. మంచిది చెప్పెదననియతఁ । డించుక సేపట్టి మాచి - యిభరాజగమనా !
కొంచక నిక్కముగావి । షించి యెఱింగినది తెలియఁ- జెప్పెద వినుమీ ! 32

మ. అమరేన్ శ్రీపురి మేలుచుండు రుచిరా-స్యాఖ్యాపనీ జానిశ
న్క్రముతో డ్వాపటుగ; నా నృపాలసుతుఁ డా - రమ్యాంగుఁ డాత్మీయ నా
గముపైని ప్రవహించియున్న తటసోం - పుష్యాంబునం దవ్వరు
త్తములో చూతమటంచుఁ గూర్చిరవివా - హంబొంచ దైత్యుల్ సుమున్. 33

వ. నీకుఁ దగ్వవిచిత్రవృత్తాంతంబుఁ దేటపడఁబలికెద నాకర్ణింపుము. నీవతనిం గాంచిన నాఁటి రేయి నిర్ధిష్టమయంబున నిరువురు రక్కసులు వియన్మార్గంబునం బోవుచుండి శ్రీపురంబు నకు సమీపంబునం దధించి మాటలాడుచుఁ బ్రసంగవశంబున నొకఁడా పట్టణపురాజ పుత్త్రిం డు మిక్కిలి చక్కనివాఁడనియు మఱియొకండు నీ వెక్కుడు చక్కనిదానవనియు వర్ణించి వాదించుకొని వివాదపడుచున్న సమయంబున నచ్చటికి వచ్చిన తృతీయదైత్యు నిచేఁ బ్రబోధితులై వారు నిజం బెఱుఁగఁదలంచి యపుడు దాపుననుండుటం జేసి రాజ కుమారుని నంబరపథంబునఁ నతివేగంబునఁ గొనివచ్చి నిద్రించుచున్న నీ ప్రక్కఁ బర్యంకం బుపై డించి విలోకించి మీరిలివురును వయోరూపలావణ్య విలాసంబులఁ దుల్యులని నిర్ధ రించి మరల నృపాత్మజుని నతనిమందిరంబునకుం జేర్చి నిజేచ్ఛం బోయిరి సుమీ ! ఏతద్వృ త్తాంతంబంతయు మదీయకజ్జలప్రభావంబునం జేసియు, యోగవిద్యామహత్త్వంబు నం జేసియుఁ, దెల్లంబుఁగా నెఱింగితి. నారాజపుత్త్రిని నామంబు విజయాశ్వుండు. మఱియు నిపుడు గోచరించు విశేషంబులం దెలిపెద వినుమని యాదిక్కునకు దృష్టి సారించి యిట్లనియె. 34

తే. గీ. వానిమఱబాళి యెట్టిదో - కాని మాడ । రాదు సుమి తల్లడంబున - రామరామ !
హరిహరీ! యంచుఁ బలుకుఁ దా-నారటించుఁ । జాలచింతించు నీమూర్తి-సంస్మరించు. 35

వ. ఇది యతని యిప్పటిప్రవర్తనంబని చెప్ప నెండియు నిట్లనియె. 36

క. తిలకింతు రంజనముచేఁ | బలుకులు మీకేటులవినఁగఁ - బడెనవెదేమో
చెలువరో! యిదియెవ్వరిక | న్నులకున్ రాచినను నుడివి-నున్ గాన్పించున్. 37

చ. అనెయటులుండనిమ్మతని - యద్భుతమౌ కథవిన్నయట్టి వా
రదికలయించు వల్కెఁ-బరి - హాసముఁజేసిరికాని వారలా
యొదవినలాగుఁ దామెఱుఁగ - రొక్కరుసుం గని సంతఁజెప్పితిం
కెనె తెలియంగ నన్నడుగ - నెంచితివో వివరింపుమెయ్యనన్. 38

గీ. తడవుసేయకు పోవలె - నుడువుమన్నఁ | బట్టిసిద్ధుండు పల్కెన - పలుకులాత్మ
నెంచియడుగఁగాఁ దగినదు-హెచ్చిమించి | దైవవచియింపుఁ డొకవిష-యమువుహాత్మ!

క. ఇపుడారాజకుమారుఁడు | స్వపురంబునను ంటఁగాంచి - నటికితిరిగడా!
విపరీతమైన యామొ | హపువెతఁగొని యేటవసించు - నదియుం జెపుడా! 40

క. పలుమారు మిమ్మడుగుట | పలనమదిన్విసుకుఁ గొంద - నలపనఘాత్మా!
తెలిసినవారలు గావునఁ | గలతెలఁగెలిగింతునెడి - కాంక్షనడిగితిన్. 41

క. నాయందుఁగరుణనొక్కెం | తాయాసంబైన నోర్చి - యాగాములుబ
ర్వ్యాయముగఁ దెలిపినువికా | ప్యాయముఁగలిగింపుఁడింక-నడుగనటనినన్. 42

క. వినుమెన్నిమారులడిగినఁ | గనలొందక సంతసమునఁ - గనుఁగొనినీకున్
వినుపింతు సంశయింపకు | మనిసిద్ధుఁడు మోలఁగాంచి - యాప్రశిష్టుని తోన్. 43

క. ఎనలేనివిరహతాపం | బునకున్ బాలై విచిత్ర - ముగ సల్లవిగా!
మనుజేశ్వర సంపనుఁడుప | వనమునఁ గడునలయుచున్న - వాఁడులతాంగీ! 44

సీ. విరిశయ్యపైఁబండి - వేదనమించినఁ - జిగురాకుపాన్పుపైఁ - జేర్చువేనుఁ
జిగురాకుపానుపు - సెగఁజెందివాడిన - మరిసైఁపలేకపూఁ - బొదలదూఱుఁ
బొదలయందునవెట్ట - పొడమినవెగటొంది - పన్నీటికొలఁకుల - పజ్జకేఁగుఁ
బన్నీటికొలఁకుల - పైగాలికడువేండ్ర - మైనతరుచ్ఛాయ - లాశ్రయించు

గీ. చెలఁగిచెంగటఁ బలుకుప-క్షులరవములు | పరుషముగఁదోఁచి దప్పగాఁ - బొఁదోలు
నతఁడుపడుచున్న వెతఁగని - నట్టులైనఁ | గఠినచిత్తునిమదియును - గరఁగుఁజుమ్మ. 45

క. మాడఁగరాదావెతనో | రాదదు నీతోడవలుక - నతఁడవ్వోటం
జేడెరో! నీవివ్వోటను | వీడనికష్టంబునసుభ-వించెద రకటా! 46

క. శ్రీపురమను నదియెచ్చట | నీపట్టెచ్చోటయిపుడు - నీకునతనికిన్
బాపపువిధి యీవిధిసం | తాపముఁ గలిగించెనమ్మ - తామరసాక్షీ! 47

క. అనిచెప్పిసిద్ధుఁడావెసఁ | గనుటను జాలించిలేచి - కాంతామణి! నేఁ
జనియెదనిఁకనిటఁదడవా | యెను సుమ్మనుచరులఁజేర - నేగఁగవలయున్. 48

వ. ఈప్రసంగంబువలనఁ జాలఁబ్రొద్దుపోయెనని ప్రయాణంబైనవారించి యశోవతి దీనాన
నయై యిట్లనియె. 49

క. ఓపావనాత్మ! నాదగు । పాపపువెతఁదీర్ప కేగ - వచ్చునె మీరల్
ప్రాపించుదుఃఖమున న । న్నేపగిదింబొమ్మటందు - రేమగుదానన్. 50

క. ఖేదమునుడిపెదనని మది । నేదోయె కలాగు ధృతివ - హించితి, నిఁక నేఁ
బోదుననియంటిరిప్పుడు । మీదయయుండేదిగతియొ - మీరే చెపుఁడా. 51

క. మీపాదంబులునమ్మితిఁ । బ్రాపన్యులు లేరునాకుఁ - బావనచరితా!
కోపముఁబూనకమన్సం । తాపంబునుమాన్చి చనుట - ధర్మమునుండీ! 52

క. కరుణించి నామనోహరు । సరగునఁగాన్పింపుఁడతని - చందము నేనున్
పరికించి తనివినొందెదఁ । త్వరయేలా? ప్రొద్దులేదొ - తామేగుటకున్. 53

ఆ. తలఁచినంతలోనఁ - దలఁచినచోటున । కరుగనేర్పుఁగలిగి - నట్టిమీరు
గడియసేపునిలువఁ - గారాదెయిచ్చోట । నింతలోనఁ జెడిన - దేమిగలదు. 54

గీ. అనినసిద్ధుండు మోజన - నభినయించి । మరలఁగూర్చుండి మునుపటి-బరిణఁదీసి
కాటుకొక్కింత యాకాంత-కనులరాచి । చూడుమాదిశ నిపుడంచుఁ-జూపుటయును.

క. వారిజముఖి కనెరాజకు । మారున్ సౌందర్యవిజిత - మారున్ సుగుణా
ధారున్ సుకుమారున్ మణి । హారున్ సంతోషదూరు - నధికవిచారున్. 56

గీ. కాంచితమిమించి ధృతిడించి-కాంచనాంగి । పొలుపువర్ణించి నెమ్మేను-పులకరించి
చాలఁగాబాళిఁగొనిమది - సంచలించి । పలుకఁగారాని చహచహ - పాటునొందె. 57

ఉ. రాసుతునింగసంగనె వి-రాళికడున్ ధృఢమయ్యెఁ బల్లవ
గ్రాసనిమిత్త మత్తకల - కంఠకల ప్రనవాణికద్భుతం
బాసయుఁగొంకుఁగల్గెఁ బల - కాంకురము ల్ప్రడసూపెమించెనా
యాసము నీవిజాలెను త - నంతనె మారుఁడు నవ్వెఁ ఘక్కునన్. 58

మ. తనపై మోహముఁజెందె తాపమునకుం - దాళంగ లేకెంతయున్
దనలో దైన్యము బెగ్గలంబువగపున్ - దాల్చున్నసొంపేది ని
ల్చినచో నిల్వఁగఁజాలకారటముతో - జీవేశురూపంబుఁ జే
ర్మినివర్ణించుచు మూర్ఛనొందెఁ గని తే - ర్చెన్ సిద్ధుఁడాతొయ్యలిన్. 59

గీ. అటులఁదెలివొందియును నృపా - లాత్మజాతు । నందు నిజమానసములగ్న - మైనకతన
నతనివెంగట నిలిచియు - న్నటులఁదలఁచి । పలికెనిట్లని మించు వి-భ్రాంతికతన. 60

క. ఏకాంతకునై యింతటి । యాకులమున కగ్గమైతి - వాకాంతను నే
నీకెలనికివచ్చితి ననుఁ । జేకొని మన్నింపుమిటుల - జింతిలనేలా? 61

క. వేదనమించెను సైఁపఁగ | రాదిఁక దడవేలఁ జేర - రమ్మని కడును
సమ్మదమునఁ గౌఁగిలింపఁగఁ | జేదోయిం జాచెఁ జాన - సిద్ధుఁడు నగియెన్. 62

గీ. నగినవెంటనె తెలివొంది - నాసమదెని | గదురనవ్వుచు సిద్ధుని-వదనమరసి
యనఘ! తెలియక నేవల్కి - నట్టివిభ్ర | మోక్తులివి మీకు వింతయై-యుండుననిన. 63

క. ఔనౌ మించినవిభ్రమ | మేనిను పలికించె నిటుల - నెఱుఁగుదుఁ; గంటే!
మానవపతి పుత్రుని విధ | మేను వచించినది నిక్క - మేనో కాదో. 64

చ. అనవుఁడు మీరు వల్కినది - యంతయు నిక్కము కంటిఁ గాదనే
నును; మిముబోటి పెద్దలు వి-నోదముగా నగునేనిఁ గల్లమా
టను వచియించుటున్నె? యక - టా! సుకుమారుఁడు మత్ప్రియుండు మిం
చిన వెతనొంది నాకొఱకుఁ - జింతిలుచుండెడు నేమి సేయుదున్. 65

క. ఎన్నఁడు నా హృదయేశుని | మన్ననఁ గని వేడ్కమీఱ - మనియెద నొక్కో
యన్నన్న యోర్వలేని | ఖిన్నాళీమోహవార్ధి - నీదఁగవలెనో. 66

వ. ప్రవర్తిల్లిన యీవృత్తాంతం బిట్టిదని యెఱుంగనేరక వెతపడుచున్న సమయంబున, దైవ
ఘటనం జేసి మీ రిచ్చోటికి వచ్చుటయు నిక్కమగు వృత్తాంతంబుఁ దెలుపుటయుఁ దటస్థించె.
మహాత్మా! మీకరుణావిశేషంబునఁ గదా మదీయమనోహరుని గాంచితి; మీరు సర్వజ్ఞులరు.

క. దైవమన నింక నెవ్వరు? | భావింపఁగ మీర నాదు - పాలిటి దేవుం
డీవేళ నన్నుఁ గావం | గా వచ్చితిరిదె నిజంబు - కలుష విదూరా! 68

క. కాంచితి మిము ధన్యత నువ | హించితి రక్షించు భార - మిఁక మీది కటా
క్షించి నను పాలలోనన్ | ముంచిన నటుగాక నీట - ముంచిన నొప్పన్. 69

క. భావింపని నాపాలికి | దేవునివలె వచ్చి నేఁడు - తెలియక మిము నే
నే విషయ మడిగినను మది | నేనపసెకఁ జెప్పినార - లే కృప ననినన్. 70

క. ఆలలన మాటలన్నియు | నాలించుచునుండి సిద్ధుఁ - డంతట లోనే
మోలాతిగ్రైన విషయము | నాలోచనఁ జేసి లేచి - యప్పుడిట్లనియెన్. 71

క. అడిగిన దెల్లను జెప్పితి | విడువకఁ బరికించి నీకు - విరిబోణిరో! నేఁ
డడవాయె వచ్చి యిచటికిఁ | గడువడిఁ బోవలయుఁ గలదు - కర్జము నాకున్. 72

గీ. కరము నీయందు నాకనుగ్రహము గలదు | కాననిచ్చెదఁ గొనుమయీ - కరపటంబు
నిందుఁ గలకాటుకొక్కింత-నెత్తికనుల | రాచికొని నీప్రియుని రీతిఁ-జూచుకొనుము. 73

క. చెలువరో! విను కావలసిన | కొలఁదిం గావించి యునుచు - కొనసేర్తుము సి
ద్ధులమగుటవలన నీక | జ్జల; మనుష్యులు నేయలేరు - సత్యము సుమ్మీ! 74

ఆ. దీనినెంతయుష్టు - లైనవారికిఁగాని । యొసఁగమెపుడు నేము - కింతరైన
నేఁడుమదినినాకు - నీయందుఁగలదయ । వలననిచ్చిపోవఁ - దలఁచినాఁడ. 75

ఉ. నావుఁడుగుండె జల్లనఁగ - నాతికడుంగడుభీతినొందియో
పావనమూర్తి! నన్నిపుడు - పాయనిచింతల పాలుఁజేసి మీ
త్రోవను మీరుబోయెదరె? - యూషిగసర్వమెఱింగినట్టి వా
రీవిధిఁబల్కరేని యన - నేమిఁకనున్నది యడ్డశక్యమే. 76

గీ. తగశరీర మాద్యంఖలు - ధర్మసాధ । నమ్మనెడు మాటఁదలఁచియో - స్నంగపరుల
కుపకృతినిసేయఁ గాంక్షించు-చుండువారు । మీరువిడిచిన రక్షించు - వారలెవరు ? 77

క. ఆశగొనియుంటిహృదయ । క్లేశంబునుమాన్చి ననుసు - ఖింపఁగఁజేయం
గాశక్తులు దొరికితిరని; । యాశంసిత మొందఁజేసి - యరుగందగదే. 78

క. మిమునడిగి సంతవట్టును । క్రమముగ నెఱిఁగించినారు - గద, యిఁకనాలో
నమరినకోరికఁ దెలిపెద । విమలాత్మా! దానిఁదీర్చి - వెడలిచనుండా! 79

క. మణిమంత్రౌషధసిద్ధులు । గణుతింపఁగ మీరలెంత - కార్యంబైనన్
క్షణమున సేయఁగనేర్తురు । ప్రణుతించెద మిమ్ముఁజింతఁ - బాపుఁడ! కూర్మిన్. 80

క. మునుపడఁగాఁ జక్కరనిడి । తినిపించిన నోటఁదేదుఁ - దినిపించుటయొ
ప్పునె? కొంతమేలుగలిగిం । చినవారలు మరలకీడుఁ - జేయకుఁడనఘా! 81

క. ననునాప్రియుఁ డుండెడిపుర । మునకుం గొంపోయి విడిచి - పొండీవేళన్
కినియకుఁడు మీదయన్ సుఖ । మునమనియెద మీకుఁజాలఁ - బుణ్యంబొదవున్. 82

క. ఆలోచింపకుఁ డాతడ । వేలా ? మత్సఖులునత్తు - రిఁకనటుపైనే
మేలొందుటరిదియగు ; నను । కూలంబగు లాగువేగఁ - గొనిచనుఁడనినన్. 83

గీ. ఉలికిసిద్ధుండునగి తల-యూఁచియట్టి । శక్తిమాబోంట్ల కొదవునే-చంద్రవదన!
యనియె; మీరెఱుంగని విద్య-యవనిఁగలదె? । పుణ్యమిదికావుఁడని పదం-బులనుబట్టె.

క. విడువిడు పదములననియా । పడఁతికరద్వయమతండు - పాయంద్రోసెన్
విడిచిననామది తాపం । బుడిపెడి వారెవ్వరనుచు - నుగ్మలివలికెన్. 85

గీ. అంతసామర్థ్యముంగల - యట్టివాఁడఁ । గానటంచెంత చెప్పినఁ - గానిమీప్ర
భావమెఱుఁగుదు నీమాయ - పలుకులేల । ననియెనాకొమ్మ యామాట-కతఁడునగియె.

క. నగికొంత దడవుతనలోఁ । దగువిధియోజించియట్టె - తరళాక్షినెగా
దిగఁజూచి యిచ్చయింపని । వగనూరక యుండిజాలి - వడినవిధమునన్. 87

క. ఆకాయ సిద్ధుఁడలివరో! । నీకోరికనెటులనైన - నెరవేర్చెదనే
శోకింపవలదు నినుఁగన । నాకుంగడు జాలివొడమె - నమ్మితివగుటన్. 88

ఆ. ఎక్కినట్టివాని - కేనుఁగు కుఱచయౌ । సట్టులయ్యె నిప్పు - డబల! చనువు
గాఁగ మాటలాడు - కతమున సిద్ధుఁడ । నైన నేను లోఁకు - వైతి నీకు. 89

క. మేమిట్టి పనికిఁ బూనుట । నేమమునకు భంగమైన - నీవెతఁగనలే
కేమైన నయ్యెడు నపై । నీమేలొనరించి పోవ - నెంచితి బుద్ధిన్. 90

వ. అని చెప్పిన నతని కయ్యిందువదన యిట్లనియె. 91

క. చేకొని యుపకృతిఁ జేసిన । మీకిందున లోపమేల - మేకొనుని మం
జేకరిణిం జెడు నయ్యా! వి । వేకింపఁగ; బావినీరు - వెల్లువఁ జను నే? 92

గీ. అడ్డిమాటలు వలుకకుఁ - డాసఁ జెంది । యడిగినపు డిష్టమును దీర్ప - కరుగరాద
టన్న వినిసిద్ధుఁ డగు నగు - నదియ గర్మ । మగుట నే గద యొనరింతు - నంటి నేను. 93

గీ. తొలుత నీకొక్క పద్ధతిఁ - దెలుపవలయు । నందునకు నిచ్ఛయించిన - సందియంబు
లేక నీప్రియుఁ జేర్చెదఁ - గాక యున్న । నావలనఁ గాదు సుమిమత్త - నాగయాన! 94

వ. అని పలికి తత్క్షణంబ లేచి పోయి తానటకరుదెంచునపుడెడఁగలుగనునిచి వచ్చిన యోగాశ్వ
మును గొనివచ్చి చూపి, లతాంగీ! నేనుదీని ప్రభావంబున నెప్పుడెప్పుడెచ్చటికిం
బోవఁదలంపుగల్గునో యాయాస్థలంబులకుం ద్రుటికాలంబున ననాయాసంబుగా వియత్ప
థంబున నంజని వచ్చుచుండుదు. నిదిమనోవేగగమనశక్తిగలయది. ప్రపంచంబంతయు
నొకముహూర్తకాలంబునఁ జుట్టి తిరిగిరానోపు. నీకభీష్టంబేని నాపిఱుందన దీనిపైనా
రోహించి చనుదెమ్ము. నిమిషంబులోన నీప్రియుని చెంత దిగవిడిచిపోయెద. మావంటి సిద్ధు
లకు యువతుల తను స్పర్శంబు గారాదు సుమీ! యైనను నీపైఁగల ప్రియంబువలన తారత
మ్యంబులు విమర్శించుటకు సమయంబు గాదని యట్టి నియమంబు సయితము లెక్క
సేయక నీకుపకారంబుఁ జేయ నిశ్చయించితి. నిదియ నీకుం దెలుపవలసిన విషయంబు.
బాగుగా యోజించి యాగాములను నిర్ణయించుకొని శీఘ్రంబుగాఁ నీయభిప్రాయంబుఁ
దెలుపుము. వ్యర్థంబుగ కాలయాపనంబుఁ జేయుట ప్రయోజనంబు గాదనుటయు, నతని
కభివందనంబుఁ గావించి యామించుబోణి మానంబున ముదంబొదవ నిట్లనియె. 95

మ. ననుమీ రిట్లడుగంగ నేల? పసిదానన్ మీకు మారాడనే
ర్తునె? మేలైనను కీడు గల్గినను సం - తోషంబ; మీరెట్లు చె
ప్పిన సభ్యంగి నొనర్తు; నమ్మితి మిమున్ - విజ్ఞాన సంపూర్ణ! యొ
య్యనఁ గొంపోవుఁడ తోఁచు రీతి నిఁక మీయాజ్ఞన్ ప్రవర్తించెదన్. 96

క. పదఁడన వేగిర పడకిపు । డెద బాగుగ నెంచి నీ వభీష్టము గలచోఁ
గదలుము లేకుండిన రాఁ । బదరకుమిది సాహసంబుఁ బనిశుకవాణీ! 97

క. పసిదానవు యోజించక । దెసదోఁచని వలపు కతనఁ - దెగువకుఁ జొరఁగాఁ
బసగాదసమంజసమనఁ । గుసుమసమానాంగి భీతిఁ గొనకిట్లనియెన్. 98

చ. వలవదు సంశయింపఁగన-నర్హముగల్గదు మీకుదీన న
న్వల నెటులైన నయ్యెడు నృ-పాలకుమారునిఁ జేర్పుఁడామదిన్
నిలుపఁగఁ జాలఁ జాలఁ గరు-ణించి సఖీతతిరాకమున్నె వేల్
తలఁపున మీమహత్త్వఫుబ-లంబున వేగ నిపాండునావుఁడున్. 99

గీ. అటుల నీకిచ్చియున్న గ-మ్మనుచుఁ జెప్పి । తొలుతఁదాసైంధవము నెక్కి-కలుకులాఁడి!
యటుపిఱుందనఁ గూర్చుండు-మంటపలదు।తడవుసేయకుమనవుఁడుఁ-దరుణియపుడు. 100

క. సంతసముం ద్వరయునుదన । మంతనమునఁ గదురశంక - మానిమహాత్మా!
స్వాంతంబున నాపైమీ । కింతటి కృపగలిగెఁజాల - నిదివేలనుచున్. 101

సీ. కనిపెంచిదయమీఱ - గారవించుచునుండు - తల్లిదండ్రులమీఁది - తలఁపువిడిచి
యాప్తులైతనచెంత - ననయంబు మెలఁగెడి - చెలులపైఁగలకూర్మిఁ - దొలఁగఁజేసి
యేవేళఁగనులారఁ - గాఁ లోకించిమ - న్నించుబంధులఁబాయు - కించయుడిగి
భయభక్తులెసఁగఁగాఁ - బలుకఁగాచిచరించు - పరిచారికలయందు - భ్రాంతిమాని

గీ. శారికాకీర పంక్తిపై-జాలివీడి । భోగభాగ్యాను భవశక్తి - బుద్ధినడఁచి
రమణిసిద్ధునివెంటఁ దు - రంగమెక్కెఁ । గలుగునే స్వజనప్రీతి - కాముకులకు. 102

వ. అపుడమ్మదవతిని హెచ్చరించి సిద్ధుండు. 103

క. పదిలము పదిలము మగువా! । వదలకు చేపట్టుసైంధ-వం బెగయువడిన్
జదలఁజనునపుడుభీతిలి । కదలకుమీయొక్క-నిమిష - కాలంబనినన్. 104

గీ. కదలకుండెదఁ బదిలంబు-గామహాత్మ! । వేగనెగయింపుఁడనియెనా-వెలఁది; యతఁడు
శీఘ్రముగ నీప్రియునిచెంతఁ-జేర్తునిన్నుఁ । గనుమునానేర్పునిత్తఱి - ననిపచించి. 105

క. అశ్వగ్రీవముఁ దట్టుచు । విశ్వంభర పాహి వేద - వేద్యనమస్తే
శాశ్వతమునినుత 'జా-పర । మేశ్వర' యని పలికెఁదురగ - మెగసెన్దివికిన్. 106

చ. సరగుననట్లుపైకెగసి - చాగినదెంతటి దవ్వొకానిమే
ల్పురములు బొమ్మరిండ్లుగను - భూధరముల్చిఱుసల్లరాళ్లుగన్
శరధులుపిల్లకాలువల - చాడ్పునఁగానలు తూరమల్లుగా
గరితకునబ్బురంబొదవఁ - గాఁగనుపట్టె ధరిత్రిఁజూడఁగన్. 107

ఉ. అంబరగామి సిద్ధునిహ-యంబు రయంబునఁబోయిపోయి గో
త్రంబులుఁ గాననంబులు పు-రంబులుఁ బల్లెలునిర్గమించి వే
గంబునుమాని భీకరము-గాఁగనుపట్టు మహాటవీప్రదే
శంబున నొక్కచోట నిమ - సంబున దిగ్గనడిగ్గినిల్చినన్. 108

క. ఇదియేమి యప్పుడేభువి । కిదిడిగినిల్చినది హేతు-వెయ్యదియొకొ? నా
హృదయేశుఁడున్నచోటికిఁ । గదపోదలఁచితిమి తడయఁ-గాఁదగునెయిటన్. 109

క. అనుచు యశోవతి యడిగిన । విని సిద్ధుం డిట్టులనియె - వేగిరపడవ
చ్చునె ? ఇచ్చినవారము మఱి । చనకిటఁ గాపురముఁ జేయఁ - జనుదెంచితిమే ? 110

శా. ఈ కాంతారములో సమీపమున స-ర్వేష్టార్థముల్ గూర్చు మే
లౌ కాళీనిలయంబు రాజిలునొకం - డా యంబపాదాబ్జముల్
మాకుం బూజ్యము లౌట నెప్పుడును నీ - మార్గంబునం బోవుచో
జోకం బూజ యొనర్చిగాని చనమో - శుభ్రాంశుబింబాననా ! 111

క. అరుదుగ నిచ్చటికిం దా । నరుదెంచిన పిదపఁ బూజ - యగుదనుకఁ బదం
బరుగదు మా యోగాశ్వము । త్వరచెడి యీకానసమునఁ - ధరపై వ్రాలుఁజన్. 112

క. కావున నిలిచెను పూజం । గావించెద వేగఁ దపియఁ - గా నేమిటికిన్
బోవుదమటు పైననిమును । తావాశ్వము డిగ్గెనతఁడు - తరుణియు నదిగన్. 113

క. ఇటనుండు మేను పూజిం । చుటకుం బూవులను దెత్తు - సుదతిరొ ! యని తా
నటనుండి చనియె సిద్ధుఁడు । కుటిలాలక యచటనుండెఁ - గొంకుచు నొంటిన్. 114

వ. అటుల కొంతవడి యటునిటు విలోకించుచుం గ్రుమ్మరుచుండి యాలతాంగి యట్టి సమ
యంబున. 115

క. అటనికట క్షోణీజ ప్ర । తతటజోత్కట గుభగుభత్ప-తనజలరాన
స్ఫుటవోద ప్రపనిర్మల । తటినీతట సీమఁ గాళీ - ధామముఁ జూచెన్. 116

గీ. మంచిమందిరమెవ్వరికిఁ దగు-చోటు లేక । నీమహాటవి నీగుడి - నేమిగొప్ప
సుకృతమని కట్టిరో యంచుఁ - జోద్యమంది । దానిఁ జూడంగవలెనను-తలపుగలిగి. 117

క. అలకాళికాలయంబునఁ । గలుగు విశేషంబులైనఁ - గనుఁగొనియెద నీ
స్థలమున నూరకయుండిన । ఫలమేమని గుడికిఁ బోయి - ప్రమదం బెసఁగన్. 118

ఉ. మానినిగాంచె ధర్మమణి - మండిత సుందరగోపురాంత సో
పానము వజ్రకల్పితక-వాటసమన్విత రమ్యమార్గసం
తానము వంద్యమాన పరి-హాసమున్నత మంటపధ్వజ
స్థానము కాళికాలయము-సన్నిభ శిల్పకళా ప్రధానమున్. 119

ఉ. వింతగు దత్ప్రకల్పనకు - వేడుకఁ జెంది నుతించి చొచ్చి యా
కాంతహృదీశుఁ గూర్పుమని - కాళికి భక్తినమస్కరించి తో
నంతటనుంగనం దలఁచి - యట్టిటు గ్రుమ్మరుచుండ గోపుర
ప్రాంతమునన్ శిలాప్రతిమ - ఫక్కున నత్తఱి నవ్వె నవ్వినన్. 120

మ. అపుడాశ్చర్యముఁ జెందినిల్చి యిదియే-మా రా విచిత్రంబు తా
నిపుడే సిద్ధుఁడు పూలు దెత్తునని పో-యెన్ యొంటరి న్నేను ఘో

గవు కాంతా! మగమ్యమీస్థలము ని-ర్మానుష్యమైనట్టి దం
డుపరుల్ నవ్వుటవింటినా కనులకెం-దుంగానరారెవ్వరున్. 121

క. నే నెటులవింటినో భ్రమ । చేనంతియ కాని యెవరు - చేరంగలరి
చ్చోనంచుఁ దలఁచుచుండఁ । గానగియెను బొమ్మమరలఁ - గామినిగనఁగన్. 122

క. ఈరీతి మాటిమాటికి । నూరక నగుచున్న మదిని - యులికియిదేమో
కారణమగు నెఱిఁగెదనని । చేరంగాఁబోయి నవ్వ - చిత్రపుబొమ్మన్. 123

వ. పరీక్షించి యదియొక స్త్రీవిగ్రహంబుగానుండినఁ గొంతవడినిలిచి విలోకించి యపుడు
నవ్వుటమాని యూరకున్న భయాశ్చర్యమగ్నమానసయై యెట్టకేలకు ధైర్యంబవలంబించి
దానిని సంబోధించి యిట్లనియె. 124

క. క్షితిలో నెన్నఁడును శిలా । ప్రతిమలు నగుటెఱుఁగ; నెవరుఁ - బలుకఁగవినలే
దతులాద్భుతమీకారణ । మతిశయమై యుండుఁబలుకు - మమ్మా! బొమ్మా! 125

క. సురసిద్ధ సాధ్యవిద్యా । ధరకిన్నర గరుడయక్ష - దానవభుజగో
స్సరసాదులందు నీవె । వ్వరవైనను నగుదువేమొ - వచియింపుతగన్. 126

క. నగ నేర్చి మాటలాడం । దగు సామర్థ్యంబుగలుగ-దా? కతమేమో
మిగులనవీనంబగు నీ । దగుచరితముఁ దెలుపుమీ ద - యంద్వరితముగన్. 127

గీ. సత్యమైనట్టి కఠినపా-షాణవిగ్ర । హంబు కావని నామది - యందుఁదోఁచె
నేమికారణమొక్కొ నీ - కిట్టిమారు । పాటుసంధిల్లుటకు; తేట-పరుపుమిపుడు. 128

గీ. అనుచుఁ బెక్కు విధంబుల-నవనివిభుని । పుత్త్రియడుగుటయును రాతి-బొమ్మయపుడు
మరల నగిమానిసియుఁబోలె - మాటలాడఁ । దొడఁగి యిట్లనువినుమమ్మ! - పడఁతినీవు.

క. భావింపఁగ సుఖదుఃఖము । లానిహీలున్ బ్రాణికోటి - కపుడపుడు భువిన్
దైవికముగ; నెదరైనను । వావిరినది యనుభవింప - వలయుంజుమ్మీ! 130

ఆ. మేలుగలిగినపుడు - మిగులసంతోషించి । చెట్టబొసఁగు వేళఁ - జింతనొందఁ
జనదు విజ్ఞులెఱిఁగి - సమముగాభావింతు । రెపుడుఁగష్టసుఖము-లిందువదన! 131

వ. సమస్తఫలాఫలంబులును, భగవత్సంకల్పసిద్ధంబులై ప్రాపించుంగాని తదన్యంబెద్దియుఁ
గలుగ నేరదని పెద్దలు సెప్పుదురు. కావున. 132

క. దైవికముగ నివ్విధినా । కీవిపరీతస్వరూప-మేర్పడె నీకున్
నావిధమున నే దుర్దశ । యావహిలెన్ గద యటంచు - నడలొందిమదిన్. 133

గీ. ఎంతవారలకైన మ-హీస్థలమున । ధాతలిఖితంబుఁ గడఁవగాఁ - దరముగాదు
గద, యనుట నెంచి నీకష్ట - గతిఁదలంచి । యాట్టె నినుజూచి నవ్వితి-నమ్మ! నేను. 134

క. ఎచ్చోటనొ పుట్టితివిపు | డిచ్చటఁ జానంగవలసె - నిదినీతలవ్రా
ల్వచ్చెడి కష్టసుఖంబుల | నిచ్చ నెఱుంగంగ శక్య-మే శుకవాణీ ! 135

క. అనవుడుఁ గడు నాశ్చర్యం | బును భీతియు బెగ్గలింపఁ - బోలఁతుక తనలో
ననుమాన మెసఁగి బొమ్మన్ | గని దైన్యము వగయు మీఱఁ-గా నిట్లనియెన్. 136

మ. నిను సామాన్యపు విగ్రహంబనుచు ని-ర్లక్ష్యంబుఁ జేయంగ రా
దను గత్తిన్ నను గావఁగాఁ దలఁచి మా-యా రూపముం దాల్చివ
చ్చిన నా పాలిటి వేల్పు వౌదువు సుమీ! - సిద్ధాపదేశంబునన్
జనరాహిత్యభయంకరాటవికి వి - స్రంభాత్మనై వచ్చితిన్. 137

ఉ. నీ విట విగ్రహాకృతిని - నిల్చుట కేమి కతంబు? చావు నా
కే విధిఁ గల్గు? నవ్విధము - నిత్తఱి నెట్టు లెఱింగితీవు? నా
కా వివరంబునంతయును - నాదర మొప్పఁగఁ జెప్పి కావుమిం
కీ విపినంబులోన నను - నెవ్వరు ప్రోవఁగలారు తెల్పుమా ! 138

క. అని వేఁడ, బొమ్మ యిట్లను | వనితరో ! తద్విధముఁ దెలియఁ - బలికెద వినుమీ
నినుఁ గొనివచ్చిన యా సి | ద్ధుని చే నీ కిట్టి కీడు - దొరకొను నమ్మా! 139

సీ. వాఁడు మాయాదుష్ట - భావుఁడీ కాళికా - దేవినిఁ గూర్చి సు - స్థిరమనస్కుఁ
డై పెక్కు నాళ్లును - హోమఘోరతప మొన - రించిన సాక్షాత్క - రించి దేవి
వేఁడుము వరమన్న - వినుతించి నే నెద్దిఁ - దలఁచినఁ జేకూఱ - నలఘు శక్తి
గలిగింపుమనుఁడు దా - క్షాయణి యోజించి - యా కోర్కి సిద్ధింప - దడుగ కిపుడు

గీ. ప్రాయ మొదవిన యదియును - బరిణయంబు | గానిదియుఁ జక్కనిదియు నా-మానవేంద్రు
పుత్త్రి నొకదానిఁ దెచ్చి యే-ప్రొద్దు నాకు | బలి యొనర్తువొ యానాఁడు-పడయఁగలవు. 140

వ. పొమ్మని యాదేశించి యాదేవి తిరోహితయగుటయుఁ దత్ప్రయత్నంబు సేయ సమకట్టి పట్టువీడక. 141

క. అని మొదల వివాహితయును | సదమల లావణ్యవతియు - జవ్వనియును నై
పొదలు నృపపుత్త్రిఁ గొనిరా | వెదకుచుఁ దిరుగంగఁ దొడఁగె - విశ్వం బెల్లన్. 142

గీ. నేఁడు వాఁ డెట్టి మాయలు - నెఱపెనొక్కొ | నిన్నుఁ గొనివచ్చె బలివెట్ట - నిశ్చయించి
కొమ్మ! నీ స్థితిఁ గని కల - గుట్టెఱింగి | నగితి విధిఁ దప్ప శివునికై - ననుదరంబె? 143

క. మాయలు మందులు మంత్రో | పాయంబులుఁ బెక్కు నేర్చుఁ - బాపాత్ముఁడు వాఁ
డా యాసమయమునకుఁ దగ | నే యే క్రియలైనఁ జేయు - నిభరాడ్గమనా ! 144

వ. మన మొకరి కొకరుపకృతిఁ జేసికొనుటకు సమయంబు తటస్థంబయ్యె నే తద్వృత్తాంతంబు నే నెఱింగి పలుకుట కాశ్చర్యంబుఁ జెందవలదు. మదీయ చరిత్రంబు సావధానంబుగా నాక

ర్శించిన యిట్టివిషయంబులు నాకుం దెలియవచ్చుటకుఁ దగుకారణంబును, శిలయైయుండి యుమాటలాడ నేర్చియుండుటకు నిమిత్తంబును, మఱియుం గొన్ని విచిత్రంబులగు విశేషంబులును, నీకు విశదంబులుగాఁ గలవు. నీకు నిట్టివృత్తాంతంబుఁ దెలిసికొనుట యావశ్యకంబై యుండుఁ; దత్ప్రయోజనంబుఁ గడపటఁ దెలియవచ్చుఁ గావునఁ దొలుత నస్మత్కథావిధానంబుఁ దేటపడంబలికి పిమ్మట సిద్ధసంకల్ప సంప్రాప్తవిపద్దశానిరోధనప్రకారంబు వివరించెద. ధర్మస్వరూపుఁడగు పరమేశ్వరుని కృపావిశేషంబున నీకు మేలు వాటిల్లఁ గలదు. వేఱొకటి వినుమని శాంతచిత్తం జేసి రాజపుత్త్రికి శిలాప్రతిమ యిట్లనియె. 145

## జటిలోపాఖ్యానము.

సీ. వినుము మున్నొకకాల - మునజటిలుండను-ముని వింధ్యపర్వత - మునకుఁ గెలన
నొకచోటకానలో - నురునిష్ఠఁ గూర్చుండి - వినువకఁ దపముఁ గా - వించుచుండ
నెఱిఁగి గీర్వాణకు-లేశ్వరుం డతని మ-హత్త్వంబునకు వెఱ-గందిచాల
యోజించి యచ్చర - యువతీమణులలోన - సౌందర్యచాతుర్య - శక్తి మించు
గీ. హేమయనుదానిఁ జీరి మ - హీస్థలమున | కేఁగి జటిలుని తపము నీ-వెవ్విధమున
నైనభంగంబుఁ జేసి ర-మ్మరుగుమనిన | నతివ యదివిని గుండె జ-ల్లనఁగ నులికి. 146

చ. జడిసిచనంగ లేననిన - శక్రుఁడు దిట్టును పోదు నేని నేఁ
డెదుట నిజంబు తాపసుని - చేఁ, నిపుడిందున కేమి సేయుదున్
గొడవ జనించెఁ బో 'వెనుక - కుంజనదన్నును ముందు కేఁగఁ గాఁ
బోడుచు' నటన్న చందమిగి - పోయినఁ బోవక యున్నఁ గీడగున్. 147

చ. చలమున వాని దిట్టినను - శక్రుఁడు దిట్టిన నెట్టులైనఁ ద
త్ఫలమునుఁ జెందఁగాఁ దగిన - దాననునే నయితిం దలంపఁగా
ములునరటాకులాగొదవె - మోసము వచ్చెను దోఁచ దేమియున్
గొలఁదులె నిర్దయామతులఁ - గొల్చెడివారికిఁ గల్గుకష్టముల్. 148

క. అని హేమ వగచి సురవ | ర్యునితోఁ దగ మనవిఁ జేసి - యొరులను పనుపం
జనునని యెద, నతఁ డటు గా | దనెనా యటమీఁదఁ జూత - మని తలఁచె మదిన్. 149

వ. అని చెప్పిన నవ్వలివృత్తాంతంబుఁ దెలుపుమని యడుగుటయు. 150

## అశ్వాసాంతము.

ఉ. పాలితనాగ! నాగధర! భక్తసుపర్వవనాగ! నాగరాట్
శూలినరాజరాజనుత! - సూరిజనావన! రాజరాజని
ర్మూలన యోగ! యోగ! భవ - మోచన! సద్వినియోగయోగసం
కీలితరూప రూప! ఖగ - కేతన! నిర్మలరూప! రూపటా! 151

క. [illegible]రవినిభశోభాభాసుర! యవిగళభవ్యస్వభావ! - యనుభావగుణీ
భవభవన! భువననుతపై! భవ! భవసఖ! సుభవ! భావ - భవభావభవా! 152

ఉత్సాహవృత్తము.

హరిహరిహరి! సార - సాక్ష! రాక్షసక్షయా!
నగ! నీరజారిహస్త! దేవదేవ! శోభనా!
నీల! సారభూరిచేల! - వేదవాదమోద! ని
[illegible]! సూరితారణా! ముకుంద! నందనందనా! 153

గద్య.

ఇది. శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాద లబ్ధానర్గళ చతుర్విధ కవిత్వమహత్త్వాభి
రామ, భూసురకుల క్షీరపారావారపూర్వశర్వరీసోమ, శ్రీవత్సగోత్ర
పవిత్రాపస్తంబసూత్ర, సావిత్రీలక్ష్మీనృసింహార్యపుత్త్ర,
సుకవిజనవిధేయ, పిన్నయనామధేయ ప్రణీతంబగు
విజయాశ్వచరిత్రంబను ప్రబంధంబునందుఁ
బూర్వభాగంబునఁ దృతీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీమద్వేంకటేశ్వరార్పణమస్తు.



శ్రీరస్తు.

# విజయాశ్వ చరిత్రము

## పూర్వభాగము

---

## చతుర్థాశ్వాసము.

క. శ్రీవర్ధన! విబుధార్చిత! । పావనసంకల్ప! సుప్రభాపూర్ణ! విలా
సావాస! జనార్దన! యు । ర్వీవర! సంకట నిరోగ!-వేంకటనాథా! 1

వ. దేవా! అవధరింపుము. సద్గుణగణవిశారదులగు శౌనకాదులకు సన్నుతపుణ్యకథాశాలాంగ
సూతుండగు సూతుండిట్లనియె. నట్లు యశోవతితోడ శిలావిగ్రహంబు హేమచరిత్రం
బుఁ జెప్పుట కుపక్రమించి సిద్ధుండువచ్చునంతకు మున్న వివరింపఁదలంచి, లతాంగి!
వినుమని చెప్పందొడంగె, నవ్విధంబున హేమమనంబున నిశ్చయించి. 2

క. శతమఖునకు భక్తినమ । స్కృతిఁజేసి నయంబుమీఱ - నిట్లనుమీఁరా
నతియొసఁగిన పనిచేగుట । హితమగు మాకైనఁజాల - నెగ్గిందోఁపవుక్. 3

క. మానుల వంచించుటయనఁ । గా నెంతయుఁ గష్టసాధ్య - కార్యమువారల్
చానలయెడ విముఖత్వము । మానసదార్ఢ్యంబుఁ గలుగు - మానుసులగుటన్. 4

గీ. అచ్చరలమిన్నలైన రం - భాదియువతు । లెట్టిచెట్టలుగనిరిము - న్నిట్టిపనుల
కరిగి; తెలియమె దేవ! యంతంతలేసి । వాగుపనలేని పనికిఁబో-వంగఁగలనె? 5

గీ. అతులసుజ్ఞాన పూర్ణమ - హత్త్వసిద్ధి । నెసఁగుమునులను వంచింప - నెవరితరము?
వారికోపాగ్నినోర్చెడి - వారుఁగలుగ । రెఱిఁగిగాముగలోఁచేయి - నిడుగుగయ్యా! 6

వ. కావున నేనీమహాత్కార్యంబు దేవరచిత్తానుసారంబుగా నిర్వర్తింపఁగలుగుదునో లేదో
యనుసందియంబు మనంబునం బెనంగుచున్నది. మునీంద్రుల మనోనిశ్చయంబును,
నవల్పక్రోధసంకల్పప్రకారంబును, నింతకుమున్ను కొంతకొంత యప్పుడప్పుడు నెఱిం
గియుండుదుఁగానఁ దమసన్నిధానంబున నిన్నిమాటలు విన్నవింపవలసె నింతకంటె
మిన్నలననుపుట యుచితంబని తోఁచుచున్నయది; యనియుక్తియుక్తంబుగా నిజాభిమ
తంబుసూచించినవనగి దేవేంద్రుం డిట్లనియె. 7

క. హేమా! వింతలునుమిమ్మా! । నీమాటలు వినఁగ ; నంత - నేఁగనిబిడవే?
కామింపఁ జేసినేర్పున । యామానిని లోఁగొనంగ - నస్యులవశమే? 8

క. తరుణీ ! యీకార్యముల । చ్చగలగు మీవలనగాని - సరిపడదిఁక మీ
రగమగనొందిన మతిరెయె । న్వరు మాపనిఁజేయఁదగిన - వారలుచెపుమా. 9

క. కన్నాకు భంగినప్సర । పన్నగవేణులకు నీవు - వైచేయివియి
ట్లన్నిపుడిచటననుపఁగ । నున్నారా నిన్నుఁబోలు - యువతులుగనుమీ. 10

వ. నీకు సమయోచితంబగుబుద్ధియుఁ, జాతుర్యంబును, లావణ్యంబును, ధైర్యసాహసంబులును, గలుగునటుల వరంబొసంగితి. నింకమారాడక వేగంబునంజని కార్యంబుసాధించి రమ్మని పొమ్మనవుఁడు పురుహూతునకడ్డు పలకనోడి యావగలాఁడియింకఁబోకున్నఁదీర దని నిశ్చయించి నమస్కరించి శలవుఁగైకొని నిజసదనంబునకరిగి మజ్జనంబొనరించి సముజ్వలవిభూషణగంధమాల్యాంబరాదులుగై సేసి, నెచ్చెలులు వెంటరాబయనంబై శీఘ్రగమనంబున వింధ్యధరాధరపరిసరకాంతారంబుఁజొచ్చి యందలి జటిలాశ్రమంబుఁబరికించి ప్రవేశించి తెగువమీఱఁ దత్సమయంబున. 11

ఆ. నిర్వికల్పభావ - నిష్ఠాగరిష్ఠుఁడై । యోగముద్రఁబూని - యుండునట్టి
జటిలుఁగాంచిచేరఁ - జనలేకవెఱఁగంది । తత్తఱమునఁగొంత - తలఁగినిలిచి. 12

సీ. హేమమదింగలంగి యిట - కేటికివచ్చితి నేడుబుద్ధిలే
కేమరి ; కష్టపాటెఱుఁగ - నే ? యపుడేగెద నంటి నెంచకిం
దీమునియున్న లాగరయ - నెంతయు భీతిజనించుచున్నదిం
కేమియొనర్తు నెవ్విధను-రీశ్వరు వాంఛను దీర్తుదైవమా! 13

క. రంభాదులైన మదగజ।కుంభస్తను లరుగమనిన - ఘోరపుపనికిన్
జంభారి నన్నుఁబనుచుట । సంభావితమగునె ? - మిగుల సంకటమొదవెన్. 14

క. వాదించి నన్నెయనుపం । గాదివిజేంద్రునకు యింకఁ - గలుగరెయువతుల్
లేదో యూర్వశి మేనక । లేదో యలమంజుఘోష - లేదో యచటన్. 15

క. ఊరకఁబోయిన నాసరి । వారలు నవ్వుదురు తిట్టు - వడుదున్ హరివే
నేరీతినైన నయ్యెడు । వీఁడఁజనరాదు నేర్పు - విధినొనరింతున్. 16

గీ. అనుచుఁజింతించి పలుయుక్తు - లాత్మనెంచి । పడఁతితుదకెద ధైర్యంబుఁ-బాదుకొల్పి
సఖులతోఁగూడి చనివేడ్క-సంయమీంద్రు।కెలన విహరించుచుండెఁ దాఁ-జెలువుదనర.

ఉ. ఆయువతీమణుల్చెలఁగి - యచ్చట నత్తఱిఁదావిపూవులం
గోయుచుఁ, గోకిలధ్వనులఁ - గూయుచు మత్తమరాళిపంక్తులన్
డాయఁగఁబోవుచుం బొదల - డాఁగుచు నింపుసుటిల్లగాన ముం
జేయుచుఁ గీరశారికలఁ - జీరుచుపంతములాడికేరుచున్. 18

క. ఆడుచు జతవీడుచు వెసఁ । గూడుచు వేడుకచెలంగఁ-గుసుమాంబకుఁగొం
డాడుచు నా గహనంబునఁ - జేడెలు విహరించిరతివి - చిత్రముగాఁగన్. 19

వ. మఱియునయ్యువతీమణులు చెలరేఁగి క్రొక్కాఱు మెఱుంగు తీఁగలం బురుడించుచు తను వల్లరులు మెఱయ మందగమనంబుల నందంపందెరుగుచు, నందంబులగు కుందంబుల కడకరుగుచు, పొదరిండ్లదూరుచు, మదహంసలం దఱుచు, కొమ్మలపై నెక్కుచుం దమ్మికొలకులం జొక్కుచు, గుత్తులం బట్టుచుఁ, జేతులం దట్టుచు, ఫలములం గోయుచుఁ, గొలఁకులం దాయుచుఁ బతిమాలిన నాగుచు, లతలమీఁద నూఁగుచు, నలరుబంతుల మీటుచు, సెలయేరులం దాఁటుచు, చిలుకలవలెఁ బలుకుచుఁ, జలువ పదనుఁ గులుకుచు, సొగసి నీడల నిల్చుచుఁ, బొగడపూవులు రాల్చుచు, దాగిలిమూతలాడుచు, జాగుఁ జేసిన వేడుచు నిట్లనేక విధంబులం బ్రసూనబాణసూత్రధారిక హస్తలాఘవప్రభావసంచలత్ప్రత్న పుత్త్రికాసముదయంబుడంబున నయ్యచ్చరమచ్చకంటులు సంచరించుచుండె నాసమయంబున. 20

ఉ. వారలలోన హేమముని - వర్యుని చేరువ సంచరించె నొ
య్యారము మీఱఁ బైటచెఱఁ - గంచుకయించుక జాఱవిడిచియా
సారెకునూడ హారములు - చన్నులపైఁ దగఁ జిందులాడ శృం
గారము తొంగలింప రహిఁ - గాంచనుఁ బిఱుందులు సంచలింపఁగన్. 21

శా. ఈరీతిం జరియించు వేళ మునియా - హేమాంగ హేమాంగలిం
పారం జెంగట సందడించుటను దా - నాలించి యిచ్చోటికే
వ్వారో వచ్చెదరంచు నెంచి తపమున్ - వర్జించి వీక్షించె శృం
గారోల్లాసలసచ్ఛుభాంగనవరే - ఖాసారలన్ వారలన్. 22

చ. అటుకని హేమరూపమున - కచ్చెరువొంది తదీయమోహసం
కటము మదింజనింపఁ బర - కాంతను జూడఁగఁ గొంకికన్నులన్
దటుకున మూయుమూసి ధృతి - తప్పిన సైఁపఁగలేకఁ జాలనా
గటుపడు నించుకించుక జరన్ముని రెప్పలు విచ్చి కన్గొనున్. 23

చ. శిరమునువాంచు నింకఁ గనఁ - జెల్లదటంచుఁ దలంచియంతలో
మఱలఁగనున్ దపోనియతి - మానితిఁగాయని సంస్మరించుఁ దా
హరిహరియంచు నామహిమ - యాఱడివోయె నటంచుఁ గొంకు దు
స్తరమిది బుద్ధినిల్వదని - తాలిమిఁ దూలి పిశాచిపాలగున్. 24

ఉ. అంగనమీఁదభావమిడి - యన్యవిచారము మాను సంతలో
వెంగలినైతి నేననుచు - వెండియు నిష్ఠవహించు బాలికా
ర్యంగతరంబుగాక చెలు - వందలపోసి నుతించుఁ దాఁదపో
భంగము సంఘటిల్లుఁ జెడు - వాంఛజనించె నటంచుఁ జింతిలున్. 25

ఆ. మనసు తపమునందు - మగువపైఁ బసజూడ్కి । తనరఁ ధృతి వహించుఁ - దత్తఱించు
నత్తతలనుచేతు - లంగడిలో బుద్ధి । యనుట తథ్యమయ్యె - నతని యెడల. 26

సీ. ఏమైననయ్యానే - నీకు నైఁపలేనని - కలహంసయానతోఁ - బలుకఁ దివురుఁ
బరులు సూచిన నగు - బాటగు ననియెంచి - నిక్కి పల్కరు నలు - దిక్కు లరయు
నెందుఁ జప్పుడు విన్న - నెవరొ వచ్చెద రంచుఁ - గడు నిష్ఠ నున్నట్లు - కనులు మూయుఁ
గ్రీడావశంబునఁ - గలనికి వచ్చినఁ - గామినీమణి నిట్లఁ - గంటఁ జూచు

గీ. తపముసాను వెంది యోజించు - తాపమొందుఁ । వనవనములయందుఁ గడుభ - క్తిని సహించు
దైన్యమున నెలనెలఁ బోవు - తాపసుండు । వలపునకు లోఁగుఁ బోయెంత - వాఁడుగాని. 27

వ. ఇట్లా జటిలుఁడు వియచ్చరకుటిలాలకపై దట్టపు విరాళిసహించి యటు పిచ్చుకుట. 28

సీ. ఊరుబింగరమున - నుపమానమై యొప్పు - మిసిమిఁ గల్గినయను - మీనుఁ జూచి
కలికి రాయంచల - గతిహీనమనిపించు - బెడఁగైన కులుకునె - న్నడలు జూచి
గుత్తంపు రైక కె - క్కుడుగా మిటారంచు - చెండ్లు నాఁ దగినవా - లిండ్లు జూచి
రాజిల్లు శృంగార - నవరూపమైనట్టి - మగువ యొయ్యారంబు - నగలుఁ జూచి

గీ. చెలువు మించిన వెనుపిరుం - దులనుఁ జూచి । వినరు బిత్తరిచూపుల - గొనబుఁ జూచి
పేరు మోవియుఁ దళుకుఁ జె - క్కులనుఁ జూచి । మోహపరవశుఁడయ్యె న - మ్మునివరుండు.

ఉ. అత్తఱి మన్మథుండు సమ - యంబని హా యని యార్చి తియ్యవి
ల్లెత్తి బిరాన బాహుబల - మేర్పడఁ దమ్మెదనారిఁ బోసి యా
యత్తనిశాత భీకరల - తాంతశరావళి నేసెఁ జాతురిన్
వెత్తలమంది మానికడుఁ - దాపము మించి చలించి కుందఁగన్ 30

గీ. భవభవ బాణకీలికీ - లావిశేష । ఘోరతరతాప జనిత వి - కారహృదయుఁ
డగుచు జటిలుండు నిజనిష్ఠ - నపుడు మఱచె । దైవసంఘటనము మునియైనఁ - దప్పఁగలఁడె ?

క. ఈరీతిఁ గడు విరాళిఁ । గూరి మునీంద్రుండు హేమ - గొనబుం గనియా
కారా ! యీనక్కడెసం । జేరి గమనీమణుల కైన - నిద్దరఁ గలదే ? 32

క. ఇదియప్సర గజనీచర । నదనయొ గంధర్వవనజ - పత్రాక్షియొ యా
మదనుని రాణియొ మానవ । సుదతియొ తలపోయ మిగుల - సుందరి కనఁగాన్. 33

క. ఈ నెలఁత సోయగము నా । మానసము హరించెనేమి - మాయయొ మానుల్
దినిఁ గని రేనియును । జ్ఞానంబఱి పోకయుండఁ - జాలుదురె ధృతిన్. 34

క. కమలభవుఁ బరిహసింపఁగఁ । గమలాధవుఁడేమొ సృష్టిఁ - గావించెను యీ
కమలారివదన, నింతుల । కమలాంగ విలాసమిట్లు - దైయుండవలెన్. 35

గీ. భామనెమ్మోము సోముని - గోముమించు । వాలుమీనులఁ గేరఁగాఁ - జాలు కనులు
నడుము పొక్కిలి రహిఁ కోక - నడములడుగు । లరఁటికంబము లూరువు - లలకలళులు. 36

క. కోదండంబులు దర్పకు । కోదండంబులు - సువర్ణ-కుంభములుచనుల్
సౌదామిని తనులతయిది । సౌదామిని యనెడివేల్పు - చానయదేమో. 37

క. దరకంధర కామినినుం । దరకంధర సదృశకచను - తన్వీబలా రే !
పరితోషము గలిగెనుయీ । పరితోషమువాణిసొగసు - పగలునుఁగన్నన్. 38

సీ. జలజాతములసౌరుఁ - జౌకఁగావించునీ - వనితపాణులుఁగన్ను-లునుగళంబుఁ
జక్రవిఖ్యాతిని - సమయింపఁజాలునీ - చెలువనాభియుఁబిలం - దులనుఁజనులు
తారావిలాసంబుఁ - గేరంగనేర్చునీ - చెలిదంతములునఖం - బులనురూపు
హరిగర్వభంగధ-ర్మాస్పదంబెంచనీ - వెలఁదిమధ్యముమోము - వేసలియును
గీ. ఇదిజగన్మోహిని యనంగ - నెసఁగునహహ । యుర్విలో నందమనిన ని-ట్లుండవలదె
దీనిఁగౌఁగిటఁజేర్పఁగా - లేనివాని । జన్మమును నొకజన్మమే - చర్చసేయ. 39

ఉ. బేలయువో లెనేఁ దపముఁ - జెద్దగ నెంచితిఁ గానలేక నా
పాలిటివేల్పు మత్కలుష - భావము మాన్పఁగ నెంచి నేటికి
బాలకురంగనేత్రఁబరు - వంపుమిటారినిఁ దెచ్చెనిందుమ
చ్ఛీలము నిష్ఫలంబనుటఁ - జిత్తము నందలఁపించెనిత్తఱిన్. 40

క. కోరికఁ దీరఁగానా । రీరత్నము నెటులఁబల్క-రింతునొ నేనే
కారణమున భాషింతునొ । యారాటము మానఁదగిన - యనువెట్టిదియో. 41

క. మున్నెపుడునుఁ గనియుండని । పన్నగవేణినివితా నె-పములేకయరయే
తెన్నునఁజేరుదుఁ జేరిన । నన్నెవ్విధిఁదలఁచునో మ-నంబుననంతన్. 42

క. అనుమానమేలనేమై । ననుదీగదుపల్కరించి - నంగానిభయం
బునులజ్జయుఁగాముకునకు । మొనయునె సౌఖ్యంబుధైర్య - మునవాటిల్లున్. 43

సీ. మునుముట్టమున్నచే - సినసాతపఃఫలం-బుతొలంగిపోయినఁ - బోవనిమ్ము
తపసికికార్యంబు - తగవుగాదనిజనుల్ - తెగువమైఁదిట్టినఁ - దిట్టనిమ్ము
హీనమైనాశీల - మిందుచేనశియించి - ధర్మంబుఁదప్పినఁ - దప్పనిమ్ము
మానివర్యులుబుద్ధి - లేనివాఁడితఁడెన్నఁ-జెడుగంచుఁజెప్పినఁ-జెప్పనిమ్ము
గీ. దీనికతమున నేపాప-మైనగాని । సూటిగాఁ జొడసూపిన - జూపనిమ్ము
సంకటము లెన్నియొదవిన -సరకుసేయఁ।గొమ్మనెట్లైన లోఁగొందుఁ-గూడియుండు. 44

క. అనినిశ్చయించి యపుడ । మ్మని జంకునుమానిలేచి - ముదమున నయ్యం
గన తిరుగుచున్నచోటికిఁ । జనితమినిట్లనియెనిర్వి - చారునిభంగిన్. 45

క. తరుణీలలామ నీవె । వ్వరిదానవు? వెఱపులేక - వనితలతోనిం
దరుదెంచిన కారణమును । బరిణామము నూరుఁబేరుఁ - బలుకుము తెలియన్. 46

క. ఇదిఘోరారణ్యంబను । నదిదెలియవో? మమ్మువంటి - యభిమానంబుల్
విడలిన వారికి నెలవిది । సుదతీ! మీవంటివారు - చొరఁగోరుదురే? 47

వ. అనియడిగిన మునివల్లభునినప్పల్లవాధర, క్రేఁగంటం జూచి మెల్లనిరవంబుదనరనిట్లనియె. 48

క. అమరాంగనలమువాచం । యమివర! మేమీవనంబు - నందిపుడు విహా
రముఁజేయవచ్చితిమి నా । మము హేమయటందురనుచు - మారుఁబలికినన్. 49

చ. వినిముని మేలు మేలు మును - విందుననేకులు నిన్ను మెచ్చఁగాఁ
గనుఁగొనిమాటలాడుటకుఁ - గాంక్షమనంబునఁ బెక్కునాళ్లుగాఁ
గొనఁగొనియుండుఁగాని కడు - భీతిలుచుండుదు నిష్ఠభంగమౌ
నని తఱినేఁడు నేను మీఁద - నంతనె దైవికమిట్టిదేఁ జుమీ ! 50

క. తలఁపని తలఁపుగ జనులకుఁ । గలిమియు లేమిడి యుసుఖముఁ-గష్టంబును సం
ధిలు వానిరాకపోకలు । తెలియంగాలేరు మదవ - తీనిజముగదా! 51

క. నీకుసరివారలిఁక మూ । ల్లోకంబులఁ గలుగరని ప-లుకవిని నిజమే
నోకాదోయని యెంచితి । మాకుంగల సంశయంబు - మానెన్ గనఁగాన్. 52

క. వేసరకఁ బెక్కునాళ్లుగఁ । జేసిననాయోగఫలము - సిద్ధించెను నే
నీసల్లాపోల్లాసమ । హాసౌఖ్యము నొందఁగంటి - హరినీలకచా! 53

ఆ. అనినమారువలుక - కాననంబునఁ జిలు । నగవు మొలకలెత్త - నానగురుఁ
గాలిబొటనవ్రేలు - నేలవ్రాయుచుఁ దల । వాంచి నిలిచియున్నఁ - వనితఁ జూచి. 54

ఆ. తపసిమదినిఁ జాల - తమిమించి శంకవ । ర్జించి కోర్కెదెలుప - నెంచియపుడు
మంచిమాటలాడి - మగువమిన్నకయున్నఁ । జంచలాత్ముఁడగుచు - సరసకరిగి. 55

గీ. కాంత! యొకమాటఁ జెప్పెదఁ-గాని తప్పు । గాగణింపకు మదిని - నిక్కంబు వినుము:
సముఖమునరాయభారంబు-జరుపనేల । నెటులనెంతువో నిన్ను మో - హించినాఁడ. 56

క. నిసుఁగనిన మొదలు నేమది । నెనలేని విరాళిఁ జెంది - హెచ్చగుతాపం
బుననలయుచున్నవాఁడన్ । గనికరమునఁ గోర్కెఁ దీర్పఁ-గాఁ బ్రార్థింతున్. 57

క. అనినమునివలపుపలుకులు । వినియొల్లనిభంగి వెగటు - వెఱచూపులఁ గ
న్గొనిచాలమంచిమాటయ । వినిపించితిరింకఁ జాలు - వేడబమనుచున్. 58

వ. అచ్చోటువాసి పోవునదియుంబోలె నటుమొగంబై చనగమకించినం గనితత్తఱంబునజటి
లుండప్పుడు. 59

క. మనసిజుఁడు వేగిరింపఁగఁ । బొనరినతమికతనమేనఁ - బులకాంకురముల్
మొనయఁగఁ గామినిపైచెఱఁ । గునునురవడిఁ బట్టఁబట్టు-కొనుటయుఁ గినుకన్. 60

ఉ. జోగ! యిదేమి పెద్దరిక - మవ్వలికాంతలనైనఁ జూడకా
చారముఁదప్పి మీరిటుల - సల్పుట యోగ్యమె? మంచిదాయెమా
వారదె చేరవచ్చెదరు - వారికి గాంచినఁ దప్పుగల్గు మీ
దారినిఁ బొండుచీ విడి - తాళుఁడ తామ మయ్యొవో యెడన్. 61

ఉ. న్యాయము నెంచకొంటరిఁబ - రాంగనని వ్విధి మిమ్ము నంటి ప్ర
జ్ఞాయుతులిచ్చలేని పతి - సాహస మొప్పఁగఁబట్టు టెంతయున్
హేయము; పెద్దలౌట మిము - నేమియుఁ బల్కఁగరాదు మంచిపే
లాయెనుగాని, పయ్యెదను - యంబునఁ బట్టెదరేలఁ గల్వఁడా! 62

క. అని హేమపాని బట్టిస । తన పైఁటచెఱంగుఁ దిగిచి - తాళుఁడు పిడుం
డనియతని యురమునందిన । చనుఁగవఁ దాఁకంగఁ దనఁగెఁ - జాతుర్యమునన్. 63

గీ. అదిగనుంగొని యాగజ - యాన చెలులు । చిక్కెఁ జిక్కెను ముని హేమ - చేతనింక
నాయెఁబో వచ్చినట్టికా - ర్యంబటంచు । నంతటంతట దవ్వగా - సరిగి రపుడు. 64

ఉ. హేమమునీంద్రుఁ జూచి నను- నేటికి చిక్కులు వెట్టగా బుధుల్
గామములం ద్యజించిన సు-ఖంబు సుఖంబిల్లను గాని యివ్విధిన్
నేమము వీడి దోషముఁ గ-ణింపక నిబ్బరమైన బాళిచే
భామలఁ గూడ నెంచుట శు-భంబగునే యన, నాతఁ డిట్లనున్. 65

క. ఏరీతినైన నయ్యెడుఁ । గోరిక జనియించె నిన్ను - గూడక యున్నం
దీరునె యారక విడిచిన । మారుఁడక నావిరాళి - మాన్పుము వేగన్. 66

మ. తపముం బోకడఁ బెట్టి నిష్ఠ చెడిచి - త్తస్వస్థతన్ మానియే
జపమున్ దోఁచక నీపయిన్ వలపులో - సంధిల్లి యున్నట్టి న
న్నిపుడేలాగున వీడిపొమ్మనెదు? నో-రెట్లాడెనో నీకు నీ
కృపకుం బాత్రుఁడ నేను సుంతపనికిం - గింకేల బింబాధరా. 67

గీ. వినుము కైవసమైతివి - విడువనిన్ను । విడిచియలయంగ నేనవి - వేకిఁగాను
చేతఁగలపండుఁ బడవైచి-చెట్టునెక్కి । ప్రాఁకులాడెడి జడుఁడున్నె-లోకమునను. 68

గీ. అనినఁ దనకిచ్చగల్గకున్నట్లు హేమ । యభినయించుచుఁ దలయూఁచి - యతనికనియె
నౌర! మీరెన్ని నేర్చితి-రయ్య యింకఁ । బుధవిగర్హ్యంబనఁగ నెద్ది? - పెద్దలెవరు? 69

క. సకలము నెఱిఁగిన మీరిం । తకుఁ దెగువయొనర్పరాదు - తగదీమతమూ
రకఁ బెనఁగుచున్నఁగనివే । లోకభంగిఁ దలంచుకొండు - లోరులేనొల్లన్. 70

ఉ. త్యాగము కీర్తిమూల మనృ-తంబుఁ దలంపఁగ దోషమూలమా
యోగము ముక్తిమూలము సు-యుక్తులు హానికి మూలము మనో

రోగము సౌఖ్యమూలము వి-రోగము సంకటమూలమంగ నా
రాగము దుఃఖమూలమును-గట్టును జెందఁగమూలమున్ డిలన్. 71

చ. ఫలములఁ గందమూలములఁ - బత్రజలాదుల నాహరించిని
శ్చలమతి నెండవానలకుఁ - జల్వకు నోర్చి తపంబుఁ జేయఁగాఁ
గలిగిన పుణ్యమల్పమగు - కామ్యము చేఁ జెడిపోవ నెంతురే?
వలవదు; తెడ్డు నాకి యుప - వాసముఁ గోల్పడినట్లగుం జుమీ' 72

క. మీకుం దెలియని ధర్మము । లోకంబునఁ గలదె? మిగుల - లోపము విడువం
డీకోరిక కోకారిస । నాకారులు మీరు మున్ను - యత్నము తగునే? 73

సీ. తనతపోధర్మంబుఁ - దప్పెనీ మునియని - పసుగురిలో నగు - బాటుగాఁగ
జపహోమసద్వ్రతా - సక్తినివర్జించి - తలఁపున బరచింత - దవ్వుగాఁగ
మునుగడించిన పుణ్య - మును మహత్త్వంబును - తలఁగి పాపంబులు - దాపుగాఁగ
సమయఁ జేసిన యరి - షడ్వర్గ మొయ్యనఁ - దలసూపుటకుఁ దగు - దారిగాఁగ

గీ. కామినీసంగ మాపేక్షఁ - గడువహించి । శీలమును వీటఁ బుచ్చి హెచ్చినవిరాళి
నెన్నఁ డేలుఁగని ననుబల్మి - నెనయఁ గోరు । టుచితమగునే వచింపుఁడా - యో మహాత్మ! 74

వ. అనిపలికి యాచిలుకలకొలికి చయ్యన పయ్యెద కొందనకరంబులఁ బెనఁచి యటునిటులాగు లాడి వేగంబుగాఁ దప్పించుకొని పోవునదియుం బోలెనటించినం జటిలుండు దిటవు సెడి పట్టు వీడక, గట్టిదానవు లెమ్మ నిన్నెట్టకేనియుం బట్టి రమింపక నేనిట్టి తటివిడతునే? యని మట్టుమీరి చట్టనఁ గౌఁగిటం బొదువ సమకట్టినఁ జిక్కక నక్కసం బైటఁ జక్కనొత్తుకొనుచుఁ దత్తఱంబు గదిరిన లాగునఁ గలఁగి యించుక తొలఁగి నిలిచి నగుమొగంబు చమరించి తిలకంబు కరఁగి జాఱు దీర్ఘోచ్ఛ్వాసపరంపరలు వెడలుచుండ నతనికిట్లనియె. 75

క. తగదీపని యని నేనెం । తగఁ జెప్పిన వినరు మొప్పె - తనమిది, నిడుఁడా
జగమున మీవలె యేముని । యగడన కిట్లలఁచుఁ బట్టి యతివలను; బళీ! 76

వ. అనిపలికిన చిఱునగవు మొగంబున మొలకలెత్త నత్తపసి యిట్లనియె. 77

గీ. ఎంత బ్రతిమాలుకొనిన నీ - వేల వినవు? । గమ్మనా చెంత కేఁక ముష్క - రంబు వలదు
కటకటా! నీకు మదియెంత - కఠిన మొక్కొ । కరఁగ దాయెను రాయైనఁ గరఁగుఁ గాని. 78

ఉ. సమ్మతి నిమ్ము కౌఁగిలి ని - జమ్ముగఁ బల్కెదనొక్క మాట, చి
త్తమ్మున నన్ను నన్యుని వి-ధమ్మున నెంచక నేలుకొన్న నేఁ
బిమ్మట మత్తపఃఫలముఁ-బిమ్మట నొందకొసంగి నిన్ను లో
కమ్మున సాటిఁగల్గని సు-ఖమ్మున నుండెడిలాగుఁ జేయుదున్. 79

గీ. అనుచు వెనుబాళిచేఁగుందు - టరసి, మఱచి । తైనమీరిపుడనుటేమి - యనియె హేమ
మరలఁబలుకంగ వలెనెయా-మాటనీకు । మునుపు నేఁదెలిపితిగద; - యని యెనతఁడు. 80

క. వగలాఁడి మానినుఁడివిని । మెఁగమించుకవాంఛయిట్టి - మునివరులిఁక నీ
జగమునఁ గలుగరుబో యిది । యగడుపడందగిన కార్య-మదియట్లుండెన్. 81

క. నాచెలులు దుర్మతులువా । రీచరత మెఱింగిపోయి - యెవ్వరితోఁదా
మేచందముగాఁ జెప్పఁగ । యోచింతురొ పిదపనేమి - యొదవునొ యిడుమల్. 82

క. వలదన్న వినరు మీరి । ట్లలయింతురటంచుఁ దోఁప - దయ్యోనుమున్నీ
స్థలమునకుం జనుదెంతునె । తెలిసిన; నేమోసపోయి - తింబాగాయెన్. 83

క. మీరు తపోధనులగుటన్ । మారాడఁగరాదు మీకు - మంచిదిగానీ,
నేగముగానీ, మీమది । నారసి వర్తింపకొప్పు - వనఁగానశవే ? 84

గీ. ఇంకమీఁదట మీయిష్ట - మెవ్విధమునఁ । జెప్పినను వినవలయు, మీ - చేతఁజిక్కి
మఱలఁదప్పించుకొని పోవఁ-దగమెయనఘ ! । యబలనగుదును గదయని-యల్లసగియె. 85

క. ముసిముసినవ్వ లెసఁగముని । బిసరుహాలోచననుఁ దిగిచి - బిగికౌఁగిటికిం
గసిమసిఁ దారిచివేస్కెన్ । వెసఁజెక్కులు ముద్దులాడి - నిబ్బరపుఁదమిన్. 86

ఆ. లలన ! నాతపఃఫలంబవు నీవింక । మాటిమాటి కడ్డు-మాటలాడ
వలదురమ్మటంచుఁ - గెలఁకులఁదిలకించి । ముదితనొకని కుంజ-మునకుఁదార్చె. 87

గీ. ఇంపు రెట్టింప నాపాద - రింటిలోన । నాలితెమ్మెరసోఁకు న-రాలినట్టి
దట్టమైయున్న పుప్పాడి - పట్టుతమకు । శయ్యఁగాఁజేరి మిగులనా - సక్తిమీఱ. 88

ఉ. వ్రాలనికూర్మిగాఢ పరి - రంభ మొనర్చి పెనంగుచుంగనా
స్ఫాలనలీలలన్మెలఁగి - పల్మొనకాటులొనర్చి మైమయిం
మూలకఁదార్చిచుంబనవి - ధుల్వచరించి నఖక్షతక్రియల్
జాలఁగఁజేసి నీవివిడ - జార్చిరమించె మునీంద్రుఁడంగనన్. 89

క. చనుపోటులు జడవ్రేటులుఁ । గనుగీఁటులు పంటిమొనల - కాటులుఁబుష్ప
స్తుతినిపాట లలుకమాటలు । మునికూటమి వేళఁదనర - ముద్దియ మెలఁగెన్. 90

చ. పొలయలుకల్ రతిశ్రమల - పూర్వపుచేష్టలుమై జెమర్పులున్
వలపులునూర్పులున్ వగలు - వాదులుమెచ్చులు గెల్పులోటముల్
కలయికనేర్పు ముద్దులును - కంటియదల్పులు వింతపావురా
పలుకులునొప్పఁగా మునికి - భామినిపొందె నయించెమోదమున్. 91

గీ. పలుతపంబు లొనర్చియుఁ-బడయరాని । యమరలోకసుఖంబు సం-యమికిఁబొసఁగెఁ
దలఁపనితలంపుగా ముహూ-ర్తంబులోనఁ । బ్రాప్తియుండినఁ గలుగునే-పదవిగాని. 92

వ. ఇవ్విధంబున నప్సరసాంగనాసంగమానందభరితహృదయారవిందుండై కృతార్థుండునుం బోలె తృప్తివహించియున్న యమ్మునిపుంగవునింగాంచి యతనితపంబు భంగంబగుట కంతరంగంబుననుప్పొంగి తద్విధంబెఱుంగనీయక యా కురంగేక్షణతొలంగిపోవఁదలంచి మధురవచనంబుల నతని కిట్లనియె. 93

క. మునివర నెచ్చెలులనువిడి । చనుదెంచితి నిటకుఁదామ - సంబయ్యెను వా
రినిఁజేర నఱుగవలెనిఁక । ననుపుఁడ సెలవొసఁగి కరుణ - నల్లననన్నున్. 94

క. ననుఁగానక వారీ కా । ననమున వెదకుదురువచ్చి - నన్నునుమిమ్మున్
గనిరేని మనయుదంతం । బును దప్పక నెఱుఁగుదురు ని-పుణలగుకతనన్. 95

క. ఒకటిపదిఁజేసి సరివా । రికిఁజెప్పుదురేఁగి యాగ - రితలందఱుఁదా
మొకవైపు హేళనగావ । జ్రికిఁదగనీకథను దెలియఁ-జేయుదురుతుదన్. 96

క. కావునఁ దడయక వేగమ । పోవలయును చెలులఁజేరఁ - బోవలెనట్టుపై
దేవేంద్రుని కొలువునకున్ । బావనుతచరితనన్నుఁ - బనుపుఁడు వేగన్. 97

చ. తెలియనివారుగారు గద; - దేవసభం గొలువుండువార మీ
స్థలమున నివ్విధిందడవు - సల్పిననోర్వఁడు జంభభేదియా
నలనెటువోయి యెట్లగునొ - వచ్చెద నింకొకమాఱు నేఁడు వే
సెలవునొసంగుఁ డేగెదను - చిత్తమునందున భీతిదోఁచెడిన్. 98

ఉ. ఇంతకుమున్నె దేవసభ - కేగి తిలోత్తమరంభయాదియౌ
కాంతలుపాకవైరి సము - ఖంబున నాట్యముఁజేయుచుందుర
య్యింతుల హేమరానికత - మెయ్యదితా నిపుడు డెందుబోయెనం
చెంతయుఁగోపమొంది యమ - రేంద్రుఁడు నిక్కముఁదెల్పుఁడన్నచోన్. 99

ఆ. వాగలదనటంచు - నేరములనుమోపి । యతనితోడనాచ - రితముఁజెప్పి
మఱియుఁగోపగించు - మాడ్కిఁగావింపుదు । రందువలనఁజాల - హానిగలుగు. 100

క. నాకమున కేగినంతట । మీకడకున్ రానటంచు - మిడుకకుఁడా యా
లోకించుచుందు నపుడపు । డీకానకువచ్చి, మిమ్ము - నిఁకనేవిడువన్. 101

క. మిముఁబాసి యరుగుటకుఁజి । త్తమురా దట్లైనఁ బోక - తప్పదునాకున్
దమిఁదిర్చితిగద మదశాం । తముఁ బూనిచియనుపుడిఁపుడు-- తడవేమిటికిన్. 102

క. అనవుఁడు జటిలుఁడు హేమన్ । దనకౌఁగిట బిగియఁబట్టి - తహతహమీఱన్
గనుఁగవ నశ్రువులొలుకఁగ । ననరునుభయ వెఁదనుగదుర - నపుడిట్లనియెన్. 103

శా. ఏమేమీ ? కడువింతమాటలివి న-న్నీఘోరకాంతారమం
దీమోహాంబుధిలోన ముంచికృపలే - కేఁగేగదన్ వేగను

త్రాముగఁ గొల్వఁగనంచుఁ బల్కెదవునీ - తాత్పర్యమిట్లున్న నే
నేమాటాడిన నేమి మేలు? సతులెం-తేనింగఠోరాత్మికల్. 104

క. ఇంకొక్క నాఁడువచ్చెద । శంకింపకుఁ డంటివెంత - శాంతమెనీకున్
గొంకక వైద్యుఁడు రోగిని । లంకణముల నుండుమనిన - లాగిదె తలఁపన్. 105

క. ఎక్కడి నాకపురంబది । యెక్కడి శతమఖునికొలువు - హితబుద్ధిని నీ
వెక్కడి కేగుటవచ్చుట । నిక్కమె? మతిహీనుఁడైన - నిజమనుకొనునే? 106

ఉ. మేలగులెమ్మ చాలునిఁక; - మించిన సౌఖ్యమహాంబురాశిలోఁ
దేలఁగనీక నామమత - తీఱియుఁ దీక్షకమున్నె తాపసం
కీలితుఁ జేసిపోవఁ బరి - కించెడ వేమనవచ్చు నిన్ను నీ
శీలమెఱుంగ వచ్చెనిటు - సేయుదురే పగవారలేనియున్. 107

మ. వ్రతనిష్ఠల్సెడె భగ్నమయ్యెఁ దపమీ - వ్యాసంగమూలంబునన్
మతిదార్ఢ్యంబు తొలంగెఁగొంకెసఁగె నా-మ్నాయార్థచింతానుసం
గతభావంబును వీడితిన్ మునుల సాం-గత్యంబు వర్జించితిన్
మతినర్పించి సుఖింపనెంచితిని ధ-ర్మంబౌనెయిట్లాడఁగన్. 108

చ. క్షణమెడఁబాసియున్న మది - చాపలమొందక నిల్వనేర్చునే?
యణువటు కౌఁగిలిన్విడిచి - నంతనె మారుఁడు భేరిఁదాఘణం
ఘణమొరయింపఁడే? యపుడు - తాలిమి గల్గునె? తప్పకిట్టిల
క్షణము లనేకముల్పొసఁగు - సైఁపదు బుద్ధినితంబినీమణీ! 109

ఆ. అతివ! నిన్నువనుప - మతియొప్పదనిముని । చేయిఁజేఁ దెమల్చి - చెఱఁగుఁబట్టె
నింతమీకధైర్య - మేల? పౌరుషవృత్తి । కిదియలోప, మనుచు - ముదితపలికె. 110

చ. పలికిన, నేమియైన నినుఁ - బాయఁగఁజాలను జుమ్మటన్నఁజం
చలుఁడితఁడంచులోన నగి - సంయమినాథ! యభిజ్ఞులైనమీ
గలెధృతివీడి నానుడిని - రాకృతిఁజేసిన నెట్లుసాగుఁగా
వలసిన కార్యమింతతలఁ - పన్వలదే మది హానివృద్ధులన్. 111

చ. అలుగక సావధానముగ - నాత్మఁదలంపుఁడు నేస్వకేచ్ఛనై
మెలఁగిడిదాననేయిచట - మిమ్మనయంబునుఁగూడియుంటకున్
వలనగునే? హరిన్ గొలుచు - వారము వేళకుఁబోవఁగావలెన్
గొలువున నాపనుల్ గడపి - గొబ్బునవచ్చెద నిందురానిచోన్. 112

క. ఈవేళనె కాకున్నను । నేవంబే దేనిఁబలికి - నేరేపోమా
పోవచ్చెద నిక్కముగాఁ । గావలసిన పనులకేగి - గదరావలయున్. 113

క. మునివర! సమయమునీకో । య్యానఁదవునె? యెట్లువత్తు - వనియెదరేమో
విభుఁడా! నెపములులేవా? । సనుదెంచెద నిటకుఁబుష్ప - సంగ్రహమునకున్. 114

మ. తఱిలేదామఱి శక్రుఁడెత్తి చనిదై - త్యశ్రేణితోఁబోరు న
త్తఱిఁగానీ, తనయజ్ఞభాగములఁ జెం-దంబోయియున్నట్టియా
త్తఱిఁగానీ, శచిమీఁది మోహవశతన్ - దాఁగొల్వుసాలించున
త్తఱిఁగానీ, చనుదెంచిమీమదని మో-దంబొప్పవర్తించెదన్. 115

క. లలనకుఁ బురుషునకున్ మది । గలిసినపై నెటులసేయఁ - గారాదు? మహా
జలధులనుదాఁటఁ జెల్లదె । కలముఁగరువలియుఁనొక్క - గతిసమరినచోన్. 116

క. సద్దువిడుఁడరిగివచ్చెదఁ । బ్రొద్దయ్యెను చాలమిమ్ముఁ - బొందెదమాలన్
నిద్దపుఁజెక్కుల నింతొక । ముద్దుంగొని యనుపుఁడిపుడు - మునికులచంద్రా! 117

వ. అని యతనిందనకౌఁగిటం జేర్చి మేటివగలమురిపెంపుమాటలఁగుస్తరించి సంతాపంబువీడి మంతనంబునశాంతముఁబాదుకొల్పి సైరించియుండుఁడుపోయి శీఘ్రంబుగామఱలివచ్చెద నని ప్రయాణంబై, వలదని జటిలుండెంతచెప్పినను వినఁనొల్లక పెడచెవినిడిపోకున్నంగాదని వాదంచిపట్టువీడకున్న యావన్నెలాఁడిపన్నుగడనెన్ని సందియంబునొందినిజయోగవిద్యా మహత్త్వంబునయుఁదంతబంతయు నెఱింగి తదీయకపటప్రవర్తనంబునకు మనంబునఘనం బగుకోపంబు దీపింపమాయలాఁడియగు హేమంజూచి కనులెఱ్ఱఁజేసికటంబులదర బొమలుముడివడ పండ్లుపటపటంగొఱుకుచు కనికరంబువిడిచి కరంబుభీకరంబుగా నిట్లనియె.

ఉ. ఇంగములేక నిన్నిచటి - కింద్రుఁడునంచినవచ్చి నాతపో
భంగముఁజేసి మోదమునఁ - బాసి చనందలకొంటివౌటనీ
చెంగటనుండుదుర్గగుడి - చేరువమానిసి వంటిపఱాయివై
యంగన! యుండుపొమ్మనుచు - నమ్మునిఘోరముగా శపించినన్. 119

గీ. నోటతడియాఱి పలుకఁగా - మాటరాక । యొడలుజల్లనఁ బదములు - వడఁకుచుండ
శోకమునఁ జాలఁగనుల న-శ్రువులురాలఁ । జేయునదిలేక వెలవెలఁ-బోయి హేమ. 120

చ. కరముభయంబునొంది ముని - కాంతుని పాదయుగంబుఁబట్టి నే
సురపతిపంపఁగా నిచటఁ - జొచ్చితి నన్నుశపించినార లె
వ్వరుమఱి దీనిఁదీర్పఁగల - వారలు మీరలుదక్క; నాకు సా
దరమున శాపమోక్షణ వి-ధానము వేగననుగ్రహింపుఁడా! 121

క. ఒడయఁడు సెప్పినపనులం । దడయక కావించుచుండు - తరుణినినన్నున్
జెడఁదిట్టిన మాదృశులే । వడువున మెలఁగుదురు సెపుఁడ - వరగుణసాంద్రా! 122

క. మీరునిరంకుశులసములు । గౌరవముం గలుగు వారు - గడుసుజ్ఞానుల్
నేరకచేసిన నేరము । నోరువఁగారాదె ? శాప - మొసఁగవలయునే ? 123

ఆ. ఎన్నితప్పులున్న - నిఁకవానినెన్నక । కరుణఁజూచి శాప - కాలమెంత
దనుకనో తొలంగు - తఱియెపుడో యది । వినికిసేయుఁడనుచు - వేఁడుకొనిన. 124

మ. కరుణన్ భాని సచించెదానిఁ గనియో - కాంతామణీ ! యెన్న దు
స్తరమీశాపమమోఘమౌఁ; బటుశిలా - త్వంబొందెయుంబల్కఁగాఁ
దరమైయుండును నీకు; నీవుగుడిలో - ద్వాత్రింశదబ్దంబులె
వ్వరితో నెద్దియు మాటలాడకటుపై - వర్జింతువారూపమున్. 125

వ. తత్ప్రకారంబు విశదంబుగా నెఱింగించెద నాకర్ణింపుము. నాచేత నాదేశింపఁ బడిన క్లుప్తకాలంబుగడచుసమయంబున నొకసిద్ధుని మాయోపాయంబునఁజిక్కి వశీ యావన వతియు, నవివాహితయునగు రాజపుత్త్రియొకర్తు నీయున్న దుర్గాలయంబునకురాఁగ లదు. తత్సమయంబున నయ్యంబుజాక్షికి నీయుదంతంబు సాంతంబుగాఁ దెలియఁబలికి జీవ హానిఁ జెందనుండు నావేదండయానకీడు తొలంగుభంగి సమయోచితసదుపాయంబు యోజించికఱపి రక్షించితివేని యాక్షణంబున నీకుశాప విమోచనంబగునుపొమ్మని యమ్ముని నిజేచ్ఛంజనియె. నంత హేమతామసింపక సఖీజనంబులఁజేరఁజేరి నడచినవృత్తాంతం బంతయుఁ దేటపఱిచి మీరలరిగి సురవరునకు మదీయవిపద్దశ నెఱింగింపుఁడని వారలది వంబునకనిచి తనయున్న వోటికిఁ జేరువనైతోఁచుచున్న కాళికాలయమునకువచ్చి యచ్చటనిలిచి తన మనంబున. 126

మ. అకటా ! నేనిపుడేమిసేయుదు నుజం - ఘారాతితో, వానినా
యకులన్ నమ్మఁగరాదు వారిమదినా - యాసంబుగల్పించువా
రికిఁదామెంతయుఁ జెట్టఁజేసికడునా - ర్తింజెందఁగాఁజేతురూ
రకబోరీపని కేగఁ జాలననే? - ప్రార్థింపనే? మ్రొక్కనే ? 127

గీ. నేర్పుఁగలవారిఁ బంపుఁడు - నేరనట్టి । దాననగునన్నుఁ బనుచుట - తగదటంచు
నెంతజెప్పిన వినెనెతా - నిపుడు కరుణ । నెవరునాకష్టమును దీర్తు - రిచటనరయ. 128

గీ. అరుగలేనన్న శపియించు - నమరభర్త । యనిభయంపడివచ్చితి - నట్టియోగ
మిచటసిద్ధించె నేమందు - నీశ్వరాజ్ఞ । నెవరుదప్పింపఁగలరు మహీస్థలమున. 129

గీ. చెలుపుగలుగు టెఱిఁగి - చెప్పనవినకన । న్ననుపఁదగునె శక్రుఁ - డతనికేమి ?
నెమ్మికంటిలోన - నీరుగారినవేఁట । కానిమదిని జాలి - గలుగుటున్నె ? 130

వ. పరాధీనలగువారికి సౌఖ్యంబుగలుగునె? యని యనేకవిధంబులందలపోయుచు శాపా పాదనసమయంబు నిరీక్షించుచుండు సమయంబున. 131

గీ. తపసివాక్శుద్ధి యెట్టిదో - తపముబలిమి । యెట్టిదోకాని యచటను - న్నట్టులుండి
యప్పుడుమనుజాకృతిని శిల - యైలతాంగి । నిలిచెనొకయోగఁ గాళికా - నిలయమునను.

వ. ఇదిహేమచరిత్రంబు నీకుసాంతంబుగా వివరించితిననిపలికి యొక్కింతసేపు మానంబున నుండి యటుపిమ్మట మరల నిట్లనియె. 133

క. కాంతాలలామ! వినఁగా । వింతకదా చాలహేమ - వృత్తాంతము, నీ
వింతకు మున్నిటువంటియు । దంతము నెందైనవినిన - దానవె? చెప్పుమా! 134

క. తలవ్రాఁతఁ గడచి మేలఁగం । గల వారెందైనఁగలరె? - కాంతరో! యాఖం
డలుని పని కరుగుదెంచిన । మెలఁతుకదుర్దశకు సమము - మేదినిఁగలదే? 135

క. సురలైనను నరులైనను । కరమరుదుగఁ జేసినట్టి - కర్మఫలమొగిన్
బొరసిన తఱిఁజింతించిన । తెరలున్నె? యదియనుభవించి-తీఱఁగవలయున్. 136

క. కావుననె యటులకష్టప । శావశగావలసె హేమ - శాపాప్తినిను
మ్మావెలఁది యెట్టిదోయని । నీవ్రుదలంచెదవ దేమొ - నేనే హేమన్. 137

గీ. ఇదియె యాకాళికాలయం - బిటకుజటిలు । నాశ్రమంబు సమీపంబు - నందుగలదు
కాననముగాన నిందున్నఁ - గానరాదు । విజనమాతోఁచు శైలంబు - మంజువాణి!

క. బలభేది పనుచుటయు ని । శ్చలుఁడగు మునివరునిఁజాలఁ - జాతుర్యముతో
వలపించుట, శాపముచే । శిలనగుటయు నీకుఁదెలియఁ - జెప్పితినిగదా! 139

క. అప్పటినుండియు నియమముఁ । దప్పకఁగడపితిని మాని - తాఁజెప్పినయా
ముప్పది రెండబ్దములును । నిప్పుడు నిన్నిచటఁగంటి - నిది మేలయ్యెన్. 140

వ. నీవలన నాకుశాపవిమోచనంబుగలుగవలయుంగావున నిన్నురక్షించుట నాకు ముఖ్య కార్యంబు నీకింకకర్తవ్యంబెఱిఁగించెద వినుమందువలన మనకిరువురకును మేలువాటిల్లు నని సభయాశ్చర్యంబులు మనంబునఁబెనంగ శిలాప్రతిమకు నమస్కరించి యశోవతి యిట్లనియె. 141

చ. పొలఁతిరో! యిట్టిచిత్రమున - పూర్వమునైన చరిత్రవిన్నని
శ్చలమతులేనియున్ మదిని - జాలివహింపుదురమ్మ! యిట్లుబా
ములుతలనూపినప్పుడు న - బుద్ధియుతుల్మిముబోంట్లుతామెదన్
గలఁగకసైఁచియుండుదురు - కాలమువేచిశుభంబగున్ తుదిన్. 142

చ. పరిమితిలేనియట్టి పెను - బాళినిఁజెంది సహింపలేకయే
పరుసునన్నైన నావెతను - బాపఁగనేర్చునటంచునమ్మి నే
తెరలియనర్థుఁగూడిచను - దెంచితి వేల్పునుఁగొల్వఁబోవ యా
ద్దిర! గుడిమీఁదఁగూలె, నను - తీరుననేర్పడె మోసపోయితిన్. 143

క. కడచిన పనినిపుమారకఁ । దడవినఫల మేమి గలదు ? - తడయక నీకీ
చెడురూపు తొలఁగులాగును । నుడివినదిం గావుమింక - నూరేమిటికిన్. 144

క. పలుమాయలు నేర్చిన యా । ఖలుఁడగు సిద్ధుండువచ్చు - కాలంబయ్యెన్
దెలుపుమిపు డేమి సేయఁగ । వలయునొ, కావింతునీవు - పలికిన భంగిన్. 145

క. తరువులు తమఫలజాలము । నొరులకుఁ దా మొసఁగులాగు - నూహింపుము మో
తరుణీ ! పరోపకారము । కరము విశేషంబటంద్రు - గదలోకమునన్. 146

క. తెలియని మోసపుమాటల । నలరంగాఁబలికి నిర్ద - యంజంపుటకున్
దలఁచినను నిటకుసిద్ధుఁడు । మెలపునఁగొని చచ్చుటయును - మేలయ్యెఁ జుమీ! 147

క. నావలన నీదుశాపము । నీవలనన్నేఁటినాదు - నెవ్వియుఁదీఱం
గావలసి యున్న కతమున । దైవముసంధింపఁజేసెఁ - దరుణీ మనలన్. 148

గీ. అనిన నౌనౌనునిజము నీ - వనినమాట । వినుముసేయంగ వలసిన - విధమునింక
సిద్ధుఁడరుదెంచి శక్తిన - ర్పించినిన్ను । మ్రొక్కుమీ దేవి కనిపల్కు - ముందునిలిపి.

క. మ్రొక్కితివా నినువెంటనె । యక్కపటన్నట్టివాఁడి - యగుఖడ్గముచేఁ
జక్కడఁచు నాతఁడంతట । నిక్కముగాఁ జెడుదుమమ్మ - నేఁడిరువురమున్. 150

చ. వెరవెఱిఁగించితిన్ భయము - వీడిపచించినలాగు సేయు మె
ల్లగకును దేవుఁడొక్కఁడ త - లంపభువిన్ పరికొక్కవాన యూ
దరకొకవానయుంగలదె? - తక్కరికిన్ వగమిచ్చువేల్ప దు
ష్కరగణముఁగూర్చు నేనిగప - రాధని కమ్మ! దలంక కాత్మలోన్. 151

గీ. ధర్మకర్తకుఁ గలవేల్పు - తంబలికిని । గలుగు, దురపేక్షమైవాఁడు - తలఁచికొలుచు
కాళికాదేవి మనపాలఁ - గలుగకున్నె । భక్తిసేవింతు మగుటచే - భయములేదు. 152

వ. నాయుపదేశంబు మఱవక నడుపుదువేని మేలువాటిల్లు ఖలుండగుసిద్ధుండు నిన్ను నమస్కరింపుమనిన తటిధైర్యంబు విడువక నేనెన్నఁడును నమస్కరించియెఱుంగఁ దొలుత నీవు నమస్కారమొనర్పుము కనుఁగొని యాలాగునఁ గావించెదననుము. తానుద్దేశించిన కార్యమును సంపూర్ణమొనరించుటకు వేగిరపడుచున్నవాఁడు కావున ముందువెనుక యోజింపక యాదుష్టుండు ప్రణామవిధిని నీకుంగఱపువాఁడై నమస్కరింపఁగలఁడు. నీవాక్షణంబున నటనికటనిక్షిప్తనిసితకరవాలంబుఁగొని సంశయింపక వానికంఠంబుఁదెగ వ్రేయుము. పిమ్మట నీకెట్టిహానియుంబొసంగదు. మదీయశాపవిమోచనప్రకారంబుఁ దెలుపుసమయంబున మునిపతి నాకుం జెప్పియున్న కతంబున కర్తవ్యంబు నీకివ్విధంబని తెలియఁబలికితి. నీవీకార్యంబు నేరవేర్చునంతవరకును, నేనీరూపంబున నేయుండవలయుఁగావున నీవిచ్చోట నింకనిలువకపోయి కార్యంబుసాధింపుమని యాదేశించి శిలా

విగ్రహంబు మానసముపహించిన తనయవివేకంబుకతన సంభవించిన మహోపద్రవంబును
దలంచిచింతించుచు నచోటువాసియావలఁజనిభయభ్రాంతరై యోజింపుసమయంబున.

సీ. సిద్ధుఁడంబికనుబూ - జించుటకుఁదగు - కుసుమంబులంతలోఁ - గోసితెచ్చి
ముందుగానాలయం - బునకుమున్మార్గప్ర - దక్షిణంబులొనర్చి - తక్షణంబ
యరళపక్షంబుల - సరగఁపాయంద్రోసి - దేవిసన్నిధిఁజేరి - భావమలర
నర్చించిధూపదీ - పాద్యుపచారము - ల్సల్పిచేతులుమోడ్చి - సంస్తుతించి

ఆ. యోజగత్త్రియాంబ - యోభక్తరక్షణీ! । యోదయామయీ! ప్ర - మోదదాయి!
ప్రొక్కెఁదీర్తు నీకు - మును నేను వాంఛించి । నట్టివరమొసంగు - మనుచువేఁడె. 154

ఉ. చెంగటనుండి రాజసుత - సిద్ధవరా! తడవయ్యెఁబూజలిం
కంగడమట్టలేదొ? యనఁ-గానతఁడాయెను రమ్ము వేగనీ
కుంగలకోర్కెఁదీర్పుమని - కొంకక దేవిని సంస్మరించి సా
ష్టాంగముగాఁ బ్రణామముర - యంబునఁ జేయుము పాదమింకనెక్. 155

వ. యశోవతి శిలాప్రతిమ యుపదేశంబుమఱవక దలంకుమాని యువ్విగంబున నడుపు
నదిగ్గై యతనికిట్లనియె. 156

గీ. ప్రొక్కులాగెన్నఁడెఱుఁగను-మొదటమీరు। ప్రొక్కుఁడా మాచియవ్విధ-మునవొనర్తు
వనియె; వాఁడపుడట్లైన-గనుముయిటులఁ।జేయఁగాఁదగుననుచుదాఁ-జెప్పిప్రొక్కె. 157

గీ. అంతనచ్చోట నునిచియు - న్నట్టివాలుఁ । గేలఁగైకొనిచయ్యన - నాలతాంగి
యతనికంఠంబు ఖండించె - నాక్షణమున । నచ్చియటనిల్చె నవ్వుచు-వనితయొకతె. 158

క. ఘటియొకపురుషుఁడు మిక్కిలి । యొఱపరి యెచ్చోటనుండి - యోఁదనచేతం
జిఱువాలుఁ బూనిదిగ్గనఁ । గుఱఁగటికరుదెంచినిలిచె - కుతుకముమీఱన్. 159

గీ. వారినిరువురఁగాంచి భూ-వరకుమారి । వరఁకుమాతిపుడేలాగు - పరఁగునోక్కొ
వీరలెవ్వారొచనుదెంచి - నారటంచు । భీతినొందుటయునుగాంచి ప్రియమెలర్ప. 160

చ. జయజయ కామినీమిగుల - సౌఖ్యము నొందఁగఁగంటినీదు స
త్క్రియనని మెచ్చివచ్చిన స - తీమణిసంస్తుతిఁజేసెరానుతన్
జయజయకామినీ మిగుల - సౌఖ్యము నొందఁగఁగంటినీదు స
త్క్రియనని మెచ్చివచ్చిన వ-రీయుఁడు సంస్తుతిఁజేసెరానుతన్. 161

వ. అనిచెప్పిన ననంతరవృత్తాంతంబు నెఱింగింపుమని యడుగుటయు. 162

చ. నరసఖ! దేహకాంతిజిత - నారద! నారదభావభావనా!
శరధిశయాన! భక్తజన - శంకర । శంకర మిత్ర! మిత్రభా

సుర ! జగదీశ్వరా ! దళిత - సోమక ! సోమకళాస్య ! లాస్యకా
మ ! రహితపాప ! దీనతరు - మాధవ ! మాధవ ! నందనందనా ! 163

క. భువనాధిక సుఖభవనా ! భవనాశక ! కిల్బిషాభ్ర - పటలీపవనా !
పవనాశ్రయబల ! యవనా ! యవనారీ ! దుష్టదైత్య - హర ! ధృతభువనా ! 164

పంచచామరము.

క్షరాక్షరస్వరూప ! గోప - బాలపాల ! నీలసుం
దరాంగ ! పక్షిరాట్తురంగ ! ధైర్యవీర్యశౌర్యపూ
ర్ణ ! రాజతుల్యరాజితాన - నా ! యజా ! రమాహృదీ
శ్వరా ! పరాత్పరా ! సురేశ ! భక్తిముక్తిశక్తిదా ! 165

గద్య.

ఇది. శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాద లబ్ధానర్ఘ చతుర్విధ కవిత్వమహత్త్వాభి
రామ, భూసురకుల క్షీరపారావారపర్వశర్వరీసోమ, శ్రీవత్సగోత్ర
పవిత్రాపస్తంబసూత్ర, సావిత్రీలక్ష్మీనృసింహార్యపుత్త్ర,
సుకవిజనవిధేయ, పిచ్చయనామధేయ ప్రణీతంబగు
విజయాశ్వచరిత్రంబను ప్రబంధంబునందుఁ
బూర్వభాగంబునఁ జతుర్థాశ్వాసము
సంపూర్ణము.

శ్రీమద్వేంకటేశ్వరార్పణమస్తు.



శ్రీరస్తు.

# విజయాశ్వ చరిత్రము

## పూర్వభాగము

---

### పంచమాశ్వాసము.

క. శ్రీరమణీయమణీమయ । హారకిరీటాదిశోభి - తాంగా ! విలస
త్స్మేరానన ! సుజనావన । భూరిగుణస్తోమ ! శేష - భూధరధామా ! 1

వ. దేవా ! అవధరింపుము. సద్గుణగణవిశారదులగు శౌనకాదులకు సన్నుతపుణ్యకథాశతాంగ
సూతుండగు సూతుండిట్లనియె. నవ్విధంబున కాళికాలయంబుననుండు యశోవతి యా
కస్మికంబుగాఁదోఁచిన తరుణీతరుణద్వయముతన్నగ్గించుటయు,నటఁదనచేఖండింపఁబడిన
సిద్ధునికళేబరఁబంతర్హితంబగుటయుంజూచి భయాశ్చర్యమగ్నమానసయై యెట్టకేలకు
నించుకధైర్యంబవలంబించి వారికినమస్కరించి సవినయంబున. 2

సీ. ఇంతకుమున్ను మీ - రిచ్చోటఁగానరా - రెందుండివచ్చితి - రింతలోన
దివ్యతేజంబున - దివ్యరూపములతో - మిగులనొప్పుచునుండు - మీరలెవ్వ
రేమికార్యంబున - నేగుదెంచితిరొక్కొ - మనికియెచ్చోటనా - మంబులెవ్వి
మీకునావలననే - మేలుచేకూఱెమి - మ్మెపుడును నేఁజూచి - యెఱుఁగమున్ను

ఆ. దిక్కులేక పెక్కు - లిక్కట్టులొందితిఁ । గరముకరుణయుంచి - కలతెఱుంగఁ
జెప్పుఁడనిన నవ్వి - యప్పడంతినిఁగాంచి । వచ్చినట్టివనజ - వదనయనియె. 3

క. ననునింతలోన మఱచితె ? । వినిపింపనె మచ్చరితము - వివరముగాని
ట్లనుమాన మొందనగునే ? । యొనరఁగవిను మెవ్వరగుట - యునువచియింతున్. 4

క. సాంతముగా సిద్ధునికప । టాంతర్య క్రమముఁదెలిపి - యనిచినదానన్
వింతయగు బొమ్మగానే । నింతవు మున్నచటనుంటి - నిపుడిట్లైతిన్. 5

క. నీవలనఁ దీఱెశాపం । బీవేళ లతాంగి ! నేను - హేమనుసుమ్మీ !
నావిని యావెలఁదుకనే । నీవలనంగాద బ్రదుక - నేర్చితిననియెన్. 6

క. ఈవిధమున ననివింతల । పైవింతలు సంభవించెఁ - బరువడినిపుడిం
దీవచ్చియున్న పురుషుని । నీవెఱుఁగుదె ? యనినహేమ - నేనెఱుఁగననెన్. 7

ఆ. అంతనతనిఁ జూచి - యబలయశోకవతి । యనఘ ! యెచటనుండి - యరుగుదెంచి
నారలొక్కొ మీర - లూరునుఁ బేరును । వినికిఁ జేయుఁడనుచు - వేఁడుకొనియె. 8

గీ. అటులఁ దనుఁ గూర్చి యడిగిన - నతఁడు నవ్వి । సాహసంబొప్పఁగా నీవు - చంపినట్టి
సిద్ధుఁడను నేను శాపంబుఁ - జెందియిచటఁ । దిరుగుచుంటిని మర్త్యాకృతి నివహించి. 9

వ. మదీయచిత్రంబగుచరిత్రంబు సావధానంబుగా నాలకించితివేని నేను శాపంబునొందిన కారణంబును, తదితరంబులగు సమస్తవిషయంబులును, నీకుబోధపడుంగావున వివరించెద వినుమని యిట్లనియె. 10

## పుష్కరోపాఖ్యానము.

క. కలకాలము వైభవమున । నలకాపుర మేలుచుండు - యక్షేశునకున్
గలఁడొక్క తనయుఁడొ అపరి । నలకూబరుఁ డతని పేరు - నళినదళాక్షీ ! 11

ఉ. వానిశుభాంగ సౌష్ఠవము - వర్ణనసేయనివారు వానిసా
ఖ్యానుభవంబుఁ గాంచి యహహా ! యని మెచ్చనివారు వాని స
జ్ఞానగుణాదులెంచి యని - శంబునుతింపని యట్టివారలున్
వానికిసాటిగాఁదగిన - వారును గల్గరువిష్టపత్రయిన్. 12

ఆ. బాల్యమాదిమేము - పాయనిసఖ్యంబుఁ । గలిగి మెలఁగుచుందు - మలరుబోణి
కనకవర్ణుఁడనెడు - గంధర్వనకుఁదన । యుండఁ బేరు పుష్కరుండటంద్రు. 13

క. నలకూబరుఁ గనుటకునై । యలకకుఁజని వచ్చుచుందు - నపుడపుడతఁడుం
బలుమార్లరుదెంచుటయుం । గలదుననుం జూచి పోవఁగా బింబోష్ఠీ ! 14

క. నానాటికి మామైత్రియు । నూనంబై యొప్పుటయు ద-నువులన్యములే
గాని హృదయంబు లొక్కటి । గానుండెను యిటులగొంత - కాలముగడచెన్. 15

వ. నేనొక్కనాఁడు నలకూబరుం జూచి రాఁదలంచి యలకకుంబోవుచుండి యప్పుడు. 16

ఆ. ఇలనుగలుగు వింత - లీక్షించుచుంబోవ । వేడ్కతోడమిడిగితి - విన్ను నుండి
చాలనట్టి వేళఁ - జననిచ్చునే విధి । యురకఁబోదునన్న ; - యువిద ! చెపుమ. 17

క. ఆలాగు భువికడిగినే । నాలోచనలేక విధిబ - లాధీనమతిన్
భూలోకవిశేషంబుల । నాలోకించుచుఁ జనంగ - నటనొకచోటన్. 18

శా. ఘోరంబైన యరణ్యమధ్యమున నా - క్షోటామ్రమందారజం
బీరాశ్వత్థతమాల సాలవటకుం - భీకుంభమాలూరవా
నీరేత్యాది మహీజముల్వెలయఁగా - నీడోద్భవారానవి
స్ఫారంబైన వనంబొకండుఁగని నే - సంతోషమొప్పారఁగన్. 19

వ. తద్వనంబుఁ బ్రవేశించి విలోకించి యందలివిశేషంబు లశేషంబుగావర్ణించుచుఁ
దరుబృందంబులచందంబును, విరిపొదలయందంబును, మనంబునకనూనంబగు ప్రమోదం
బెనయింప నింపుఁబెంపఁదగువాజీనికరంబులకలరవంబులాలించి మేలంచు వినుతించుచుఁ,
గరంబువిలాసాకరంబులగు కమలాకరంబులపైనుండివెడలి కుసుమవిసరామోదంబునలు
దెసలం బ్రసరింపవిసరునాలిగాలిసోఁకునకుంజొక్కి యొక్కింతతడవక్కడక్కడనిలిచి
యలసటంబాయుచు, సొగసగుమృగశాబకంబులుకుప్పించి దుముకునప్పుడు గుప్పుగుప్పున
నెగయుపుప్పొడి దుమారంబుపైఁగప్పినఁ దప్పించుకొని యావలంబోవుచుపావనంబగు
నావనంబుననటునిటుఁదిరుగుచుంటి నయ్యవసరంబున నటనొకకొలంకునఁ గెలంకునఁ
దనరుదట్టంపుఁ బూవుటీరంబుచెంగట. 20

సీ. లలిమించుమించుచం - చలతనునిరసించు - తనులతకాంతులం - తటనుబర్వ
మారేడుబండ్లబం - గారుగిండ్లనుబూల - చెండ్లనుఁగేరుపా - లిండ్లుదనర
నకలంకమగుపొంక - మమరియేణాంకుని - ముదలసేయనిముద్దు - మోముచెలయఁ
గొలుఁకులఁగెంజాయఁ - గలిగినీరేజంబు - లనువిూఱఁజాలిన - కనులుపొసఁగ

గీ. సాటిలేనట్టి లావణ్య - పేటియనఁగ । సానఁబట్టిన మకరాంకు - శస్త్రమనఁగ
నెమ్మిఁగలిగిన రతనంపు-బొమ్మయనఁగఁ । గొమ్మయొకర్తె పూవులఁ-గోయుచుండె 21

శా. ఆలావణ్యసముజ్జ్వలాంగినటఁ గ - న్నారంగఁ గన్గొంతలో
నాలోనెన్నఁడుఁ గల్గనట్టితమి యా - నాఁడుద్భవంబయ్యెనే
నాలోచింపక భీతివీడియటుడా - యంబోయి నీవెవ్వరిం
దేలాయొంటరివై చరించెదవునీ - దేయూరు పేరేమగుణ్. 22

ఆ. అనుచు నెన్నిమాఱు - లడిగినఁ గన్నెత్తి । చూడదయ్యెమాట - లాడదయ్యె
వనితసొబగునట్టె - కనికనిమదిబాళి । మించిమిగుల సంచ - లించినేను. 23

గీ. మరలనిట్లంటినో మద - ద్విరదగమన! । మారుమాటాడుటనునీవు - మానుకొనిన
మానుకొంటివిగాని నా-మనవివినుము । మెచ్చిమోహించి చెంతకు - వచ్చినాఁడ. 24

క. ఇదియేమి మాటయని నీ । మదినెంచెదవేమొ నిరుప - మానంబగునం
గదగాదె వలపుతలఁపున । నొదవినమునినైనఁగలఁచు - నొకనిముసమునన్. 25

ఆ. వసధులీఁదిదాఁట - వచ్చువ్రజాహతి । నైననోర్వవచ్చుఁ - గాని సైఁప
రాదుగాఢమగువి - రాళికి నెంతటి । ధైర్యవంతుఁడైనఁ - దల్లడిల్లు. 26

క. కనికరము విూఱఁగాననుఁ । గనికరము ముదంబుదనరఁ - గానేలుముచ
య్యనఁదాళఁగఁ జాలఁజువిూ । యనఁదానున్నట్టియుండె - నదిమానమునన్. 27

చ. ఇదిగనసేడమూఁక యగు - నేమొకో పల్కెదటంచుఁదొల్తనే
నెదఁదలపోసి యంతనది - యేనిజమేని యనూనరూపసం
పదఁబొసఁగించియు న్వనఁగఁ - బల్కఁగశక్తి నొసంగకున్న యా
యదయుఁడు వేధచాలఁగలు - పాత్కుఁడటంచు దలంచిదూఱితిన్. 28

క. ఈరీతిఁ దలఁచుచుండఁగ । నారీమణి కరుణఁగనక - నను మోహమహాం
భోరాశి లోనముంచివి । చారింపక నచోటువాసి - చనఁగాఁదొడఁగెన్. 29

క. పోవుటఁ గనుఁగొనియిఁక నే । నేవెఱవున సైఁపనేర్తు - నీయెలనాగన్
బోవిడిచి; యనుచునాలో । భావించి తెగించి మించు - బాళినివేగన్. 30

గీ. ఇంతికడ్డంబుసని చన - నీకనిలిపి । నన్నువిడనాడి నాదుమ - నంబుఁగొనుచు
నెందుబోయెదు నిలునిలు-మిందువదన! । వినుము నామాట నినుఁజాల-వేఁడుకొనెద. 31

క. ననుఁగూడినేఁడు నావల । పునుమాన్చితివేని నీవు - పొందెదిమేలిం
తనరాదు వశుఁడనైనీ । కనుసన్నల నెఱిఁగి మెలఁగఁ - గాఁగలవాఁడన్. 32

క. కూరిమి నెయ్యదికోరినఁ । గోరియుఁగోర కటుమున్నె - కొనివత్తునునన్
వారిధిలోఁ బడుమనినను । మారాడకఁ బడుదు పెక్కు - మాటలికేలా? 33

క. అనిమేను పులకరింపఁగ । ననుమానముమాని మోహ-మనెడిపిశాచం
బెనసి నను వేగిరించినఁ । నను పునసుప గూహనంబుబొ - నర్చితినతిపన్. 34

గీ. కౌఁగలించిన యపుడైనఁ - గానితగును । తగవుకాదని వలుకక - తక్షణమున
దిచ్చుమొగమయ్యెనామది-దిగులువొడమె। నంతలోనొక్క సంయమి-యటకువచ్చె. 35

క. చానపయిందగిలిననా । మానసము మరల్పలేక - మ్రాన్పడివగతో
నేనతనినిఁ గన్గొనిస । మ్మానింపక యుంటినెంత - మత్తుఁడనొక్కో. 36

క. వచ్చినమునివర్యుఁడునను । హెచ్చినకోపోగ్రదృష్టి - నీక్షించిమదిన్
మచ్చరముఁ బూనియెంతయు । నచ్చెరువుగ నప్పుడిట్టు - లనియెన్ బెలుచన్. 37

ఉ. ఓరిదురాత్మ! యోగ్యమని - యోగ్యముగాదని తారతమ్యని
ర్ధారణసేయనేరక . వి-రాళివహించి మదించి మత్ప్రియన్
గోరికలేనిదాని నుప - గూహనమున్ పొనరింపనౌనె? యౌ
రా! రహిగానియిట్టి యప - రాధమొనర్చిన సైఁపవచ్చునే? 38

ఉ. నీతిపథంబువీడి పెను - నేరమొనర్చితివాట, నోరి! నీ
వీతనువుం ద్యజించి తగ - నింకనరాకృతిఁదాల్చి నిర్దయన్
భూతలమందుఁ ద్రిమ్మరుము - పొమ్మని యమ్మునియోర్వులేకని
ర్ఘాతమువంటి శాపమును - గ్రక్కననిచ్చిన నొచ్చినేమదిన్. 39

ఉ. చాలభయంబుఁ జెంది ముని - చంద్రుని పాదములందటాలునన్
బ్రాలినుతించి యోవిమల - భావ! మహాపరాధినైతినా
శీలముదప్పి నేఁడుకృపఁ - జేసి వివేకినిగానియట్టి న
న్పాలనసేయుఁడింక గరు - వంబడఁగెన్ దొలఁగెన్దురాశయున్. 40

క. కనుగానక దుర్మదమున । వనితావ్యామోహపార - వశ్యమతింజే
సిన తప్పునకుం దగుఫల । మనుభవమయ్యెను మహాత్మ! - యజ్ఞుఁడఁజాలన్. 41

క. సుదతీమణి మీప్రియయను । నది తెలియమి వలచిగవియ - నాశించితి నే
నిదియెఱిఁగి యొనర్చినత । ప్పిదముగఁ దలపోయవలదు - పెద్దలుమీరల్. 42

క. కోపముచేఁ ద్వరపడిన । స్త్రీ పగిదిందిట్టినార - లిపుడకటా! త
చ్ఛాపావసానమెపుడో । రూపింపుఁడు కరుణయుంచి - రూఢిగననుచున్. 43

క. మునిమనసుఁ గరఁగఁ బ్రార్థిం । చిన సుముఖుండై యతండు - చిత్తములోయో
జనఁజేసి కనికరంబున । ననుఁగని యిట్లనియెనపుడు - నయవాక్యములన్. 44

గీ. వినుమ మోఘంబు నాశాప - మనుభవించి । తీఱవలెఁగాని యూరక - తెరలదరయ
నాశచే శాపమొందితి - వగుటఁజేసి । యాశవలననె శాపాంత - మగుసునీకు. 45

వ. అదియెట్లనిన, మద్వచనప్రకారంబుగా మనుష్యరూపంబుఁదాల్చి, యీయరణ్యంబునంగలకాళికాలయంబునఁజేరి, పూర్వజ్ఞానశూన్యుండవై యుండి యాదేవినారాధించి, ప్రసన్నయైనతల్లి, దుర్లభంబగువరంబునర్థించి, యుపహారరహితంబుగ వేఁడిన కారణంబున వాంఛితంబు లభింపదనుట దేవివలనఁదెలిసికొని తత్ఫలసిద్ధికై దుర్గయాదేశించినలాగున బలిపెట్టుటకుంగడంగి, యందునకుం దగినరాజపుత్రికనుమాయోపాయంబులవంచించి, కొని తెచ్చి, కొలసేయఁగమకించుసమయంబున, తద్విధంబెఱింగి, యాకురంగనేత్రచాతుర్యంబేర్పడ నీకరంబుఁదాఖండింపఁగలదు. నీవవ్విధంబున నిహతుండవై, శాపవిముక్తుండవయ్యెదవు. నేటికిమూఁడవనాఁడు నీకీశాపంబుప్రాప్తించుంబొమ్మని నిర్దేశించి యతండు నిజేచ్ఛంజనియెనంత నేనధికంబగు సంతాపంబుఁజెందిమదీయదుర్వర్తనంబుఁదలంచి పశ్చాత్తాపమునొంది యాత్మగతంబున. 46

క. కడుయోగ్యుఁడ ననికీర్తిని । వడసినుతింగన్న యట్టి-వాఁడను నాకీ
చెడుబుద్ధి నేఁడుగలుగుట । కడగండ్లిట్లొందవలసి - గా దేతలఁపన్. 47

సీ. నలకూబరునిఁజూడ - నలకకేగెడునేను - వసుధాతలమునకు - వచ్చుటేల?
వచ్చితిఁబోదారిఁ - బట్టిపోవకయిందు - చోద్యంబులరయఁగాఁ - జొచ్చుటేల?
చొచ్చితిఁబోవేడ్క - నూనంబులనుగోయు - మెలఁతనుమోహించి - మెచ్చనేల?
మెచ్చితిఁబోచూడ - నిచ్చలేకుండిన - యింతిఁగూడఁగఁగాంక్ష - హెచ్చనేల?

గీ. యాత్మ నెంచినదొక్కటి - యైనదొకటి । దైవతంత్రంబునకు నిరో - ధంబు గలదె?
బుద్ధికర్మానుగంబుగాఁ - బొసఁగుచుండు । వెనుకఁజింతించు టెంతయు - వెఱ్ఱితనము. 48

ఉ. ఇప్పటి నాచరిత్రమును - నేర్పడ నేను కుబేరసూతితోఁ
జెప్పిననాలకించి మదిఁ - జింతవహించునొ? లేక, నాయెడం
దప్పుపొసంగు టెంచి కడు - తామసమొందునొ జాలిఁజెందునో?
యొప్పతికించి నీచుఁడవ - యోగ్యుఁడ వౌదు నటంచు దూఱునో? 49

క. మొగమెఱుక లేని యొల్లని । మగువను మోహించిదాని - మతి కెక్కినవాఁ
డగుమాని శపించినయీ । వగఁజెడితినటంచు నెటులఁ - బలుకుదునకటా! 50

ఆ. ధృతివహించి నేను - తెలిపినఁ దెలుపుదుఁ । గాని, యతఁడు చెలిమి - కతనవినిన
వినును గాని, యొరులు - వీనికినుంతైన । నానలేదటంచు - నవ్వకొనరె? 51

చ. అనికడుఁగొంకు, లజ్జయుభ - యంబును నాత్మఁ బెనంగఁ జేయఁగ
గ్గినదిపుడేమటంచుఁ గడ - లేనివిషాదముఁ జెంది యట్టియో
జనలకుఁజొచ్చి యుక్తమగు - చందముదోఁపమి నేమియైననాఁ
జనినలకూబరుఁ గనుట - చాలఁగ మేలని యెంచితిన్ తుదన్. 52

ఆ. అటులనిశ్చయించి - యటనుండి కదలినే । నలక కేగి కంటి - యక్షరాజ
సుతుని నాదుహితుని - సురుచిరభర్మహ । ర్మ్యాంతరోపవిష్టుఁ - డైనవాని. 53

మ. ననుజూడంగనె గద్దియం డిగియ నూ-నంబైన మైత్రిన్ యెదు
ర్కొనిరా రమ్మని చేయిఁబట్టుకొని వేఁ - గొంపోయి యర్ధాసనం
బున నాసీనునిఁ జేసి మేలడిగి స-మ్మోదంబు నిండారని
ట్లనె నచ్చోఁగలవాని యాప్తులు హితు - ల్లక్షించియాలింపఁగన్. 54

ఉ. ఇందులకేల రావయితి - విన్నిదినంబులదేమొ యంచు నే
వందురుచుంటిఁ జాలమది - వచ్చితి విప్పటికైన మేలునా
యందుదొసంగు గల్గుటనొ - యన్యులమైత్రి శుభంబటంచునీ
కుందలఁ పుద్భవించుటనొ - కొంకకదేమికతంబొ వల్కుమా. 55

ఉ. నిక్కముసీకుఁ జెప్పెదను - నేఁడును రేపును నీవురానిచో
నక్కడికేను రావలయు - నంచు దృఢంబుగ నెంచియుంటిఁజు
మ్మిక్కడికేగియుంటివొకొ - హెచ్చగు కార్యము లెవ్వి చేతలన్
యొక్కదినంబు నచ్చి చన - నుండదె తీఱిక నీకుఁ బుష్కరా! 56

క. అనియడిగిన నప్పుడునా । కనుఁగొలఁకుల శోకబాష్ప - కణములు తొలఁగెన్
దనువున దౌర్బల్యమునా । ననమున దైన్యంబువొడమె - నడుకొనెపదముల్. 57

గీ. అట్టిదశ నొందిపలుకకు - న్నట్టినన్నుఁ । గాంచి నలకూబరుఁడు సంశ-యించి చాల
వెఱపు నాశ్చర్యమునుఁ జెంది - వేగఁ దెలుపు । మేమివాటిల్లె నీచింత-కేమికతము. 58

ఉ. ఇంతటిదుఃఖ మెన్నఁడు వ-హించిన వాఁడవుకావు నీవును
స్వాంతుఁడవెన్నఁగాఁ బరమ - శాంతుఁడవాతత నీతిశాలివ
శ్రాంతదయాపరుండవు ని-రస్తకుశీలుఁడవిట్టినీకుఁగీ
డెంతటివాఁడొనర్చినది - యెయ్యదివల్కుము వేగఁబుష్కరా ! 59

గీ. ఎప్పుడునను జూడవచ్చిన - నెంతయేని । వేడ్క నుండుదు వరయని - వ్యధమెఱుంగ
నిట్టివంతకుఁ గారణం - బెట్టిదొక్కొ । యోర్చివివరింపుమనిన ని-ట్టూర్చి నేను. 60

చ. అలకకుఁ బైనసూటి మొద - లచ్చటఁ జేరిన యంతదాఁక నుం
గలిగిన మచ్చరిత్రము నొ - కండునువీడక లజ్జనొంచియుం
బలికితి, నాలకించి యొక - భంగినిఁ గొండొక సేపతండుని
శ్చలతవహించియుండి సవి - షాదముగాఁ దలయూఁచియిట్లనెన్. 61

క. భావింపక కూడనిపనిఁ । గావింపఁగఁ దగునె? చేదుఁ - గఱచితివినుమీ!
దైవోపహతుఁడు మతిచెడి । హోవడిఁ గలిగించు పనుల - కాసక్తిఁ గొనున్. 62

చ. ఒఱపునుజవ్వనంబు హొయ - లొప్పగు జాతియుఁ గల్గుకామినిం
దఱిసిననీవకాదు భువిఁ - దాపసులైనను చంచలాత్ములై
తెలియకుపలేక వెంటఁబడి - ద్రిమ్మరుచుండుదురక్టె; కానినీ
కీఱుదగు దుర్దశానుభవ - ఖేదమునెంచి తలంకెదన్ మదిన్. 63

మ. అకటా! యెంతటిమాట వింటినివయ-స్యా ! శాపమింకెన్ని నా
ళ్లకుఁదీఱంగలదొక్కొ? నీవెటులనా-లాగన్యరూపంబుతో
సకలంబుల్ విడిభీకరాటవుల సం - చారంబుఁ గావింతువో ?
యొకనాఁడో యొక పక్షమో నెలయొ బా-యున్ నాటికంచెన్నఁగన్. 64

న. దైవకృతంబిట్టిదయ్యె. వగచినఁ బ్రయోజనంబుగలుగదు. యీయదరుననుభవింపక తప్పదని యట్లుండె. నీచరిత్రంబునకు సంబంధించినదియు నేనెఱింగినదియు నగువిశేషంబొకటిఁ జెప్పెద. నందువలన నీకుశాపంబుగలుగుటకు నిమిత్తంబైన యాసుందరాంగి యొక్కయు నమ్మునియొక్కయు వృత్తాంతంబు బోధపడఁగల దాకర్ణింపుము. 65

ఆ. జటిలుఁడనెడి తపసి - యటవిలో వింధ్యాద్రి । చెంతనిష్ఠఁ దపముఁ - జేయుచుండు
నతఁడెనిన్నుఁ దిట్టి - నట్టిమునీశ్వరుం । డావనంబె వాని - యాశ్రమంబు. 66

చ. అతనితపోగ్ని ధూమ శిఖ - లంతటదిక్కులునిండి మింటికు
త్పతితములైనఁ గన్గొనిను - సర్వవిభుండు నిజాధిపత్యమా

ప్రతిగొను నేమొ మీఁదటఁత - పఃపరిపూర్తి యొనర్చియుంచుఁడా
మతివెఱఁగంది మానినియ - మంబును భంగ మొనర్చు యోజనన్. 67

క. అంగుగల దేవతావే । శ్యాంగనయును నేర్పుతియును - నగు హేమాఖ్యన్
భంగంబుఁ జేయుమమ్ముని । పుంగవుని తపంబు వేగఁ - బొమ్మనిపనిచెన్. 68

చ. అదివని మానివల్లభున - కంగజతాప మెసంగఁజేసిన
మ్మృదమునఁగూడి శిలపరి - ముక్తున నొనర్చిచనందలంపఁగా
సదమలమానసుండతఁడు - సంశయమంది లతాంగిచర్యలన్
గదలిక యోగదృష్టిఁగని - కన్నెఅనేసి శపించెతాయిఁగాన్. 69

వ. ఆజటిలునియాశ్రమంబునకు సమీపంబునఁ బురాతనంబగుదుర్గాలయంబుగలదని మున్ను మాయావియనుదనుజునికుమారుండును లోకకంటకుండునునగు కంటకుండను రాక్షసుండు నిలింపులజయింపఁ దలంపుఁగొని కలహాశనునియుపదేశంబున దేవినారాధించి వరంబుఁ గైకొననిశ్చయించి యచ్చోటనాలయంబునిర్మించి యందుకాళికనుఁబ్రతిష్ఠించి పూజించును కల్పోక్తవిధిందప్పివర్తించినకతంబున యామహాశక్తివలన నిహతుండయ్యె. నది మొదలుగా నచ్చోటునకుంబోవుటకందఱునుభీతిల్లుచుండుదురు. నీకుమునివరుండునిర్దేశించినకాళికాలయంబదియ యతనిచేశపింపఁబడిన హేమయాగుడియందు శిలావిగ్రహంబైయున్నయది. పుష్కరా ! యింక నటుమీఁది జటిలునివృత్తాంతంబునుఁ దెలిపెదవినుము. 70

గీ. అటులజటిలునిచే శాప - మంది హేమ । యుపలమగుటయుఁజెలులేగి - యపుడుదివిజ
భర్తకెఱిఁగించి రదివిని - పాకవైరి । వగచివిధికృతమనుచు భా-వమునఁదలఁచె. 71

క. అంతటవెండియు జటిలుఁడు । వింతగఁ గడునిష్ఠఁబూని - విష్టపములకున్
సంతాపము వాటిల్లఁగ । నెంతయుఁదప మాచరింప - నెఱిఁగిభయమునన్. 72

క. రంభనుబనిచిన నదిముని । జంభారితపంబుఁ జెఱుపఁ - జాలునటనియా
జంభారిదానికాయా । రంభఁ బెఱిఁగింపఁదలఁచి - రావించుటయున్. 73

గీ. గురుకుచద్వయ నిర్జిత - కుంభికుంభ । దంభపస్తంభ యతులస-ద్వాగ్విజృంభ
బంభరాలకమాని భా - వప్రలంభ । రంభసను దెంచె మిగులసం - రంభ మొప్ప. 74

క. ఆరంభను నిరతాభిమ । తారంభనుగాంచి జిష్ణుఁ - డవతిరో ! వేవిం
ధ్యారణ్యంబునకుంజని । నేరిమిజటిలుని తపంబు - నెఱిఁ జెఱుపుమనన్. 75

క. అంగీకరించివేగ య । నంగుని సమ్మోహనాస్త్ర - మగునన నఁదగియా
యంగనసని జటిలునిఁదన । కుంగడు వశ్యునిగఁజేసి - కొనియెన్ గడఁకన్. 76

వ. అవ్విధంబు వివరంబుగాఁజెప్పెద నాకర్ణింపుము. 77

క. ప్రకటవ్యామోహప్రద । సకటాక్ష నిరీక్షణముల - సారించుచుమా
నికినికటంబున నటునిటు । పకియ మెలఁగుచున్నఁ గాంచి - సంశయ మొదవన్. 78

ఆ. జ్ఞానదృష్టిఁ గాంచి - తానుసర్వ మెఱింగి । కోమలాంగిఁ జీరి - కోపగింప
కతఁడుతమియునిస్పృ-హయునాత్మఁ బెనఁగొన । తపము మొనర్చునట్టి-తలఁపువిడిచి. 79

క. అపుడేర్పడఁగా రంభకు । విపులముగా హేమకథను - వివరించియనున్
చపలాక్షీ ! నీవునటువలె । కృపగలుగని దానవేని - కీడగుఁజుమ్మీ ! 80

చ. వనరుహగంధి ! నీవిటకు - వచ్చిన కార్యమెఱుంగుదైననేఁ
గనలువహింప నీపయినిఁ - గల్గినమాట నెఱుంగఁ జెప్పెదన్
విను, మిఁక నీవునుంగడును - వేశ్యవు హేమనుబోలె; నమ్మఁగాఁ
జనదుమిముం, దలంపగుణ - సంపదమీయెడఁ గల్గదెప్పుడున్. 81

క. ఏజాతికైనఁగానియు । నాజాతిగుణంబులేక - దాయొదవుభువిన్
రాజిల్ల రాగిఁజల్లిన । రాజనములు పండునటవె - రంభా! చెపుమా. 82

ఉ. జంతలుగారె మీరు నిము - సంబున నెంతటివానినైన న
త్యంతము నంకయై మెలఁగు - నట్లొనరించుకొనంగ నేర్తురా
నంతియకాని కూర్మియిసు - మంతయుఁ గల్గదుమీకు, హేమము
న్నింతటికంటెఁ జెప్ప తుద-నెల్లనుఁ గల్లలు సేసెఁదాఁ దెడెన్. 83

గీ. కానమిము నమ్మరాదన్నఁ - గాంతనవ్వి । యటుల నెంచంగనలదు మీ - యాజ్ఞరీతి
మెలఁగఁగలదాన ననుచున-మ్మించెనతని । నతఁడు మెచ్చి లతాంగికి-ట్లనియెనపుడు. 84

వ. ఇంద్రుండు నాతపోభంగంబుఁ జేయుటకై నిన్నుఁ బుత్తెంచుట నే నెఱింగియు నీపైఁగల
ప్రేమకతంబున భవద్వచనంబులు నమ్మికినియక నిన్నుఁ గూడి సుఖింప నెంచితిఁ గాన మదీ
యశీలంబు విడిచెద నింక నీవు వర్తింపవలసిన విధంబుఁ జెప్పెద వినుము. 85

సీ. అశ్వమేధాదిమ - హాయాగములుచేసి - పరమపుణ్యాత్ములై - పరఁగువారు
నస్తోకదానధ - ర్మాదిసత్క్రియలుగా - వించితత్ఫలమొంది - వెలయువారు
నిష్ఠాగరిష్ఠులై - నిశ్చలమతిఁదపం - బొనరించియనఘులై - యున్నవారు
సురధరాసురభక్తి - పరులై వ్రతంబులఁ - జేసినిర్మలమతిఁ - జెలఁగువారు

గీ. నంటఁబడుఁగాని నినునింక - నన్యులెపుడు । నంటఁగారాదు ననువీడి - యరుగరాదు
పరులఁగనులెత్తి కనరాదు - పలుకరాదు । చెలువ ! యిదినీకుఁగట్టడ - చెప్పినాఁడ 86

క. ఈరీతి నుండినన్నున్ । గూరిమి మీఱంగనేలు - కొనగల్గినచో
గారవమున నీమాటకు । మారాడక మెలఁగుచుందు - మానుదుఁదపమున్. 87

క. తమవాంఛా సిద్ధికై | సమయోచితముగ వచించు - చానలనుడువుల్
భ్రమపడినమ్మిన మనుజుఁడు | తమిగాలము ద్రింగుమీను - దశఁ దాఁ జెందున్. 88

ఉ. ఏడుచునవ్వుకోపము వ-హించు వగల్పచరించుభీతిలున్
వేడుకనొందుసోలుఁగడు - వేదనఁ జెందుఁ జలంబుఁ గైకొనున్
వీడనివంతఁ దిట్టుదరు - ణీమణి నేర్పునవాంఛితాప్తికై
యోడకలోఁగఁ జేయు సమ - యోచితభంగి మెలంగిపూరుషున్. 89

ఆ. కాంత! మిమ్మునమ్మఁ - గాఁ జనదైనను | నొకట రెంట నెఱిఁగి - యుడుగుటొప్పఁ
జెడితిమున్నొకర్తు - చెప్పినమాటల | నాలకించి నీవు - నటులనైన. 90

క. శాపంబు నొసఁగుదునుని | వీపద్ధతు లెంచి యిచ్ఛ - యించి నిలువఁగా
నోపననుండుము నీకిది | యాపదగాఁ దోఁచెనేని - యరుగుముదివికిన్. 91

వ. అనిచెప్పిన. 92

గీ. పడతి యామాటలకు నొడం-బడకయున్నఁ | గార్యభంగంబు వాటిల్లుఁ-గదయటంచుఁ
జిత్తమున నెంచి యుండెదఁ - జెప్పినటుల | ననియె, విడిచెదపోనిష్ఠ-మునివరుండు. 93

క. అదిమొదలు మౌనినాథుఁడు | వదలని కామము నలన - వనజాక్షిననున్
గదియంగరాక మసలిన | నిదియేమని సంశయించి - నే నెఱుఁగమిచేన్. 94

మ. చిరకాలంబుననుండి నాయెడల న-క్షీణానురాగంబు ని
బ్బరమౌ బాళియు గల్గియుండునదియే - భంగిన్ నిరోధంబొ తా
స్థిరచిత్తంబున రాకయున్నది, మహో - చిత్రంబు మున్నిన్ని నా
ళ్లరయంగాఁ జనుదేరకుండు టెఱుఁగన్ - హాళిన్ విసర్జించెనే. 95

క. నాపైని వలపుతొలఁగెనొ | కోపించి బిడౌజుఁడెరుగఁ - గూడదనుచు నా
జ్ఞాపించెనొ పుణ్యాత్ముల | దాపుననున్నదియొ వీడి - తాఁ జనరామిన్. 96

గీ. అనివిచారించి తగువారి - ననిచియునికిఁ | దెలిసికొనిపోయి మౌనిని - ద్రించువేళ
నతివనెడగల్గఁ బిలిచిన - యరుగుదెంచి | యలమి ననుఁ గౌఁగిటం జేర్చి - యాసదీఱ. 97

వ. సమీపంబునంగల పూవుటీరంబునకుం గొనిపోయి యసమశరుని కేళిఁ దేలించి, యనురా
గంబు తేటపడ బహువిధసంభాషణంబులు నెఱపిన తదనంతరంబున, నీవిచ్చటకేలవచ్చితి
వని యడిగిన. 98

క. అసారస ముఖినాతో | నీసందేశంబుఁ దెలిపి - యిది నిర్జరరా
ట్ఛాసనముగాన కినియకు | మీసగణిని వచ్చుచుండు - మిటకనుదినమున్. 99

ఉ. స్నానముసేయఁ జన్నపుడు - సంధ్యయొనర్చెడివేళ దేవపూ
జానియమాలిన్ మెలంగుతఱి - సత్ఫలముల్గొనిపత్తునంచుఁ దాఁ

గానసమందుఁ గ్రుమ్మరెదు - కాలమునన్ నిదురించుజాము నం
గాని విడందుమానినను - కావున రమ్మ పుడిందు వేడుకన్. 100

వ. మునివరుండు నన్నుఁ బరులం గాంచి భాషింపఁగూడదని యాజ్ఞాపించియున్నవాఁడు. కావున నతండిప్పటి మనయుదంతం బెఱింగిన మిన్నకుండువాఁడు కాఁడు. మనమిచ్చోటఁ దడవు సేయఁదగదు. నేనింక నతనిచెంతకుం బోయెదనని పునరాలింగనంబుఁ గావించి మఱియుం గొన్ని రహస్యంబు లెఱింగించి యాశ్రమంబునకుం బోవుటయు, నంత నేనటనుండి చనుదెంచి నాఁడు మొదలు రమణీమణిక ఆపినచందంబున బ్రతిదివసంబునను నచటికిం బోయి వచ్చుచున్నవాఁడ నేతద్వృత్తాంతంబు నీకుం జెప్పవలయునను కుతూహలంబుతో నెపుడు వత్తువో యని నిరాకం బ్రతీక్షించుచుంటిఁ బుష్కరా! యిపుడు వచ్చితివని సంతసించితిఁ గాని నాసంతోషంబు వితయగులాగున భయంకరోదంతంబుఁ జెప్పితివి. నామనంబునఁ గర్తవ్యంబు తోఁపకున్నయది యని విశేషంబులన్నియుం జెప్పి కొంతదడవు మిన్నకుండి పిమ్మట. 101

చ. కడచినదానికై వగచి - కార్యము లేదిఁకఁ గాన నీవిటన్
దడవుగ నుండ కేగి గహ - నంబున మానివచించినట్టి యా
గుడి నివసించి కాళికన - కుంఠితభక్తి భజించుచుండు మి
య్యెడు మలుదీఱునంచు వచి - యించి మదిం గడుజాలిఁ జెందినన్. 102

వ. నేను సురపురనివాసుండనై యుండియు తత్పూర్వంబెపుడును రంభను జూచియుండని కతంబునఁ దెలియక నేనలచికవియనెంచినది నాప్రియమిత్రుండగు నలకూబరుని నేస్తకత్తెయగు రంభయే యని యతఁడు చెప్పిన యుదంతంబువలన నెఱింగినవాఁడనై యట్టి సఖుని విషయంబున నేను గావించిన యవజ్ఞతం దలంచి లజ్జయుఁ బశ్చాత్తాపంబును మనంబునఁ బొడమి, యంతటి యపకృతిఁ దనపట్లఁ గావించిన నాయందు కినుక వహింపక మదీయదుర్దశకు వగుచుచున్న యతని సద్భావంబునకు మెచ్చి యించుక ధైర్యంబుఁ బూని యప్పుడు.

చ. విధికృతమౌ టెఱింగియు వి - వేకివి నీవు ననున్ గురించి యి
వ్విధిఁ బరితాపమందుటన - వెఱ్ఱితనంబు గుణాఢ్య! నీమనో
వ్యధ విడుమంచు శాంతమగు - వాక్యములన్ ధృతిఁ బూనఁ జేసి నే
నధికరయంబుతో నతని - యానతిఁ గైకొని యెట్టకేలకున్. 104

క. అటనుండి కదలి విధినా । కిటువంటిది పోయటంచు - నెంతయు వగతో
నిటకరుగుదెంచి యీగుడి । నటునిటుఁ జరియించుచుండ - నాసమయమునన్. 105

క. అశరీరివలికెఁ బుష్కర! । కుశలంబగు మాటవినుము - గొబ్బున గుడి ప్రా
గ్దిశ నీకన్నులకుం దోఁ । చు శమీమూలమునఁ ద్రవ్వి - చూడుమ, యచటన్. 106

గీ. అద్భుతంబగునట్టి యో-గాశ్వమొకటి । కజ్జలకరండ మొకటియుఁ - గానుపించు
సిద్ధుఁడొక్కండుమునుసిద్ధిఁ-జెందువేళ।నచటఁబూడిచియుంచెఁదా-నదియునదియు. 107

చ. తలఁచిన చోటికింగొనుచుఁ - దక్షిణమేగఁగ నేర్చువాజిక
జ్జలమునుఁ గంటరాచికొని - చక్కఁగఁ జూచిన నెంతదవ్వునం
గలుగు విశేషమైనఁ దగఁ - గానఁగవచ్చుఁ జుమీయదంతె కా
దిలనెటనెవ్వరేమి పచి - యించినవే వినవచ్చువింతగన్. 108

క. కైకొనుము పోయివానిని । నీకుశుభంబగును దైవ - నిర్ణయమునకున్
వ్యాకులపడఁగారాదెద । లోకము సుఖదుఃఖమయ మ - లుకుదురెధీరుల్. 109

క. అనితెలిపిన నచ్చోటికిఁ । జనిపుడమినిఁద్రవ్వి వినిన - చందంబుననుం
డినఁగని యారెంటినిమె । ల్లనఁగొని నేమగలదేవ - శమఁజేరుటయున్. 110

క. తనువు వివర్ణంబయ్యెన్ । నను నేనెఱుఁగమి ఘటిల్లె - నయనంబులకుం
దనరెను సనిమేషతయుం । తనెమనుజాకార మోఁదవె - తత్వముమారెన్. 111

క. శ్రమపోఁచె నేదెనంబగ । గమనప్రజ్ఞయును బలముఁ - గడునాకలి ద
ప్పిమొనసెనొగిపూర్వజ్ఞా । నము సెడె దేనత్వమెడలి - నరుఁడనగుటచేన్. 112

ఉ. అంతటనేమిసేయుదు న-టంచువివేచన సేయుచుండి నా
స్వాంతము శాంతినొందమి వి - చారసముద్రములోమునింగి నేఁ
గొంతధృతిన్వహించి యిటు - గుందగనెవ్వరుమాన్చువారు ని
శ్చింతనిటన్వసించి నుతి-సేయుచునుండెద దుర్గనెప్పుడున్. 113

క. భాగ్యాను సారముగ భువి । భోగ్యములగు మేలుకీళ్లు - పొడెము తలంపుల్
భాగ్యము మూలంబెంతటి । యోగ్యులకేనియును దొలఁగ - దొఁగూడుతఱిన్. 114

మ. జనకుండంబుజనాభుఁడంబసిరి య-స్త్రంబుల్సరోజాదులై
దనిరుద్ధుండు సుతుండుమామశశి దు - గ్ధాంభోధిమాతామహుం
డనివార్యాసమశక్తియుక్తుఁడగుఁదా - నయ్యున్మరుండుగ్రులో
చనవహ్నిన్ సమసెన్వృథా చనవవ-శ్యంబేర్చుఁ బూర్వాఘముల్. 115

ఉ. వర్జితదోషుఁ డెంతయును - వైభవశాలి మహాధ్వరార్చితుం
డూర్జితశక్తి సంకలితుఁ - డుగ్రతరాశనిధారినిత్య వి
స్ఫూర్జితతేజుఁ డింద్రుఁడును - బూర్వమొకప్పుడు కోలుపోయెఁదా
నిర్జరరాజ్య భోగమును - నేరరుపోవిధిదాటనెవ్వరున్. 116

ఉ. అంతటివారలే యొఁదవి - నట్టి విపద్దశలందొలంపలే
కెంతయు వంతనొందిరను - కెంచిన నేనననెంత ? దీనికై

చింతలనేమి గల్గుభువిఁ-జేసినవారికిఁ జేసినంతయా
నంతియకాని మిక్కిలిసు-ఖానుభవంబదియేల చేకుఱున్. 117

ఆ. అనుచునిశ్చయించి - యపుడు మొదల్గొన్నాళ్లు । దుర్గనధిక భక్తి - తోడనమ్మి
పూజసేయుచుండఁ-బొడసూపి యాదేవి । తెలుపుమేమి వరము - వలయుననియె. 118

వ. కాళికాదేవి నన్నట్లడుగుటయు. 119

క. ఎదియెట్లు కావలయునని । మదిఁదలఁచినఁ దలఁచుకొన్న - మాడ్కినపుడెనా
కదియట్లొదవెడు వరమీ । గదవమ్మా! జనని యనిన - కాళికనగుచున్. 120

క. ఈవరమును నీవింతటి । తీవరమునఁ బడయలేవు - తెగిమొకయువిడన్
గావిడిన నొసఁగుదును నీ । కావిధమెఱిఁగింతు వినుమ - యదియెట్లన్నన్. 121

క. అవివాహితయుంజవ్వని । యువివేకియు రూపవతియు - నుర్వీశ్వర సం
భవయునసహోదరియునౌ । యువిదను గైకొందుఁగాని - యొల్లనితరులన్. 122

వ. అనితిరోధానయగుటయు, నాటఁగోలె దేవియానతిచ్చిన లక్షణంబులుగల జవరాలెచ్చటఁ
గలుగునోయని యంజనప్రభావంబున నప్పుడప్పుడచ్చటచ్చటవిలోకించుచుండి నేటిది
నంబు మదీయదృష్టిమీ పురంబునంకఁబ్రకరించిన నీయందంతంబంతయుం దెలిసికొని దుర్గ
కుఁబ్రియంబగు సర్వలక్షణంబులును నీయందమరియుండుటఁగని సంతసించి కపటవేషం
బునమాయాసైంధవంబారోహించి నీయొద్దకుఁజనుదెంచి భవదిచ్ఛానుగుణ్యంబుగాఁ
బ్రసక్తినడిపి నమ్మికఁబుట్టించి బలిఁబెట్టుతలంపున నిలింపమార్గంబున నిన్నిటంకుంగొని
వచ్చితి నటుమీఁద జరిగినవృత్తాంతము నీవెఱింగినదియ యనిపలికి మరల నిట్లనియె. 123

శా. ఓశాతోదరి! నీవునన్నటులనేఁ-డుగ్రాసిచేఁద్రుంపఁగా
నాశాపంబు తొలంగిపోయెఁగలిగెన్ - నాస్వస్వరూపంబుమ
త్క్లేశంబేదఁగఁ గంటినిప్పటికి; నిన్ -గీర్తించియీచిత్రసం
దేశంబేర్పడఁ బల్కిపోవుటకునై - నేవచ్చినాఁడంజుమీ! 124

ఆ. ఇదిమదీయ చరిత - మిపుడు పూర్వజ్ఞాన । మొదవెగాన నెఱిఁగి - కొదువలేక
చెప్పినాఁడనీకుఁ - జెలువ! యింకేమైన । నడుగవలసియున్న - నడుగుమనిన. 125

గీ. ఊబిపుట్టువు రేకుల - కుపమలైన । కనులనానంద బాష్పంపు - కణములొలుక
వింతయగుపుష్కరుని కథ - వినివెలంది । యబ్బురంబంది యతనికి-ట్లనియెనపుడు. 126

క. అటులనిరువుర శపించిన । జటిలుండెటువోయెనొక్కొ - చర్చింపఁగ నిం
తటిదనుక బ్రతికియుండునె? । దిటముగ నీకతనిపోక - దెలియునె చెపుమా. 127

ఆ. నావుఁడతఁడు పెక్కు - నాళ్లకుముందున్న । వాఁడుగాననిపుడు - పలుకఁజాల
నెటులనయ్యెనొక్కొ - యటుమీఁదదైవంబె । యెఱుంగుఁగాని నే నె - ఱుంగనబల! 128

గీ. అనుచు వచియించె గంధర్వుఁ - డంతలోన । నచటికొక మౌని చనుదెంచి - యల్లనగుచు
నేమియునుఁ గాక యున్నాఁడ - వింతదనుక । జటిలుఁడను నేన; మీ కేల - సంశయంబు.

వ. ఇపుడొక రౌషధికొఱకరుదెంచి యీగుడికి సమీపంబునఁ గ్రుమ్మరుచుండి ప్రస్తావవశంబున మీరు నన్నుఁ జేకొని మాటలాడుచుండుట నాలించి మీసందియంబు నారించి పోవఁదలంచి వచ్చితిం జుమీ! యనినఁ బరమాశ్చర్యసంభరితాంతరంగులై తత్పూర్వంబతని నెఱింగియున్న హేమయుం బుష్కరుండును సాష్టాంగదండప్రణామంబులాచరించిరి. రాజపుత్త్రియు నమస్కరించి భక్తివినయంబు లెసంగ నమ్మునిపతికిట్లనియె. 130

మ. ఇపుడీ హేమయుఁ బుష్కరాఖ్యుఁడును దా - మెన్నాళ్లకో పూర్వము
గ్రపుశాపంబుల నొందినారమని ప - ల్కన్వింటి మీరీ మహా
విపినక్షోణిని నాటనుండియును ని - ర్విఘ్నంబుగా నెవ్విధిం
దపముం జేయుచు మంటిరొక్కొ మునినా - థా! చిత్రమై తోఁచెడిన్. 131

క. హేమను శపించినంతట । నామఘవుఁడు మీతపోమ - హత్త్వముఁ జెఱుపం
గా మరల రంభననుచుట । నీమాన్యుఁడు సెప్పె రంభ - యిపుడెటకేగెన్? 132

ఉ. నావుఁడు నవ్వి నీకిదిమ - నంబున వింతగఁ దోఁచెనే? లతాం
గి! వినుపల్కెదం జరయుఁ - గ్లేశము దుస్సల క్షుత్పిపాసలుం
బోవఁగఁ జేయఁజాలు గుణ - ముల్గల యోషధులన్ భుజించి మే
మావడిలేక యోగమహి - మాతిశయంబున నుందుమిద్ధరన్. 133

గీ. బ్రదుకఁదలఁచిన యన్నాళ్లు - బ్రదుకుటకును । నెపుడు మదిలో విరక్తి వ - హింతు మపుడు
తనువు విడుచుటకును శక్తి - తనరు మాకుఁ । దరుణి! కనలేరు మామహ - త్త్వంబుఁ బరులు. 134

ఉ. ఎంతటికైనఁ జాలరె ము - నీంద్రులు కాంచి యెఱుంగ వౌటచే
వింతగఁ దోఁచె నీకు విను - వింగడ మేమియు లేదుసుమ్మియ
త్యంతగుణప్రదంబులగు - నట్టిమహౌషధులన్ భుజించియ
శ్రాంతము నిచ్చమైఁ దపము - సల్పుచునుండుదు జీవధారినై. 135

వ. మాబోంట్లు పెక్కునాళ్లు జీవించుటకుం దగినకారణం బెఱింగించితి నింక నీవడిగిన రెండవది యగు రంభవృత్తాంతంబుఁ జెప్పెదవినుమవ్విధంబున హేమశాపంబు నొందిననిమ్మట సంక్రందనుండు మరల నాచెంతకు రంభను బనుచుటయు, నది మొదలు తనశాపంబు తీఱువఱకును సమస్తవిషయంబులునుఁ బుష్కరునివలన వినియున్నదానవు, కావున దాని మరలఁ దడవంబనిలేదు. నావలనఁ బుష్కరుం డవ్విధంబునఁ దిట్టువడిపోయినంతట. 136

క. నాకుం దెలియఁగనీయక । నాకేవజనించుభంగి - నలకూబరునిం
జేకొనియుండుటయును నతఁ । డీకానకు వచ్చిచనుట - నెఱిఁగితలఁపునన్. 137

వ. రంభదుశ్శీలంబునకుంగినిసి, యోసీ! నీపైమక్కువంజేసి తపంబుఁజాలించి నీతోడి దియలోకంబనిశలంచినమ్మియున్న నన్నుఁగికురించి ప్రియంబున మఱియొకనింగలిసి వర్తించుచు నిరపరాధినియుంబోలెనటించుచున్న దానవు. నీప్రవర్తనంబు సర్వంబును గోచరంబయ్యె. నింతటియకార్యంబొనరించితివి గావునభూలోకంబునమానవయోనిం బుట్టుమనిశపించితి నయ్యవసరంబున రంభాసంగమవాంఛంజనుదెంచిచెంగటికుడుం గంబునఁడాఁగియున్న నలకూబరుండునుదృగ్గోచరుండగుటయువానిఁజేరంజని యాగ్రహంబున. 138

గీ. నన్నుగికురించి నేఁగోరి-కొన్నదానిఁ । గపయఁదలకొంటి వగుటచే - భువినిరంభ మాడ్కిఁబుట్టుము నీవును - మనుజయోని । ననుచుఁదిట్టినవారు భయంబుఁజెంది. 139

క. కామోద్రేకంబుననా । గాములు యోచింపలేక - కడుమీయెడలన్ మేమపచార మొనర్చితి । మోహానివరేణ్యా యింత - యునువిధికృతమా. 140

వ. కరుణించి శాపావసానసమయంబు ననుగ్రహింపుఁడాయని ప్రార్థించిన వారియందు జాలిఁజెందినవాఁడనై మీరిరువురును బాహుజకులసంభవులరై యనూనరూపలావణ్యాది శుభలక్షణంబులఁ బ్రసిద్ధివడసి సమస్తభోగంబులనుభవించుచుం బెద్దకాలంబుండి యనంతరంబునస్వస్వరూపంబులనొంది మీమీస్థానంబులకుఁజేరఁగలరు. మఱియొక విశేషంబువినుండు. 141

గీ. మీరలొండొరులనయంబు - మిగులవలచి । యుండువారలు గావున - నుర్విమీరు సతియుఁబతియును నై లోక-సమ్మతముగ।సిరియురాజ్యభోగంబులుఁ- జెందఁగలరు. 142

క. సత్యమున నొకరుబాతి । ప్రత్యంబున నొకరుమించి - వర్తింతురు మీ కత్యంతకరుణ విష్ణుఁడు । ప్రత్యక్షంబగును పిదప - భావుక మొదవున్. 143

వ. మీరుమనుజులై జన్మించుటకునిమిత్తంబై నయీవృత్తాంతంబుత్రిమూర్తులకుఁదక్కతక్కిన వారికెఱుఁగఁబడకయుండఁగలదు. చయ్యన నింకఁబనివినుండనివారలననిచి, యప్పటికిఁ దప్పని తోఁచిన మదనుచిత్రప్రవర్తనమునకువగచియంతనట్టిదుర్వ్యవసాయంబునకుఁజిత్తంబునాయిత్తపడనీయక యోగ్యంబగురీతినికాలంబుఁగడపుచుఁదపంబొనర్చుచున్న వాఁడ నీయడిగినప్రశ్నంబులకు సదుత్తరంబులిచ్చితి నవిపలికి యాచిలుకలకొలికి కతఁడుమరల నిట్లనియె. నాప్రకారంబున నావలనశపింపఁబడిన రంభానలకూబరులుమారాడనోరురాక కటకటంబడిపోయియిరువురునునిరుదేశంబులభూభర్తలకుఁబుత్త్రిందునుబుత్త్రికయునై జన్మించి దినదినాభివృద్ధిఁజెందుచుండ వారికియౌవనంబంకురించెనప్పుడు. 144

సీ. దైవికంబుగనొక్క - తఱివారలిరువురు - నొకచోటఁజేరితా - మొకరినొకరు వీక్షించుకొనుటకు - వేళచేకూరుట - యునుదమలోనమాఁనవిరాళి

నొందిరంతటిలోని - యోగంబువాటిల్లె - నదిమొదలొండొరుల్మదముతొలఁగి
కేలుంబనల్లునా - ర్తినిఁజెందివెతపడు - చున్నవారింక మే - లొందగలరు

ఆ. వన్నెలాడి! వింటె - కొన్నినాళ్లకులోన । నామనుష్యజనిత - కాముకులకు
జరుగఁగలదుసుమ్ము - పరిణయంబటుమీఁదఁ । బొసఁగు నెల్లగతుల- భోగములును. 145

గీ. చానరో! మఱియొక రహ-స్యంబుగలదు । గానియదిచెప్పరాదింక - పైనిఁగొంత
కాలమరిగినఁ దెలియఁగాఁ-గలవునీవు । పోయెదతపంబునకు నేను-ప్రొద్దువోయె. 146

చ. అనవుఁడు నబ్బురంబొదవ - నంగన యిట్లను నోమునీంద్ర! మీ
కనమఱి గల్గరిద్ధరణి - నింతటిసన్నుత యోగసత్త్వసా
ధనులగుటే నెఱుంగకమ - దంబున నిన్నిటిఁజెప్పపంటిలోఁ
గినియక తప్పుగాఁదలఁచి - కేరక మన్ననఁదేయుఁడాదయన్. 147

వ. అనిపలికిన యాకలికి పలుకులకు జటిలుండునగి, చాలుఁజాలుమావంటివారికిఁగోపమెక్కుడిది; సందియంబుగల యర్థంబునెఱిఁగినవారినడిగి తెలిసికొనుటనేరంబేలయగు దీనికింగిని యుదునే; నావలన నీకుఁజెక్కుసంకటంబులు తటస్థించెఁగదా! యని నేనుమనంబున వగచుచున్నవాఁడ పుష్కరునిశపింపకుంటినేని నీకీకష్టంబులు సంప్రాప్తింపనేరవు. దానంజేసి యిపుడిన్నిచిత్రంబులుపుట్టె. కడచినపనికివిచారించుట ప్రయోజనంబుకాదు. నీచరిత్రంబంతయు నేనెఱుంగుదును. 148

శా. ఓబింబాధర! దైవచిత్రమిదిని - న్నోలాకునొందించెని
ట్లాబన్నంబు తొలంగె సౌఖ్యసమయం-బాసన్నమానింకగా
రాబంబొప్పఁగ నీప్రియుఁగలిసి యా-రా! యంచుధాత్రీజనుల్
నీబంధుల్ నుతియింపవర్ధిలుము రా-ణించుచున్ భవద్భోగముల్. 149

చ. అలఘుతర ప్రవీణలర - యన్మన హేమయుఁబుష్కరుండు నే
యలజడినొంద నీకనిమి - షార్థములో నినునీదురమ్యని
ర్మలమణి హార్మ్యసీమనిడి - రాఁగలరంతట వేలుపాంటిలం
గలదు నిజంబునీకుఁ దల-కంబనిలేదిఁక నేనుపోయెదన్. 150

క. అనిచెప్పి పుష్కరుని హే । మనుగని మీారీక్షణమున - మదవతినిరయం
బునఁగొనిచని హార్మ్యముపై । ననువొందఁగఁజేర్చి యరుగుఁ-డనిశాసించెన్. 151

గీ. మంచిదాలాగుగావింతు - మంచువారు । ప్రొక్కిరతనికిఁ దానును - ప్రొక్కె రాజ
తనయయందఱుదీవించి-చనియెజటిలుఁ । డాశ్రమమునకుఁ గడుఁదడ-వయ్యెననుచు. 152

క. అంతట హేమాపుష్కరు । లెంతయు సంతోషమును వ-హించిధరిత్రీ
కాంతాత్మజ నిలుసేర్పఁగ । మంతనమొనరించి యపుడు - మహిమదలిర్పన్. 153

చ. జలరుహగంధి! నీవు నిను - సంబుకనుంగప మోడ్చియుండుమా
వలఁగనవచ్చునన్న నర - పాలకపుత్త్రిక యట్లసేసె; యా
వెలఁదుక హేమ పుష్కరుఁడు - వెంబడిరాఁగొని పోయివే యథా
స్థలమునడించి చూడుమిఁకఁ - జక్కఁగఁగన్నులు విచ్చినావుఁడున్. 154

క. కనకనిభాంగి యశోవతి | తనమేడం జేరుటెఱిఁగి - తగవారికిపం
దనములొనరించె నంతట | వనితను దీవించిచనిరి - వారుముదముతోన్. 155

ఉ. అంతటఁదాను వీడిచని - నప్పటినుండియు వర్తమానమొ
క్కింతయుఁ దామెఱుంగకయి - దేమియశోవతి కానరాదు నేఁ
డింతటిలోన నెందరిగె - నేర్పడదంచుఁ దలంకు నెచ్చెలుల్
సంతసమొందజేరఁ జని - సర్వము వారికిఁ జెప్పెఁదప్పకన్. 156

క. వినివారలు నివ్వెఱపడి | మునువినియుం గనియు నెఱుఁగ - ముబళీ! యీవిం
తనుమించిన వింతను, యే | మనఁగాదగు వినినగుండె - లదరెడుమాకున్. 157

క. తలఁపఁగఁ బసిదానవు వెఱఁ | దలఁగిమమున్ విడిచియెటుల - ధైర్యంబున న
ప్పలుగాకి మాయసిద్ధుని | పలుకులువిని పోయితమ్మ - భ్రమపడితరుణీ! 158

క. కమ్మనిమాటలు సెప్పిన | నమ్మంగాఁజనునె? పరజనంబులనుడువుల్
మమ్మేమరించి యెవ్విధిఁ | గిమ్మనకరిగితివి చెపుమ-కృత్యముగాదే? 159

వ. అనిపలుకుచుండ నందుమఱికొందఱు కప్పురగంధు లాపుష్పంధయవేణిం జూచి యిట్లనిరి.

సీ. ఎంతసాహసమెమా - కిదియిట్టిదని తెల్ప - కరుగంగఁదగునెనీ - వనియెనొకతె
భూకాంతుఁడేమను - నోకదా తెలిసియుం - చపలుచుంటిమిగదే - యనియెనొకతె
క్షణములోనందఱి - కనులుమూసితివెంత - కైనఁజాలుదువునీ - వనియెనొకతె
మాయసిద్ధునికల్ల - మాటలునమ్మఁగా - నగునెయాలోచింప - కనియెనొకతె

గీ. యారనీకెంత ధైర్యమే-యనియెనొకతె | యబల! యింకెన్నఁడిటు సేయ-కనియెనొకతె
వనటఁగొంటిమిగదవె మే-మనియెనొకతె | నినుఁగనుటచేత బ్రతికితి-మనియెనొకతె. 161

క. ఈరీతి సఖులుతోఁచిన | తీరునవచియించుచుండఁ - దిన్ననుడువుల
న్వారల వైరస్యంబును | వారించి ముదంబుఁబూన్చి - వనితామణితాన్. 162

ఉ. మంచిగ వారిమూలమున - మాతకుఁదచ్చరితంబునాత్మలో
మించినకోర్కియు న్వలపు - మీఁదటి కార్యవిధానరక్తిఁ జె
ప్పించిన నాలకించికడు - భీతియు నచ్చెరుపాటునొంది తె
ల్పించెను భర్తకుందగు వి-వేకులనయ్యెడఁ బంచిసర్వమున్. 163

శా. ఆవృత్తాంతము భూవిభుండువిని య - త్యాశ్చర్యమగ్నాత్ముఁడై
కావింపందగు నట్టికార్యమును సం - కల్పించి శీఘ్రంబుగా

దైవజ్ఞోత్తములన్ సుధీవరుల నా - ప్తవ్రాతమున్ బంధులన్
దా వేఁబిల్వఁగఁబంచి తెల్పఁగడుచి - త్రంబైన యావృత్తమున్. 164

క. అదివిని వారందఱు మే । మిదివఱకును వినియెఱుంగ - మిట్టివిశేషం
బిది నూతనమనిరి విభుం । డెదికర్తవ్యంబు తెలుపుఁడీ! యనియడిగెన్. 165

చ. అడిగినవారిలోన ఘను - లైనసుధీమణులో నరేంద్ర! మ
మ్మడుగఁగనేల? నింకభవ - దాత్మజగోరిన రాజపుత్త్రిని
ప్పుడు దడవంగనేమిటికి - భూరియశుండవు గావెనీవుయా
పడఁతుక వాంఛఁదీర్చుట కు-పాయము లెవ్వియులేవె మాడఁగన్. 166

చ. తరుణికిఁబెండ్లిసేయుటుచి - తంబగుకార్యముగానఁబూని స
త్వరముగ దేశదేశములఁ - దప్పకసద్భటకోటిచేస్వయం
వరమునుజాటబంపుమిఁక - నెత్తుగభూవరులెల్లనందు సుం
దరివరియించుఁదావలచు - ధాత్రిపునింద్రమదంబు మీరఁగన్. 167

క. వారలలోఁ దనమానస । చోరుఁడు లేకున్నఁదగిన - శుభమూర్తినిఁదా
జేకొని వరించుఁగామది । వారిజముఖి నతనికొసఁగి - వడయుముకీర్తిన్. 168

క. ఇదితగుయోచన యటులై । మదిఁదోఁచిన లాగొనర్పు-మా! యనుటయు రా
జిదియేమేలని చారుల । ముదమునఁ జాటంగ దేశ-ములకుంబనిచెన్. 169

ఆ. సకలదేశములకుఁ - జనిరాజసేవకు । లచటనచటఁదత్స్వ - యంవరంబు
జరుగఁబోవునట్టి - సమయంబుఁదెలియంగఁ । జాటివచ్చిరపుడు - సంతసమున. 170

వ. అంత. 171

చ. సొరదినిలోకులెల్లను య - శోవతిరూపవిలాస సద్గుణో
త్కరములు సన్నుతింపవిని - కన్గొనఁగాఁదటివేచియున్నభూ
వరులుచెలంగి యచ్చటికి - వచ్చిరనేకులు కాంతనారయన్
బొరసెను పుణ్యమిప్పుడని - భోరనఁగా విభవప్రయుక్తులై. 172

సీ. ఎవ్వొప్పటఁగనినమ - త్తేభదానోదకా - గ్రద్విస్మృపరాగక - ర్దమతలంబు
లెవ్వొప్పటఁగనినబా - హ్లీకదేశజాతాశ్వ - సంబద్ధరమ్యాకాం - చనరథంబు
లెవ్వొప్పటఁగనినచంద్ర - యూతనుద్యుతినిరో - ధశ్వేతకేతుఛ - త్రవ్రజంబు
లెవ్వొప్పటఁగనినన - రేంద్రసందోహాభి - రామవిభూషణ - రత్నరుచులు

గీ. నతిశయించెను తత్పురి - నాస్వయంవ । రావలోకనకుతుకయు - తాగతావ
నీవరస్తోమ విభవప్ర-భావసిద్ధిఁ । బరఁగుటనుజేసి కన్నుల - పండువుగను. 173

వ. ఆసమయంబున. 174

ఉ. ఏలలితాంగి రాజనుత - నింటికిఁజేర్చినో యాలతాంగితా
మేలొనరింప నెంచి తటి- మేకొనె నేఁడని పుష్కరాక్షుఁడో
వేలుపుగాణకా విధము - వేచని తెల్పె నతండుఁదత్క్రియా
లాలసుఁడై యశోవతిత - లంపొడఁగూర్తును పొమ్మనీవనెఁ. 175

వ. అనిచెప్పిన ననంతర వృత్తాంతంబునుఁ జెప్పుమని యడుగుటయును. 176

శా. జ్ఞానానంద మయస్వరూప! ఫణిరా - జన్మాభరోత్తుంగ శృం
గానూనో పరిభాగనిర్మితమనో - జ్ఞాగారమధ్యోన్నత
స్థానస్థాపిత రత్నపీఠ! పరిశు - ద్ధస్వాంత! శాంతిప్రదా!
మానీంద్రార్చిత! పద్మనాభ! యలమే - ల్మంగామనోవల్లభా! 177

క. వనజ వనజావతారా! ఘనరస ఘనరస సుపర్వ - గజరుచిరయశా!
ధనద! ధనదసఖవందిత! యనఘా! యనఘాంగ! శార్ఙ్గ - హస్త! సమస్తా! 178

సుగంధివృత్తము.

కేసరీంద్రవిక్రమా! నృ - కేసరీస్వరూప! గో
త్రానుపర్వసేవ్య! భవ్య! - దాసవాంఛితప్రదో
ల్లాస! సుస్మితాస్య! రాస - లాసకప్రధాన! మం
గాసమేత! పావనా! సు - గాత్ర! లోకజీవనా! 179

గద్య.

ఇది. శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాద లబ్ధానర్ఘళచతుర్విధ కవిత్వమహత్త్వాభి
రామ, భూసురకుల క్షీరపారావారపర్వశర్వరీసోమ, శ్రీవత్సగోత్ర
పవిత్రాపస్తంబసూత్ర, సావిత్రీలక్ష్మీనృసింహార్యపుత్త్ర,
సుకవిజనవిధేయ, పిచ్చయనామధేయ ప్రణీతంబగు
విజయాశ్వచరిత్రంబను ప్రబంధంబునందుఁ
బూర్వభాగంబునఁ బంచమాశ్వాసము
సంపూర్ణము.

శ్రీమద్వేంకటేశ్వరార్పణమస్తు.



శ్రీరస్తు.

# విజయాశ్వ చరిత్రము

## పూర్వభాగము

## షష్ఠాశ్వాసము.

క. శ్రీ లోకత్రయపూజిత ! పౌలస్త్యసమాశ్రితాంఘ్రి - పంకజయుగళా !
లీలావతార ! వేంకట । శైలోపరివాస ! భక్త - జాలోల్లాసా ! 1

వ. దేవా యవధరింపుము—సద్గుణగణవిశారదులగు శౌనకాదులకున్నతపుణ్యకథాశతాంగ సూతుండగు సూతుండిట్లనియె. నవ్విధంబునఁ గనకపురాధీశ్వరుండు నిజాత్మజా స్వయంవరంబుఁ బ్రకటించి, తదుత్సవవిలోకనాగతరాజలోకంబునకుఁ బ్రియంబెసఁగఁ దగినవిడుదులు చూపి, విడియింపనర్హులగువారిని నియోగించిన, వారలత్తెఱంగునఁ గావించుచుండి రట్టిసమయంబున నట్లు శ్రీపురంబున. 2

క. తటుకున నాఁడొకసంయమి । నిటలాక్షుఁడనంగఁదగిన - నిర్మలతరవి
స్ఫుటతేజోమయదేహుం । డెటనుండియొ పిలిచినటుల - నేతెంచి పురిన్. 3

మ. రమణీయోపవనాంతరంబునఁ గడున్ - రాజిల్లు కాసారతీ
రమునం బ్రోదిగనొప్పు రమ్యసహకా - రక్ష్మాజపార్శ్వంబునన్
క్రముకస్తోమముచెంత వేలఁగుకుడుం - గశ్రేణికిన్ మధ్యభా
గమునం జొంపపుఁ బొన్ననీడఁ జలువల్ - గావించు పూఁబాన్పునన్. 4

క. నిరశనుఁడై పంచశర । జ్వరతాప మ్లానవదన - జలరుహుఁడగుచుం
బొరలుచుఁ బలుమరును మనో । హరియగు ముద్దియనుదలఁచి-యతిదైన్యమునన్. 5

ఉ. ప్రక్కనుపుష్పతల్పమునఁ - బండినవీన మనోహరాకృతిం
జక్కనికన్నులన్ మొగిచి - శాంతముగా నిదురించువేళనే
నక్కునఁజేర్చి ముద్దుగొన - నైతిని మేల్కొనఁజేయనైతిఁజేఁ
జిక్కినదక్కునే ప్రియముఁ - జెందికొనంగ ననర్హుఁడెంచినన్. 6

క. అనివగచి మాటిమాటికిఁ । దనవలచిన సుందరాంగి - తగఁగన్నులఁదోఁ
చిన భంగినైన కలవర । మునుఁజెందుచు బాళిమించి - మదవేదిమదిన్. 7

సీ. తననర్మసఖుఁడుమం - దటఁజేరితాల్మికి - మూలమా విషయము - లుమ్మచ్ఛటింపఁ
గడుఁగూర్చుచెలికాఁడొ - కండు మెల్లగఁదాళ - వృంతంబుఁజేకొని - విసరుచుండ

విడువక నిరతంబు - వెంటనుండు హితుండు - తాపోపశమనకృ - త్యములొనర్పఁ
బ్రేమ రెట్టింపవ - ర్తించు మిత్రుఁడు వేంద్ర - మెక్కి వాడినపాన్పుఁ - జక్కఁ జేయ

గీ. యట్టి కార్యంబు లెల్ల నిక్కట్టుగాఁగ । బుద్ధిఁ దోఁచిన నొల్లక - పూర్వ విరహ
వేదనార్ణవ భీకర - వీచికాప । రంపరలనురియుచునుండు - రాజసుతుని. 8

క. స్థితిఁ గన్గొని యమ్ముని మది । నతని శుభాకృతిని మెచ్చి - యంగజు మహిమన్
నుతియించుచు నటకుం జని । చతురత నాశీర్వదించి - చక్కని నిలిచెన్. 9

చ. నిలుచు టెఱుంగక కతులను-నిబ్బరపుం దమి మోడ్చియుండియా
వలఁగను విచ్చి చూచి ముని - వచ్చినయప్పుడ మీఁగలిఁ దఱుఁ
దెలుపక యుంటిరేల? యని - దిగ్గున లేచి నమస్కరించి మి
త్రులయపరాధ మిప్పుడిది - దూఱకుఁ డాతఁడ నయ్యె నంచనన్. 10

క. కోపంబు లేదు మాకున్ । నీపయిఁ బంచాస్త్రబాణ - నికరానలకీ
లాపరితప్తుఁడవగుటన్ । బ్రాపింపదు బుద్ధి యొండు - పనుల కెఱుఁగుదున్. 11

క. అనిన గుచుం బలికిన ముని । తన లాగుం దెలిసెనని వితర్కించి రయం
బున నుపవిష్టునిఁ జేసి స । వినయోక్తుల నిట్టులనియె - విజయాశ్వుఁ డోగిన్. 12

శా. ఓయయ్యా! యెటనుండి వచ్చెదరొ యెం - దో యాశ్రమంబిత్తఱిన్
మా యోగంబున దర్శనం బొడవె బ్ర - హ్మప్రాయులౌ మీకు నేఁ
జేయంగాఁగల కార్యమెయ్యదియొకో - శీఘ్రంబుగాఁ బల్కుఁడా
పేయంబైన నసాధ్యమైన నగుమీ - యిష్టంబుఁ దీర్తున్ వడిన్. 13

క. నాపుఁడు విని యాసంయమి । నీ వెంతటికైనఁ జాలు - నేర్పుతివైనన్
లేవడినే నడిగెడిదియుఁ । గావింపఁగ వలసినదియుఁ - గలుగ దొకండున్. 14

క. నా యాశ్రమస్థలంబును । నా యోగ్యతయుం బ్రతిష్ఠ - నవవడి నీకే
లా? యడుగ; జెప్పినంతనె । చేయంగల దేమి కలదు - చెపుమ? కుమారా! 15

వ. అనిన విజయాశ్వుం డతనిం గని యనఘా! సత్యంబది యట్టిదియ, యని పలికి యడుగుటఁ జాలించి సముచితంబులగు నితర విషయంబులఁ గొంతవడి సంభాషించుచుండి, ప్రస్తావవశంబునఁ దన చరిత్రంబును సాంతంబుగా వివరించి, నేనిట్టి దుర్దశ ననుభవించుచున్న వాఁడ నేమి సేయుదునని దైన్యంబుగాఁ బలికిన నతనికి మునివరుం డిట్లనియె. 16

క. నేనాత్మదృష్టిచే ము । న్నే నీ చరితంబుఁ జక్క - నెఱిఁగితిఁ జెప్పం
గా నేల నీదు దైన్యము । మానిచి పోవచ్చితిం గుమారా! వినుమా! 17

వ. మదీయ తపోమహత్త్వంబుచే నంబరమార్గంబున హిమవంతంబుఁ జూచు కోరికం జనుచుండి నీ యుపవనోపరిభాగంబున కరుదెంచి నీ విచ్చోటఁ బల్లవతల్పంబున శయనించి యలయుచుం

డుటయుఁ జెక్కుటద్దము పెక్కువిధంబుల నీకుపచారంబు లొనరించుచుండుటయుఁ గాంచి, నిమిత్తం బెయ్యదియో యని యోచించి యోగదృష్టిప్రభావంబున వృత్తాంతంబు నెఱింగికొని, నామనంబునఁ గనికరంబు జనించుటం జేసి నీయడరు మాన్పి పోవఁదలంచి నేని పుడిటకుం జనుదెంచితి. రాజపుత్త్రికా! నీ వింక శుభంబు నొందఁగలవు. వగపు వీడి ధైర్యంబ వలంబింపుము. 18

ఉ. అనికకపాలనుండి యొక - యద్భుత సౌరభపుష్పమాలికన్
గొని, యిది దేవసూనతతిఁ - గూర్చినదామము కంఠమందుఁ దా
ల్చిన శుభముల్ ప్రసంగు మదిఁ - జింతలడంగు మహాత్ముఁ డొక్కరుం
డనుపమమంచుఁ జెప్పి ప్రియ - మారఁగ నిచ్చెను సుమ్ము దీనినిన్. 19

గీ. దీనినన్యుల కొసఁగరా - దైన నిపుడు | కనికరము మించె నీయెడఁ - గాననిచ్చి
పోఁదలంచితి నాకిట్లు - బుద్ధిపొడమె | నిదిగో! కైకొను మెదవుని - కష్టసిద్ధి. 20

వ. దీనిం దొలుత ధరించునపు డొకనియమంబు గలదు. ఎట్లనిన, శుచియై కాని తాల్పరాదు. కావున శీఘ్రంబుగా నీ విచ్చోటఁ గలకమలాకరంబున శిరస్స్నానంబుఁ గావించి ధౌత వస్త్రంబుఁ గట్టి భక్తియుక్తుండవై సూర్యునకు నమస్కరించి యటుపిమ్మట నీదండను కంఠంబున నలంకరించుకొనుము. దీని ప్రభావవిశేషంబువలన నభీష్టంబు సిద్ధించు నిది సత్యం బని యాశీర్వాదపూర్వకంబుగా కుసుమహారము నతని కొసంగి చాలఁదడవయ్యె నే నింకఁ బోయెద నని చెప్పి దిగ్గున మింటికుద్గమించి నిజేచ్ఛం జనియె నంత. 21

చ. సరగున నుండుచోటున నె - సంగడికాండ్రను నిల్పి యొక్కఁడే
యరిగి ముదంబు మీఱ ముని - యానతి లాగునఁ జేసి దండఁ గం
ధరమునఁ దాల్ప నెంచి యటఁ - దామరసాకరమందుఁ జొచ్చి భా
స్కరుని మదిన్ స్మరించి యుద - కంబులలో మునిఁగెం దటాలునన్. 22

మ. అతఁ డభ్యంగి మునింగి లేచి కనఁగా - నాశ్చర్యమాశ్చర్యమా
తత దివ్యాభరణాంబర ప్రసవ స-ద్దామాంగ రాగాద్యలం
కృతుఁడై నవ్యసుగంధబంధురమనః - క్లేశాపనోదానిలా
ద్భుతమా నొక్క మహామనోజ్ఞమగు క్రొం-బూఁదోఁటయం దుండె తాన్. 23

గీ. అంతలోన వ్విధమున వ - బ్జాకరంబు | తనయెఱుంగని యొకపురం - బునకుఁ గెలని
పుష్పవాటికయగుటయు-భూషణాదు | లపుడు తనకొదవుటయును-నతఁడు కాంచి. 24

క. ఇది యేమి మాయయో తెలి | యదు నాఁడంగనను గూర్చి - యలయించిన లా
గొదవె నిపుడు నాకీమా | రెది నేయును దైవగతికి - నేమనవచ్చున్. 25

క. పిలువని పేరంటమునకు | వలె ముని యరుదెంచె నతఁడు - వచ్చిన దారిం
దొలఁగి చనక నాకొకపూ | వులదండన్ జేనొసంగి - పోవఁగ నేలా ? 26

ఉ. మాయతపస్విమాట నిజ - మాయతఁడింపుగఁబల్కినట్టియా
ప్యాయన భాషణంబులను - హర్షముఁ జెందితి నమ్మ నేమదిన్
మాయురె! యెంతఁజేసిచనె - మార్గమునం బయిఁబోవువాఁడు తా
నీయెడ కేగుదెంచి ; యిఁకె-న్నెట్టి విచిత్రములావహిల్లునో ? 27

క. మునిరూపంబుననాదగు | మునుపటి దురదృష్టదైవ - మకటా ! ననుఁదా
ర్కొనిమరల నలంపఁగఁబూ | నెనుగాఁబోలుం దలంప - నేఁడిబ్భంగిన్. 28

క. అతఁడే కారణమింతటి | వెతకును; జేయంగఁదగిన - విధితోఁజదువుయీ
ప్రతిలేని భూషణాంబర | తతులొదవుట మాయగాక - తథ్యంబగునే ? 29

క. అనినిర్వేఅయును సంశయ | మును దనమానసములోన - ముప్పిరిగొనఁగా
మనుజేంద్రనందనుఁడునిలి | చినచోటనె నిలిచియేమి - సేయుదునని తాన్. 30

క. అటునిటు దిక్కులుగనుఁగొని | నటఁబుష్పంబులను గోయ - నరుదెంచిన యు
త్కటగజయానలు కొందఱు | దుటఁదోఁచినఁ గరిగివారి - తోనిట్లనియెన్. 31

ఆ. ఇంతులార ! మీర - లెవ్వరెవ్వరిదియీ | పూవుఁదోఁట ? యిచటి - పురికినామ
మెద్ది ? దీనికధిపు - డెవ్వఁడు ? పేరేమి ? | తెలియఁబలుకుఁడెల్లఁ - దేటపడఁగ. 32

చ. అనవుఁడువారు వింతపడి - యౌర ! యిదేమి విచిత్రమమ్మ ! యీ
తనివచనంబు; లిట్లుకల - దా ! యిపుడీపురికేగుదెంచి తా
మనలఁబురంబు పేరడుగ - మాఱిక నేమనవచ్చునిట్టి వా
రునుఁగలరే ? ధరిత్రిఁజతు - రుండితఁడెన్నఁగ నెల్లభంగులన్. 33

వ. ఇవిచాతుర్యంపుమాటలుగాక మఱియేమగు ? మనలఁబలుకరించుటకిదియొక సాకుఁగల్పిం
చుకొనియెంగాఁబోలుననియొండొరులు మొగంబులుజూచుకొని ముసిముసినగవులునగుచు
న్నవారియందొక్క టెక్కులాఁడితక్కుపూఁబోఁడులంగని యితఁడుకడుసౌందర్యంబుఁ
గలవాఁడు. మిక్కిలియోగ్యుండై కనుపట్టుచున్నవాఁడు. ఇతనిశుభలక్షణంబులుచూడ
రాజపుత్త్రుండుగాఁదోఁచుచున్నది. యెట్లైననయ్యేఁదానై మనలఁబలుకరించియడిగినపుడు
చెప్పకుండుటపాడిగాదని, యతనింజూచియిట్లనియె. 34

క. వినుఁడీపట్టణమునకుం | గనకపురాహ్వయముదనరు - ఘనుఁడగు శశిబిం
దునరేంద్రుఁ డేలుదీనిన్ | జనవందితుఁ డతఁడురాజ - చంద్రులలోనన్. 35

క. అతనికిఁగల దొకపుత్త్రిక | శతపత్త్రాంబకుని సతికి - సరియగులోక
స్తుతరూప భవ్యలక్షణ | యుతయది లేరెందునట్టి - యువతులుజగతిన్. 36

మ. ఇదియారాజవ్వని పూవుఁదోఁటనుమి! తా-నిచ్చోటికిన్ వచ్చి స
మ్మదలీలన్ విహరించుచుండుఁ జెలిమి - న్నమ్మందఅంగూడి యా

మదిరాక్షీమణి సుస్వయంవరమసా - మ్యంబై ప్రవర్తిల్లునేఁ
డిది మీకుండెలియంగరాదె? నృపులిం - దేతెంచుచున్నారొగిన్. 37

ఆ. ఆమహోత్సవమున - కేమేముసరములు । గూర్పఁబూలఁగోసి - కొనుటకిచటి
కరుగుదెంచి నార - మెఱుఁగులిందుఁజొరరాదు । తెలియరే మొమీరు - తొలఁగిచనుఁడు. 38

వ. ఇదిభూపాలుఁనిశాసనంబనిచెప్పి, యశోవతిలావణ్యావిలాసవిశేషంబులును, విచిత్రంబైన యాకుసుమగాత్రిచరిత్రంబును వివరించియాయెమ్మెలాఁడియతనితో మఱియునిట్లనియె. 39

గీ. ఉవిదకోరినపురుషుఁడెం - దుండుటయునుఁ । నెఱుఁగఁజాలక శశిబిందు - నృపతిదాస్వ
యంవరముఁ జాటఁబంచెత - ద్గమిటకు।రాఁగలఁడు చూచివరియించు - రమణియనుచు. 40

క. జాగయ్యెను మాకిచ్చట । వేగమపోవలయు మేము - విరులంగొనియిం
దోగితము కాదుమెఱఁగుట । బాగుగవిచ్చేయుఁడటకు - పరువడిమీరున్. 41

వ. అనిపలికి వారతనిచే ననుజ్ఞంగొని పురంబుఁజొచ్చి యరుగుసమయంబున నొండొరులు తమలోన. 42

ఉ. ఈనవమన్మథాంగుని మ - హీస్థలిలో సృజియించియొక్కొ బ్ర
జ్ఞానిధియంచు నెంతయును - సన్నుతిఁగాంచె విధాతృఁడింతితా
వీనివరింపఁగాఁ దగదె? - వీనినిమించిన సుందరాంగుఁడెం
దైననుగల్గునే? యితఁడె - యానొకొయంగనగన్నదానిసిన్. 43

గీ. దైవమీతని నేదయఁ - దలఁచియిపుడు । మన నరేశ్వరుపుత్త్రికి - మగనిఁజేయ
వలయు, నట్లయ్యెనేని సు - వర్ణమునకుఁ । బరిమళంబు ఘటిల్లిన - భంగినొప్పు. 44

వ. అనిప్రశంసాలాపంబులు బలుకుకొనుచుంజనినయ్యవసరంబున విజయాశ్వుండాయువతులవలనఁ దానువినినవృత్తాంతంబంతయుఁదనకుసంబంధంబగుచుదంతంబుగాఁదోఁచిన, యోజించి, తలఁపనితలంపుగా మునియొకండరుదెంచి పుష్పమాలికనిచ్చుటయు, జలాశయంబునిమిషకాలంబునకుసుమవాటికయగుటయుఁ, దానుకనకపురంబనుపట్టణముచెంతనుండుటయునిత్యాదివిశేషంబులుతలఁచి, దైవమాయకుమిగులనాశ్చర్యమొందుచు నింకనెట్టివిశేషంబులువొడమునోచూచెదంగాకయనినిశ్చయించిసందర్భంబులంబట్టి తానువలచిన యెమ్మెలాఁడియమ్మహీకాంతాత్మజయైయుండునొకో, యనిసంశయించి, తదీయస్వయంవరమహోత్స వాలోకనాభిలాషయతిశయింపనచ్చోటువిడిచినగరంబునఁ బ్రవేశించియప్పుడు. 45

మ. కనియెన్వాసవ నీలకల్పితగవా - క్షస్తంభ మాణిక్యకు
డ్య నభోమండలచుంబితాగ్రమణి హ - ర్మ్యగ్రావశిలాగోపు రా

భినుతానూనసువర్ణమంటప లస - ద్విఖ్యాతనానాసుర
త్ననికాయస్థగితాభిరామ గృహయు - క్తంబై నయామేల్పురిన్. 46

గీ. కాంచివిజయాఖ్యుఁడానంద - కలితుఁడగుచు । నచ్చెరువునొందిదైవమా - యాప్రభావ
మనవలయుఁగానియొండుగా - దన్యమైన । నింతలోనిచ్చటికిఁజేర - నెవ్వఁడోపు. 47

ఉ. హెచ్చినమోహవేదన స - హింపఁగలేక తపించుచుండఁన
న్నైచ్చెరఁగావఁగాఁదలఁచి - నేఁడిటుదైవము మానివోలెఁదా
వచ్చి నిమేషమాత్రమున - వాంఛనుదీర్పఁగ నేమొతెచ్చె న
న్నిచ్చటికిన్ ఫలాఫలము - లెప్పటికెట్టివొ కానవచ్చునే? 48

వ. అని తనలోఁదానుతలపోయుచు, నవ్వేటంగల విశేషంబులఁబరికింపుచుఁ గొంతవడి యటునిటుంబరిక్రమింపుచుండి, పిమ్మట స్వయంవరోత్సవాలోకనకౌతుకాయత్తచిత్తులై, ముహూర్తసమయంబు సమీపించెనని బహువిధాలంకృతదేహులై కడువడిం జనుచున్న రాజసమూహంబుతోడంగలిసియరిగి, యనల్పశిల్పికల్పనాభిరామంబును, మణిగణస్థగితశాతకుంభకుంభసంభృతస్తంభశోభితంబును, రమణీయగారుత్మతమణికీలితమకరతోరణాలంకృతంబును, సురుచిరహరినీలనికరనిర్మితతరాతరవాతాయనసముదయవిరాజితంబును, మనోహ్లాదకరపరిమళమిళిత మందమారుతప్రసారణకలితంబును, నరేశ్వరసమూదయోపవేశార్హ వివిధరూపప్రకల్పితరత్నపీఠవితానభాసురంబును, రాజన్యసందోహాలంకృతవిభూషణజాలజాతనిరుపమానప్రభా పరిపూర్ణంబును, విశాలంబునునగు కల్యాణమహాకూటంబుంబ్రవేశించి, యటవేచియున్న సచివపుంగవుండురాజానుమతింబూని భయభక్తివినయవిధేయతలెసంగనొసరించిన సత్కారంబులఁబరితృప్తినొంది తోడనుండువారలుందానును నుచితాసనంబులనలంకరించియున్నంత భేరీమృదంగాదినానావిధవాద్యఘోషంబులుమిన్నుముట్టుచుండె. నాసమయంబునఁ గనకపురాధీశ్వరుండుసంతసంబెసంగఁ దనపుత్రికందోడితేరఁదగువారలబుత్తెంచిన. 49

చ. సులలితమందగామిని యశోవతియు త్తజిఁ జిత్తమందు నే
వలచిన రాజనందనుడె - వల్లభుఁడౌననిపల్కెమానిము
న్నలఘుతరప్రభావయుతుఁ - డమ్మహనీయుఁడు సెప్పినట్టియా
పలుకుఁదలంపఁ బొల్లగునె? - భానువిధుల్గతిఁ దప్పిపోయినన్. 50

ఆ. సకలదేశవరులుఁ - జనుదెంచియున్నవా । రిచటికఁచుమింటి - నిపుడురాజు
లెల్లగరుగుఁదేర - హృదయేశ్వరుండేల । రాకయుండు? దెలియ - రాదునిజము. 51

ఆ. వచ్చియుండెనేని - వరియింతుఁగనుఁగొని । మనుజపతులయందు - మచ్చిరియుండు
గానరాకయున్నఁ - గామాగ్నికర్పింతుఁ । దనువు, నొరులనొల్ల - ననుచుఁదలఁచి. 52

వ. మనోజ్ఞానర్ఘాంబరరత్నాభరణంబులు ధరియించి పరిమళకలితాంగరాగప్రసూనమాలికాదు
లంగై చేసికొని, మేఘంబులనుండి వెలువడు క్రొక్కాఱు మెఱుఁగుఁదీఁగెయుంబోలె నిజ
హర్మ్యంబుననుండి వెలువడి యలంకృతాంగులైన సఖీజనంబులు పరివేష్టించి చనుదేరన్ పాల
సందోహంబున్న రమణీయకూటంబునకుం జనుదెంచుచున్న సమయంబున. 53

సీ. తెలిచుక్కతుదనాటి - నెలను మించఁగఁజాలు - గోముఁగల్గిన ముద్దు - మోముతోడ
దేనెచేతులగుంపు - తోనెనయైయొప్పు - కొమరైనయట్టిముం - గురులుదనర
నైదుకన్నులవాని - యాలినిఁబోలిన - సుందరాకారంబు - శోభిలంగ
నిరుపండ్లనిరసించి - పరిహసింపఁగఁజాలు - బెడఁగుఁగల్గినచిఱు-నడలుపాసఁగ

గీ. నొక్కవిరిబోణి యెటనుండి - యొక్కొ యపుడు । వనితముంపట దిగ్గన - వచ్చినిలిచె
మేదినికిడిగివచ్చిన - మించుభాతిఁ । గరము రాజిల్లు మణిశిలా - కయునువోలె. 54

చ. అటుచనుదెంచి వింతపడి - యట్టికనుంగొనుచున్నయట్టియా
కుటిలవినీలకుంతలను - గొబ్బునఁగాఁగిటఁజేర్చి కాంత ! నీ
విటులనెఱుంగనట్లుకనె - డేల ? ననుక్ మఱవంగనౌనె ? ప్రా
కటవిభవప్రమత్తులకుఁ - గల్గవొ పూర్వవివేకసఖ్యముల్. 55

క. దుర్గగుడినుండి యంబర । మార్గంబునఁదెచ్చి నిముస - మాత్రములో నీ
దుర్గతిఁదొలంచి యీయం । తర్గేహముఁజేర్చినట్టి - దానను హేమక్. 56

క. అడియాలముఁ జెప్పితిఁగద । పడతీ ! యిప్పుడైనగుఱుతుఁ - బట్టితివెననుక్
నుడువుమనుటయు యశోవతి । కడుసంతసమొంది యపుడు-గారవమొప్పన్. 57

క. వందనముఁజేసి తొల్లిటి । చందముగా కిపుడునీదు - సౌందర్యము మిం
చెం దెలియలేక నాలో । సందేహము గదిరిపలుకఁ - జాలకయుంటిన్. 58

క. నేరముగ నెంచకనవ్వుఁడు । నారా ! నీమీఁదగోప - మడరునె ? మదిఁబూ
జారిపయిఁ గినియుదేవత । కేరీతిం జరుగుఁబూజ - లిల ? ననినగియెన్. 59

మ. నగినం దానును నవ్వి రాజసుత, "పుణ్యం బెట్టిదో కాని నే
దగు వేళంగనుఁగొంటి నిన్ను నినుసందర్శించుభాగ్యంబుయే
వగఁజేకూరునొ యింక నంచుమదిలో - భావించుచుంటిం జుమీ !
భగవంతుండిపుడిందుఁదెచ్చెను తగం - బ్రాప్తించె నాకోరికల్. 60

క. కృపవీడకు మునిపలికిన । నిపుడెచటికిఁ బయనమైతి - వెఱిఁగింపవెరో
చపలాక్షీ ! యనియచ్చర । విపులాధరకుచయడిగెను - వేడుకమీఱన్. 61

వ. ఇట్లడిగిన యచ్చరమచ్చకంటిం జూచి విలాసవతియగు యశోవతి తానుకాళికాలయంబున
నుండి గృహంబునకుం జేరిన పిమ్మటం జరిగిన వృత్తాంతం బంతయుం దెలిపి, మదీయజన

కుండు నేఁడుస్వయంవరముహూర్తంబు నిర్ణయించియున్నకతంబున సకలదేశాధీశ్వరులును సనుదెంచి తదర్థంబునిర్మింపఁబడిన రమణీయంబగుకూటంబున సమావేశమై యున్నవారు. తండ్రియానతినిపుడచ్చోటికిఁబోవుచున్న దానను. ప్రయాణంబైనసమయంబునం దొలుత నీసందర్శనంబుగలుగుటఁజేసి యింక నాయభీష్టసిద్ధి కాఁగలదు. 62

క. అనిపలికిన హేమలతకుఁ । విని మోదముఁ జెందియనియె - నెలఁదిరో ! యిదినే
నును నెఱుఁగుదునైనను నే । మనియెదవో చూతమనుచు - నడిగితినిన్నున్. 63

వ. నేఁడు నీస్వయంవరముహూర్తంబు నిశ్చయింపఁబడియుండుట నెఱింగి నేనుత్వరితంబుగాఁ బుష్కరునిపాలికిం జని, యతనికీవృత్తాంతంబుఁ దేటపఱచి, భవత్ప్రియుండగు రాజకుమారునిచ్చోటం జేర్పుమనియు, నాలస్యంబొనరించిన మిక్కిలి దవ్వుననుండు వాఁడగుటం జేసి యింతటిసమీపకాలంబుననిర్ణయింపఁబడియున్న లగ్నమునకు రాఁజాలక యతం డొకవేళఁ బ్రయాణంబు గాకుండునేమో యనియు నటులనయ్యెనేని యతనికై నానాకష్టంబులుం జెందిన యశోవతియభీష్టసిద్ధిగాకపోవుననియు, కోరికసమకూఱకున్నఁ బ్రాణంబులఁబాయుంగాని యాచానయన్యులవరింపదనియు, సుగుణవతియైన యాయశోవతికిం బ్రియంబొనర్చుట మనకుగర్తవ్యంబనియుఁ బ్రబోధించిన, నతండునామాటలాలించి, యేతత్కార్యంబునొనర్చుటనీకుంబోలె నాకును నావశ్యకంబగుంగావున, సదుపాయంబుఁ జింతించి రాజపుత్త్రినిఁదప్పకలగ్నకాలంబునకుం గనకపురంబుఁ జేర్చెద మదీయప్రభావంబును నీవెఱుంగనిదానవుకావుగదా ! నామాట నమ్ము మనిపలికెనని, విచిత్రంబగు నొకతంత్రంబున నీమనోహరునిచటికిం జేర్చి, యావింత యుదంతంబంతయు నాతోడ వచియించెననియె. నీకీవిషయంబుఁ దేటపఱచిపోవఁదలంచి నేనిపుడిచ్చోటికిం జనుదెంచితి నిపుడు రాజపుత్త్రిండు స్వయంవరకూటంబునన్నవాఁడు. నీయందుమాకుం గలప్రియంబుకతంబున నీకుంబ్రత్యుపకారంబుగా మేమిరువురమును నిట్టి కార్యంబుఁ జేయసమకట్టితిమి. నీకింక శుభంబుగలుగుఁగాక. 64

క ద్విరదనిభయానచనికని । వరియింపుము వలచియున్న - వానిం బ్రీతిన్
బరిణయమై నీవతనినిఁ । గరమొప్పఁగఁ గూడిసుఖము - గనుమనయంబున్. 65

క. అనిచెప్పి మోదమున దీ । వనలొసఁగి వియచ్చరప్ర - వాళాధరత
త్క్షణమతిరోహితయయ్యెం । జనియెయశోవతియురాజ - సభకున్ వేడ్కన్. 66

సీ. హంసయానలతాంగి - యని చూచువారలే - కరిరాజగామినిఁ - గాఁదలంప
వనజాతముఖికాంత - యనిచూచువారలే - పూర్ణచంద్రాస్యఁగా - బుద్ధినెంచ
నబ్జలోచనలేమ - యనిచూచువారలే - సారంగనేత్రఁగా - సంశయింప
నళికులాలకభామ - యనిచూచువారలే - హరినీలకురుళఁగాఁ - బరిగణింప

గీ. వినుతపక్కినిమూర్తి ధ-రించివచ్చు । రమ్యతరమైన శృంగార - రసమనంగ
సఖులు సేవింప నెఱనీటు - సౌరుమీఱ । నొనరఁగావచ్చె భూపతు-లున్నయెడకు. 67

క. ఆయువిద చక్కఁదనముం । బ్రాయమ్మును హొయలుఁగాంచి - భ్రమఁగొనియెరా
రాయని మెచ్చుచుఁ గడుమో । హాయత్తస్వాంతులైరి - యటఁగలరాజుల్. 68

సీ. మెలఁతయో గ్రొక్కాఱు-మెఱుఁగొక్కొ-నిక్కంబుఁ-దెలియంగరాదని-పలుకువారు
నతివయో సమ్మోహ - నాస్త్రమో నిక్కంబుఁ - దెలియంగరాదని - పలుకువారు
ముదితయో స్మరశిలీ - ముఖమొక్కొ నిక్కంబుఁ - దెలియఁగరాదని - పలుకువారు
గాంతయో ద్విజరాజ - కళయొకో నిక్కంబుఁ - దెలియంగరాదని - పలుకువారు

గీ. నట్టికనువారు నిర్విణ్ణు - లైనవారు । సంచలించెడివారు వ - ర్ణించువారు
నుస్సురనువారలునుఁదల - లూఁచువారు । నగుచుఁగలవారమందర - య్యవనిపతులు. 69

ఉ. చంచలవీక్షణంబులును - జక్కనిముద్దుమొగంబు విద్యుతి
న్మించు శరీరకాంతియును - మెల్లనియానము మీఁదికిన్మిటా
రించినచన్నుదోయి యతి - రేకములైన పిఱుందులున్ నిరీ
క్షించి శుభాంగిపైవలపుఁ - జెందనివాఁడొకఁడైనలేఁడటన్. 70

గీ. అపుడు విజయాశ్వఁ డాయింతి - నట్టెచూచి । యానిసిని నేగనుంగొన్న-యదియు నాదు
మదినిహరియించి కొనిపోయి-నదియునిదియ। సందియము లేదుకలవుల - క్షణములెల్ల. 71

గీ. మాయముని నన్నునిటఁజేర్చె - మంచిదయ్యె । నంచుఁబొంగితి నీమంద - యాననన్ను
దావరించునో యొండ్లపైఁ-దలఁపుఁగొనునో। దైవతంత్రమెట్టిదో యని-తలఁచుచుండె. 72

క. అత్తటిజనకుని యానతి । నత్తలిరుంబోణి సకియ - యప్పుడిచ్చినయ
త్యుత్తమ సుమదామముఁగొని - చిత్తజుసామ్రాజ్యలక్ష్మి చెలువునవేడ్కన్. 73

క. కైదండయొసఁగి యొక్కతె । లోదరిపార్శ్వమున వచ్చు - చుండఁగనుల స
మ్మోదంబును నానయునా। పాదిల్లంగులుకునడలు - పరఁగహొయలుగాన్. 74

వ. రాజసమూహమధ్యంబునఁ బ్రవేశించి, నిజమనోహరావలోకనకౌతూహలాయత్తచిత్తయై
క్రమక్రమంబుగా నందఱంగనుంగొనుచు మెల్లమెల్లగాఁ జనుచున్న సమయంబున. 75

ఉ. ఎవ్వనిఁగోరునో చెలువ - యెవ్వనిపైఁ దనచూడ్కి నిల్పునో
యెవ్వనిమీఁద నిచ్చయొకో - యెవ్వనికిం బ్రియపత్ని యౌనొయిం
దెవ్వనిపూర్వపుణ్య ఫల - మిత్తఱిఁజేకుఱునో యటంచుఁదా
నవ్విజయాశ్వుఁడష్ట మది - యందున సంశయమొందిచూడఁగన్. 76

సీ. అదెనన్నుఁ గాంచుచు - న్నదివరించునటంచు - లేనిగాంభీర్యంబుఁ - బూనెనొక్కఁ
డదెనన్ను డాయుచు - న్నదివరించునటంచు - తోడవులసవరింపఁ - దొడఁగెనొక్కఁ

డదెనన్నుఁ జూపుచు - న్నదివరించునటంచు - నీటుగా మీసలు - దీటెనొక్కఁ
డదెనన్ను మెచ్చుచు - న్నదివరించునటంచు - హో యలుగాఁగనుచుఁ గూర్చుండెనొక్కఁ
ఆ. డిటులనచటఁ గలమ - హీపతులందఱు | ననువరించునబల - ననువరించు
ననువరించుననుచు - నమ్మివీక్షింపఁగా | వారినెల్లఁ గడచి - వారిజాక్షి. 77

ఉ. కేరళశూరసేన కురు - కేకయ మత్స్యవరాటలాటగాం
ధారసురాష్ట్రబర్బర వి - దర్భకిరాత కళింగవంగకా
శ్మీరపుళిందపారసిక - సింహళబాహ్లిక ముఖ్యదేశపృ
థ్వీరమణావళిందనము - దిరఁగణుతింపక పోయియొక్కెడన్. 78

క. తానంతటఁ గనియె సతీ | మానసమానసభవున్ సమంజసవిభవున్
ధీనిర్జిత సురగురువున్ | భూనాథతనూభవున్ సుముఖుహ్యాత్రప్రభువున్. 79

మ. కనిసంతోషములజ్జయుం బ్రియమునం - గబ్రభంశ మొప్పారమో
హనపుంజూడ్కులు సొంపుఁ బెంప మునివా - క్యంబాత్మలోనెంచి యొ
య్యనడాయంజనఁగాఁ దలంచుమది పై - ర్యంబేది శంకించుఁ గ్రీఁ
గనులన్ మాటికిఁ జూచుఁ దత్తఱపడున్ - గాఢానురాగంబునన్. 80

ఉ. కాంచనగాత్రి చూడ్కిఁ గ్రతుటి - కాలములోఁ బ్రసరించెవింతగా
నెంచఁగవేయిమాఱులు హ్యా-దీశునికంఠము పైఁగరస్థగ
మ్యాంచితసౌరభప్రసవ-హారము పైనటఁ గాంచువారికిం
జంచలనేత్రయాటపుడు - సత్యముగాఁ గనుపట్టుచుండఁగన్. 81

సీ. తారకానికరము - గ్యంబునఁ జెలువొందు - పూర్ణచంద్రునిభంగిఁ - బొలుపుమించి
విబుధబృందములోన - విష్టరశ్రవుపోల్కి - నిరుపమానోత్సాహ - గరిమఁదనరి
గ్రహములయందుభా - స్కరునిచందంబున - వినుత తేజస్ఫూర్తి - విస్తరిల్లి
మృగసమూహంబున - మేటిసింగముమాడ్కి - గాంభీర్యధైర్యాల - క్షణములెసఁగి
గీ. యచటినరపతులకునెల్ల-నధికుఁడగుచు | మిగులఁ జెలువొందు విజయాశ్వ-మీఁదిదృష్టి
మరలిరాకున్నఁ ద్రిప్పఁగ-మనసువోయి | తానునటుండి రాలేక-దగులువడియె. 82

వ. అప్పుడాకప్పురగంధి యొట్టకేలకునొక్కింతధైర్యంబు నవలంబించి తత్క్షణంబున. 83

క. డాయఁగజనుటయు మరుఁడోహో | హోయని పెల్లార్చి పేర్చి - యుగ్మలి పెనుచం
దోయికి నడుమన్ నూటిగ | నేయంగాఁ దొడఁగెఁ గడిమి - నిషుపంచకమున్. 84

క. ఆయులిపివానిశితనుమ | సాయకహతికిందలంకి - సఖియంసము పైఁ
జేయూఁదియొరిగెనపుడా | హా ! యని నిముసంబుసోలి - యంగన; యంతన్. 85

ఆ. మనసు దృఢముఁ జేసి - తనలోన నచ్చోటి | వారెఱుంగకుండ - నగనటించి
మందగమన మొప్ప - మదహంసి చాడ్పునఁ | జిత్తచోరు మెచ్చి - చేరఁబోయి. 86

సీ. వీఁడెకదా! లోక - వినుతసుందరమూర్తి - యైననా హృదయాప - హారకుండు
వీఁడెకదా! నిసి - వేళనా శయ్యపైఁ - బవళించియుండిన - ప్రమదకరుఁడు
వీఁడెకదా! మోహ - వివశాత్మనగు నన్ను - విడిచిపోయినయట్టి - విధుముఖుండు
వీఁడెకదా! పెక్కు - విధముల వేడినఁ - గనువిచ్చి కనకున్న - వినుతయశుఁడు
గీ. వీఁడెకద! నేను వలచిన - విభవశాలి | వీఁడెకద! మానిచెప్పిన - విమలగుణుఁడు
వీఁడెకద! సర్వలక్షణా - న్వితుఁడుఁ బ్రియుఁడు | కంటి నిప్పుడు కన్నుల - కఱవుదీఱ. 87

క. అనితనకుం బెన్నిధియ | బ్బినగతిఁ గోల్పడినమణిల - భించినభంగిన్
మనమున నుప్పొంగుచు మో | మున మందాక్షంబు వలపు - ముడివడి పెనఁగన్. 88

ఉ. ప్రియ మెసఁగంగఁ బైఁట సవ - రించుచు సాధ్వస మొప్ప లోకవి
స్మయకరమంగళాంగవిల - సత్ప్రభలుల్లసిలంగ లోచన
ద్వయిఁ బరితోషవారికణ - వర్గము జాఱ నొయారి చేతులన్
రయమునఁ జాఁచి యచ్చటిఘ - రావరులందఱుఁ జూచుచుండఁగన్. 89

క. చరణములు వడఁక బులకాం | కురములు మైమెనయఁ జెమట - గుబ్బతిలఁగని
బ్బరపుఁ దమి నతని గళమునఁ | దరుణీమణి వేడ్కఁ బుష్ప - దామము వైచెన్. 90

తే. వైచి సిగ్గొనరఁగఁ దల - వాంచి చెంత | నిలిచె నపుడొక నూత్నమా - చెలువు దోఁచెఁ
జెలువముఖమున విజయాశ్వుఁ - డలరెఁ జాలఁ | జిత్తజుని రాజ్యరమనుఁ దాఁ - జెందినట్లు.

ఉ. ఆవిరిబోణి యందమును - నారుచిరాస్య కుమారురూపమున్
భూవరులట్టై చూచి తగుఁ - బోజతవీరలకుం గడానికిం
దావి పొసంగినట్లుగు వి - ధాతృని కూర్పిది యంచు మెచ్చి సం
భావనఁ జేసి రీర్ష్యతమ - భావములందు వహింపకత్తఱిన్. 92

వ. అంతఁ గనకపురాధీశ్వరుండు విజయాశ్వుని మిక్కిలి గౌరవించి, యతనివలన వలయు విషయంబు లెఱింగికొని, విధ్యుక్తంబుగా వివాహంబుఁ గావింప నెంచి యక్కార్యంబు నెఱవేరునంతదనుక రాజుల నెల్ల నిలువుండని ప్రార్థించి యొప్పించుకొని, తద్వృత్తాంతం బురుచిరాస్యమహీపతికిం దెలిపి, బంధుమిత్రపరివారసమేతంబుగా నతనిఁ దోడ్కొనివచ్చుటకుం దగినవారిం బుత్తెంచిన, వారును శీఘ్రగమనంబున శ్రీపురంబునకుం బోయి, తనపుత్త్రిం డువోయినజాడ నెఱుంగఁజాలక జాలఁ ఖిన్నుండై వనరుచున్న యన్నరపతిని యుచితభంగి సందర్శించి నడచిన యుదంతంబును సాంతంబుగా నివేదించి ముహూర్తంబు సమీపముగా నుండుటం జేసి త్వరితంబ పయనంబు సాగించుట యుక్తంబని చెప్పిన; నతండు తద్విష

యంబు నాలించి సంభ్రమాశ్చర్యానందమగ్నమానసుండై దైవఘటనంబట్టిదయ్యెనని నిశ్చ
యించి, ప్రయాణసన్నాహంబుంగావించి యప్పుడు. 93

చ. ప్రియసుతు పెండ్లికిందగిన - పెద్దలనాప్తుల బంధుమిత్రసం
చయమును బిల్వఁబంచి తగు - చందముగాఁ బయనంబుఁజేసి ని
ర్ణయమగులగ్నవాసరము - నాటికిఁదప్పకఁజేరులాగునన్
రయమున నేగుదెంచె ధన - రత్నచతుర్బల సంయుతంబుగన్. 94

చ. కనకపురీశ్వరుండతని - గౌరవమొప్పఁగఁ దోడితెచ్చి తా
వినయమెలర్ప వేఁడడిగి - వేడుకతోఁ దగుచోటఁదక్షణం
బునవిడియించె నంతగుణ - భూషణుఁడావిజయాశ్వుఁడుబ్బునన్
జనకునకుం బ్రణామములు - సల్పి వచించె నుదంతమంతయున్. 95

ఆ. అతఁడు సుతుఁడుసెప్పి - నట్టివృత్తాంతంబు । వినిమనంబులోన - వింతపడుచు
నిదివిధాతచెయిద-మెవరేమిచేయుదు । రనుచుపలికి పెండ్లి - కనుమతించె. 96

క. ఆనాఁడె పెండ్లిలగ్నము । గాన నొనర్పంగఁదగిన - కార్యములెల్లన్
బూనిసువర్ణపురీశుని । యానతిఁగావించి తెలిపి - గపుడునియుక్తుల్. 97

ఉ. పిమ్మటఁగార్య వేదులగు - పెద్దలయానతి నింపుమీఱవే
గమ్మన నుష్ణవారినిడఁ - గాజలకంబొనరించి మంచియో
గ్యమ్మగు వస్త్రభూషణ సు - గంధవిలేపనమాలికాదులన్
సమ్మతిమైగరించి హరి - చందముగా విజయాశ్వుఁడొప్పఁగన్. 98

వ. అపుడు కొందఱుమందయానలు నృపనందనంబెండ్లికూతురినింజేయఁబూనిసంతసంబున
నయ్యంబుజాక్షిందోడ్కొనివచ్చి పసిండిగద్దియపైఁగూర్చుండఁజేసిరట్టియెడ. 99

గీ. తరుణికొకలేమ సంపంగి - తైలమంటి । మేనపరిమళయుతమైన - మెఱుఁగురాచి
పలుకులెడపినసునిబిండి - నలుగుఁబెట్టి । కలియనటికలినిడితోమి - జలకమార్చె. 100

క. వడఁతుకకొక్కతె నెరులం । దవిమొత్తెనుచిక్కుడల్చెఁ - దగనొక్కతెయే
గృహధూపమిడియెనొక్కతె । కడుసొంపుగ నొకతె కీలు - గంటుగముడిచెన్. 101

మ. చెలువాబంగరు వన్నెచీర నొకరా - జీవాక్షికట్టెన్ సము
జ్జ్వలరత్నాభరణంబు లొక్కతెయిడెన్ - సొరొప్పఁగాఁగాటుకం
దిలకంబున్మృగీయోర్తుపెద్దెఁదోడిగన్ - చేటంచుపైతాణికం
చెలనొక్కర్తుక యోర్తుపూవులనుగై - సేసెన్ముడిన్ గాంతకున్. 102

గీ. పునుగు నత్తరుఁగుంకుమ - పూజవాజి । మేళనముఁజేసిపన్నీట - మెదిపిపచ్చ
కప్పురముఁగూర్చి నూరిన-గందమలఁది । భామకొకలేమ ఘుమఘుమ-పరిమళింప. 103

వ. ఇట్లు సర్వాలంకారశోభితులై, యశోవతీవిజయాశ్వులు రతీమన్మథులో యని చూపరు
లకు సంశయము పొడమం దగులాగున నొప్పుచున్న యయ్యవసరంబున. 104

చ. తడవొనరింపఁగాఁదగదు - దాఁగొనె లగ్నమటంచు పెద్దల
ప్పుడు విజయాశ్వునిన్ నృవర - పుత్త్రిని రమ్యవివాహవేదికన్
బడిబడి రుక్మపీఠముల-పై నుపవిష్టులఁ జేసి తొల్త నే
ర్పడఁగ గణేశ్వరార్చనము - భక్తి నొనర్చిరి భావుకాప్తికిన్. 105

చ. వెలయఁ బురోహితార్య పృథి - వీసురవర్యులు కూడి యంతఁద
త్కుల మరియాదలందనవి - గొబ్బున శాస్త్రవిధిన్ బొనర్పఁగా
వలసిన కార్యముల్ సలిపి - నావిరిసందఱు మంగళాష్టకం
బులఁ బఠియించి రైదువులు - పూవులు సల్లిరి సంతసంబునన్. 106

క. మంగళతూర్య రవంబులు । నింగిఁ బ్రతిధ్వనులనీన - నిలువక మొఱసెన్
సంగీత నినదములు గణి । కాంగనల విలాసనర్త - నాదులు మించెన్. 107

క. ప్రాకట వస్త్రాభరణా । స్తోకాలంకారరుచులు - తొలఁకఁగఁ బికా
ళీకల నాదంబులగా । రీకల్యాణంబుఁ బాడిరి సరోజాస్యల్. 108

వ. తదనంతరంబున విప్రజనానుమతిం గొని సుముహూర్తంబునఁ బురోహితుండు గృహ
దేవతార్చనంబు నిర్వర్తించి పెద్దలాశీర్వదించి యొసంగిన మాంగల్యంబును, తండులఫలపుష్ప
హరిద్రాకుంకుమసహితంబైన పసిఁడిపళ్లెరంబున నిడి పూజించి, యోగ్యులగు పెద్దలచే స్పృశిం
పఁజేసి, తడవొనరింపక విజయాశ్వుని చే నొసంగిన. 109

క. పొంగుచు శుభలగ్నంబున । నంగజసామ్రాజ్యలక్ష్మి - నలమెననఁగస
న్మంగళ సూత్రముఁ గట్టెను । భృంగాలక గళమునందు - విజయాశ్వుఁడు తాన్. 110

గీ. అతుల మాంగల్యమును గట్టు - నట్టివేళ । భూపతుల జయధ్వనులును - బుధజనముల
దీవనల యారవంబును - దిశలు ముట్టెఁ । జాలఁగా వాద్యనిచయఘోషంబు లెసఁగె. 111

క. చెలువుండును జెలువయు శిర । ములపై నొండొరులు మంచి - ముత్తెంబులు దో
యిలులఁ గొని యాసలూరఁగఁ । దలఁ బ్రాలం బోసికొనిరి - తద్దయు వేడ్కన్. 112

గీ. పంచశరనీపటిమ యింక - భగ్నమగును । పొమ్మటని ధూళిఁ దూర్పునఁ బోసెననఁగ
గందవడి దోయి టంగొని - సుందరాంగి । నగుచుఁ బతిమీఁద నొయ్యన - నెగయఁ జల్లె. 113

క. పటగ విజయాశ్వుఁడును దా । నటు వలెఁ గావించెఁ జూచి - యటఁ గల జవరాం
డ్రిటు తగునని గురుకుచములు । కిటకిట నొరయంగ నొరిగి - కిలకిల నవ్వన్. 114

గీ. విప్రసాధ్వీమణులు చాల - వేడ్కమీఱ । భాసురంబైన ముత్యాల - పళ్లెరములఁ
బూవు మంగళములు బాడి - పోసఁగ హార । తులను బట్టిరి వేడ్కవ - ధూవరులకు. 115

గీ. పొగడిరందఱు నృపులును - భూమిసురులు । చెలఁగియాశీర్వదించిరి - కులజులిష్టు
లెంతయును సమ్మదమునొంది-రెల్లజనులుఁ । దృప్తిఁగొని హర్షవార్ధిలోఁ-దేలిరంత. 116

వ. శశిబిందునరేంద్రుండమందానందకందళితహృదయారవిందుఁడై, భూసురబృందంబులకును నర్థిజనసందోహంబులకును, జాంబూనదాంబరాభరణంబులును, ధనధాన్యమణిగణచ్ఛత్ర సుందరమందిరసముదయంబులునురథగజతురంగగోనిచయాగ్రహారంబులును,యథేష్టంబుగా నొసంగి, మృష్టాన్నపరితుష్టులంగావించి మించినప్రియంబున దేశాంతరాగతమహీవర నికరంబులఁగరంబుగౌరవించి, సముచితసత్కారంబులొనరించియందఱుఁదగువిధంబున వీడ్కొలిపె, నయ్యవసరంబునరుచిరాస్యుండుతానునుస్వపురంబునకుంబ్రయాణంబగు టయుఁగనక పురీశుండతనివారించి కొన్నిదినంబులందునిలువఁబ్రార్థించిన నతండియ్యకొని యచ్చోటనిలిచె, నిట్లువివాహమహోత్సవంబు నిర్విఘ్నంబుగా నెరవేరుటయు నటుపిమ్మట. 117

శా. నేఁడేమంచిముహూర్తమంచు చెలులే - ణీనేత్రనారాసుతున్
నాఁడేకూర్పఁదలంచి యాపవలుపి - న్మాణంపు భావోక్తులన్
ఓఁడబ్బెన్మనమేలనింకఁ బనితీ - అన్ బల్కఁగాఁబోదుతాఁ
దేఁడున్ బో ప్రియుఁగూడినేఁటినిసి సం - తృప్తిన్ గడున్మేలగున్. 118

గీ. పోదమింకేమిమాటలీ-పొలఁతితోడ । పకులతోఁబల్కదని సఖుల్ - బరిహసింపఁ
బులుకుపులుకునఁ గనుమఁ గ-న్నులనునీరు । నించుటీక్షించినగికాఁగ - లించివారు. 119

క. కాంచనగాత్రికి మదిలోఁ । గించఁదొలంగంగ బుజ్జ - గించిముదముఁగ
గ్గించి నినుఁబరిహసింపను । టంచు వినోదించుచుండె - నారిగ్రుంకుటయున్. 120

క. వారుతగఁబడకటిలు సిం । గారింపఁగఁ బూనిసేయఁ - గాఁదగినపనుల్
నేరిమినొనరించి యలం । కారము కడునొప్పుచుండఁ - గానచ్చోటన్. 121

గీ. పటములను గట్టిసొగసైన - పైఁడికోళ్ల । పట్టెమంచముపైమెత్తఁ-బఱచినాల్గు
ప్రక్కలనుగొప్పరత్న దీ-పములువెలుఁగు । పగడపుంబెద్దదివ్వెగం - బములునిలిపి. 122

గీ. తీరుఁగాఁజాట్టునాణెము - త్తైపుసరములు । వ్రేలఁగాఁగట్టిశయ్యపై - విరులునెరపి
దెసలనిలువుటద్దంబులఁ - దెచ్చియునిచి । పరిమళోదకములుసల్లి - పద్మముఖులు. 123

చ. అమరఁగమంచిపోఁక పొడి - యాకులుమెత్తనిముత్తియంపుసు
న్నమువఱిగల్గువీడియపు - నాలుగువస్తువులున్ సుగంధలే
పములనుబాలుఁ జక్కెరయుఁ - బక్వఫలంబులుఁబిండివంటలున్
గ్రమముగఁదెచ్చియుంచిరటఁ - గన్నులకింపగుపైఁడితట్టలన్. 124

గీ. అపుడచటఁగలవస్తువు - లట్టెచూచి । యన్నియును జేర్చితిమిగద - యనుచునొక్క
మగువపెరవారినడిగిన - మఱచినార । మనుచుఁగొనివచ్చియునిచెవీ-జనమునొకతె. 125

వ. ఇట్లుపడకటిల్లుసింగారించుచున్నతతీఁ దద్విధంబంతయుంగాంచిలోలోననుబ్బుచుఁ దన సంతసంబుఁబయలుపడనీయక సిగ్గునందలవాంచియున్నకన్నయశోవతింజూచి ముసిముసి నగవులునగుచు సఖీజనంబులాబింబోష్ఠింజేరంజని. 126

సీ. ఇవినీకుఁగావ్రుసు - మ్మేమ్మలచూచెదవుమా - రాజపుత్త్రినకనె - రామమొకతె
రాజపుత్త్రినిసామ్మ - రమణిదిగాకున్నె - యదియేమిమాటనె - నలివయొకతె
మాటయెట్టిదోచూడ - మాయింకగడియలో - నిపుడేమిసామ్మనె - నింతియొకతె
నెఱపించెదేలనే - విరిబోణియంతనే - రనికూనగాదనె - రమణియొకతె

గీ. మగనిలోఁ గోనఁగాగల - తెగువదారి। గానిమాచానమదిశంకఁ-బూనదనియెఁ
గాంతయొక్కతెసఖులిట్లు - సంతసమునఁబలువిధంబులవచియింపఁ - దలనువాంచి. 127

క. మారాడకున్ననృపనుత। తీరంగనియొక్కతేను - ధృతివీడకుమో
నారీలలామరాజకు। మారుఁడునిన్నేమిసేయుఁ? - మానుముకొంకున్. 128

వ. అనిపలికియాకలికిందనకౌఁగిటంబాదివిపట్టియిట్లనియె. 129

చ. సురతసుఖానుభోగములఁ - జొక్కినిజేశునినిండుకౌఁగిలిన్
మరగియలక్ష్యభావమున - మమ్మదలంపకయుండకమ్మ! నీ
స్ఫురదరవిందపత్రనిభ - సుందరలోచనసత్కటాక్షను
స్థిరపరితోషితాత్మలను - జేయుచువేడ్కభరింపుమీచెలీ! 130

మ. కలికీ! మంచిమగండుగల్గెనని త - త్కౌతూహలోద్రేకసం
కలితోద్వృత్తినిజేసి మాయెడల స - క్తంబైననీబుద్ధియా
వలనెల్లైననునయ్యెఁగానిప్రియమొ - ప్పంబెంచుచున్నట్టియా
చెలువౌముద్దులకీరశారికలపైఁ - జింతన్మదిన్నిల్పుమా. 131

క. అనియొకసక్కుపుమాటలు। వనితలువచియింపమాటు - వలుకకయున్నన్
గినియఁగనవ్వుచునందఱు। వనరుహగంధినిఁగలంచ - వలెననువాంఛన్. 132

సీ. అదెవచ్చెనీవిభుం - డనిపల్కిబెదరియా - గజయానయాదెసఁ - గన్నవవ్వి
నేఁడుమున్నటికన్న - నీమోముచెలువొందె - ననఁగసరిసఁజాల-ననునయించి
మావంకఁగనుటనీ - వీవేళనేకదే - యన్ననవ్వలిమొగం - బగుడుఁజీరి
మంచిదికానిమ్మ - మాన్పింతునీబిగు - వనఁజిన్నబోవఁబ్రి - యంబువలికి

గీ. కేలిసేయుచుమజ్జన - శాలఁజేర్చి। జలకమార్చియర్హాంబరో - జ్జ్వలవిభూష
ణాంగరాగాద్య లంకృతు - లపుడొనర్చి। షడ్రసోదనమిడిచాల - సంతసమున. 133

క. బతిమాలి మంచిమాటలఁ। జతుర్గ్వతమెలర్పఁబలికి - జవ్వనినాథున్
గొంకుకొఁగఁగడు యత్నంబున। వెతఁబడి పడకింటఁదెచ్చి - విడిచిరిచానల్. 134

ఉ. అంతట వేడ్క మీఱ విజ - యాశ్వుఁడు మజ్జనభోజనాదుల
త్యంతరయంబునం దగిన - యట్లొనరించి యలంకృతాంగుఁడై
కాంతలు దారివెట్టమణి - కల్పితభూషణ సద్రుచుల్ గృహా
భ్యంతరసీమఁ బర్వ నవు - డచ్చటికిం జనుదెంచి సమ్మతిన్. 135

క. ఆసంస్కృతమృదులప్రస । వాసేచననిబిడసౌర - భాసాదకర
మ్యాసమతల్పముపైఁ దా । నాసీనుండయ్యెఁ దనర - నాసమయమునన్. 136

శా. క్రేగంటన్ బతిఁ జూచి సంభ్రమమును - ద్రేకంబు మందాక్షమున్
రాగంబుం బొరయన్ శరీరము గగు - ర్పన్ రాజసంభూతసం
భోగోత్సాహము వేగిరింపఁగ ముఖం - బున్ వాంచి యత్యంతమా
ప్రాగల్భ్యంబును సొంపుమీఱ నొకయో - రన్ నిల్చియున్నంతటన్. 137

క. చెలులా సుందరి తీరుం । దిలకించి యిదేమియొ యులుకో - తెలియుండనియా
వ్వలిమోమై నగుమసతీ । తిలకంబును జేరవచ్చి - దిగులుడుపుటకై. 138

క. అటు తోడ్కొనిచని యందఱుఁ । దటవటమాటలను పలువి-ధంబుల మరిగిం
చుటకుం బలుకఁగఁ దనకౌఁ । గిటుఁ గాంతనుఁ జేర్చి యొకస - కియ యిట్లనియెన్. 139

సీ. అబ్బఁ బెన్నిధివంటి - యాత్మప్రియుఁడు నీకు - మనసు దీఱఁగఁ గూడి - పెనఁగవేల ?
నీచెంతమును శయ - నించియుండినవాని - వీక్షింపఁగా నిట్లు - వెఱచెదేల ?
సరసకుఁ బోయి ము - చ్చటదీర నతనితో - సరససల్లాపము-ల్జరుపవేల ?
వీనికై కడపెక్కు - వెతలొందితివి కై వ - శంబయ్యె నింక సం - శయమదేల ?

గీ. సుందరాంగునిఁ గన్నెత్తి-చూడవేల ? । మాకుఁ జెప్పినమాటలు - మరచితేల ?
తలఁగి యొక యోరగాఁ బోయి-నిలువనేల? । ముద్దుగుమ్మరో ! నీకింత-మోడియేల? 140

క. అనిపలికిన పలుకులు దా । వినియును విననట్లు బెడచె-విని బెట్టి మొగం
బును ద్రిప్పి మిన్నకుండినఁ । గనితక్కంగలుగు చెలులు - కదిసి వినుగునన్. 141

క. కడుగడుసుదానవే నీ । వడుగడుగున కింత మూర్ఖ - మటవే ? యిట్లై
క్కడఁదైనఁ గలదె ? నాథుని । కడకుం జన నొల్లవేమి - గాఁ దలఁచితివో. 142

క. మనమెంత తెలియఁ జెప్పిన । వినదిఁక విరిబోణి నిచట - విడిచి తొలఁగి క
న్గొనకేగుద మతఁడే చ । క్కనసేయును గాక మనకుఁ - గష్టంబేలా ? 143

వ. అనిపలికి యంతఁ బోక మరల యశోవతిం జూచి యిట్లనిరి. 144

సీ. ఇటు మోడిసేయుదు - రటె పతిచెంతకుఁ - జనక నీవలె నింతు - లనియొకనొకతె
వలచి నిద్రాహార - ములుమాని యీతని-కై కాదవె తఁగొంటి - వనియెనొకతె
మనమిట్టివాగల - మదినెఱుంగుట కష్ట - మాసలేకుండునే - యనియెనొకతె
పడఁతుక కడుబెఱ - పడియున్న దూరక - యదలించి పలుకకుఁ - డనియెనొకతె

గీ. చాలుఁజాలును బాగాయె - మేలుమేలు । కలరుబోయిట్టి బూమెక-త్తెలుజగమున
నోరెఱుంగని కూనరో ?-యారమంచి । మాటలను వినదిదియేమి-మతమొకాని. 145

ఆ. ఇంతసిగ్గునెఱపు - నింతలో నెటువచ్చె । మున్ను తానెఱుంగ కున్నవాఁడె
యతఁడఁటంచుఁ బలికె - నందొకభామిని । నెగటునొందెనొక్క - విద్రుమోష్ఠి. 146

ఉ. సారెకువారలిట్లుపలు - చందములన్ వచియించుచుండఁగా
వారినదల్చియొక్కచరిత - వాయపుఁబల్కులు మానుఁడింక మీ
కోరిమిలేదు సిగ్గుపడి - యున్నదిచిన్నది తాళుఁడంచుఁదాఁ
జేరఁగఁదీసి యిట్లనుచుఁ - జెప్పెఁహాస్యముగాఁ బ్రియోక్తులన్. 147

చ. ఒకనిసినొక్క జామరత - నుండెనితఁడలనాఁడు ముగ్ధవై
యొకటియునెన్నఁడుందెలిసి - యుండని నీవపెయాదిగాఁగనో
పికమదిమాని యొక్కమొగిఁ - బెన్వలపుంగొని నెట్టిదాని పో
లికఁదపియించుచుంటివి ఫ - లించెను గోరికనేఁడుకోమలీ ! 148

వ. మదిలోనశంక విడిచి । మ్ముదమునవల్లభునిగూఁడి - మోహముపేర్చన్
గదియించి యొగముఱమ్మనఁ । బదరక భోగింపవమ్మ - బంగరుబొమ్మా ! 149

క. పతిచెంగట మెలఁగఁగఁదగు । వితమునుదెలిపెదను నీకు - వినుముగ్ధవునీ
వతివరో! యుచితంబుననను । చితమును బాగుగనెఱుంగు - చెలువసుఖించున్. 150

సీ. పతిమోహముననిన్నుఁ - బజ్జకుండేర్చినఁ - దొలఁగకఁగౌఁగలీ - వలయునమ్మ
విభుఁడుతాఁగొఱికిన - వీడెంబొసంగిన - వలఁతివై కైకొన - వలయునమ్మ
యాత్మేశ్వరుండల్క - నందిపల్కకయున్న - వలపించియదిమాన్ప - వలయునమ్మ
ప్రియుఁడుగతిశ్రమ - బెరసిసోలినవేళఁ - దొలఁగించిపైకొన - వలయునమ్మ

గీ. చెలఁగిమురిపెంబు సూపంగ - వలయునమ్మ । తలఁపులొక్కటి సేయంగ-వలరొ
వగలుపచరించి మెప్పింప - వలయునమ్మ । వల్లభునికూర్మి గడియింప - వలరొ 132

క. పొమ్మాయటుచెంగటికని । కొమ్మకుబోధించి పట్టు - కొనియుండినచ్వే
లమ్మచెఱంగును సదుపా । యమ్మనవిడిపించికొనియె - నంగనయ్యుంచి

సీ. చిలుకలకొరఁజెట్టు - వలయుంజిమీనేఁడు - తపవాయెననియొక్కతరి
సచ్చోటనిడికంఠ - హారంబుఁగైకొన - మఱచితిననియొక్క - మ్రాబువలికి
మృగశాబకముచాల - దగదొట్టియుండునీ - రిడనైతిననియొక్క త్వాలవిభూష
నిదొవత్తుమఱలన - న్నెప్పరోపిలుచుచు - న్నారిపుడనియొక్క - సంతసమున. 133

గీ. పూవుటెత్తులు గొనివత్తుఁ - బొలఁతులార । వేగముననియందఱ
నందఱునుమాయమై రిడే-మనుచుఁదలుపు । దిగ్గునను గొళ్లెమిడిరువిచానల్. 134

క. ఈలాగున సఖులరిగిన । నీలాలకమదినిసిగ్గు - నిండాగవిలా
సాలోకనమాలానిక । రాలంకృతుఁజేసి విభుని - నటువీక్షించెన్. 154

గీ. అటులఁ గ్రేగంట నొక్కమా - రాత్మపతినిఁ । జూచినంత నెపమయంబు - వేచియున్న
శంబరద్వేషియట్టిహా - సంబొనర్చి । వరుసనై దమ్మ్ములేసియి - ర్వారఁగలంచె. 155

చ. కలఁచినసైఁపక లేకతమ - కంబున నవ్విజయాశ్వఁడేలనే
చిలుకలకొల్కి ! యీతపము - చెంతకు రమ్మనిచీరి యట్టితా
నిలిచినచోటనేనిలిచి - నేలఁగనుంగొను కాంతకిట్లనున్
బిలిచినఁబల్కవేల? వెతఁ - బెట్టఁగనాయెననున్ మనోహరీ! 156

క. ఔరా ! యనితల్పముడిగి । చేరంగాఁబోయియెంత - చెప్పినవినవీ
తీరేమి? నన్నెఱుంగవె । నారీమణి ! నీకువెఱపు-నానయునేలా ? 157

క. ఇటుమోడిచేసి ననునే । చుటనాయమె ? సైఁపఁజాల-సుమశరతాపో
త్కటసంకటమతినైనే । కటకటపడుచున్నఁ గరుణ - గల్గదెనీకున్. 158

క. ఒవ్వనివాఁడెనెచెపుమా ! । పువ్విలుతుని కేళిసుఖము - పొసఁగెననుమలో
నువ్విళ్లూరుచునుండఁగఁ । జివ్వనిపించెదవుమనసుఁ - జెలువా ! చెలువా ! 159

క. శుకవాణీ ! నినునీఁకనూ । రకవిడుతునె ? కోర్కెదీఱ - రతికేళినిఁగూ
డక; నోడకురారమ్మా । చకననిపయ్యెదనుబట్టి - శయ్యకుఁదార్చెన్. 160

ఉ. తారిచికాఁగిటంబొదివి - తామరసాక్షినిఁగుస్తరించితాఁ
గోరికదీఱముద్దుఁగొని - కొంకునులజ్జయువీడి వేడ్కచే
కూరెడిలాగునందగిన - కోడిగపుంబనులొక్కకొన్ని యెం
తేరపిమీఱఁజేసి యెల - యింపఁగఁబూనినఁదక్షిణంబునన్. 161

బున్నకుచంబులింతికవ - నీవగనందనుమీఁది యగ్గమా
క. కడుగడుసఁజేసి కంచుకము - మాకిటనొక్కనిరోధమాయటం
క్కడనైనఁర్కశత్వమును - నొప్పదటాలునఁజించిమించి ; యా
క. మనమెంత తెఱ్ఱసంపద మ - హిన్ దొడరంగనె పుట్టుగర్వమున్. 162
గ్గొనకేగుదమతఁశ్రు - వీక్షింపకుండిన । మరునిసాయకముల - చురుకు వ్రేటు
వ. అనిపలికి యంతఁ కిటునటునైనమది । యుయ్యెలయునువోలె - నూగఁదొడఁగె. 163

సీ. ఇటుమోడిసేయుదనామణి । గజిబిజిపాటపుడుచక్కఁ - గాఁగనుఁగొనియో
వలచినిద్రాహార - ఙఁకనం । గజతాపమునైఁపతరము - గాదనుచుఁదమిన్. 164
మనమిట్టివాగల - ఁ - గాఁజేయిసాఁచినఁ - జేగరాకటుద్రోసి- యొరగిల్లి
వడఁతుక కడుకొ - ల్కుద్దాడఁబూనిన - బిగువుమీఱఁగమాటు - మొగముపెట్టి

ననమోవినొక్కనో - య్యన మెడయొగ్గిన - నళికహస్తంబుల - నడ్డగించి
తమిమించినీవిప - దల్పఁగాఁదొడరినఁ - బెనుసిగ్గువహియించి - బిగియఁబట్టి

గీ. కోరిచనులంటవచ్చినఁ - గొంగుఁదార్చి । యడరిపైకొనఁ గడఁగిన - యవలకరిగి
చెలఁగివేఁడినఁదాఁబెడ - చెవిని బెట్టి । కాంతయలయించెఁ గాంతునిఁ-గొంతసేపు. 165

గీ. అటులనలయింపఁదమిమించి - యనునయించి। కదిసివెఱనడఁగించివ - ల్యెదఁదొలంచి
కొంచకింపైన చనులప్పళించిమరుని। పొగరుడుపనెంచియురముగం-బునఁగదించె. 166

ఆ. ముదితకపుడుపోక - ముడిజాఱెఁదనయంతఁ । గొంకుతోడసిగ్గు - కొంతజాఱె
నక్షులందుపమ్మ - దాశ్రువుల్ దిగజాఱె । నతనుచేతిబాణ - మపుడుజాఱె. 167

ఉ. ఇంతివిముగ్ధచేష్టితము - లెంతయునింపుజనింపఁజేయఁదా
సంతసమందియుత్తమగు - చందమునన్ సరసంపుమాటలం
గొంతఁదలంకుమాన్చి యను - కూలవతిం బొనరించెవల్లభుం
డంతనితాంతమోహకలి - తాత్మకయైన్నృపపుత్త్రియుండగన్. 168

చ. జతపడవల్కిలోఁబడఁగఁ - జాతురిమైఁబతిసేయుచేష్టలన్
మతిఁగడుమెచ్చియింకనిటు - మల్లడిఁగొల్పఁగరాదు మానినీ
గతివెతఁబెట్టుమన్నఁగిను - కన్నను నెట్టుదలంచునోయసం
గతమునుసంగతంబెఱిఁగి - కార్యములంబొనరింపఁగావలెన్. 169

గీ. కొలఁదిగానట్టి పెనువెతల్ - గుడిచికుడిచి । వలచివరియించినట్టి నా - వల్లభునకుఁ
బ్రియమురెట్టింపఁగాఁగూడి - పెనఁగకున్న । నేమిఫలమనితలపోసి-కోమలాంగి. 170

క. స్మితముఖియైనిజపతి యభి । మతమున కనుసారముగాఁగ - మసకొనుటయు స
మ్మతినలరియతఁడుదనక । ప్రతిమానశ్రీపొసఁగిన - భంగిఁదలఁచుచున్. 171

శా. చాతుర్యంబునదేశకాలములని - చ్ఛాజాతిభేదంబులున్
ధాతుస్సత్త్వకళావిశేషములుఁద - త్తత్తారతమ్యంబులున్
రీతుల్దంతనఖక్షతక్రియలు సం - శ్లేషంబులున్ బంధచా
శీతిన్ జుంబనధర్మముందెలిసిరా - జిల్లంగఁగూడెన్ సతిన్. 172

క. అప్పటివారలభోగముఁ । జెప్పంగాఁదరముగాదు - చెలువయునతఁడున్
ముప్పిరిగొనుమోహంబున । నొప్పుగఁ బెనఁగిరి యథేచ్ఛ-నుత్సేకమునన్. 173

చ. ఒనరఁగనొండొరుల్వలచి - యుండినవారఁట జాలరూపయౌ
వనముల నిర్వురుందగిన - వారఁట భోగములన్ గుణంబులం
దునుగొదలేనివారలఁట - నూతనసంగమమయ్యెనంటయు
ట్లనియుఁకవారి సౌఖ్యమహహా! విధికైన గణింపశక్యమే? 174

క. ఈరీతిని విజయాశ్వుఁడు । నారీమణితోడఁగూడి - నానాగతులం
గూరిమిభోగించుచు నొగి । వారత్రయమప్పురమున - వసియించిపయిన్. 175

ఆ. నిజపురమునకరుగ - నిశ్చయంబొనరించి । తండ్రికెఱుఁగఁజేసెఁ - దనకడంక
సంతసమున నతఁడు - చయ్యనశశిబిందు । ధరణిపతికిఁదెలిపెఁ - దక్షణమున. 176

మ. అనుమానింపకతండుసంతసిలి మే - లౌఁగాక యంచనప్పుడా
య్యనవిద్యుంకునిచిత్తముందెలిసియా - గ్యంబైనలగ్నంబునం
దనువొందన్ బయనంబుఁజేయుటకునై - యత్నంబుగావించె సా
చ్చినసంప్రీతిని బంధుపుల్గుపనుల్ - శీఘ్రంబుగాఁదీర్పఁగన్. 177

వ. ఇట్లుసన్నాహంబుఁగావించి విద్యుంకునిందగువిధంబునంబూజించిచీనాంబరమణివిభూ
షణాదులగుకానుకలొసంగి, యల్లునింగూతుం బిలిపించియప్పుడు. 178

చ. వినుతయశోధనుండు శశిబిందుమహీపతి మోద మొప్పఁగా
ననుపమభూషణాంబరగ - జాశ్వచయంబులఁ జాలనిచ్చియ
ల్లునిఁదగగారవించిమృగ - లోచనయాతనపుత్రికన్ బ్రియం
బునఁబయనంబు సేయుతతి - ముఖ్యులుబంధులుఁజాల మెచ్చఁగన్. 179

చ. హరులొకలక్షయన్నియహ - యంబులునన్నియ తేర్లుకాల్బలం
బగయతదర్ధమూడిగపు - టంగనలందఱునింక భూషణాం
బరములు శయ్యలున్ శిబిర - వర్గమునొక్కొకవేయివేయితా
నరణ మొసంగెఁగూఁతునకు - హర్ష మెలర్పఁగ, వేశ్మనత్తతిన్. 180

చ. అలరినిజాంగనాసహితుఁడై విజయాశ్వుఁడుభక్తి నత్తమా
మలకు నమస్కరించి హిత - మంత్రిపురోహిత బంధువర్గమున్
సలలితభాషణంబులఁ బ్రి - సన్నులఁజేసి యనుజ్ఞనొందివే
విలసితభర్మహర్మ్యమును - వెల్వడివచ్చెడి వేళనాదటన్. 181

శా. సైనంబై పతివెంటఁబోవఁగనిచె - ప్పంగల్గుసద్బుద్ధులం
దానొయ్యారికుమారికిం దెలుపఁగాఁ - దర్కించితన్మాతయెం
తేనింగూరిమిమీఱఁగాఁబిలిచి, పుత్రీ! సాహితోక్తుల్ శుభం
బౌనీకుందగనాలకింపుమనియా - ప్యాయంబుగానిట్లనున్. 182

గీ. అత్తవారియింటి - కరిగిననవ్వోట । మెలఁగఁదగినరీతిఁ - దెలియవలయు
నిచ్చవచ్చినటుల - నితరస్థలంబుల । యందువోలెనడచు - టచటఁదగదు. 183

క. నన్నెడఁబాసియెఱుంగవు । మున్నెన్నఁడుఁగాననిక్క - ముగనేనీ మే
లెన్నెడి దాననుగావునఁ । గొన్నివిధుల్ నీకుఁదెలుపఁ - గోరితినబలా! 184

క. హానియువృద్ధియుఁ దెలియని । దానవుపసిదానవే వి-ధంబునఁబతిభా
వానుగుణవిహితరీతులఁ । బూని మెలంగుదువొ కానఁ - బోలదునాకున్. 185

క. పతిమాటలకెదురాడకు । మతనిని నీపాలిదైవ - మనితలఁపుము స
మ్మతిసేవఁ జేయుమనెం । ద్గతిమార్గము పతియయేడు - గడయగుపతికిన్. 186

ఉ. వేసరకత్తమామలను - వేల్పులభంగిఁదలంచివారికా
యాసముఁగల్గనీక విన-యంబునసేవయొనర్ప మెప్పుడున్.
పూసలలోని దారమును - బోలె మెలంగుము బంధుకోటిలో
నీసరివారు మేలని గ-ణింపఁగఁ గీర్తిగడింపు మెప్పుడున్. 187

చ. పతిమతికెక్కనట్టియతి - వంగనిబంధువులీసడింతురీ
క్షితిజనులెల్లదూఱుదురు - చెంతనుగమ్మని పిల్వరెవ్వరుం
గొతుకుదురిచ్ఛలేకతెగఁ - గొల్వరునమ్ముడిగంపుటింతులుం
బ్రతిహతిగాఁగఁగైకొనక - వల్కుదు గల్పులునోడరెంతయున్. 188

గీ. వల్లభుఁడుచాల మన్నించు - వారితోడ । నైననేకాంతమునమాట - లాడరాదు
దానననుమాన మొదవుఖే-దంబునగడు । సంభవించును నిజమిది - జలజనయన ! 189

సీ. ప్రాణేశ్వరుండునీ - భవనంబునకువచ్చె - నేనిచయ్యనలేచు - రేగుమమ్మ
వినుమెదురేగితో - డ్కొనివచ్చి పీఠంబుఁ - బెట్టించిపూజగా - వింపవమ్మ
పూజించియతనికిం - పుగవినయోక్తులు - వలుకుచుఁదగుసేవ - సలుపవమ్మ
సేవించిమనసురం - జిల్లఁగా మెలఁగియుం - పడరించి కరుణను - పడయుమమ్మ

గీ. యొరులఁదిట్టకు మమ్మవా - యోడకమ్మ । దీనజనములపైఁగిన్కఁ - బూనకమ్మ
యాప్తులను నిరసించియొ-గ్గాడకమ్మ । దయయుసత్యంబువిడువఁగా-దలఁపకమ్మ. 190

క. చెడుభామలమైత్రి కడుం । జెడుగుంగావించుఁ దెలియఁ-జెప్పితి నెపుడున్
గొడవయదినీకు నిప్పక । లాడిఁగట్టినఁజేలఁగాల్ప - కుండు నెచెపుమా? 191

క. నామాటలు మఱువకతగ । నీమదిలోనిలిపిచాల - నేర్పునబంధు
స్తోమంబు మెచ్చి మేలనఁ । గా మెలఁగుము మాకుఁగీర్తిఁ - గలిగింపు మొగిన్. 192

క. అనిమతియును దెల్పఁగఁగల్గిన సద్బుద్ధులను దెలిపి - కృపమీఱఁగనో
య్యనఁగూతునలమికౌఁగిట । ననువొందఁగఁజేర్చికనుల - నశ్రువులొలుకన్. 193

వ. కూరిమిపెంపున నెడఁబాయఁజాలక కొంతవడి పరితాపంబునొంది యెట్టకేలకు ధైర్యం
బవలంబించియుంచుకతొలఁగినిలిచియున్న యల్లునింజేరబిలిచిరాజమహిషియిట్లనియె. 194

చ. ఒనరఁగఁగీడు మేల్తెలిసి - యున్నదిగాదు లతాంగిమున్ను, గో
మునఁబెటిగెన్ గడుంబసరు - మొగ్గయగున్నను బాసియొంటినీ

దనకను నన్యభూములకుఁ - దాజనివచ్చు టెఱుంగదిప్డునూ
తనమిదిగాన మేలగువిధంబునఁ గూరిమి నేలుకొమ్మిఁక౯. 195

వ. అనిపలికి పుత్త్రికకరం బతనికరంబునఁ బెట్టి యప్పగించిన, జననింబాయలేక యశోవతి కనులం గ్రమ్మి తొఱంగు బాష్పంబులపైఁ బఁటచెఱంగున నొత్తుకొనుచుఁ దలవాంచి నిలిచి యుండెనయ్యవసరంబున. 196

క. అత్తకు విజయాశ్వుఁడు కడు । బత్తినివందన మొనర్చి - ప్రమదముమదిరే
కెత్తఁగ బిత్తరిఁ దోడ్కొని । క్రొత్తవిలాసంబుదనరఁ - గొంచకవెడలె౯. 197

మ. సుతుఁడుం గోడలు వెంటఁ రాఁగ రుచిరా - స్యుండెంతయు౯ సమ్మదా
న్వితుఁడై వైభవమొప్పఁగాఁ బయనమై - వియ్యంకుఁడు౯ బాంధవ
ప్రతతుల్ పెద్దలు సాగనంపఁ జనుదే - రన్ వారల౯ జాలస
మ్మతమౌ నెయ్యపు మాటలందనిపిభ - ర్మ్యస్యందనారూఢుఁడై. 198

వ. కనకపురంబు విడిచి కొంతదవ్వరిగి యంతదనుక వెంటనంటి వచ్చుచున్న నృపప్రముఖులం జూచి ప్రియంబు మీఱ, నింక మీరందఱును నిలువుండు చాలదూరంబు చనుదెంచితిరి. చాలును రావలదు మరలమనకు శీఘ్రంబునఁ బునర్దర్శనంబయ్యెడు మేము పోయివచ్చెదమని సముచితంబుగావలికి నిలువరించి చనుచున్న సమయంబున. 199

ఉ. పిన్నటనాటనుండియును - వీడక కూడి మెలంగు నెచ్చెలుల్
విన్ననిమోములొప్పఁ బృథి - వీవరపుత్త్రినిఁ గూడిపోవుయా
పన్నగవేణి రానుతను - బాయఁగఁ జాలక చింత చేఁగడు౯
గన్నుల నశ్రువుల్ దొరఁగ - గద్గదకంఠరవంబు లొప్పఁగ౯. 200

క. ఓపంకజాతలోచన ! । మాపైఁగలకూర్మి మఱచి - మమునిటవిడినేఁ
డేపగిది నేఁగెదమ్మా ! । యోపుదుమే నిన్నుబాసి - యుండఁగఁ దలఁప౯. 201

శా. నీతోఁగూడి మెలంగుచున్న విధము౯ - నీయాటలుం బాటలు౯
నీతియ్యంబును నెయ్యము౯ గుణములు౯ - నీమాటలు౯ జేష్టలే
రీతి౯ మేమిఁక మీఁదట౯ మఱచి వ - ర్తింపఁగ నౌనమ్మ ! మా
కేతద్వ్యాకులమెవ్విధిం దొలఁగు మే - మెబ్భంగి సైరింతుమో ? 202

క. నీవెంటం గొనిచనుమ । మ్మా ! వచ్చెదమిందఱమును - మాపైఁ బ్రేమ౯
బోవిడిచిచనిన నిలువం । గావశమే మాకు బాయఁ - గాదేమనిన౯. 203

వ. వారిదీనాలాపంబులు విని యాకనకాంగి దుఃఖాంబుపూరలు కన్నులనుండి జాఱి చన్నులపయిం బడుచుండఁ గొంతచింతించి ధైర్యంబవలంబించి యిట్లనియె. 204

క. చెలులార ! మిమ్ము మఱువం | గలనే ? కలలోననైనఁ - గానియునాపై
నలుగకుఁ డెడఁబాసితినని | నిలుపుఁడు నాపైనిమీరు - నెయ్యము నెపుడున్. 205

మ. పతివెంటంజనకుంటధర్మమగునే ? - శాపింపఁగాఁగాంతకున్
క్షితిలోభర్తయెదైవమాటనతనిన్ - సేవింపకున్నట్టియా
సతికిన్‌గల్గవు సద్గతుల్ దురితముల్ - సంధిల్లునండ్రార్యులీ
వితమాత్మన్ దలపోయఁగావలయు సాధ్వీత్వంబిదేస్త్రీలకున్. 206

వ. కావున నేనిపుడువల్లభునిఁగూడిచనుట పరమధర్మంబు. 207

గీ. వగవకుఁడు మీరుమరలనే - వత్తునిటకు | శీఘ్రముగనింకచనుఁడెదఁ - జింతమాని
మఱువనెపుడునునేనుమీ-మంచిచెలిమి | ననుచునోదార్చివెండియు-నబలయనియె. 208

సీ. ప్రేమతోనెరఁబెట్టి - పెంచినమనముద్దు - చిలుకలవిడకర - క్షింపరమ్మ
యడుగులవెంటఁబా - యకసంచరించురా - యంచలప్రియమున - నరయుఁడమ్మ
తడియారనీకనీ - రిడివృద్ధినొందఁజే - సినయట్టిలతలఁబో - షింపరమ్మ
చిగురుబచ్చికమేఁతఁ - దగనుంచిమృగశాబ - కంబులఁగరుణతోఁ - గావరమ్మ

గీ. రంగురంగులపుష్పకు - డుంగజాల | బాలకర్పూరకదళీర-సాలనిర్జ
లారవిందాదులందన - యంబుఁగన్నుఁ | గలిగివర్తింపరమ్మయో - కాంతలార! 209

గీ. మరువవలదువానినిమీరు - మరలుఁడింకఁ | బోయివచ్చెదననుడుఁనా - బోటులెల్ల
రెట్టకేలకుశాంతివ - హించిమంచి | దరిగిరావమ్మసుఖమున - నంబుజాక్షి! 210

చ. మరువకుమమ్మ ! మమ్ము - మదిమాపయిఁగల్గిన కూర్మినేనియున్
సరగునరాగదమ్మయొక - సారిభవత్పతితోడనీడకున్
దరుణిరో! నీదురాకడము - దంబునఁగోరుచు నుందుమమ్మ! నీ
స్మరణను వీడమమ్మ ! యిఁక - సమ్మతినేగెదమమ్మ ! తాలిమిన్. 211

ఆ. అనియనుజ్ఞవడసి - యంపటిసుందరు | లరుగమనసురాక - యడుగులిడుచు
మరలవెనుకఁదిరిగి - మాటిమాటికినిల్చి | కనుచునెట్టకేలిఁ - జనిరిపురికి. 212

వ. అంత. 213

ఉ. బంధులఁగూడి వెంటపగు - భంగిజనిసుతు లేగుదేఁగా
సింధురయోధవాజిరథ - సేవకబృంద సమన్వితంబుగా
సింధువుపొంగివేపారలి - సీమలమీఁదికివచ్చినట్లుగ
ర్వాంధరిపుప్రభేదరుచి - రాస్యమహీపతి పోవుచుండఁగన్. 214

ఆ. అచటనచట మార్గ - మందునఁగలదేశ | పతులుకానుకలొసఁగి - నుతులొనర్ప
వారినెల్లఁగుశల - వార్తలమన్నించి | యతఁడుకొన్నినాళ్ల - కరిగెఁబురికి. 215

ఆ. అటుల నేఁగి యమరఁ - బటకుటీరములలోఁ । బురబహిఃప్రదేశ-మున వసించి
విభవ మొప్ప నొక్క - శుభముహూర్తంబున । నగరు సొచ్చెఁ బరిజ-నములతోడ. 216

క. అంతటఁ గొన్ని దినంబులు । సంతోషము మీఱఁ బౌర - జనులు నుతింపన్
వింతగ విందులు వేడుక । లెంతయుఁ గావించి చాల - హృష్టిం జైతాన్. 217

ఉ. వచ్చినవారి కెల్లను న - వారిగ మేలగు భూషణంబులున్
బచ్చడముల్ సువర్ణమును - వాహనముల్ మణులిష్టవస్తువుల్
మచ్చిక మీఱ నిచ్చి తగు - మాడ్కిని మన్ననఁ జేసి పంచె నిం
పెచ్చఁగ నిట్లు మున్ను నృపుఁ - డెవ్వఁ డొసంగె నటంచు మెచ్చఁగన్. 218

మ. అటుపైఁ గొన్ని దినంబు లెంతయును సౌ-ఖ్యం బొప్పఁ దా రాజ్యమె
ప్పటి భంగిన్ సరివారలబ్బురపడం - బాలించి తద్వాంఛదీ
రుటయున్ సర్వవిధంబులం దనకుమా-రుం డొప్పుటం గాంచి యా
దటమీఱన్ దగ వీని కిచ్చెదఁ బ్రభు-త్వం బర్హుఁ డైయుండెడిన్. 219

క. వీనికిఁ బట్టముఁ గట్టెద । వానప్రస్థాశ్రమంబు - వడిఁ గొని యిఁక నే
కానలలో మునివృత్తిన్ । బూని వసించెదను రాజ్య-భోగము చాలున్. 220

క. అని నిశ్చయించి తగువా । రినిఁ బిల్వఁగఁ బంచి సత్క-రించి యభీష్టం
బును దెలిపి వారి యనుమతి । ననువగు నొక లగ్నమునఁ బ్ర-యత్న మొనర్చెన్. 221

వ. అపుడు రాజ శాసనానువర్తులై సేవకులు నియమితకార్యంబు లొనర్పం దొడంగి శీఘ్రంబున.

శా. మాలిన్యం బెడలించి వీధులను స - మ్మార్జించి గంధాంబువుల్
ధూళిం బాయఁగఁ జల్లి ముత్తెముల మేల్ - ముగ్గుల్ రహిం దీర్చి యు
త్తాలస్తంభ చయంబు నిల్పి యనువొం - దం బందిళుల్ వెట్టి హృ
ద్యాలంకార మెలర్పఁ దోరణములం - దందుం బురిం గట్టియున్. 223

క. కావలసిన కార్యంబులు । గావించి రెఱింగి మనుజ - కాంతుం డంతన్
సేవకులఁ బనిచి యత్తఱిఁ । దేవలసిన వస్తుచయముఁ - దెప్పించి యొగిన్. 224

వ. బుధజనచోదితంబగు శుభలగ్నంబున బంధుమిత్రపురోహిత సామంతపౌరజానపదాదుల
మందానందపరవశులై విలోకింప, విజయాశ్వుం డగు విజయాశ్వుని నవరత్నఖచితసిం
హాసనాధిష్ఠితునిం జేసి యథావిధింబుణ్యోదకంబులచే నభిషిక్తుం గావించి పట్టంబుఁ గట్టి
రుచిరాస్యుండు నిజకరస్థంబైన రాజముద్రిక నతని కరాంగుళిం గీలించె నయ్యవసరంబున
మంగళతూర్యనినాదంబులును, విలోకనవాంఛాసమాగత జనసముదయకోలాహలధ్వను
లును, మహీనాయకనికరజయజయధ్వానంబులును, భూసురసందోహాశీర్వాదరవంబు
లును నింగిముట్టెఁ దదనంతరంబున. 225

గీ. అటులసుతునకు వేడ్కరా - జ్యంబొసంగి । యచటివారెల్లవినరుచి - రాస్యనృపతి
మీకితండొడయండిఁక - మీఁదఁగాన । భక్తిసేవింపుఁడనుచునే - ర్పడఁగఁబలికె. 226

క. ధనకనకవస్తుచయవా । హనగోభూదానములన - నంతంబుగఁగో
రినభంగినిచ్చె విప్రుల । కునుఁబేదలకర్థిజనుల - కుంబ్రియమెసఁగన్. 227

శా. శ్రీనిండారఁగ రాజకోటిపరివే - ష్టింపంగసింహాసనా
సీనుండైగ్రహబృంద మధ్యమునరా - జీవాప్తుఁడుంబోలెతే
జోనిష్పాదితమూర్తినొప్పు విజయా - శ్వన్ రాజరాజంచుస
న్మానంబేర్పడఁబల్కిమ్రొక్కిరొగిసా - మంతప్రభుల్ మంత్రులున్. 228

ఉ. అందఱుగౌరవించి, విజయాశ్వుఁడు శాంతరసప్రపూర్ణసా
నందకటాక్షదృష్టులఁజ - నంబులఁగన్గొని మంజులోక్తులన్
ముందటిభంగిమీకు సుఖముల్ ముదముల్ గలిగింతునింకపై
సందియమొందఁబోకుఁడని - సమ్మదచిత్తులఁజేసెనెంతయున్. 229

క. క్రమముగరుచిరాస్యుండును । సముచితసమ్మానవిధుల - సరవినృపాలో
త్తములాదిరైనయందఱి । విమలోక్తులనాదరించి - వీడ్కొలిపెఁగన్. 230

ఉ. ఇట్లు నిజాధిపత్యము వహించినపుత్త్రునిఁజేరఁబిల్చినీ
వెట్లునుబిన్నవాఁడవు మహీజనపాలన లాగెఱుంగవిం
కట్లగునేనిమేల్ పొసఁగ - దొటవచించెద నాలకింపుమే
పట్లనురాజువైఁబ్రజల - భానముచిట్లఁగరాదు పుత్త్రకా ! 231

క. అనియానీతులురీతులు । ననువుగఁదెలుపంగనెంచి - యపుడిట్లనియెన్
జనములును జనవిభుండును । దనువుంబ్రాణంబునుమ్మ - దర్కింపంగన్. 232

క. చెడునుశరీరముజీవం । బెడఁబాసిన, జీవమునురహితదేహంబై
పుడమిఁజరింపఁగఁజాలదు । కడునివియొండొంటిఁగూడి - కనుసౌఖ్యంబున్. 233

చ. కరుణయు శీలమున్ ధృతియుఁ - గౌతుకమున్ క్షమయున్ వివేకమున్
పరహితబుద్ధిసత్యమును - పాయమునీవియు సాహసంబుభూ
సురసురసేవనప్రియముఁ - జొప్పడునే నృపునందువాఁడును
స్థిరతరసౌఖ్యవంతుఁడగుఁ - దేజముమీఱఁగఁ గీర్తిఁగైకొనున్. 234

క. న్యాయంబెఱింగిచతురో । పాయంబులుఁ దెలిసివలయు - భంగిందత్త
ద్వ్యాయామంబులమెలఁగుట । శ్రేయముభూవిభునకనుచుఁ - జెప్పెదురార్యుల్. 235

క. అపరాధమునకుమిక్కిలి । కృపవిడిదండింపరాదు - కించులనెపుడుం
గృపఁజూడరాదు సుజనుల । కపకారమొనర్పరాద - హంకృతిఁబుత్త్రా ! 236

మ. ప్రజలం గ్రూరముగా వధించుటమహా - పాపంబునుం గీడుభూ
భుజుఁడభ్భంగి నొనర్పఁగూడదనయం - బుక్తషష్ఠమాంశంబు నే
నిజశుల్కంబుగఁ గైకొనంగవలయున్ - నిర్దోషులందుష్క్రియా
వృజినాయత్తులఁజేయుటొప్పదది వి - ద్వేషంబుఁ బుట్టించెడిన్. 237

క. ఎదిరిబలంబును నిజబల | మదనును యోజించి యెఱిఁగి - యనువగుతఱిఁ దా
నెదిరింపఁదగును రిపులం | గొదువైనన్ సంధిఁజేసి - కొనుటొప్పు సుతా! 238

ఆ. దేశకాలములను - దెలిసి యేకార్యంబు | నైనఁజేయుటుచిత - మవనివిభుఁడు
శక్తిగలదటంచు - సంరంభమునఁబూని | సేయుపనులు సెడును - జెడునతడును. 239

క. లోఁగినయపుడభియాతిన్ | భంగింపఁగఁ దగదు - కడునపాయము వానిం
బొంగార్ప నుపేక్షించుట | యుంగావునఁ దగినరీతి-నొనరింపనగున్. 240

క. అమరనరేంద్రులకెల్లను | క్రమముగఁ గలుగంగవలయుఁ - బ్రభుమంత్రోత్సా
హములని యొడిశక్తిత్రయ | మమరనిభుఁడు వానిఁగలుగు - నతఁడు కుమారా! 241

క. దుండగమున నన్యులచే | దండుగఁగొనఁబూనినట్టి - ధరణీశుండా
ఖండలునంతటివాఁడై | యుండినను బ్రాణహాని - నొందుందనయా! 242

క. దుష్టుండగు వానికిఁగడు | నిష్టుండనియాధిపత్య - మిచ్చినపతికిం
గష్టంబులు చేకూర్చును | స్పష్టంబీమాటమరువఁ - జనదేవేళన్. 243

గీ. క్రూరుఁడగువానిహితునిఁగాఁ - గొనుటహాని | కాస్పదంబదియెన్నని - యట్టినృపతి
కడకుఁజెడువాని చేఁగీటు - కకృతావ | నిజముంబోలెఁ దెవులొంది - నిశ్చయంబు. 244

క. దానమునఁ దనకులోకమ | ధీనంబగు దానిచేఁ బ్రతిష్ఠనుటిల్లున్
గానఁదగులాగుభూపతి | దానము సేయంగనొప్పు - తగుకాలములన్. 245

చ. ధనపతియైననుం జెడువ్యథాకలయర్థము దుర్వ్యయంబు స
ల్పిన, నతనిన్ హసింపఁగల - వృద్ధియొసంగు నిజాయతిన్ మనం
బునఁదగ నెంచి వెచ్చమును - బూనియొనర్చినఁ, గాననేర్పుతో
నొనరఁగఁజేయుటొప్పువిని - యోగము నెంతటి కల్మిగల్గినన్. 246

క. తగువిధమున ధనమార్జిం | పఁగఁబూనుట శుభముకాని - భంగిదురాశా
నుగతమతియై యకార్యము | లొగిదాఁగావించి కూర్చు-టొప్పదుపతికిన్. 247

ఆ. ప్రజలనేమరించి - నిజసుఖంబునకునై | చెడుగుకార్యములను - జేయరాదు
కంచెచేను మేయఁ - గాఁగాంచివారింప | నెవ్వఁడోపు? ధర్మ - మెన్నవలయు. 248

సీ. క్రమముగాధర్మార్థ - కామములు మోక్షంబు - ననుచతుర్విధపురు - షార్థములకు
నాస్పదంబగుటఁ దదర్థమై యర్థంబుఁ - దాసంగ్రహించి తత్త్రివిధముల

వినియోగ మొనరించి - విజ్ఞుఁడౌ భూపతి - కాంచు సత్కీర్తిలో - కంబునందు
విపరీతముగఁ గల్గు - విత్తంబు వెచ్చించు - నట్టివాఁడనరున - కగ్గమగును.

గీ. ఇట్టినీతి నెఱింగి మహీవిభుండు । మెలఁగవలయును లేకున్న - మేలుగలుగు
టరిదియంతియ కాదు దుర్యశము నొందు । నిచ్చ మఱువకు మీదీని - నెపుడుఁ దనయ ! 249

క. నిందింపఁదగదు భూసుర । బృందంబును సుజనగురులఁ - బేదలవెలన్
నొందించుట దోషంబీ । చందంబును భూవిభుండు - వర్జింపవలెన్. 250

క. శరణాగతులను నార్తుల । దరిశులదరి జేసె జనులఁ - జాలిమి మైఁదా
నిరసింపక కామటయది । ధరణీనాథులకుఁ బరమ-ధర్మం బరయన్. 251

క. మన్నింపఁదగినవారల । మన్నింపక తగనివారి - మన్నించుట దా
వెన్నఁ దినుటుడిగి మేలని । సున్నంబును దినుటఁ బోలు - సుమ్మాత్మభవా! 252

క. హితమతియగు మంత్రినిఁ ప । మ్మతిఁజేకొను టొప్పఁగుమతి - మనుజేశుఁబద
చ్యుతుఁజేయు నిజమభిజ్ఞుల । మతమిది యోజింపవలయు - మంచియుఁ జెడుగన్. 253

క. మతకరితోఁ జెలిమి కడున్ । వెతఁగూర్చుం బ్రాణహాని - వేఁగలిగించున్
వ్రతమని విషముం గ్రోలిన । మృతునిం గావింపకెట్లు - మేలొనరించున్? 254

ఉ. వీరులు సత్యవంతులు వి-వేకులు నాభటులెల్ల భంగులన్
చేరిమిఁగూర్తురెన్నఁ బృథి - వీపతికిం దమ నేర్పు పెంపునన్
భీరులు దుర్బలుల్ జడులు - వృద్ధులునైన జయంబునున్న దు
ర్వారతరోగ్ర వైరిపరి - వారమహోద్ధతి నోటు చేకుఱున్. 255

క. శుభలక్షణాన్వితములై । ప్రభవించిన యట్టిగజతు - రంగోష్ట్రములున్
సుభటులు రథములు నృపతుల । కభయప్రదసత్వదంబు-లండ్రు మనీషుల్. 256

ఉ. లావరియైనను న్విషయ - లంపటుఁడై పతి రాజ్యతంత్రముల్
భావనఁజేయకుండిన న-పాయముగల్గుట నిక్క మెన్నఁగా
యావిధముగ్ర శాత్రవజ - నాభిమతాప్తికిఁ గారణంబగుం
జూవె, వివేకికిట్టి నెగ - సుల్ నిరతంబును వర్జనీయముల్. 257

వ. అని చెప్పి, మఱియు దండయాత్రానుకూల సమయంబులును, సైన్యనిర్ణయప్రకారంబును, వ్యూహనిర్మాణభేదంబులును, వైరిభేదనోపాయంబులును, విత్తసంపాదననియమంబులును, ధర్మాధర్మఫలంబులును, పాత్రాపాత్రస్వరూపవిమర్శన విధానంబును, క్రియాయోగశాస్త్రవిషయాది విశేషంబులును జనవశీకరణతంత్రంబులును నాదియగు రాజనీతులన్నియుం బ్రబోధించి వెండియు నిట్లనియె. 258

ఉ. ఇట్టులమైనశక్తి నిపు - డేనువచించినరాజధర్మము
లట్టుగఁబూనియేమరక - బాగుగయోజనఁజేసిసాటివా
రిట్టిఁడులేఁడు లోకమున - నింకననందగుభంగినీవుచేఁ
బట్టినరాజ్యముంబ్రజలఁ - బాలనసేయుమువైభవంబునన్. 259

మ. అనిశాసించి కృతార్థుఁడైనగతిఁదా - హర్షించివిప్రావళిన్
ఘనులం బెద్దల బంధులన్ సచివవ - ర్గంబుంబురీవాసులన్
జనువొప్పందిలకించి వారికి నిజే - చ్ఛందెల్పిసంప్రీతిఁబు
త్త్రునిరాజ్యంబును నప్పగించి కడుసం - తుష్టాత్ముఁడై యంతటన్. 260

క. వారలయనుమతిఁగైకొని । పౌరజనుల్ తేఱిచూడ - పత్నీయుతుఁడై
కూరిమిసుతుదీవించిమ । హారణ్యంబునకుఁదపసి - యగుటకుఁజనియెన్. 261

ఉ. అంతననంతవైభవస - మన్వితుఁడా విజయాశ్వుఁడెల్లభూ
కాంతులుమెచ్చగారిపుల - గర్వమడంచినిజాధిపత్యమ
త్యంతమొనర్చి నేర్పునని - రంకుశుఁడై ధరనేలుచుండెనా
శాంతగతాతి నిర్మలత - రాక్షయకీర్తిగడించియున్నతిన్. 262

గీ. అమరసాధ్వీమతల్లియై - నట్టిపత్ని । మిగులననుకూలవతిగాఁగ - మెలఁగుచుండ
నతఁడుసత్యవ్రతముఁబూని - యాచరించె । సజ్జనులుమెచ్చఁగా హరిశ్చంద్రుపగిది. 263

వ. అనిచెప్పిననటుమీఁది వృత్తాంతంబునెఱింగింపుమనియడుగుటయు. 264

పుష్పమాలికాబంధము

చ. శరచర ! మారవైరిసఖ ! - సర్వసమాన ! యమేయగాయకా !
ధరధర ! ధీర ! సంతతను - తస్మితవక్త్ర ! మహామతీ ! మఖో
ద్ధర ! నరసారథీ ! - సదయ ! - దస్యుదళక్షయ ! శ్రేయదాయకా !
మురహర ! నీరజాక్ష ! ముని - ముఖ్యముదప్రద ! నందనందనా ! 265

హంసగమనవృత్త, శోకరుతవృత్త, మేఘరంజనీవృత్తసంధీకృత
శార్దూలవిక్రీడితవృత్తము.

శా. గోపాలప్రముఖా ! దయాజలనిధీ ! - గోవర్ధనోద్ధారకా !
పాపధ్వంస ! యజా ! జయానుజనుతా ! - భావస్వరూపా ! హరీ !
యాపన్నాభయదా ! స్మయాదిరహితా ! - జ్యావల్లభా ! పావనా !
చాపాబ్జారిధరా ! పయోధిశయనా ! - జైవాతృకార్కాంబకా ! 266

చ. వ్రజరమణీ మనోహర ! ప - రాత్పర ! సర్వచరాచరాత్మకా !
ద్విజకులపాల ! శైలసమ - ధీర ! చతుర్భుజ ! దేవదేవ ! నీ

రజదళసన్నిభాక్ష ! కరి - రక్షక ! కౌతుకభావ ! సజ్జన
వ్రజపరిపోషణా ! పరమ - భాగవతాశ్రయ ! రమ్యభూషణా ! 267

క. భూభవహరణ ! శుభప్రద ! ! భూభుజసందోహనాశ ! - భుజగేంద్రాగ
శ్రీభవనవాస ! శౌరీ ! ! వైభవజితవిర్జరేంద్ర ! - పద్మగుణసాంద్రా ! 268

తోదకవృత్తము.

భగమ ! సుఖప్రద ! - పావననామా !
గరుడతురంగ ! జ - గన్నుతధామా !
శరధిగభీర ! ని - శాచరశోషా !
నిరుపమతేజ ! ము - నిస్తుతవేషా ! 269

గద్య.

ఇది. శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాద లబ్ధానర్గళచతుర్విధ కవిత్వమహాత్వాభి
రామ, భూసురకుల క్షీరపారావారపర్వశర్వరీసోమ, శ్రీవత్సగోత్ర
పవిత్రాపస్తంబసూత్ర, సావిత్రీలక్ష్మీనృసింహార్యపుత్త్రి,
సుకవిజనవిధేయ, పిచ్చయనామధేయ ప్రణీతంబగు
విజయాశ్వచరిత్రంబను ప్రబంధంబునఁ బూర్వ
భాగంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము
సంపూర్ణము.

శ్రీమద్వేంకటేశ్వరార్పణమస్తు.



శ్రీరస్తు.

# విజయాశ్వ చరిత్రము

## ఉత్తరభాగము

---

## ప్రథమాశ్వాసము.

క. శ్రీభవన! భువనవందిత । వైభవ! పరిపూర్ణ! రుక్మి - వసన! మహార
మ్యాభరణ! వజ్రకవచ ధ । రా! భుజగేంద్రాద్రిధామ! - రమణీకామా! 1

వ. దేవా! అవధరింపుము. సద్గుణగణవిశారదులగు శౌనకాదులకుసన్నుతపుణ్యకథాళ తాంగ సూతుండగు సూతుండిట్లనియె. పూర్వోక్తప్రకారంబునవిజయాశ్వమహీశ్వరుండునిజతేజంబున నెల్లరాజులనుజయించి మించినవైభవంబున సత్యంబును ధర్మంబు నుందోడుగాసకలజనరంజకుండై, యనేకజన్మంబులొనరించికీర్తిఁగాంచిపతివ్రతాశిరోమణియు నర్ధాంగలక్ష్మియునగుయశోవతింగూడిసమస్తసుఖంబులుననుభవించుచు, రాజ్యపాలనంబొనర్చుచుండెనప్పుడు. 2

క. కలనైనఁబలికిబొంకం । దలఁపనివిజయాశ్వసూను - తద్వ్రతగరిమం
బలివేణియశోవతి ని । శ్చలమగు సాధ్వీత్వమహిమ - జాలఁగవెలసెన్. 3

క. సత్యంబునందుఁబాతి । వ్రత్యంబున వీరిఁ బోలు - వారలుగలరే?
యత్యుత్తమదంపతులని । ప్రత్యహముంజనులుపొగడఁ - బరఁగెడువేళన్. 4

క. ఒకనాఁడంబుజనాభుఁడు! సకలచరాచరవితాన - సంయుక్త జగ
త్త్రికసంరక్షణకార్యో । త్సుకుఁడై వైకుంఠమందు - శుభకరలీలన్. 5

సీ. శ్రీదేవియొకవంక - భూదేవియొకవంకఁ - జెలఁగివింజామరం - బులనువీవ
యజుఁడుముందటనిల్చి - నిజకల్పితంబైన - సృష్టిక్రమంబెల్లఁ - జెప్పుచుండ
మ్రొక్కికరంబులు - ముకుళించి శక్రుండు - దనకష్టసుఖములు - మనవిఁజేయ
నెప్పుడెయ్యదియాన - తిచ్చునోయనిభక్తిఁ - గదిసిమాయాకాంత - గాచియుండ

గీ. సన్నిధినిసడ్డమైయూఁగి - యున్నసురల । సన్నగావించిదిక్పతు - ల్చాటుఁదోలఁచ
నపుడపుడును విష్వక్సేనుఁ - డచటమించు । సందడిసడంపనటునిటు - సంచరింప. 6

సీ. ఓంనమస్తే పుర - షోత్తమకాంచనాం - బరపాహియనిమునుల్ - ప్రస్తుతింప
వందేచిదానంద - వాసుదేవముకుంద - రక్షింపుమనుచు ని - ర్జరులుపొగడ

జయజయపద్మాక్ష - సర్వలోకాధార - దయఁజూడుమనిభక్త - తతులువేఁడ
సాష్టాంగములుశంఖ - చక్రధరాచ్యుత - పాలింపుమని పుణ్యు - పరులుమ్రొక్క
గీ. ప్రవిమలానర్ఘభూషణ - ప్రకరరత్న | కాంతులెంతయుమించిన - ల్గడలఁబర్వ
శేషతల్పంబుమీఁదనా - సీనుఁడగుచు | నోనరఁజేరోలగంబున - నుండువేళ. 7

సీ. తనకుఁదానైహస్త - మునసుండుమహతియుం - పలరసప్తస్వరం - బులునువలుక
నీరహీరతుషార - తారాభ్రములమించు - దేహకాంతులునలు - దిశలఁబర్వఁ
బెనఁచిజాఱఁగనీక - బిగియజుట్టినయట్టి - జడముడిశిరమునఁ - జాలనొప్ప
పాలఁపుగాఁదులసిపూ - సలపేరులురమున - నోలివిజ్జోడులై - వ్రేలుచుండ
గీ. తగముఖంబునగోపీచం - దనమువెలయ | మదినిహరిచింతనాసక్తి - పొదలుచుండ
వేగఁజనుదెంచెభక్తి సే - వింపఁదలఁచి | నయగుణవిశారదుండగు - నారదుండు. 8

చ. ముదమునవట్లు వచ్చుముని - పుంగవునింగని పౌరులెల్లన
ల్లదెగనుఁడేగుదెంచెఁగల - హాశనుఁడెంతటి వింతమాటలిం
పొదవఁగనింకఁ దెల్పెడినొ - యూరకరాఁడటె నువ్వుగింజనా
నదుతగనోటనీతనికి - నాగదుశక్తి నెఱుంగశక్యమే ? 9

ఆ. ఎవట్లనైననెవరి - కేనియువాదుగ | ల్పించుటొండెయెట్టి - విషయమైన
మదినినిల్పుకొనక - పదుగురికిందెల్పు | టొండెప్రవృత్తిమిన్న - కుండఁడితఁడు. 10

చ. అని తనుఁజూచిపల్కుకొను - చంతలనింతలనిల్చి భక్తివం
దన మొనరించువారలము - దంబునఁగన్గొని చేయిసాఁచిదీ
వనలొనరించుచుంజనిను - వర్ణమణీమయమైన యబ్జనా
భుని మొగసాలఁజేరికర - ముల్ముకుళించి నమస్కరించి తాఁ. 11

వ. ద్వారంబుఁ బ్రవేశించి చనునప్పుడచ్చట మధుసూదన సందర్శనాసక్తచిత్తులై యరుదెంచి యున్న దేవర్షిసముదయంబులు సమ్మర్దబాహుళ్యంబు కతంబునఁదెఱపిఁగని యావలం జనవలనుగాక యుపాయంబు నరయుచుంద్రోద్రోపులాడియలసట పెంపునంజిక్కిసొక్కి ప్రక్కలకొదిగిత్రొక్కులంబడినొక్కికపచిచనసుక్కు లేకగ్రుక్కిళ్లుమ్రింగుచునిక్కినిక్కి యట్టులెత్తిచూచువారును, చూచువారికింగోచరింపకిపుడేచందంబుననైననుంద్రోచికొని పోవలయునని యోజించిపీచుగోచులబిగియఁగట్టియొండొరులురాచికొనుచుమైచమటలు దిగజాఱలాఁచిలాఁచిసందారసియరుగుచు వెంటరాకనిలిచినవారింజేవీచిపిలుచువారును, పిలుచువారలయెలుంగునాలించియెక్కడెక్కడనని నలుకెలంకులందిలకించుచు నిఱుకటం బులందవిలియు సరకుసేయకబిరుసుదనంబున మొఁగలంగలవారలఁదల కడచియరుగుబల వంతులపిఱుందందవిలిపదపదండనికదిపికదిపియదలింపుచు మెల్లమెల్లగానడుగులిడువారును, కదిసినవారింగడలనీక వెనుబడంగదిమిరోహంబులుపడరనిదియేమి మొప్పెతనంబని కోపించి

కటంబులదరరదనంబులగీటుచు దారివిడక మో చేతులంబొడిచిపోరాడువారును, పోరాడు వారిందూఱుచు వారింపరాఁజాలక దూరంబుననుండి కారణంబడిగి నేరంబు లెంచు తరుణంబుగా దూరకుండుండని సారెసారెకుంజీరిపలుకువారును, పలుకువారలకూఁకలువిని మూఁకఁగడచి వీఁకమీఱనే కరణినైనం బోకున్న కాదనిడీకొనిముందుండువారల చీకాకుపఱచి తలతలండని యటునిటుంద్రోసివాకిలిదాటి పోవనుంకించువారునునై, వారు వారు తాము ముందఱనరుగ గమకించుచుగజిబిజింబడిసందడించుచందంబుఁదిలకించుచుఁ గొంతతడవునిలిచియుండుతఱిఁ దనరాకయెఱింగి దౌవారికులు మహాప్రయాసంబున నచటిగుంపు నెడపియొక్కింతపాయవడంజేసి దారిఁగలిగించినమించినసంతసంబున నటనుండికదలినలుగుడులంబడితప్పించుకొని ద్వారంబుదాటిలోపలఁజొచ్చి క్రమక్రమంబుగా ననేకకక్ష్యాంతరంబులుగడచి పోయిపోయిముందట త్రిజగన్నాథుండును, త్రిగుణప్రధానుండును, ప్రముదిత చంద్రబింబవదనుండును, పరమపురుషుండును, భక్తవత్సలుండును, శాంతస్వరూపుండును, నీలవర్ణుండును, కరుణామయుండునునగునళిననాభుండున్న నగరుఁ బ్రవేశించి, యచటిమనోజ్ఞతరానల్పచిత్రకల్పనంబులకును, నిరుపమానాలంకారసౌభాగ్యశోభావిశేషంబులకును, నాశ్చర్యంబునొందివర్ణించుచుఁ జేరంజనియప్పుడు. 12

సీ. నిత్యయోగాభ్యాస - నిష్ఠాగరిష్ఠులై - యొప్పుమానులఁబ్రియం - బొనరమనిచి
యనయంబునేమర - కాశ్రయించినుతించు దేవతలనుఁగృపా - దృష్టిఁజూచి
యనుపమపుణ్యాప్తి - యాఫలసంసిద్ధి - నలరుసత్పురుషుల - నాదరించి
గతియనినమ్మిన - స్మృతినిబ్రార్థనఁజేయు - భక్తసంతతులకా - పదలుమాన్పి

గీ. సకలలోకములకు - శాంతినిఁజేకూర్చి । నిర్వికారబుద్ధి - నెఱయ మెఱయు
భానుకోటితేజుఁ - బరమాత్మునీశ్వరు । సర్వసమునిఁగుశలుఁ - జక్రిఁగనియె. 13

మ. కనిసాష్టాంగ నమస్కృతుల్వలు మరుం - గావించి తా మోడ్పుకే
లును ఫాలంబునఁగీలుకొల్పి యజును - శ్లోకుం జిదానందుపా
వనమూర్తిన్ జగదీశ్వరున్ వరదుస - ర్వవ్యాపకున్ భక్తిని
ట్లనిభావించినుతించె సంయమివరుం - డామ్నాయవాక్యంబులన్. 14

చ. జయజయ! చక్రహస్త! సుర - సన్నుతభవ్యపదాంబుజద్వయా!
జయజయ! విశ్వరూపధర -! శాశ్వత! శాంతగుణప్రవర్ధనా!
జయజయ! సజ్జనాశ్రయ! ని - శాటవినాశ! ఖగేంద్రవాహనా!
జయజయ! ఘోరకిల్బిషతు - షారవికర్తన! పుణ్యావర్తనా! 15

మ. జయ! లోకైకశరణ్యా! శార్ఙ్గధర! దు - ష్టధ్వంస! గోపీజన
ప్రియ! సంపూజ్యచరిత్ర! సర్వసమ! యు - ర్వీభృద్ధరా! సిద్ధని

శ్చయ! సర్వజ్ఞ! వికారదూర! కరుణా - సంపూర్ణ! తేజోనిధీ!
భయవిధ్వంస! విపన్నపాల! ఫణిరా - ట్పర్యంక! భద్రాత్మకా! 16

క. మందరధర! నందకకర! । సుందరవదనారవింద! - శుభకర! పరమా
నంద! శతానందనుతా! । నందసుతా! నీకువంద - నంబుముకుందా! 17

క. సింధురసంరక్షక! దర । కంధర! కంధరనిభాంగ! - కలుషవిభంగా!
కంధిగభీర! హరీ! గ । ర్వాంధారివినాశకా! జో - హారజజనకా! 18

ఉ. వారిజనాభ! భక్తజన - వర్ధన! పాండవపాల! దీనమం
దార! పురాణపూరుష! గ - దాధర! వర్ణితరమ్యవేష! సం
సారమహార్ణవోత్తరణ - సాధన రూప! జగన్మయా! నమ
స్కారమునీకునన్నుఁగృపఁ - గాంచికృతార్థునిఁజేయుమీశ్వరా! 19

సమ్మిళితనాగబంధకల్పిత పద్యద్వయము.

క. నారాయణ! దేవేశా! । శౌరీ! మురముఖ్యరాక్ష - సక్షయ! సకలా
ధార! వరద! యజరా! శృం । గారాంగా! శుభనివేశ! - నాగారాధ్యా! 20

క. ధీరా! పరమ! వివేకద। మారామాకాంత! భాస - మానాస్యా! శౌ
ర్యారంభప్రీణన! య । జ్ఞారాధ్య! జలజధరణ! వి - షాయతతత్త్వ! 21

క. అనిమిషియుఁ బెక్కుభంగుల । వినుతించి భయంబు భక్తి-వినయంబును నె
మ్మనమునఁ గదురంగఁబునః । పునరభివందనము లతఁడ-పుడుజేసితగన్. 22

క. ఒకయోర నిలుచుటయు నా । సకలజ్ఞుండైన హరిప్ర-సన్నముఖుండై
సుకృపాయుతవీక్షణమా । లికలలముకొనంగ నగ్గ-లికఁగనెనతనిన్. 23

క. కనియుప విష్టుండవు క । మ్మనికనుసంజ్ఞన్ నొనర్ప - నదితెలిసియటన్
తనకొసఁగిన యాసన । మున మునిగూర్చుండె మదిఁబ్ర - మోదము మీఱన్. 24

క. ఆసురమునినిఁ గనుంగొని । యాసురహరుఁడపుడు మంద-హాసము తనరం
గాసత్త్వసంగగోష్ఠీ । వ్యాసంగము మీఱనిట్లు - లనియెన్ మునితోన్. 25

ఉ. ఓమునివంశభూషణ! స-ముజ్జ్వలతేజ! వివేకపూర్ణ! నీ
వేమరకెల్లలోకములు - నిచ్చమెయింజని సంచరింతువే
మేమివిశేషముల్గలుగు - నిత్తఱి నెచ్చటనుండిరాక నా
తోమొగిఁబల్కుమా వినఁగు-తూహలమయ్యెడు నేఁడు నామదిన్. 26

క. నీకుం దెలియని విషయము । లోకంబుల నెందునుంగ-లుగ దొకటియున
స్తోకాభిలాషమై ని । ర్వ్యాకులమతి సంచరింతు - వఖిలజగములన్. 27

క. ఇంతకుమును వినియుండని । వింతగమదిఁదోఁచు నూత్న - వృత్తాంతము నా
లింతుంగలిగినఁ దెలుపుము । సంతసమొప్పంగ వలదు-శంక మునీంద్రా! 28

వ. అనియడిగిన మధుసూదనునిమధురభాషణంబులకలరితనయం దాజగదీశ్వరునకుంగలకరుణా
విశేషంబునకు మంతనంబునసంతుష్టివహించి మించినభక్తిఁగరంబులుముకుళించివినయం
బెనయ సద్గుణగణవిశారదుండగు నారదుండిట్లనియె. 29

మ. జగదోద్ధారక! నీవెఱుంగని విశే - షంబుల్వినోదంబులుం
దగనెందేనియుఁగల్గునే? సకలవృ - త్తంబుల్ విచిత్రంబులొ
ప్పఁగఁగల్గించెడివాఁడ వీవ నినుఁదృ - ప్తుండేయఁగా నేర్తునే?
నిగమాధార! సురేశ్వరేశ్వర! హరీ! - నేనెంత? సామాన్యుఁడన్. 30

క. లోకంబులు పదునాల్గును । నీకుక్షింగలిగియుండ - నీరజనాభా!
నీకుం దెలియనివింతల । నేకరణిం దెలుపనేర్తు - నివికలవనుచున్. 31

క. సకలమున నిండియుందువు । సకలము నీయందగలుగు - సర్వము నీవే
యకలంక భవ్యమూర్తీ! । యొకటైనను నీవెఱుంగ - కున్నది కలదే? 32

క. తెలియుదువన్నియు నెదియును । దెలియని యట్లుందువజ్ఞు - తీరున నీకుం
దెలుపఁగఁగల నేర్పటియుం । గలఁడే? ముల్లోకముల నొ-కండింకనజా! 33

ఆ. అఖిలభూత సముద - యాశ్రయంబైనట్టి । విష్టపత్రయంబు - నెలయఁజేయ
నడఁపనీవనేర్తు - వజహరాదులకైన । నీప్రభావమెఱుఁగ - నేర్పుకలదె? 34

సీ. అలయశోదకుక్షి - యందులోకములెల్ల - నిమిడియుండుటనోట - నెవఁడుసూపె
స్తంభంబులోఁబుట్టి - దైత్యబాలునిపల్కు - నెఱవేర్చికృపమీఱ - నెవఁడుప్రోచె
సభలోనఁబరులువ - స్త్రములూడ్చుతఱినార్తి - నెదఁదలంచినకాంత - నెవఁడుగాచె
గ్రాహంబునకుఁజిక్కి - కడుభక్తివేఁడిన - నేగియాగజరాజు - నెవఁడువిడిచె

ఆ. నీవకాదె? వరద! నీమహత్త్వం బెన్న । మమ్ము వంటి యల్ప - మతులతరమె?
పరమపురుష! భక్త-పాల! మురాంతక । వందిత ప్రభావ! - వాసుదేవ! 35

ఉ. అజ్ఞుఁడు నీజగన్నుత మ-హత్త్వముగానఁగలేఁడు, శాంతుఁడై
విజ్ఞుఁడుయోగపద్ధతి వి-వేచనసేయు, భవత్ప్రసిద్ధమా
ప్రజ్ఞ నెఱుంగగామదిని - భావనఁజేసి కలంగుఁజాలశా
స్త్రజ్ఞుఁడు, సత్యముం దెలియఁ - జాలరు తారొకరుం జనార్దనా! 36

చ. ఘనగుణపూర్ణ! నీవఖిల - కారణకర్త వెఱుంగనట్లుగా
ననునొకపెద్దఁజేసి తగ - నావలనం బ్రియమౌ విశేషముల్
వినఁగఁదలంపు సేయుటిది - వేడుకమాత్రమెకాని నీవెఱుం
గని కతన న్వచింపుమని - కాదిపుడివ్విధిఁగోరుటీశ్వరా! 37

చ. ఘనుఁడవునీవు నేనుడువఁ-గా వినవెంచిన యట్టివేళఁగా
దనుటుచితంబుగాదెఱిఁగి - నంతవచించుటమేలుగానఁ గ

ద్గానినవిశేషమొక్కటి వి-నోదముగావచియించెదం బ్రియం
బున నదియాలకింపుము సు-భూషణ ! పేశలమంజుభాషణా ! 38

గీ. అనిననదియెట్టిదోఁ దెల్పు-మనుచు మోద । మమరఁబద్మాక్షుఁడమ్మని -నడుగుటయును
వినయమొప్పఁగ నిట్లని-విన్నవింపఁ। బొడఁగెనతఁడు సంతోషంబు-గడలుకొనఁగ. 39

చ. అవనిగలందు పార్థివకు - లార్ణవ పూర్ణసుధాంశుఁడో యనం
గువలయ నాయకుండొకఁడ - కుంఠిత శౌర్యధనుండు దుష్టశా
త్రవమదకుంభిమస్తకవి - దారణదారుణ ఖడ్గపాణి దు
శ్చ్యవనసమానవైభవ స-మన్వితుఁ డెన్న నతండు మాధవా ! 40

చ. అతులితలోకసన్నుత గు-ణాకరుఁ డిందు వసంతకంతులం
దతనికి రూపమందు సరి-యాటకొకండునుఁ జాలడెన్నఁగా
శ్రితజనకల్పశాఖి బుధ-జీవనుఁ డార్త శరణ్యుఁ డెంతయుం
జతురుఁడు ధైర్యవంతుఁడ వి-చారుఁడు దారుఁడు శూరుఁ డాజులన్. 41

గీ. అముష్యాయణుఁ డుత్తముఁ । డామానవ విభునకు విజ-యాఖ్యుండనఁగా
నామము కరుణాపూర్ణుఁడు । సామాన్యుఁడుగాఁ డతండు - శాంతాకారా ! 42

గీ. మృదులమాధుర్యభాషి స-మీత్యకారి । సురధరాసురభక్తియు - సూనృతంబు
నతనికిం దోఁడఁబుట్టువు - లనినయెడల । నతిశయోక్తిగా నేరదో - యబ్జనాభ ! 43

చ. అడిగిననెద్దియైనను బ్రి-యంబున లేదనికిచ్చుఁగాని తా
జడియఁడు కోపముం గొనఁడు - సంకటమొందఁడు సత్యమార్గమున్
విడువఁడు దైన్యమొందఁ డెద - వేసటఁబూనఁడు వానిబుద్ధియున్
నడవడియున్ వచించుటకు - నాదగు నేరుపు చాలదచ్యుతా ! 44

ఉ. ఇంద్రునకున్ స్వకీకసము - నిచ్చినయట్టిదధీచి నాహరి
శ్చంద్రునిఁ గర్ణునిం జయము ని-శాటపతిన్ శిబిముఖ్యులైన యా
రుంద్రవిసర్జన ప్రియుల - రూఢిగమించఁగఁ జాలుదాతభో
గీంద్రశయానయానృపున - కెవ్వనినేసరిఁబోల్చి చెప్పుదున్ ? 45

సీ. తనివినొందఁగనిజ - దానధారావృష్టి - నర్థిసందోహస-స్యములఁ దడపి
ప్రాకటకరుణావ - లోకనామృతమున - నార్తులసంకట - వ్యాధులడఁచి
యసమానబాహుబ - లాటోపగరిమచే - రిపులగర్వధనంబు - లపహరించి
సత్యవ్రతానూన - సంకల్పమహిమాప్తి - ననృతవాదులకుసి - గ్గడరఁజేసి

గీ. నిఖిలదిక్కులఁదనకీర్తి - నిండివెలయ । సంతతాక్షీణ సౌఖ్యభా-జననిరంకు
శాధికారాభివృద్ధి రా - జ్యంబునేలు । నతఁడు, వైకుంఠధామ! లో-కాభిరామ! 46

గీ. అతనిధర్మపత్నికి యశో-వతియనంగఁ । దనరు నాహ్వయమాయింతి - కెనయనుటకుఁ
దగినమానిని లేదు భూ-తలమునందు । నిక్కమీమాటనమ్ముము - నీలవర్ణ! 47

గీ. అఖిలశుభలక్షణములు న-య్యతివయందు । మించికాన్పించు మూర్తీభ-వించినటుల
నామెలావణ్య మెన్న నా-యట్టివాని । కలవిగాదింక వేయేల - కలుషదూర! 48

క. రతియు నరుంధతియును బా । ర్వతియు సరస్వతియు నిర్జ - రప్రభుసతియున్
జతగారననగును యశో । వతికిం బతిభక్తినోవి-భావసుతేజా! 49

క. అమరును వారలదాంప । త్యము సర్వవిధంబులన్ ము-దంబెనయఁగను
త్తమలీలవారు మెలఁగెడి । క్రమమంతయుఁ జూచితీఱఁ - గావలయుహరీ! 50

క. సతియుం బతిగావారల । జతఁగూర్చిన యట్టిపద్మ - సంభవునేర్పిం
కితరులకుఁ గలదె? యహహా! । నుతియింపందగునువారి-నోరారంగన్. 51

క. శ్రీపురమనియెడి యాధర । ణీపతి పట్టణమునుండి - నేనిపుడు భవ
చ్ఛ్రీపాదాబ్జద్వయసే । వాపేక్షజనించివచ్చి - తల్లననిటకున్. 52

చ. విలసితభంగినేఁడు పృథి - వీసురయాచకకోటికోలిను
జ్జ్వలమణిభూషణాంబర స - వత్సగవీస్వపసైంధవాదులిం
పొలయ నొసంగెనొక్కొకని - కొక్కొక వేయిటినిట్లు నిత్యముం
దలఁకకతండుసేయు వివి-ధంబులుదానములిందిరాప్రియా! 53

గీ. అతనిపరమార్థచింతయు - నతనియీవి । యతనిదృఢనిశ్చయంబును - నతని నియతి
యరసి ముదమందుచుండుదు-నప్పుడప్పుడు । నిపుడునుంగాంచివచ్చితి-నింపుమీఱ. 54

గీ. రాత్రియనరాదు పగలన - రాదుకనిన । గడియసేపైనఁగానియు - నెడముఁదెఱపి
యొదవదతనిహజారంబు-నొద్దమూఁగి । యుండు యాచకజనకోటి-గోముకుంద! 55

గీ. నిరతమునువాని మొగసాల - నిల్చియున్న । భూరిదానధ్వజాగ్రఘం - టారవంబు
లతఁడొనర్చుదానముల సం-ఖ్యనుసుపర్వ । నరునకెఱిఁగించుచాడ్పున-మొఱయుచుండు. 56

క. ఇదినేనెఱింగిచూచిన । యది మున్నే తెలుపవలయు - నను కోరిక నా
మదిఁగలిగియు నీవెఱుఁగని । యదికలదా! యని తలంచి - యననైతిహరీ! 57

ఉ. ఇంతకుమించు చిత్రమిఁక-నెందును గల్గదు జూచిచూచి నే
నెంతయు సంతసింపుదు మ-హీస్థలినంతటివానిఁ గాంచి నే
నింతకుమున్నెఱుంగఁ గడు - నెక్కుడుమాకిదె, యంతెకానియో
దంతివరేణ్యపాల! శుభ-దాయక! వింతగ నీకుఁదోఁచునే? 58

క. అడిగినఁ దెలిసిన విషయము । నుడువంగావలయుఁగాన - నుడివితినేఁ జొ
ప్పడినను జొప్పడకున్నను । గడకును వింటివిదయాంద-గఁగ నదిచాలున్. 59

చ. అనిసురసంయమిప్రవరుఁ - డద్భుతమా విజయాశ్వధారుణీ
శునిచరితంబువిన్చి హరి - సూక్తముభక్తిఁ బఠించిమ్రొక్కినన్
గనికనకాంబరుండతని - గౌరవమొప్పఁగ నాదరించి నె
మ్మనమున సమ్మదంబడర - మంజుమృదూక్తుల నిట్లనెన్ దగన్. 60

చ. విను మొకమాటఁ జెప్పెదవి - వేకము మీఱఁగ నెవ్వఁడుర్విస
జ్జనహితమైన కృత్యములు - సల్పుచు ధర్మమునాచరించు న
య్యనఘుఁడు నాదయంబడ య-నర్హుఁడునమ్మనయంబునట్టివా
నినిఁ దగుభంగిఁగాతును ము-నీ! యిది నామత మెల్లభంగులన్. 61

మ. జలజాతోదరపుత్ర! నేఁడు విజయా-శ్వక్ష్మావరాఖ్యక్షమాపెం
పలఘుప్రజ్ఞయు ధర్మబుద్ధియును స-త్యప్రీతియున్ శీలమున్
దెలియంగా వచియించి నాఁడవు కడుం-దృప్తుండనైతిన్ మదిం
గలరే? క్రొత్తవిశేషముల్దెలియఁ బ-ల్కన్నేర్చునీబోంట్లిఁకన్. 62

క. వినఁదగిన మంచివిషయము । వినిపించితివయ్య! నీప్ర-వీణతమఱి యే
మునికింగలుగదు తెలియని । వినుతంబగు చరితమొకటి - వింటినిదనివిన్. 63

సీ. కలఁగక పేదసా - దులుసంతసింపఁగాఁ - జెలఁగి సత్కార్యము - ల్జేయువారు
సురలయందునుధరా - సురలయందునుభక్తి - గలిగి సత్పథమున - మెలఁగువారు
పరమార్థబుద్ధిని-బాయక తగురీతి - శిష్టుల వేడ్కఁబూ - జించువారు
విత్తశాఠ్యమువీఁడి - వెగటొందకతిథులఁ - దృప్తినొందఁగనాద-రించువారు
ఆ. ప్రియులు నాకు వారి - విడువకరక్షింతుఁ । గుజనతతినలంతుఁ - గ్రూరఫణితిఁ
బలుకు లేలనాదు - భక్తసంతతికిల । నందరాని సుఖము-లెందులేవు. 64

శా. సుజ్ఞానంబునమించితత్త్వమును సం - శోధించువేదాంత శా
స్త్రజ్ఞుల్గాని, తపః ప్రభావమున మో-క్షంబొందఁగా నర్హులౌ
ప్రాజ్ఞుల్గాని, కనంగఁజాలరుననున్ - భక్తుల్ మదీయాకృతిన్
ప్రజ్ఞాచాతురిచే నెఱింగితనివిన్ - వర్ణింతుర శ్రాంతమున్. 65

క. సుజనులరక్షించుటకును । గుజనుల శిక్షించుటకును - గోరుదునగుటన్
వృజినంబులుడిపినేనా । విజయాశ్వునిఁ బ్రోతునెల్ల - విధములననఘా! 66

ఆ. వానిచిత్తశుద్ధి - వానియౌదార్యంబు । వానిధర్మవాంఛ - వానిసత్య
భాషణవ్రతంబుఁ - బరిశీలనముఁజేయఁ । దలఁపుగలిగె నాకుఁ - దాపసేంద్ర! 67

ఉ. నేనుధరాసురాకృతిని - నేఁడటకుంజని మాయమాటలన్
వీనులకింపుగాఁబలికి - వెడ్డునదానము వేఁడి నేర్పుమై

వానినలంతునీవిపుడు - వల్కినభంగిని సత్యధర్మముల్
మానకయుండెనేనియస - మానశుభంబులొసంగుదుంగృపన్. 68

క. నీవునురమ్మచ్చోటికి । నావెంటంబోయిచూచి - నంగానిమదీ
యావేగముదీఱదును । మ్మేవిధమునన్నైనఁగలఁత - మిరుపురమతనిన్. 69

వ. అనిపలికినవనజనాభునిపలుకులువిని నారదుండు తనమనంబునసయ్యిందిరాపతికినుజనులయెడంగలయనురాగంబునుఁ, దనపైమించువాత్సల్యంబునుందలంచి, సంతసించి కరంబులు ముకుళించినమస్కరించి, స్వామీ! మహాప్రసాదంబు దేవరచిత్తానుసారంబుగాఁబ్రవర్తించుటకు సంసిద్ధుఁడనైయున్నవాఁడనని విన్నవించియప్పుడు. 70

ఉ. ఇట్టిపనుల్ గదా! సతత - మిచ్చఁదలంపుదు రాజశీలమున్
గట్టితనంబువెంటఁజని - కాంచెదనేనును, మాధవుండుదాఁ
బట్టినకార్యమున్ విడఁడు - పారునియాకృతిఁ దాల్చునంతనేఁ
జట్టనశిష్యురూపముఁ బొసంగవహించెద, నంచునెంచఁగన్. 71

సీ. ఒనరమోమునఁదీర్చి - యుండినగీరునామంబు మేలగు గంగ - మట్టిగాఁగఁ
గటిసీమఁజెలువారఁ - గట్టినయట్టికా - శేయవస్త్రమునార - చీరగాఁగ
రాజిల్లురత్నహా - రంబులన్నియుదుల - సీదారుపూసల - చేర్లుగాఁగ
నమరఁగానెమ్మేన - నలఁదినగందంబు - పొలుపుమించువిభూతి-పూఁతగాఁగ

గీ. హస్తములఁబట్టియుండెడి-యబ్జమరియు । నంబుకలితకుండియును దం - డంబుగాఁగ
సొరుమించినముంగురు - ల్జటలుగాఁగఁ । దపసివేషంబుఁదాల్చెమం-దాధరుండు. 72

క. ఆపుణ్యమూర్తివందిత । తాపసరూపంబుఁజూచి - తనలోనముదం
బాపాదిల్లఁగనెదితగ । దీపరమేశ్వరునకొప్పు - నేయాకృతియున్. 73

ఉ. తాపసభావవీథులస - దాప్రియమొప్పమెలంగువానికీ
తాపసవేషమెంతపని - దానవవీరులఁగూల్పనెన్నియో
రూపములంధరింపఁడె ? ని - రూఢముగాఁబ్రమటిలోనన్ప్రతి
జ్ఞాపరుఁడంచుమెచ్చిసుర - సంయమిశిష్యునిపోల్కినయ్యెఁదాన్. 74

క. వారిరువురునత్తఱిఁగా । ర్యార్థంబు దెల్పనిలిచి - రబ్జాక్షుఁడునా
పేరిఁకవిశ్వంభరుఁడనె । నారదుఁడునునుగ్రశర్మ - నాపేరనియెన్. 75

గీ. అటులమునియును శిష్యుండు - నైమురాంత! కాబ్జభవనందనలువేగ-నచటుగదలి
క్షితికిఁజనుదెంచిరమ్యమా - శ్రీపురంబుఁ । జొచ్చిరాజమార్గంబున - వచ్చుచుండ. 76

క. వారలతేజముఁగనుఁగొని । పౌరజనుల్మిగులవెఱఁగు - పడియటునిటువే
దూరముగఁవొలఁగినిలుచుచు । వీరెవరోపెద్దలనుచు - వీక్షింపంగన్. 77

వ. అప్పుడప్పద్మావల్లభపద్మసంభవ సంభవులుతత్పురాలంకారంబుఁగాంచి మెచ్చుచు మెల్ల
మెల్లగానడిచి రాజద్వారంబుఁజేరంజనుదెంచి యచ్చట. 78

శా. మాతంగంబులు గోవులశ్వతతులు - న్మాణిక్యమంజూషలు
న్భాతిన్ మించువిభూషణంబులు మణుల్ - వస్త్రంబులున్ విత్తమున్
బ్రీతిన్ భూపుఁడొసంగఁగైకొని మహా - వేదజ్ఞుల్ ధరాదేవసం
ఘాతంబుల్సనుదెంచుచున్నఁగనిజో - కన్ మెచ్చివర్ణింపుచున్. 79

సీ. భారమైమోయంగ - నేరకయొక కొంత - పడసిన విత్తంబుఁ - బాలువైచి
వలదన్న నిచ్చె నీ - వారునంబులనునా - కిన్నియేల ? నటంచుఁ - గొన్ని విడిచి
యొసఁగినమణులలో - నురవగుకొన్నిటి - నేటికైకొని శేష - మెగయఁజల్లి
తమకెదురైన పే - దలకునర్థులకుఁ దె - చ్చినధనంబున సగం - బునునొసంగి

ఆ. వచ్చువిప్రవరుల - వారలుగనముపైఁ | గలయలక్ష్మ్యబుద్ధి - కతనఁజేయు
కార్యములనుగాంచి - కడునబ్బురముఁజెంది | రిదివిచిత్రమెందు - నెఱుఁగమనుచు. 80

క. ఈసరణిఁగనుచుఁగైతవ | భూసురయుగళంబుజనులు - పొడఁగనిపొగడం
గాసుందరమగురాజస | భాసదనద్వారమునకు - వచ్చినిలిచినన్. 81

క. అటఁగాచియుండు భూపతి | భటవరులీక్షించియపుడు - వారలదగువి
స్ఫుటతేజోత్కటమహిమకు | విటతాటముఁజెందిసభకు - వేజనిభక్తిన్. 82

చ. అటఁగొలువున్న భూపతికి - లాగ్రణికట్లనిరో నరేంద్ర! నేఁ
డిటకొకమానిశిష్యయుతుఁ - డెచ్చటనుండియొవచ్చెవచ్చి వాఁ
కిటనదెయున్న వాఁడతని - కిన్ సరివారినిఁజూడమెందుఁ దె
ల్పుటకరుదెంచినారమరి - భూవరగర్వహరా! మహాప్రభో! 83

గీ. అనిహజారపు కాపరు - లైనయట్టి | భటులుదెల్పినవిని యానృ - పాలమౌళి
దిగ్గనమృగేంద్ర పీఠంబు - డిగ్గిసభ్యు | లిరుగడలఁగొల్చిరానెదు - రేగివేగ. 84

క. ద్వారమునభటులుసెప్పిన | తీరుననసమానవిమల - తేజోన్నతిఁజె
ల్వారంగనిలిచియుండెడి | వారలఁబొడఁగాంచిభక్తి - సల్లింగన్. 85

వ. సాష్టాంగదండప్రణామంబులాచరించితోడతెచ్చియర్హాసనాసీనులగావించియర్ఘ్యపాద్యా
దివిధులంబూజించిసవినయంబుగాఁబ్రార్థించివేఁడడిగివారలయనుమంగొనిసమీపంబున
నొకపీఠంబుపైనుపవిష్టుండైయున్న విజయాశ్వమహీవల్లభతల్లజునింజూచిచేయిసాచిము
నీశ్వరుండప్పుడు. 86

క. స్వస్తినిరస్తవిచారస | మస్తగుణాధార! నిరుప - మాన! ధరాభృ
న్మస్తకమకుటస్థగితమ | ణిస్తోమవిరాజితాంఘ్రి | నిష్ఠితపేశా! 87

క. అనిదీవించియతండో । యనఘా! కుశలంబె నీకు - నాశ్రితులకుప
జ్జనులకుబంధువులకునెం । దును మీకుంగొఱంతగల్గదుగదా! యనుఁడున్. 88

క. మీకరుణవలన నెపుడును । మాకేకొఱతలును లేవు - మానీంద్రా! ని
ర్వ్యాకులహృదయులమై య । స్తోకప్రమదమున నుండు - దుము సిరిమీఱన్. 89

చ. ఘనులగుమిమ్ముఁబోంట్లు తగు - కారణమెద్దియులేక రారు ఎ
చ్చినసది మాదృశుల్దొడరి - చేసినపూర్వఫలానుభోగమే
యనఁదగునొండుగాదు భవ - దంఘ్రులు సోఁకిమదాలయంబు మే
ల్వినుతిఁగనెం బొసంగెనఖి - వృద్ధి తొలంగె నఘంబులన్నియున్. 90

క. పనిలేకురక పథిశ్రమ । మునకోరిచి యింతదూర - మున్వృథామీరల్
సను దేరరుకద! మీవ । చ్చినకార్యంబెద్ది యొక్కొ - చెపుడా! నాతోన్. 91

ఉ. ఓవసుధామరాన్వయమ - హోదధిచంద్ర! మునీంద్ర! నేనుమీ
భావమునందు జేకుఱిన - వాంఛను దీర్చెదమిమ్ముఁబోంట్లకే
మేవిధినైన సత్కృతుల - నేర్పడఁజేయుట యొప్పు మాకిలన్
దైవసముల్భవాదృశులు - తావకదాసుల మాదుమిందఱున్. 92

క. మహనీయులైన మీకున్ । విహితములగు పనులొనర్చి - వెలయంగామే
మిహపరసౌఖ్యానందము । వహియించుట యొప్పునదిశు - భంబగుమాకున్. 93

క. ఇదితగునిదితగదనిమీ । మదిలోశంకింపవలదు - మానీశ్వర! స
మ్మదమునఁ దెలుపుఁడ! కోరికి । నదియెట్టిదియైన దీర్తు - ననిపల్కుటయున్. 94

ఉ. సంతసమంది యిట్లనియె - సంయమినాథుఁడు రాజచంద్ర! నీ
శాంతియు ధైర్యముం బ్రియము - శక్తియు నన్యులకింక నెందులే
దెంతయుఁదృప్తి గల్గెవచి - యించెదనాదగుకోర్కెనైనయొ
క్కింతతలంకునుంగొదుకు - నిత్తఱినామదిఁదోఁచె నెట్లనన్. 95

గీ. వినుముకష్టంబు యాచనా - వృత్తి యడిగి । నపుడు లేదన్న యాదుఃఖ - మర్థి యెఱుఁగు
నన్యుఁడెఱుఁగునె? చావు మే - లంతకంటెఁ । గాన దేహీతివచనంబు - కష్టతరము. 96

ఉ. ఉత్తలపాటుశంక వెఱ - యున్వగదైన్యమధైర్యమూర్పు గ
గ్గుత్తికదుర్బలంబు వినుఁ - గుందడవెల్లదనంబులజ్జయుం
దత్తఱముంజనించు విక్ర - తంబగునాస్యము నీచయాచనా
వృత్తికిఁబూని యన్యులను - వేఁడఁగఁబోయిన వేళనర్థికిన్. 97

క. కావునవేఁడుటకష్టము । నావాంఛన్ బలికినంత - నలుగురువిననేఁ
గావింపనేరనీపని । నావలనంగాదటన్న - నగుబాటధిపా! 98

ఆ. ఆసఁజెందివచ్చి - యడిగిలేదనుపించు । కొనుటవలననేమి - గొప్పగలుగు
నట్టియాజ్ఞ మిగుల - హాస్యాస్పదంబగు । నడుగకుంటయుక్త - మంతకంటె. 99

క. ఈసందేహము నామది । లోసంధిల్లినకతన దెలుప వెఱచెదఁ జు
మ్మా సందీర్చెదననితగు । బాసయొసర్చినవచింతుఁ - బార్థివముఖ్యా! 100

ఆ. మొదటననినమాటఁ - బిదపఁదప్పితివేనిఁ । గిల్బిషంబుగలుగుఁ - గీర్తితొలఁగు
నొరులభంగి సైఁచి - యుండువాఁడనుగాను । నేనునినుశపింతు - నిశ్చయంబు. 101

క. నామదిఁగోరికిఁదీర్చెదు । సామర్థ్యముగలిగియున్న - సమకూర్పములే
దామానుమునిర్బంధం । బేమాత్రములేదు తెలుపు - మేమనియెదవో. 102

క. సంశయముబోడమినపుడా । యంశముఁదాఁదొలుతఁదెలియ - నడుగుట మేలో
భ్రంశవిదూరా! రాజను । ధాంశా! నేనిటులనంటి - ననికినియకుమా! 103

గీ. అనినదరహాసమొనరించి - యవనివిభుఁడు । మానికిట్లను, నయ్యా! యే - మైనవయ్యెఁ
గానిమదినను మానంబుఁ - బూనవలదు । తెలుపుఁడా! కోర్కి వెఱిపింప - వలదునన్ను

క. ఖలునివలెపలికి బొంకుటఁ । గలనైననెఱుంగ నేను - గైకొనుఁడాకా
వలసినరాజ్యము నైననుఁ । దలనైననొసంగుదుఁగా ము - దంబునఁదలఁకకే. 105

సీ. అపరదిక్తటమున - నర్కుండుపొడిచిన - దిగ్గజంబులు మ్రొగ్గ - తిలఁగఁబడిన
భూమియునంబరం - బునునటునిటు నైనఁ - గులశిలోచ్చయములు - గ్రుంగిచన్నఁ
దడిలేకయబ్ధిసం - ద్రంబులువట్టినఁ - దలవాంచిఫణిరాజు - దద్దరిలిన
తారకానివహంబు - ధాత్రిపైడుల్లిన - బహుభయంకరముగా - ప్రళయమైన

ఆ. నెట్టిసంకటంబు - లెన్నిపాసంగినఁ । బారికాంక్షివర్య! - పలికిబొంకఁ
జాలనేనునాదు - సత్యవ్రతంబును । విడువనుసుఱులైన - విడుతుఁగాని. 106

క. మీరెద్దిగోరిననుజే । కూరుతునని యంటిమున్నె - కొంకేలా? నో
రారఁగఁబలికితిఁదిరుగ । న్నేరదునాజిహ్వయింక - నిర్మలభావా! 107

గీ. స్థిరము నామాటమీకోర్కెఁ - దీర్తునెట్టి । దైనఁగానిమీపాద-మాననిజము
తెలుపుఁడా! యన్నముదమొంది-తొలఁగశంక । యధిప! వినుమింకననుచుని-ట్లనియె మౌని.

శా. దూరీభూతమనోవికారులును ని - ర్దోషుల్మునుల్వారలం
సారక్లేశమునొందనొల్లరదిమో - క్షప్రాప్తికిందవ్వగున్
దారల్పుత్త్రిలుసంపదల్గనని - త్యంబుల్గదాయంచుదా
మారూఢించదలపోసివానిఁదమలో - నాసింపరెక్కాలమున్. 109

క. మునులమతమట్టిదైనను । వినుతింపఁగనొప్పుతపసి - వృత్తినివిడకుం
డినవాఁడనైననుజనిం । చెనుమదిసంసారవాంఛ - నృపవరనాకున్. 110

సీ. వెలఁదికంఠధ్వని - వినవచ్చెనాకర్ణ - ములురెండుచేతుల - మూసికొనుచుఁ
గాంతలనెందైనఁ - గంటినాకోపంబు - మించిదిగ్గనఁదల - వాంచుకొనుచు
ముదితతనుస్పర్శ - మొదవెనామైదద్ది - ఱిల్లిమంత్రాంబువు - ల్జల్లుకొనుచుఁ
బొలఁతిరూపముదలం - పునఁదోఁచెనాదోష - మెడలఁగామదిహరి - నెన్నుకొనుచు
ఆ. పడఁతులన్ననేన - పడుచుందునేముందు । పరమయోగిననుచుఁ - బ్రస్తుతింతు
నఖిలమునులునన్ను - నట్టిశీలమువీడి । కామసుఖమునొందఁ - గలిగెఁబుద్ధి. 111

చ. కటకట! నాకిదేమిభ్రమ - గల్గెనొకాని వచింపఁజాలని
స్ఫుటికెఱుగంగవచ్చెనిది - బాగదెయోగనినావివేకమె
చ్చటలయమయ్యెనొక్కొ-బలు - సంసృతివాంఛ జనించెవింజెతో
ల్లిటివగమోక్షకాంక్షమది - లేదుగృహస్థుఁడనౌటకెంచితిన్. 112

ఉ. మేనుగృశింపఁగాసిరులు - మెచ్చకభోగములుజ్జగించిపె
న్గానలలోనభీకరమ్ము - గంబులుదోడుగ యెండవేఁడికిన్
వానకునోర్చిమానవుల - వాసనయైనను లేనిచోటునన్
మానముఁబూనిపండ్లుదిని - మక్కుటయుక్తమె? మోక్షమబ్బునే? 113

ఉ. ఎచ్చటనొక్కమోక్షమిఁక - నెన్నటికోసమకూడునంచులో
నచ్చిగమీఱఁగాఁదపమొ - నర్పఁగఁబూని గృహస్థధర్మమం
దొచ్చములేనిసౌఖ్యముల - నొందకమాని నటంచువీడఁగా
వచ్చునె? చేతిపండుఁబడ - వైచికుజంబునఁ బ్రాకులాగునన్. 114

చ. వినుమునృపాలశేఖర ! వి - వేకవిహీనుఁడనై తపంబొన
ర్చినసుఖమబ్బునంచునిర - సించితిసంసృతినిన్నినాళ్లునా
కనరుసుటిల్లఁగానితప - మందొకమేలును గల్గదయ్యెజ
వ్వనమువృథాచనెందుదక - వార్థికమిబ్బిధి నాకుఁజేకుఱెన్. 115

క. ఈతీరుందలపోసియు । ఛీ! తగదీతపముగిపముఁ - జెడినంజెడుదుం
బోతివిరిగృహస్థుఁడనై । ఖ్యాతిగమనుటొప్పునిటుల - నలయఁగనేలా? 116

క. అనితలఁచివినుగుఁగొనినే । వనవాసముఘోరతపము - నయ్యాంబనియొ
య్యనవిడిచిగృహస్థాశ్రమ । మునునుండఁగవచ్చితింబ్ర - మోదముమీఱన్. 117

గీ. వయసువృథఁజేసి సతులపై - వాంఛమాని । కూడునీళ్ళకువాచిపె - స్గహాలనుండి
తనువుకృశియింపఁగాఘోర - తపమొనర్చు । వాఁడుసంసారిఁబోలఁగా - లేఁడునమ్ము!

ఉ. చేరువయాకొలంకువిడి - చెచ్చెరదవ్వునుండువాహినీ
వారినిఁద్రోలఁగాఁజనెడి - వానివిధంబునఁ దృప్తిఁగూర్చుసం

సారసుఖంబు మెచ్చకయ - సాంఖ్యము ముక్తిఫలానురక్తి చే 119
వారనిసంకటంబులను - వాడుచు మేనుసలంచుటొప్పునే?

ఉ. బాగిది మేలుగల్గునని - భస్మవిలిప్తశరీరుఁడై నరుం
డేగిరిగహ్వరంబుననొ - యేగహనాంతరసీమనో మహా
యోగముఁబూని యొక్కెడ - నయుగ్రపిశాచము వోలె నెన్ని నా
ళ్లేగతిఁగూరుచుండినను - నేమియు లేదు ఫలంబు వానికిన్. 120

చ. మతినిడియాలకింపుము మ - నుజప మోయ సమంజసంబుగా
నిశ్చితము నీకుఁ జెప్పెదఁ బ్ర - సిద్ధిగనొప్పు గృహస్థధర్మమే
హితమొనరించు నిష్ఠసుఖ - హేతువువో యదియంచు నేదలం
చితినిఁక వేయు నేమిటికి - సీ! మునివృత్తి యనర్హ మెన్నఁగన్. 121

వ. కావున నెందేనియు నొకసుందరాంగిం బడసి కామసుఖంబులం బరితృప్తి నొందం దలంచి తద
ర్థంబుగా నే తెంచితి. 122

గీ. అనుచుఁబల్కిన సర్వంస - హావిభుండు । వింతపడి వాని మాటలు - కొంతసేపు
తనమనంబునఁ జింతించి - ధర్మశాస్త్రి । హితనుతోక్తుల నతనితో - నిట్టులనియె. 123

క. ఇదియేమి మాట మునివర ! । యదవదయగు కోర్కిఁ గలుగు - టరయఁగ మీకుం
గాదువగదా ! ధర్మజ్ఞులు । గదె యింతురె మదిని బాప - కార్యచయమునన్. 124

క. బాగనుచు సర్వసంగ । త్యాగులు నాగాము లెఱిఁగి - నట్టియనఘులున్
రాగరహితులును నగు మీ । రీగతి నిదురాశ మదివ - హింతురె ? చెపుఁడా ! 125

క. నామతమెట్టిదో యని మీ । రీమాడ్కిఁ బలికి తెలియ - నెంచితిరేమో
యోమునివర ! కాదనని । ప్రేమానియపేక్ష నొందు - నిహసుఖమునకున్. 126

గీ. అనిననది యెట్టిదైనను - నయ్యెఁగాని । వినుము నా నిశ్చయంబిది - యనియెఁదపసి
యతనిదృఢవాంఛ వినివిజ - యాశ్వనృపతి । మఱియు నబ్బురపడి యిట్లు - మరలననియె.

క. ప్రాపించు సంకటంబుల । నోపిక మైఁ గడచి చింత - లొందక ధృతిఁ గాం
క్షాపరుఁడుగాక వర్తిలు । తాపసముఖ్యుండు మిగుల - ధన్యుండుగదా ! 128

క. అనిశంబు నీషణత్రయ । మునకుం దగులై వికార - ముం జెందితలం
పునఁ గామక్రోధాదుల । నెనయింతురె మిమ్ముఁ బోంట్ల - హీనగుణాఢ్యా ! 129

క. స్మయరహితులనఘమతులిం । ద్రియనిగ్రహశక్తిమించు - దృఢచిత్తులున
క్షయసమ్మదయుతులు జగ । త్త్రియమునను మునులఁ బోలు - ధన్యులుగలరే ! 130

క. సకలక్లేశాంకురవృ । ద్ధికిఁ గారణమగుట నెంచి - తెలుకువఁ గలవా
రొకనాఁడును మనములనై । హికవాంఛం జెందరేల - యీభ్రమగలిగెన్. 131

ఆ. తెలియఁగల సెమీకుఁ - దెలియని ధర్మంబు । లెందుఁ గలవు? పలుక - నెంతవాఁడ !
బుణ్యచరిత ! క్రుద్ధు - పోయి కూసను వెక్కి । రించినటుల నగుడ - లంచి మాట. 132

చ. అనినఁ జియించి పభూవరుని - యర్థపుమాటల కిచ్చ మెచ్చి మో
మునఁ జిఱునవ్వు గోఁపఁదన - పూనికఁ దీర్చుకొనంగ నెంచి యి
ట్లనియె నుదాని నీనుడువు - లన్నియు సత్యములైన బుద్ధినా
కెనయదు కష్టకాటఁదప - మింకనొనర్పఁగఁ జాలమానితిన్. 133

గీ. ఇప్పిరో! సర్వభోగంబు - లీటువోవ । నెల్లకాలంబుఁ గష్టించు - టేమి బ్రదుకు?
తపముచేఁ బడసెడు మేలు-దైవమెఱుఁగుఁ । గాని యీమాటవలదింక-మానవేంద్ర! 134

చ. ఇడుములఁ బొందికుందిఫల - మిందునఁ గల్గదటంచు నెంచి నే
విడిచినకార్యమున్మరల- వెట్టిపథంబునఁ జేయ నెంచు టె
క్కుడినుడి; నిష్ఠయుం దపముఁ - గానలలోననె పోయె, నీతులం
దడవఁగ నిందు వచ్చితినె ? - ధర్మవిచారమదేల నాకిటన్ ? 135

ఉ. కోరిన నెట్టిదైన నొడఁ - గూర్తు వుయాచక కోటికిం బ్రియం
బారఁగ సత్యశీలుఁడవ - టంచు జనుల్ నినుఁ జాల మెచ్చి వి
స్తారము నాత్మలై వినుతి - సల్పఁగ నేవిని వేడ్కనీప్సితం
బేరహిఁ గాననొందఁగల - నింక నటంచుఁ దలంచి వచ్చితిన్. 136

ఉ. వ్యర్థపుమాటలేల ? మను - జాధిప! దాతవుగాన నీవు నా
ప్రార్థనమాలకించిమది - బాగని యోగనిశంకఁ బూనకి
ష్టార్థ మొసంగు మెంతయుఁ బ్రి - యంబది నామనికింబరోపకా
రార్థమిదం శరీరమను - నార్యజనోక్తిఁ దలంపు నేయుమా. 137

క. అనఁ గుముదిని కైతవ వి । భునకిట్లను నృపతి దేవ ! - పూజ్యులు మీరె
ట్లు నుమీకుల దెలియని దెం । దును నే ధర్మమును లేదు - దురితంబనుచున్. 138

క. మునివరులు పలుకుచుండఁగ । వినియుండిన కతనఁ దపము - విడునందగ దం
టిని గాని యన్యభావం । బునఁ జెప్పినవాఁడఁ గాను - పుణ్యచరిత్రా ! 139

క. మా కేలయీ ప్రసంగము । మీకోరికఁ దెలుపుఁడీక స - మీచీనగుణా
ఢ్యా ! కష్టసాధ్యమైనను । వ్యాకులమొందక యొసంగి - యనిచెదమిమ్మున్. 140

క. తడవొనరింపకుఁ డెద్దియొ । యడుగుఁడ ! యనన చటి సభ్యు - లాలోచనలే
కడుగుమని యెన్నఁడు పుడతఁడే । మడుగునొ యని తలఁచుచుండ - నమ్ముని వేడ్కన్. 141

ఉ. ఇచ్చెదనంటివేదయిన - నింక మదీప్సితమబ్బినట్లను
మ్మెచ్చె ముఖులేను నేను సుఖము - నొందఁగఁగంటి నొసంగుదేనినీ

వెచ్చటనైన సద్గుణము - లెల్లనుగల్గిననుందరాంగినిం
పెచ్చుఁగఁదెచ్చియిమ్ముప్రియ - మేర్పడనంతియచాలు భూవరా ! 142

ఆ. సకలలక్షణములు - సమకూరియుండెడు । తరుణిమైనఁగొందు - నొరులనొల్లఁ
దొడరితగినదాని - తోడసంసారంబు । సేయుటొప్పుగడియ - సేయదైన. 143

క. ఇదిదప్పు వేఱుకోరిక । మదిఁగలుగదునాకురాజ - మార్తాండా! పెం
పొదవఁగనిమ్మని యడిగిన । నదివిని యిట్లనియెభూపుఁ - డాశ్చర్యమునన్. 144

క. ఓయయ్యా ! తగునె? మీరిపు । డీయల్పంబైనదాని - నేలావేడన్
నాయట్టివాఁడుమీకుం । జేయంగాఁదగినమేలు - నేఁతయె ? యివియున్. 145

చ. ధనకనకాంబరాభరణ - దంతితురంగమ గోవితానముల్
ఘనముగవేఁడకిట్లలతిఁ - గాంతనువేఁడిన నాదుగౌరవం
బునకుఁగొఱంతగాదె ? తగు - పోల్కినియోజన సేయరైతిరే
మనగలసర్వముందెలిసి - నట్టిభవాదృశు లిట్లుకోరినన్. 146

ఆ. పైఁడికొండకేగి - పలుకురాలేరఁగాఁ । దొడఁగినట్లుమీరు - తుచ్ఛమైన
కోర్కెఁగోరఁదగునె? - గొప్పగానడుగుఁడే । నిచ్చువాఁడనుండ - నేమికొఱత ? 147

క. అనినన్ నగి మునియిట్లను । వినుమొకధర్మంబునీకు - వివరించెదయా
చనసేయువేళనత్యా । శనుబూనుట యాచకునకుఁ - జనదండ్రుబుధుల్. 148

చ. అడిగినదాని నిమ్మదయ - నంతియచాలును మానసంబునం
బొడమెడియాశకేపతుది - భూవర! సర్వమునిచ్చినట్లు నే
నెడదఁదలంచుకొందునిది - హీనముగాదు వివేకిపీవుదం
దడిపచియింపనేటికిన్వు - ఘాతపవిట్లొనరింప నేటికిన్. 149

వ. అనిపలికిన మానిమాటలకుమారాపనోడివిజయాశ్వమహీశ్వరుండతనికి భయభక్తివినయం
బులెసంగ నమస్కరించిమహాత్మా! మీరు సర్వజ్ఞులరు మాదృశులగువారు మీతోడనిట్టి
ట్టని పచియించుటకర్జంబుగాదు. మీరిచ్చయించుమచ్చకంటికిఁగలిగియుండఁదగినలక్ష
ణంబులెఱింగింపుడు. విచారించికొనివచ్చిసమర్పించికృతార్థుండనయ్యెదననినసంతసించి
యామనస్వికిఁదపస్వి యిట్లనియె. 150

మ. వినురాజేంద్ర దురాశయుంగపటమున్ - ద్వేషంబుగోపంబువం
చనయుంజింతయు గర్వమున్ విరసభా - షల్ దుష్క్రియారక్తియున్
ఘనపాభుక్తియు నిర్దయామతియుదుః - ఖక్రార్యముల్లేనిదా
వనితారత్నముఁదెమ్ము వేగమున మ-ద్వాంఛానుసారంబుగన్. 151

క. అనయంబును దుర్మతమునఁ । దనయొడయనికప్రియంబుఁ - దగఁజేసిసదా
ధనుకొదవించెడిదానిం । గొనుటకదుంగీడుతెలిసి - కొనిరావలయున్. 152

వ. అని నిరూపించిచెప్పిన నట్లయగుంగాకయని విజయాశ్వుండు శిష్యయుతంబుగామునీం
ద్రునిందగిన స్థలంబున విడియించి వారికుపచరింపందగువారలనియమించికాంతాన్వేషణ
కార్యంబునకుపక్రమించిసాముద్రికశాస్త్రజ్ఞులరావించియావద్వృత్తాంతంబు నెఱింగించి
సకలశుభలక్షణ సమన్వితయగు మగువను విచారించికొనిరండు పొండనివలసిన ధనంబు
నొసంగిపంచిన. 153

క. వారెల్లచోట్లకరిగి వి। చారించియనూనశాస్త్ర - సమ్మతరమ్యా
కారశుభలక్షణాదుల। నారూఢిగ నొప్పుతరుణి - నధిపతికడకున్. 154

క. తెచ్చినంగనిరాజెంతయు। మెచ్చిమునీంద్రుండుదీని - మెచ్చకయున్నే?
యొచ్చంబులేదొకింతయు। నచ్చెరవలెయున్నదనుచు - నగ్గించివడిన్. 155

ఆ. కొలువుకూటమునకుం - గొనివచ్చిరయమి। వరునకెఱుంగంజేసె - నరుగుదెంచి
దానినట్లెజూచి - తగినదిగాదిది। యనినిరాకరించి - కనలుమించి. 156

క. పటపటపండ్లంగీటుచు। కుటిలభ్రూకుటిభయంబుం - గొలుపంగంజాలం
గటములదరంగా నృపుండెదం। గటకటపజనిట్టులనియెం - గడుమైబదరన్. 157

గీ. మంచిలక్షణములుగల - మగువందెచ్చి। ప్రియముకట్టింపంగా సమ-ర్పింతుమీకు .
ననుచువాగ్దానమొనరించి - నట్టిపాండ। వీచెడిపెందెచ్చికొనుమను - టేమిఘనత? 158

క. ముదివగ్గునకున్ మేలగు। నుదతీరత్నంబదేల? - సుగుణములెల్లన్
వెదుకంగనేలా? వీనికి। నిదిచాలునటంచుబుద్ధి - నెంచితివే? బళి! 159

చ. తొలుత నెఱింగించితిన్ సతుల - దోషగుణంబులు సద్గుణంబులున్
బలుమఱు, నీవుతద్విధము - భావనజేయకనర్హలక్షణం
బులుగల రూపహీనయగు - బోటెనిందెచ్చి పరిగ్రహింపంగాం
గలననినమ్మి, నాకొసంగ-గాండలపంపగునే? క్షితీశ్వరా!. 160

గీ. ఎంతసౌందర్యవతియైన - నెట్టిదైనం। గానిదీనినినేనొల్ల - మానవేంద్ర!
యున్న వెదకించితెచ్చి వే - రొకతెనిమ్ము। లేకయొసంగలేననుమె-గ్గు-లేదుమాకు. 161

మ. అనిమానీంద్రుండనాదరించెందగదీ - యజ్ఞాక్షియంచంతదా
వినయంబొప్పంగభూపుండిట్లనియెనో - విప్రాన్వయాధ్యక్షయీ
వనితారత్నమునొల్లకున్నసుడిం బ - ప్పక వేగవేరొక్కతెం
గొని తెప్పించెద నిష్టసిద్ధియగుసం - కోచింపంగానేటికిన్. 162

వ. కనలువీడిశాంతచిత్తులరై యుండుండనియమ్మగువననిచివిజయాశ్వుండది మొదలుగానచ్చట
చ్చటవెదకించిరూపలావణ్యానుగుణశీలంబులం జేరువడసినకాంతామణులం బెక్కండ్రరావిం
చిక్రమంబుగామునివరునకుంగానిపించినం జూచి యతండువారలలక్షణంబులువిమర్శించి
యొవ్వకనిరాకరించి విజయాశ్వునకిట్లనియె. 163

సీ. మైచాయయేగాని - మర్షంబు హర్షంబుఁ - గలుగదుర్వీశ ! యీ - కాంతయందు
మోమందమేగాని - ప్రేమంబుఁగామంబుఁ - గలుగదుర్వీశ ! యీ - కాంతయందు
నడలజగ్గేగాని - యడకంబునొడికంబుఁ - గలుగదుర్వీశ ! యీ - కాంతయందు
వగలపెంపేగాని - పరువంబుగరువంబుఁ - గలుగదుర్వీశ ! యీ - కాంతయందు
గీ. సుందరాంగులయ్యు - శుభగుణంబులేవు | వీరిలోనఁదగిన - వెలఁదిగలుగ
దెఱిఁగినాఁడరోగ - దృష్టిచేనేనుయీ | లలనలందుగలుగు - లక్షణములు. 164

క. అనిచెప్పిమఱియునెందఱేఁ | గొనితెచ్చిన నొల్లకున్నఁ - గొఁకుగదిరియా
జనపాలుఁడుకర్తవ్యం | బునుఁగానకయున్నఁగాంచి - మునియిట్లనియెన్. 165

క. కలిగినఁబొగడఁగఁదగుగుణ | ములుగలముద్దియనుదెమ్ము - భూవరకొనిరా
గలవోలేవోపలుకుము | వెలవెలనైదీనికింత - వెఱచెదవేలా ? 166

క. అప్పటిధైర్యముఁజెంపును | నిప్పుడుగాన్పింపవయ్యె - నెటువోయెనొకో
చెప్పినలాగునఁజేయక | దప్పినదియేమిగొప్ప - తనము ? నరేంద్రా ! 167

క. అగునోకాదోచెప్పినఁ | దగువారలనాశ్రయించె - దంజనినీదా
తెగువనెఱింగితిఁగద; యని | నగియెంబృథ్వీశ్వరునకు - నానగదురఁగన్. 168

గీ. అపుడుమానిశిష్యుఁ - డైనయుగ్రాఖ్యుఁడి | ట్లనియెగురునకింక - నవనిలేదె ?
లేరెదాతలెందు ? - లేలెందుపోదము | మనలఁగొనఁడితండు - మాయకాఁడు. 169

క. మున్నజనులనుకొనఁగనే | విన్నదితార్కాణమయ్యె - వృథయగుతుద మీ
రెన్నాళ్లిటనుండిననితఁ | డన్నవిగలవెన్నియేని-యహితవచనముల్. 170

వ. ఆవిచారంబిపుడేల ? ఇతనివలనమీకభీష్టసిద్ధియగుటదుర్లభంబు. మఱియెందేనియుంబోయి తగినవారలనాశ్రయించుటలగ్గనిచెప్పిన, మునివరుండుశిష్యునిఁజూచి, యుగ్రా ! నీవువిన్న మాటలు వివరింపుమనియెట్టివో యాలకించిపిమ్మటకర్తవ్యంబునుయోజించెదననినన్నుగ్రుం డిట్లనియె. మునీంద్రా ! మొన్నమీరువిశ్రమించియున్న సమయంబునఁ బురాలంకారావలోకనకుతూహలాయత్తచిత్తుండనై వెడలి సేనచటనచటంగలుగువిశేషంబులఁగనుచుఁ గ్రుమ్మరుచుండి యటనొక్కచోటం గొందఱుగుమిగూడిమాటలాడుచుంబ్రస్తావవశంబున మీనామంబునుచ్చరించిపలుకుచుండపనినిమిత్తంబెఱుంగనెంచిచేరంజనివారలకెఱుకపడకయుండులాగ ననొకరొఁగుప్యంబ నకుంజేరఁగిలి నిలిచివినుచుంటినపుడాగుంపునందొకఁడుతక్కినవారింజూచియీనృపాలుండు మనపరోక్షంబునమంతనంబుఁగావించి నిశ్చయించియున్న పద్ధతిందెలుపుచున్న వినివచ్చితినితనియందుసదభిప్రాయంబుంగలిగియున్న మీతోడనట్టిమాటలుచెప్పుట యుక్తంబుగాదనితలంచియింతదనక నెఱిఁగింపనైతి. సమయంబుతటస్థించినపుడుతెలుపకుండుటమేలుగాదు. కావునఁజెప్పెద నామాటలు వినుండు. 171

ఉ. కాయలునాకులుందినుచుఁ - గాననమందుసదాతపంబుఁదాఁ
జేయఁగలేకనిష్ఠవిడి - చెల్లునటంచుగృహస్థధర్మకాం
క్షాయుతబుద్ధినొక్క-తెను - జవ్వనినిమ్మనివేఁడవచ్చినాఁ
డీయవివేకివిప్రుఁడఁట - యేలనొకోముది వానికీభ్రమల్. 172

క. ఆశఁగొనియలయుసంతియ । పోఁ, శక్తివిహీనుఁడెట్లు - పొందునుఖముఁదా
నీశుంఠనతివవలచునె ? । కీశముదినఁగలడె ? నారి - కేళఫలంబుల్. 173

క. సిగ్గఱిమిక్కిలిముదిసిన । వగ్గయ్యునురతవాంఛ - వదలఁడుమదిలో
లగ్గాయిదివీనికిఁ ? దప । వెగ్గఁట; యీతులువనింక - నేమనవచ్చున్. 174

ఆ. మంచిగాఁగనేన - టించిదుర్లక్షణ । కలితలైనభామి - నులనుదెచ్చి
కానిపించిపోరి - కైకొమ్మటనివీనిఁ । బరిహసించివెడలఁ - బనుతునిఁక. 175

క. అనితగువారలతోమం । తనమొనరఁగజేసియిపుడు-ధగణేశ్వరుఁడా
మునినేపఁదోడఁగెనదినిజ । మనిమతఁడున్నాఁడెఱుంగఁ - డాతంత్రంబుల్. 176

వ. అనిచెప్పినందక్కినవారుపకపకనగుచున్నృపాలుఁనిచాతుర్యంబుఁబలువిధంబులమెచ్చియచ్చో
టువిడిచిపోయిరంతటనటనుండి కదిలివచ్చియదిమొదలు నేనువినినమాటలఁదలంచిపెక్కు
విధంబులందలపోయుచునెట్లగునోచూతమనియింతదనుకమీకెఱింగింపకుంటిని. 177

క. అచ్చటవిన్నవిధంబున । నిచ్చటనీరాజుచర్య - లెల్లనుగంటిన్
ముచ్చితఁడు నమ్మకుఁడుమీ । కిచ్చెడివారింకలేరె? - యింతినొకర్తున్. 178

క. పోదముపదఁడని తనకప । వాదముఁగల్పించి కల్ల - వలికిమునిమదిన్
భేదిల్లఁజేయఁబూనిన । భూదేవకుమారునేరు - పుంగనిభీతిన్. 179

ఆ. నృపతియిట్టులనియె - నిరపరాధినినేను । వటువుమాటనమ్మ - వలవదయ్య!
కల్లఁజెప్పెనిజము - గాదుమీకపకృతిఁ । జేయుఖలుఁడఁగాను - సిద్ధశీల! 180

వ. అనిపలికిన నతనిమాటలనాదరింపక యుగ్రునిఁజూచి. 181

క. పసగాననగవునగియా । వసుధామరుఁడనియె నెట్టి - వచనంబహహా !
యసమీక్ష్యకారినగుటఁ । బొసఁగదుపోశుభమునాకు - బుద్ధితొలంగెన్. 182

క. వేలయ్యెఁజాలుఁజాలును । లేలెమ్మిఁక, మున్నెయొసఁగ - లేననరాదో
నేలేకినగుదునరా । దోలలనందెచ్చుశక్తి - తొడరకయున్నన్. 183

ఆ. ఇతనికపటతంత్ర - మిట్టిదౌటెఱుఁగఁగా । నేరమైతిమహహా! - నీళ్ళలోఁతు
మనుజునందుఁగలుగు - మర్మంబుఁదెలియరా । దంద్రుసత్యమైన - దావచనము. 184

వ. అని విజయాళ్వనరేశ్వరుని కభిముఖుండై కోపాతిరేకంబున మొగంబుజేగురింపతీక్ష్ణ
దృష్టింజూచియిట్లనియె. 185

క. ననుఁబరిహసింపఁబూనుట । ఘనతయగునె? నీకునోరి - కపటాత్మా! న
మ్మినమాబోఁట్లనలంచెడి । నిను నెట్టిఁడవనఁగవచ్చు - నృపుఁడవెనీవున్. 186

ఆ. నేనుముచ్చటపడి - చెలఁతనొక్కఁతెనిమ్మ । టనుచునిన్ను వేఁడు - కొనినవల్లె
యనియనర్హులైన - యతివలఁగాన్పించి । చిట్టకంపుఁబనులు - సేయఁదగునె? 187

క. పోలుంబోలదనుచుఁదగ । నాలోచింపకలతాంగి - నర్పింపకమ
మ్మేలాగెలియొనర్పఁగ । నేలిదమైతిమె? దయావి - హీనా! నీకున్. 188

గీ. ఇటులనోలాటఁబెట్టువా - రెందుగలరు? । క్రూరుఁడవునీమొగముఁగనఁ - గొనఁగరాదు
చెప్పలేదనిబొంకు మీ - చేష్టలేల? । ననినవెఱఁగొంది విజయాశ్వుఁ - డిట్టులనియె. 189

క. ఈవటుకునిపలుకులువినఁ । గావలదోమునికులేంద్ర! - కల్లవచించెన్
దైవముసాక్షిగనెప్పుడును । భావంబుననటులఁదలఁచి - పలికిరెయుంగన్. 190

క. మీవంటివారికెగ్గుం । గావింపఁగఁదలఁచునట్టి - ఖలుఁడుంగలఁడే?
దేవా! తానెవఁడనఁగా । నేవిధినీమాటలెల్ల - నీతఁడువినెనో. 191

ఆ. మీపదంబులాన - మిము గేలిసేయంగఁ । దలఁపలేదు నేను - తలఁచియున్నఁ
జెడుదుఁగాకయనుచుఁ - జేదోయిమోడిచి । మ్రొక్కి మ్రొక్కుటయును - మునియదల్చి. 192

క. కలిమికొలందినివిభవము । బలిమికొలందినిచలంబు - భక్తికొలందిన్
ఫలముఘటముకొలఁదినిజల । ములుకులముకొలందిశీల - మునుసంధిల్లున్. 193

క. వేయేలపలుకనీకున్ । మాయెడలన్ లేదుభక్తి - మము నేఁచుటకై
చేయఁగఁదలఁచినదంతయుఁ । జేయుముతత్ఫలమునీవు - నెందెదవుతుదిన్. 194

ఉ. వాదముభేదమేమిటికి - వాలకమెల్ల నెఱుంగవచ్చె నీ
యాదరమింకఁజాలువిను - మంగననిచ్చెదనంచుఁబల్కఁగా
లేదె? వచింపుమా! కొఱఁత - లేదటువల్కినమాకు, నీకు స
మ్మోదమెకాదె బొంకనిన? - ముల్లెమునుంగునె కల్లలాడినన్? 195

ఉ. ఆడినఁదప్పవంచువిని - యంగననొక్కఁతెనిమ్మటంచునే
వేడుకఁగోరినాఁడనవి - వేకివటంచుఁదలంపలేదు నీ
వేషబమెల్లనిప్పుడు వి - వేచనసేయఁగఁదెల్లమయ్యెనిం
కోడకచెప్పలేదనుము - యోజనఁజేసి యలంపనేటికిన్. 196

క. నీలావరితనము మదీ । యాలోడన మడఁపఁజాల - దడియాసలుమా
కేలా? చాలామేలగు । వైరమువివరింపుమేమి - వచియించెదవో. 197

వ. అనిపలికి మునికిసదుత్తరంబునొసంగగమకించిన విజయాశ్వునివారించియుగ్రుండుగురునిఁ
జూచి నిర్దాక్షిణ్యంబగుమాటల నిట్లనియె. 198

గీ. కపటమెఱుఁగనివారలు - గానమీరు । మానరింకను నడిమాస - మానసమున
వీనినమ్మంగవలదు దు - ర్వ్యదుఁడు వీఁడు । కాంతనర్పించుననుమాట - కల్లకల్ల. 199

క. తివిరితలఁదఱుగవచ్చినఁ । జెవులకు మందడిగెనన్న - చెన్నిది, మిమువీఁ
డవమానించుట నెంచక । యువిదవొసఁగుననుచు నమ్మి - యుండంజను నే ? 200

ఉ. వేడుకఁగొల్వులోఘనత - వీఁరబోఁకయుండునట్లు తా
నాడినమాటలందలఁచి - యన్యవిధంబుగఁ బల్కలేక మో
మోడివితాకుఁజెందిచెడు - యుక్తులఁబన్నఁదొడంగెఁజాలకి
గ్గాడినరుండువీఁడిపుడు - కాంక్షితముల్ సమకూర్పనేర్చునే ? 201

మ. జననాథుండిటులైననింకఁబ్రజలే - చందానవర్తింతు, రీ
తనిసమ్మానమెఱుంగనర్యోనిటుస - త్యంజేదిబొంకేది, యె
వ్వనిదూఱుందగునెవ్వనింబొగడనా - బాగాయెనీపాటియ
ల్పునినర్థించుటయేయసంగతము మీ - బుద్ధిన్ విచారింపుఁడా ! 202

ఆ. పూని త్రాగనీరు - లేనిచోటుననీఁదఁ । బోయినట్లుమీకుఁ - బొలఁతినొసఁగ
మనసుగలుగకున్న - మతకరినివ్విధి । వేఁడుచుండదగునె? - విడువుఁడాస. 203

ఆ. కనులుచెడినవానిఁ - గంటికివైద్యంబు । నడుగుభంగిసత్య - మందుబుద్ధి
లేనివానినడుగఁ - గానేమిఫలము మీ । కొదవు ? నదిఁదలంప - కున్నవారు. 204

క. ఇతఁడేనారాజిద్ధర । బ్రతిమాలుకొనంగ, సత్య-వంతులుసుగుణా
న్వితులెంద ఱుందఱోఁగల । గతివనుగొనఁదగదెవారి - నడిగి మునీంద్రా ! 205

వ. అనిననతనిమాటలువిని కటకటంబడిమునివరుంజూచి విజయాశ్వుండిట్లనియె. 206

చ. సకలమెఱుంగువారుఁదొలి - జాతినిఁబుట్టినవారుఁబెద్దలో
పికవిడి రునన్నువెతఁ - బెట్టఁగనాత్మఁదలంచియిట్లు మె
చ్చకయొకనిందమోపి యప - చారమొనర్చితిసంచునెంచినే
నకలుషమానసుండనగు - టాత్మఁదలంపకదూఱుటొప్పునే ? 207

క. ఏదుష్టుఁడెవటనెందున । కో, దబ్బరలాడవినియె - గోలవటువుమీ
కాదుర్వాక్యంబులనా । వేసంచెను నిక్కమని వి - వేచింపక తాన్. 208

క. ఇందునకై నాపైనలు । గందగదుమునీంద్రయెంత - కష్టమొదవినన్
నిందింతునెమిము ? నావ్రత । ముందెలియఁగలేరె ? సర్వ - ముంగనుమీరల్. 209

ఉ. ఈకొనరై తిరంగనల - నెందఱిదోడ్కొని వచ్చిచూపినన్
మీకురుచించుభామినులు - మేదినినెచ్చటనున్నవారలో.

మాకెఱుఁగంగరాదుకల - మాటవచించితి యోగదృష్టి మీ
రేకనిపల్కుఁడయ్యయిపు - డేచని నోఁగొని వచ్చియిచ్చెదన్. 210

ఆ. అనిన శాంతినొంది - యా మునియతనికి | ట్లనియె, మంచిదటుల - నైన నేన
దెలియఁ జేతు యోగ - దృష్టిచేఁ గనుఁగొని | మెచ్చుకొనినదానిఁ - దెచ్చియిమ్ము. 211

స. అనిపలికి యొక్కింతతడవు కన్నులు ముకుళించియుండి మగలవిచ్చి యానృపాలునింజూచి
యిట్లనియె. 212

మ. కనుఁగొంటిన్ నరనాథ నేనిపుడు లో - కంబెల్ల నాబుద్ధికే
వనజాతాక్షియు నెక్కడయ్యెను వృథా - వాంఛించితిన్ నిష్ప్రియో
జనమౌ కోర్కెఁ బడెం గష్టమొందితి వినన్ - సంతృప్తినొందింపనెం
చిననీవున్, మహిలో దరిద్రునకు సం - సిద్ధించునే సంపదల్ ? 213

ఆ. ధాతయొకనినుదుట - దౌర్భాగ్యుఁడగును వీఁ | డనిలిఖించియున్న - యట్టివానిఁ
దివిరిమంచిదశకుఁ - దేనేర్చునట్టివాఁ | డెవఁడుగలఁడు? తప్ప - నెవనితరము? 214

ఉ. కోరినకోర్కెఁ దీర్చుటకుఁ - గోరికఁగల్గిన వాఁడవీవు నే
నూరకచన్న నీయతిశ - యోన్నతికింగడులోటు సజ్జనుల్
నేరమునాయదే యనిగ - ణింపుదురాటను దీనికొక్కని
ర్ధారణఁజేసినాఁడను ధరావర! దెల్పెదనాలకింపుమా ! 215

చ. అడిగితి నేనొసంగెదన - టంటివి నీవును నింతమాత్రముం
బడయఁగలేమి యివ్వమియుఁ - బాపముగావున యున్నవారిలో
యడఁకువఁగల్గు దానిఁ బ్రియ - మారగనొక్కర్తుకనిమ్ము తెల్పెదం
జెడినను సౌఖ్యమొందినను - చిత్తమునంగొఱలేదు పిమ్మటన్. 216

ఆ. తామసంబొనర్పఁ - దగదు కల్గినమాటఁ | దెలుపుమిపుడు కోర్కెఁ - దీర్పఁగలవొ
కామపొమ్మనెదవొ - కానరాదయ్యెనీ | తలఁపటన్న విభుఁడు - తపసిఁజూచి. 217

క. కాదనిపలుకుదు నే ? యో | భూదేవకులాగ్రగణ్య ! - పొలఁతుకయునికిన్
మోదము మీఱఁగఁ దెలుపుఁడ | యాదరకంధరనుఁ దెచ్చి - యర్పింతు వడిన్. 218

క. చెప్పిననిప్పుడచనినే | నప్పడఁతినిఁ బిలువఁబనిచి - యాడినమాటం
దప్పక మీకొప్పించెద | మెప్పించెద మిమ్ము నిజము - మృడనిభమూర్తీ ! 219

చ. అని విజయాశ్వభూపతి మహావినయంబునఁ బల్కమానియా
జనపతిఁ జూచి దామరల - శాస్త్యమునందలయూఁచి నవ్వియప
ల్కినఫలమేమి ? కానిపని - కింబ్రియమేటికి ? ఱెవ్వరైనన
య్యోను వివరింపనొల్లఁగడు - హేళనతుంగుదురాడుఁ జెప్పినన్. 220

క. వినిపించిననీవుమదిం | గనలొందుదువిదినిజంబు - కావుననీకున్
వినిపింపనేల? యదికా | దనిపించుకొనంగనేల? - యఘమునిపోల్కిన్. 221

ఉ. ప్రాప్తముగల్గునేనిజప - రాలులభింపవె లోకమందు? నే
సప్తసముద్రములల్గడచి - చన్నను నొవ్వని వేళఁజిక్కునే?
వ్యాప్తినిమించుమెచ్చఁదగు - వాఁడవుదాతవు నీవునిట్లుసం
తృప్తియొనర్పఁజాలక మ - దిన్వెతనొందెదవేమిసేయుదున్. 222

క. నావినిభూపాలుండో | దేవా! నేనేశుభాంగిఁ - దెత్తు? దెలుపుఁడే
లావినుగుఁజెందఁగానిపు | డావెలఁదుకయొచటనుండు - నమరఁగఁజెపుఁడా. 223

వ. అనియడిగిననిట్టూర్చిమునివరుండా జనవరునకిట్లనియె. 224

ఉ. ఎవ్వతెయంచునీవడిగె - దేమనిచెప్పుదుమానవేంద్ర! యా
జవ్వనియిందెయుండుఁగడు - సౌఖ్యములొప్పఁగనిర్విచారయై
పువ్విలుకానిపూమలికి - పోయిదినాఁదగుదానిమించువా
రెవ్వరునింకలేరుమది - కింపగుచానలు కోరివేఁడఁగన్. 225

క. దానిన్ సంగినఁజాలుం | బో! నామదిఁజాలఁదృప్తిఁ - బొందెదననన
మ్మానింగనిమానవపతి | యానెలఁతుకయెవ్వరెచట - నదియుండుఁబురిన్. 226

క. వచియింపుఁడనినఁ దాపనుఁ | డచలుండై పలుకవెఱచి - యటునిటుఁగని, మీ
కిచటభయమెందనేటికి | యుచితంబగుఁదెలుపుఁడనిరి - నృగుఁడువేడ్కన్. 227

గీ. అంతధైర్యంబునొందిన - ట్లభినయించి | యతఁడురాజునుగనిపల్కె - నైననయ్యెఁ
గాకయుండినఁగాకుండుఁ - గానిదాని | నెఱుఁగఁజెప్పెదవినుము మహీశచంద్ర! 228

చ. పొనరఁగనెందుఁ జల్లఁగొనఁ - బోయినచోటున ముంతదాపఁగాఁ
జనదఁటచెప్పఁగాఁదలఁచి - జాగదియేటికి? యోగదృష్టిచేఁ
గనుఁగొని మెచ్చియిమ్మనిన - కంజదళాయతనేత్ర యెవ్వతో
యనిమదిసంశయింపకుము - స్వర్గమొయర్థమొకాని తెల్పెదన్. 229

క. సర్వశుభలక్షణంబుల | నుర్విఁగడుఁజేరుఁగొన్న - యువతులలోనన్
సర్వోత్తమగుణయుతయగు | పర్వేందునిభాస్యనీదు - భార్యయనుమ్మా! 230

క. ఆలలనకంటెభువిమతి | మేలగువారెందులేరు - మెచ్చితిదానిం
జాలునని, లేనియువతుల | నేలాగునెందుదెత్తు - వేనడిగినచోన్. 231

ఆ. తగినకాంతగాదు - మగువయటన్న, లే | రధికులంతకన్న - నగుటగ్రుడ్డి
యందుమెల్లమేల - టంచుఁదలంచివే | మదినిఁగోరినాఁడఁ - దుదకుదాని. 232

ఉ. భూవరయెన్నఁడుంబలికి - బొంకనివాఁడవుగానయా వ్రతం
బేవిధినైనఁ గాచుకొన - నిచ్చదలంపుము దీనికాత్మయం
దేవముఁ జెందఁగావలద - భీష్టముఁ దీర్పుము వేగనీయశః
శ్రీవిలసిల్లులోకమునఁ - జేకుఱునీకు సమస్తసంపదల్. 233

క. తగుఁదగదని యెంచకుమే । లగుఁగీడగుననుభవింతు - నరమరనీలో
దిగవిడిచియిమ్మునీసతి । నగడై ననునయ్యెఁగొందు - నంతియచాలున్. 234

క. అని తెలిపి మానివరుఁడా । డినమాటలనాలకించి - డీల్పడినృపుఁడెం
దునుమున్నువిని యెఱుంగని । చనవితనికిఁ గలిగెననివి - షాదాత్మకుఁడై. 235

మ. తనలోఁదత్తఱపాటుభీతియును సం - తాపంబు హెచ్చంగయి
ట్లనియోచింపఁదొడంగె నీద్విజుఁడెన - ర్థంబంచుఁజింతింపకే
మనిపత్నిన్ దనకిమ్మటంచిపుడుదా - నర్థించెనో కానియె
ట్లొనరింపందగు నీయకార్యమును? న - న్నుర్వీజనుల్ దూఱరే ? 236

ఉ. అర్థులువస్త్రవాహన గృ - హార్థ విభూషణరత్నజాలరు
క్మార్థము లిష్టవస్తువులు - నందఁగఁగోరుదురంతె కాని యీ
ప్రార్థకునట్లయోగ్యమగు - భంగిఁగులాంగన నిమ్మటందురే ?
వ్యర్థపువాంఛనొందె నితఁ - డైన ? యొసంగుట నాకుఁబాడియే ? 237

క. కులకాంత నడుగునని నేఁ । దలఁపఁగలే దీతఁడిది య-ధర్మంబని తాఁ
దెలిసియు వేఁడుటచిత్రము । కలరా యిటువంటియాచ - కజనులునుర్విన్. 238

చ. అడుగుము దేనినైననుఁ బ్రి - యంబున నిచ్చెదనంటిఁగానఁ దా
నడిగెనితండు, లేదితని - యందపరాధము సుంతయేనియుం
గడిదిగనెంచి నేనిపుడు - కాదనవచ్చునె ? మానికోరికన్
విడువఁడు వేఁడఁడన్యమును - భీతిలఁడించుకయైన నిందకున్. 239

మ. సతినర్పించుట ధర్మమా ? మిగుల దూ - ష్యంబింక నేదేని స
మ్మతినీకిచ్చెదవేఁడుమన్న నదిధ - ర్మంబౌనె ? యట్లన్న నా
వ్రతభంగంబగు నేమిసేయుదునవా - ర్యంబై నకష్టంపుదు
స్థితికింబాల్పడికుందఁగావలసెనే - జింతింపఁగా నేమగున్ ? 240

ఉ. ఏమివచింతునే తపసి - కీలువుఁదప్పనిదైన మత్సతిన్
నేమమువీడకిచ్చుటయొ - నేనుడిఁదప్పుటొ యొండుగాక నిం
కేమొగిఁ దీఱునీయడరు - హీనుని భంగినిఁబల్కి బొంకఁగా
నామతియొల్లకున్న దవ - నాయపుకార్యము నెట్లుసేయుదున్ ? 241

క. యాచకుఁడు తగునతగదని । యౌచిత్యము ననుచితంబు - నాత్మ నెఱిఁగి దా
యాచించునె? ముదమునసం । కోచింపక వేఁడుఁగాని - కోరినభంగిన్. 242

ఆ. అనుచు పెక్కుగతులఁ - దనలోనఁ దలపోసి । తత్తఱించుచున్న - ధరణిపతినిఁ
గాంచిమునివరుండు - కన్నులెఱ్ఱఁగఁజేసి । జెట్టిదంబుగాఁగ - నిట్టులనియె. 243

శా. ఏరా! యోరివివేకదూర! మును నీ - వెద్దానినర్థించినన్
ధారాళంబుగ నిచ్చువానివలె వా - గ్దానంబుఁగావించి నీ
దారన్ గోరితినిమ్మటన్నఁ గడుచిం - తన్ బూని మారాడవె
వ్వారైనన్ నినుమెత్తురే? కపటదు - ర్వ్యాచాట! నీచాత్మకా! 244

చ. గుడసరి! యోజనల్ విడిచి - కోమలినిమ్మఱలేక సత్యమున్
విడువనివాఁడవైన విను - వెంగలివై సతిమీఁది యాసచే
నుడివిన మాటఁదప్పిన ని - నున్ బహుళాఘములంచు నీయశం
బడఁగును సంపదల్దొలఁగు - నాత్మఁదలంపుము హానివృద్ధులన్. 245

మ. మరుమాటాడకయున్నఁ బోదునె? వృథా - మాకేలనీతోడయీ
పరుషోక్తుల్ తగ వర్థితంబొసఁగినీ - ప్రఖ్యాతిరక్షించుకో
మ్మరవాయింగొను టొప్పదింకనిముసం - బైనన్ ప్రతీక్షింపనో
ధరణీశా! తడయంగనేమిటికి? కాం-తన్ వేగనర్పింపుమా! 246

క. లేకున్న నినుశపించెద । నాకుంగోపంబుమించె - నా? యటుపైనే
నేకీడొదవిననొదవుం । గాకవిచారించువాఁడఁ - గానుకతినుఁడన్. 247

మ. అనిగద్దించిమహోగ్రుఁడై వలుకయు - గ్రాఖ్యుండుదానొజ్జకి
ట్లను, నోమానివరేణ్య! కూళుఁడును మా - యాశీలుఁడున్ వీఁడుసాం
త్వనయోక్తుల్తగ నీఖలుండువినునే? - తర్కింపుఁడా! యెంతదె
ల్పిన భస్మంబున సేయుహోమమును వో - లెన్ వ్యర్థమౌనెంచఁగన్. 248

శా. సందేహించిన నేమిమేలొదవు? మీ - శాంతంబుపట్టయ్యో వీఁ
డిందాకన్ ముసిమెచ్చులాడుటకు ము - న్నేగంటినీతత్త్వమున్
విందోమిత్రుఁడొ వియ్యమందినతఁడో - విశ్వాసపాత్రుండొ యీ
నిందార్హుండెవఁడో శపింపఁదగదే? - నిస్త్రింశభావంబునన్. 249

చ. ఘనతరదారుఖండపరి - కల్పితమూర్తపరంజమధ్యమం
దునిచి, తదీయమైన రస - మొల్కఁగ నొత్తడిగల్గుభంగిఁద్రి
ప్పినతఱిఁగాని, యోచెఱుక! - బెల్లముఁబెట్టుమటన్నఁబెట్టునే?
మననుడి వీనికింపగునె? - మంచితనంబున నెంతఁజెప్పినన్. 250

క. నుడివిననుడువుం దప్పిన। చెడుగునుఁగని కరముమాని - చెడఁదిట్టినఁగ
ల్గెడిదోషమేమి గలదీ। వడువున దైన్యమున వేఁడ - వలయునె ? వీనిన్. 251

మ. తరువా ! నాకొకపండుని మ్ముడుపమా ! - దాటింపుమీ వాహినిన్
సురభీ ! క్షీరములిమ్మటన్న యవియా - శోకంబ్రసాదించునే ?
ధరమీఁదంబడ రాల్పకున్నను నరి - త్రిద్వంద్వమున్ బూనితాన్
జరుగన్ద్రోయకయున్ననుం బిదుకతు - న్నన్ మానివంశాగ్రణీ ! 252

ఆ. కాంతనిచ్చుననుట - కల్లమీరడియాస। మానిచనుటమేలు - మార్గమింక
సుచితమైనచోట - నువిదనార్జింపఁగాఁ। దగునిదేటిగోడవ - ధన్యచరిత ! 253

చ. అనవుఁడు నోరి ! మెచ్చితియ - ధార్మముఁబల్కితి వింతమంచి శి
ష్యునిఁగలనాకుఁ జేకుఱదె ? - సుందరియొక్కతె, యైనవీఁడుము
న్ననుమతిమాటలం బలికి - యంజికనిత్తతి మారుఁబల్కకుం
డిన విడువంగనౌనె ? మన - నేర్పుకొఱంతయె ? వీనికత్తికిన్. 254

క. పైదలి నర్పించుటయో। లేదనుటయొరెంటనొకటి - లెస్సవినకనేఁ
బోదునె ? యూరక, యిఁకనా। వైదగ్ధ్యము నీకుఁదెలియ - వచ్చుంగనుమా ! 255

క. అనిమోము జేవురింపఁగఁ। దనకభిముఖుఁడై వచింపఁ - దలఁచినమానిన్
గనుఁగొని విజయాశ్వుఁడుగడు। వినయంబున నిట్టులనియె - వెఱమదిఁగదురన్. 256

ఉ. పూజ్యచరిత్రనేఁ బలికి - బొంకెడువాఁడనుగాను మీకు నా
రాజ్యమునైననిచ్చెదను - రజ్జులుగావు భవత్కృపాప్తిసా
యుజ్య ఫలప్రదాయకము - యోగ్యముగా దనియెంచ కివ్విధిన్
త్యాజ్యము సేయఁగాఁదగిన - దానము వేఁడితిరాటఁ గొంకెదన్. 257

క. పరసతినిఁ గోరుటెంతయు। దురితంబని బుధులువల్కు - దురుసర్వజ్ఞు
ల్పరికింపఁగమీరోకరుని। తరుణినపేక్షించుటేమి - ధర్మంబనఘా ! 258

క. ధనకనక విభూషణవా। హనచయములఁ గోరియడుగ - కన్యాంగనని
మ్మనివేఁడుదురే ? యొండై। నను, దారినెఱింగిమడువు - నంజోరఁదగునే ? 259

క. కలుగవెపురములు భూములుఁ। గలుగరె లావణ్యమొదవు - కామినులింకం
గలుగవెవేఁడఁగఁదగునవి। కులకాంతనొసంగుమనుచుఁ - గోరుటుచితమే ? 260

క. అనఘా ! శాస్త్రనిషిద్ధం। బును కిల్బిషకరమునుట - బుద్ధినిఁదగరో
జనసేయకన్యసతియగు। వనితనుఁగైకొనఁదలంప - వచ్చునె ? చెప్పుఁడా ! 261

శా. అశ్వానీకముగో శతాంగములనో - హారామసౌధంబులో
విశ్వంబోపరివారమో పటములో - విత్తంబొరత్నంబులో

విశ్వేశాకృతి నొప్పుమీకిపుడె యు - ర్వింతుం గొనుండయ్యా ! యి
ట్లైశ్వర్యంబును వేఁడలేకఁదగునే - యర్థింపఁగామత్సతిన్. 262

ఆ. తారతమ్య మెఱిఁగి - దానంబునడుగఁగా । వలయునర్థియనుచుఁ - బలుకవినమె ?
తగనివస్తువైన - దత్తంబుఁజేయరా । దటవదాన్యుఁడెపుడు - యాచకునకు. 263

సీ. అవనినేదానమున నసుం - బవసుళించు । నట్టిదానంబుఁజేయరా - దంద్రుడుబుధులు
కొడుకకొసఁగినవాఁడునుఁ-గొనినవాఁడు । మేలుఁజెందరనెడు సుద్ది-మీరువినరె ? 264

క. కావునఁగూడని కార్యముఁ । గావింపఁగనేటి కన్ని - గలుగవుకొనఁగా
దేవా ! యర్హంబగునది । గావేఁటొకటడుగుఁడనినఁ - గడుకోపమునన్. 265

ఆ. ఉగ్రదృష్టిఁజూచి - యుర్వీశునదలించి । వానియిట్టులనియె - మదిచలింపఁ
దలిసెనోరి ! నీదు - తెగువరి తనమెల్లఁ । గల్లరిఁడవీవు - కలుషహృదయ ! 266

క. అడుగు మనియొట్టిదైనం । గడువడినిచ్చెద నటంచు - ఘనులువినంగా
నుడువఁగలేదే ? యిపుడీ । చెడుమతమును బూననీకుఁ - జెల్లునెచెపుమా ! 267

క. పుడమిని మానధనుల్తా । మొడఁబడికంబలికి బొంక - నోడుదు రెపుడున్
జెడిననుఁజెడుదురు యేకీ । డడరిన సైఁపుదురువిడువ - రసత్యంబున్. 268

క. కోరినయర్థంబొసఁగఁగ । నేరకయీలాగునీవు - నీతులువలుకం
గారాజధర్మమగునే? । యోరీ! నీవంటికుటిలుఁ - డుర్విఁగలఁడే? 269

చ. వలసినదానిఁగైకొనక - వాంఛనుగొందునె యన్యవస్తువుల్
గలవనినీవు మాకొసఁగఁ - గాఁదలపోసిన, మున్నె దెల్పనే?
పలుమఱు, వేఁడినంతనిది - బాగదియోగనరాదు నీమదిం
దలఁచివచింపుమీయనుచు; - దప్పిద మెవ్వని దెంచిచూడుమా! 270

క. కులకాంతనుఁ గోరుటకడుఁ । గలుషంబగునంటివెందుఁ - గలధర్మంబోఁ
దొలుత నెదియడుగునోయని । తలపోయనినేర మెవని - తల పైఁగలదో. 271

క. తెలివిచెడిపోనివృద్ధులఁ । దలఁపకఁగావించుకొనిన-తప్పున్యులదా ?
జలచరముమిట్టిధాత్రీ । స్థలమునఁబడియులయుతప్పు - సలిలమందగునే ? 272

క. సతినర్పించుటకున్నీ । మతియొప్పమిన నెదవిట్టి - మర్మపుమాటల్
కితవుఁడవునీవుసత్య । వ్రతమింబాలించుకొనఁగ - వశమానీకున్. 273

క. వినువాగ్దత్తంబునుజే । సినబాదిగమాధనంబు - చెలువముఁగలనీ
కులకాంతగాన తగువిధ । మునమాకొప్పింపుమింక - మోమో టేలన్. 274

క. ఒకనిమిషమైననిఁకపై । సకియనుమాకొసఁగకున్న - సైఁపనునిన్నున్
ముకుఁబట్టిలాగుదుంగని । పకపకనీపాటుఁజూచి - పదుగురునవ్వన్. 275

క. అనిలేచినిలిచి బిరబిరఁ । దన పైఁగలనారచేలఁ - దగఁగటిసీమన్
బెనవెట్టిచుట్టిసభ్యులు । గనుఁగొని వెఱఁగందఁగోప - కలితాననుఁడై. 276

ఆ. రాజుచేయిఁబట్టి - రమణినర్పింపుము । తడవుసేయుచున్న - విడువనిన్ను
సంశయింతువేని - శపియింతునిపుడని । యార్చిపండ్లుగీఁటి - యట్టెతిగిచి. 277

శా. రాఁగమ్మింతినిఁ బిల్వఁబొమ్మనుచుని - ర్బంధింపరాజిట్లనున్
దారాదత్తమొనర్చినాఁడనెమహా - త్మా! మీకు? మీరింతని
ష్కారుణ్యంబుగఁ బల్కనొప్పునె? నమ - స్కారంబుఁగావించెదన్
నేరం బెద్దియులేదు నాయెడవృథా - నిర్మింపఁగానేటికిన్. 278

క. కోరినయదియొసఁగెదనని । నేరూఢిగనినమాట - నేరంబగునే?
ధారుణినెవరైననుఁబరు । దారంగోరుదురె? చెపుడ - ధర్మవిచారా! 279

క. మీకుం దెలియనిధర్మము । లోకంబుననెందుఁగలదు? - లోఁజూపుఁగలా
రీకీలునెఱుఁగకుందురె? । సాకొక్కటిగలిగెఁగాని - సంకటపెట్టన్. 280

వ. అనినమఱియుఁ గినిసివెగటుగానగి తపసియిట్లనియె. 281

క. అడిగినదిచ్చెదనంటివి । యడిగినవన్నియునుదత్త - మైనట్లగదా!
యొడఁబడకున్నం దీఱునె? । వెడఁగా! నీభార్యయైన - వేఁడెందగదో. 282

క. మఱుమాయలచేఁగికురిం । చుటకుం జూచెదవునీదు - చొప్పెఱుఁగుదునేఁ
గుటిలుఁడవసత్యవాదివి। కటకటనీమోముఁజూడఁ - గాదోసమగున్. 283

క. లేదనుముపోయెదనుయీ । ఖేదమునీకేలనోరి! - కృపణుఁడవుధరి
త్రీదేవులతరమెఱుఁగవు । ప్రాదేశమిట్టిదగునె? - పాపస్వాంతా! 284

ఉ. న్యాయములన్ వచించెదవు - నానయొకింతయులేక యొప్పదీ
ప్రాయిఁడిచేష్టమానుముధ - రావర! యాడినమాటఁదప్పినన్
శ్రేయముగాదు మాదృశులు - చేకొనరిట్టివివేకహీనునిన్
న్యాయుఁడనాటఁగాంచియొక - సక్కముఁజేయఁదలంచినాఁడవే? 285

క. నీవలెనింతకుమున్నే । భూవల్లభులెచటఁబలికి - బొంకిరి? తామే
నోవ్వెతలొందియు విడిచిరె? । పావనమగునట్టిసత్య - భాషావ్రతమున్. 286

సీ. చండాలునకుహరి - శ్చంద్రుఁడమ్ముడువోఁడె - ధనమునకై యాడి - తప్పలేకఁ
బుత్రునిఁగాననం - బునకుఁబంపడెయజా - త్మజుఁడుచెప్పినమాటఁ - దప్పలేక
సర్వస్వమునుబ్రహ్మ - చారికివ్వఁడెబలి - ముప్పెఱింగియునుడిఁ - దప్పలేక
రుక్మాంగదుఁడుకుమా - రునిఁజంపఁబూనఁడే - తరుణికిచ్చినబాసఁ - దప్పలేక. 287

గీ. మఱియునిలనెందఱోసత్య - మతులుమున్ను । పలికిబొంకఁగఁజాలక - పడఁగరాని
కష్టములనొందిసత్కీర్తిఁ - గాంచినారు । వారునీవంటివారలు - గారొ చెపుమ! 288

క. అనిరోషకషాయితలో । చనుఁడైముష్కరముగాఁగ - సతినిమ్మనున
మ్మునియుద్ధతిఁగనివగరిచి । మనుజేశ్వరుఁడిట్టులనియె - మర్షముమీఱన్. 289

క. ఇపుడేమిపలికిబొంకితి? । విపులానుగవంశభూష! - వివరింపుఁడ! యీ
విపరీతమైనయాచన । యపకృష్టమువేఁడరాద - టంటినినుండీ! 290

క. ఆదిష్టోదనపగదా । రాదులుగొనరానివగుట - నవిగోరంగా
రాదందురభిజ్ఞులుమీ । రాదుర్నయమెంచకుండు - టబ్రమునాకున్. 291

ఆ. ఇంతకంటెమించు - కాంతగల్గెదెమీకు । వసుధ, మనసుగలుగ - వలయుఁగాని
యరసితగిననుంద - రాంగినిరాశించి । యొప్పగింతుమాటఁ - దప్పఁజాల. 292

క. నావుఁడు పకపకనగిధా । త్రీవరునింగాంచియట్టె - తెక్కలిమునిక్రో
ధావిష్టుఁడగుచునిట్లను । నీవలెనేనెఱుఁగనేర్తు - నే? ధర్మంబున్. 293

చ. పలుకకుమప్రయోజకపుఁ - బల్కులునీకడధర్మశాస్త్రమున్
దెలిసికొనంగవచ్చితినె? - నేరక, నీసతినిమ్మటన్న నా
తలఁపునుదీర్పఁబూనక వృ - థాతడవిట్లొనరించినేఁడు మ
మ్మలఁచుటకెంచినాఁడవుదు - రాత్మక! నీవొక క్షత్రియుండవే? 294

ఆ. దత్తమైననీదు - దారనుమాకిమ్ము । మనసుగలుగకున్న - మాటదప్పి
నాఁడననుమువిడుచు - వాఁడఁగానంతటి । దనుకవేయిమాట - లనఁగనేల. 295

గీ. భ్రూణహత్యాదిపాతకం-బులనొనర్చు । వానికంటెనునన్నృతంబు - వలుకువాఁడు
కరముభారంబుతనకని - ధరణిమున్ను । విధినిఁగనిపల్కెననుగాథ - వినఁగలేదె? 296

వ. అసత్యదోషంబుబొరయకుండువిధంబునబోటినొసంగిమాటంగాచుకొనుము. నీకుసత్యవంతుఁడవనువిఖ్యాతియతిశయింపఁగలదు. కాదేనియపారంబగుపాపంబునునావలనశాపంబునుననుభవింపఁబాత్రుండవగుదువనినయతనిమాటకుమారాడఁజాలకనిజసత్యవ్రతభంగంబునకువెఱచి,యెట్టకేలకుమనంబునధైర్యంబుఁబాదుకొలిపి, మాటదప్పక యత్తపసియభీష్టంబుఁ దీర్చుటయుత్తమపక్షంబని నిశ్చయించియతనినీక్షించి యిట్లనియె. 297

క. ఓపుణ్యమూర్తి! నాపైఁ । గోపింపఁగవలదుమీరు - కోరినభంగిన్
నాపడఁతినిచ్చెదనుకృపఁ! జేపట్టిసుఖింపుఁడాస - జెందితిరగుటన్. 298

వ. అనిపలికినమస్కరించినమునివరుండుసంతసించియతనిదీవించిపరమానందనిమగ్నుండయ్యెననిచెప్పిన, యవ్వాలివృత్తాంతంబునెఱింగింపుఁడనియడుగుటయు. 299

## ఆశ్వాసాంతము.

శా. శేషక్ష్మాధరగేహ ! శాంతహృదయా ! - సిద్ధౌఘసంరక్ష ! సం
తోషాధార ! చిరా ! సురేశ్వర ! మహా - స్థూలాణు చిద్రూప ! వి
ద్వేషిధ్వంస ! యశేషదోషహరణా ! - విశ్వాత్మ ! రతోల్లస
ద్భాషా ! నిర్మల ! దేవదేవ ! వికచాం - భోజాతపత్రేక్షణా ! 300

క. వేదాంతవేద్య ! భయవి
చ్ఛేద ! జగత్త్రియవినోద ! - సింధురపతి స
మ్మోద ప్రద ! నృహరీ ! ప్ర
హ్లాదావన ! మునివిహార ! - యబ్ధిగభీరా ! 301

తరళావృత్తము

భువనరక్షక ! కైటభాంతక ! - భోగితల్ప ! ధనంజయ
స్తవ ! శివంకర ! పంకజాసన - జప్రసన్న ! బుధాశ్రయా !
ప్రవిమలాంగ గుణత్రయాకర ! - భక్తవత్సల ! మాధవా !
పవనభుక్చ్ఛయవైరివాహన ! - భామినీజనమోహనా ! 302

గద్య.

ఇది. శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాద లబ్ధానర్గళచతుర్విధ కవిత్వమహత్త్వాభి
రామ, భూసురకుల క్షీరపారావారపర్వశర్వరీసోమ, శ్రీవత్సగోత్ర
పవిత్రాపస్తంబసూత్ర, సావిత్రీలక్ష్మీనృసింహార్యపుత్రి,
సుకవిజనవిధేయ, పిచ్చయనామధేయ ప్రణీతంబగు
విజయాశ్వచరిత్రంబను ప్రబంధంబున నుత్తర
భాగంబునందు ప్రథమాశ్వాసము
సంపూర్ణము.

శ్రీమద్వేంకటేశ్వరార్పణమస్తు.



శ్రీరస్తు.

# విజయాశ్వ చరిత్రము

## ఉత్తరభాగము



## ద్వితీయాశ్వాసము.

క. శ్రీమత్పయఃపయోధిసు । తామంజులతరకపోల - దర్పణవిలస
చ్ఛ్రీముఖబింబ ! వరాంబర ! । శామిత్రోద్ధార ! శేష - శైలవిహారా ! 1

వ. దేవా ! అవధరింపుము సద్గుణగణవిశారదులగు శౌనకాదులకు సన్నుతపుణ్యకథాశతాంగ
సూతుండగు సూతుండిట్లనియె. సవిగ్రహంబున విజయాశ్వమహీశ్వరుండు విశ్వంభరాహ్వ
య తాపసోత్తమునకు నిజదారనర్పింపయత్నించుటయు నయ్యవసరంబున నించుక సేపు యో
జించి తత్పూర్వంబు నొందినసంతోషంబు మాని ఋషివర్యుండతనితో నిట్లనియె. 2

క. వినువిజయాశ్వనరేశ్వర ! । నినునడిగెదనొకటినీవు - నిర్మలబుద్ధిన్
వనితనొసంగెదనంటివొ । యనరునఁ జెప్పితివొ తెలియ - దగ్యోం జెపుమా. 3

చ. అఱిగొఱగాఁగనీవుయిపు - డాడినమాటనుఁదప్పలేక, నే
నెఱఁగొనుటన్ మదిందలఁచి - యిచ్చెదపత్నినిఁగొండటంచుఁ బె
న్వెఱపునఁబల్కినట్లుగ వి-వేచనఁజేయఁగఁదోఁచెబుద్ధి క
త్తెఱఁగునసైన నేనుపరి - తృప్తినిఁజెందనుగైకొనం జుమీ ! 4

క. అప్రియదానపరిగ్రహ । ణప్రియులముగాము మేము - నలకుసరోసన్
విప్రునకెవఁడెదియొసఁగిన ! నాప్రతిపాదనము వ్యర్థ - మంద్రుమనీషుల్. 5

ఆ. మనసుకలుగకున్న - మాకేమిటికికాంత । చనెదనే గ్రహింపఁ - జాలనని వ
నుంతయైనఁగొంకుఁ-జింతయునామనెఁ । గలుగదనఘ ! యనుచుఁ - బలికెన్నృపుఁడు. 6

ఉ. అంతటతాపసుండునగి - యట్లగు నేనిపరిగ్రహించెదన్
సంతసమొప్ప, నింకొకవి-చారము నామదిలోనఁగల్గె నీ
యంతటివారుగాక మఱి - యన్యులు దానినిఁదీర్పలేరటెం
గింతును, కోర్కిదీఱఁగను - ఖింపఁగనెంచితలంక నేటికిన్ ? 7

మ. వినుమాచింతనుసావధానమతివై - విశ్వంభరాధీశ ! యో
జనఁగావింపకనీసతింగొనుట యే - సౌఖ్యంబుగానే మదిం

పనివింజెందియొసంగుమంచినినుమీ ! - తప్పెవ్వియొనాయాసయిం
దునన్నొక్కింతయుఁదృప్తి చేయుఁడు సంతోషంబుగా దెంచఁగన్. 8

ఉ. సర్వవిభంబులన్ మిగుల - సంతసమొప్పఁగ సంతతంబుదా
నిర్వృతిమీఱఁజేటికలు - నేర్పున సేవయొనర్ప నొప్పన
ప్పర్వసుధాకరాననను - భాగ్యవిహీనుఁడనైన నేమహా
గర్వమెలర్పఁగైకొనినఁ - గల్గునె సౌఖ్యము సుంతయేనియున్. 9

క. ఊరక పోవక నేనై । నేరక పైఁబెట్టుకొనిన - నేరంబిదియో
భూరమణా ! విచారింపక । ఘోరంగాఁదగని కోర్కెఁ - గోరితినకటా ! 10

ఆ. కాపురంబు ఘోర - కాంతారమందున । నుండునట్టి పెద్ద - కొండచెంత
పులులుసింగములును- మెలఁగుచుండెడిచోట । వెలఁదిగనినమునెని - వెఱపకున్నె ? 11

సీ. అనయంబుఁగందమూ - లాహారమేకాని - షడ్రసోపేతభో - జనములేదు
పతనపార్శ్వప్రత్న - పర్ణశాలయెకాని - సౌధిష్ఠరమ్యావే - శ్మంబులేదు
చటులఫేకరమృగ - సందోహమేకాని - పరిచారికాజన - ప్రతతిలేదు
ప్రవిమలతరుభూర్జ - పత్రంబులేకాని - రాజిల్లుచీనాంబ - రంబులేదు

ఆ. కుడుపఁగావసింపఁ - గొలువంగభరియింప । లేనిపేదతపసి - నైననేను
కాపురంబునెట్లు - కావింతుభోగంబు । లనుభవించుచున్న - యతివఁగూడి. 12

సీ. మృదులతల్పంబుపై - మేనుసేర్చెడిలేమ - కటికినేలఁబరుండి - గాసిఁబడునె ?
పఁచాకలచేత - పనిఁగొనుకోమలి - యింటపనుల్ నిర్వ - హింపఁగలదె ?
యొక్కింతనడువంగ - నోఁపనిసుకుమారి - ధృతిమీఱమండ్లలోఁ - దిరుగవశమె ?
వేళకుభుజియించి - విహరించుసుందరి - యుపవాసములనుక్క - చుండఁదరమె ?

గీ. వఱలువెన్నెలవేఁడికి - వాడిపోవు । చానశీతాతపములకు - సైఁచియున్నె ?
చాలఁగాఁగలవిట్టిక - ష్టంబులచట । నెతలుగుడువంగఁగోరునె ? - విద్రుమోష్ఠి. 13

గీ. తెల్లవాఱినదాదిగా - దినదినంబు । నింటనెయ్యదిలేకున్నఁ - గంటగించి
తెమ్మపొమ్మనినన్నువే - ధించుఁగాని । తరుణిసైరించునే పేద - తనముఁదెలిసి. 14

చ. అతులితమైనభోగముల - హర్నిశముల్ గొఱలేకఁగల్గి వే
వితములఁగోరినట్లనుభ - వించులతాంగిననూనసంకట
స్థితులయించిచూచుటకుఁ - జిత్తమొడంబడదయ్యెఁగాననీ
సతియును నేను జక్కవతు - చందముగల్గినఁదెల్పు మేర్పడన్. 15

క. మతిహీనునివలెమీఁరటి । గతినెంచకనీదుసతినిఁ - గ్గొనిచనిదు
స్థితికింబాల్పడఁజేసిన । క్షితిలోప్రజలెల్లనింద - సేయరె ? నన్నున్. 16

క. కాన్యసనీదానము మా । కేవిధమునఁగనిఁజాల - నెగ్గతోఁచెన్
భావంబున, నేనొల్లను । నీవేసుఖమొందుమింతి - నింగూడిన్నృపా. 17

క. కడపటఁదానేవలదను । జడిసితపసి, యనుచునెంచి - సమ్మతిపడినే
నడిగియునడుగకమున్నే । పడతుకనర్పింతుననుచుఁ - బలికితివహహా! 18

శా. ఈకాపట్యమెఱుంగలేకయిపుడిం - దీసభ్యులాలింపఁగా
మీకుందారనొసంగఁదన్నసవియే - మేలంచుభావించితిన్
గైకొన్నంజెడుఁబో? భరింపఁగలడే? - కాంతామణిన్ విప్రుఁడా
లోకింతున్ ద్వరయేలనంచుమదినా - లోచించితే? దుర్మతీ! 19

క. కాడెఱుఁగనివారముయె । ట్లాడిననమ్మెదము సత్య - మని, వేమెదలో
కీడును మేలునుదలఁపము । బాడబులముగిక్కురింపఁ - బాడియెమమ్మున్. 20

క. తలఁపొకటియుఁబలుకొకటియుఁ । గలవారలనాశ్రయింపఁ - గారాదటయీ
వలవనిదానముదానమె? । పలుకంగాఁదగదె? కాని - పనియదియనుచున్. 21

గీ. జాయనర్పించినంతట - సంభవించు । చెట్టలన్నియు నెఱిఁగియుఁ - జెప్పనైతి
వించుకైననునోర! నీ - సంచుమాకుఁ । దెలిసెనరిపరి! నీకాంత - వలదువలదు. 22

గీ. పదరివాగ్దానమొసరించి - పిదపనాయ । భీష్టసంపూర్తిఁగావింప - కిట్లుకపట
తంత్రములుచేసితివిగాన - దానివలనఁ । బలికిబొంకినదోషంబు - గలుగునీకు. 23

వ. అని పలికిన. 24

ఉ. నిర్మలమానసుండు ధర - ణీవిభుఁడిట్లనియెన్ యిదేమయా!
ధర్మమిదెట్లగున్? వెలయు - దత్తముఁజేసినకాంత నొల్లకి
ట్లర్మిలినీవయేలుకొను - మంచువచింపఁగఁబాడియే? భువిన్
శేర్మితొలంగుకార్యమును - నేనొనరింపఁదలంతునే? మదిన్. 25

ఆ. కోరియొసఁగుమనిన - దారనర్పించెద । నంటిమరలవలవ - దనుటకడున
ధర్మమైనమాట - దత్తాపహారంబుఁ । జేయఁజాలనేను - శిష్టచరిత! 26

మ. అమరబ్రాహ్మణవృత్తి సంగ్రహణదు - ర్వ్యవహారులన్యాపకా
రమతుల్గోగణ జాలహంతకులు ధ - ర్మధ్వంసకుల్ సంతతా
క్రమకార్యప్రియు లాదిగాఁగలుగువా - రల్మెలుదత్తాపహా
రముఁగావించినవానికంటె ననిశా - స్త్రంబుల్ప్రబోధింపవే? 27

గీ. చాననుకుమారి కష్టసం - సారమెట్లు । జరుపుకొననేర్తు? ననియెదు - జడుపువలవ
దద్దిరయైననునిచ్చెద - నిపుడుమీకు । వేఁడుఁడా! వాంఛగలవాని - విమలభావ! 28

ఉ. నావుఁడుభూసురుండునగి - నల్లవొమెచ్చుకొసంగరాదె? ని
న్నాపటమైననీనుడువు - లర్హములెంతయు రాజచంద్ర! యీ

భావము పూర్వపుణ్యాపరి - పాకసముద్భవమాను కోరితాఁ
గావలెనన్న గల్గదుజ - గంబునఁజేకుఱ నెల్లవారికిన్. 29

ఉ. ఇంతినొసంగి, 'వాంఛితము - నిచ్చితిబొమ్మనకింకనున్ 'సమ
ర్పింతునుమీకుఁగోరినది - తృప్తిగ' నంటివిచాలమేలుసు
మ్మెంతయుఃంతసంబొదవె - నింకఁబచింపెదఁగాని 'మానియ
త్యంతముగాఁగవేఁడెనుదు - రాశఁగలాఁ' డనియెంచకాత్మలోన్. 30

చ. తిపుటనుఁదీర్చఁగాననుమ - తించితినోటమదీయవాక్యముల్
దెవడకవేశ్యతోఁ భవద - ధీనమునంగలవారణోష్ట్రసైం
ధవరథ యానసౌధఘన - ధాన్యములాదిగఁ గల్గుద్రవ్యమున్
బ్రవిమలబుద్ధినిమ్మఁజన - పాలక' యంతియ చాలువేఁడితిన్. 31

మ. అటులైనన్ ఘనదంగనన్ బడసిసౌ - ఖ్యంబొందుదుంజుమ్మనే
నటవీవాసముమాని సర్వజనస - న్మానార్హమైనట్టి యీ
పుటభేదంబునునుండెదన్ దనివిమై - భూయిష్ఠభోగంబు లొం
దుటకీమాత్రము చాలఁజాలునిదియేం - తోగొప్పనాబోటికిన్. 32

క. అత్యాశతగదుగానయ । గత్యముఁగలవఱకు మితము - గానడిగితినో
సత్యవ్రత! యల్పంబన । కత్యర్థముగాఁగనెంచి - యవినాకిమ్మా! 33

క. ఇచ్చెదనఁటివివెఱచిన । మెచ్చరునినుసాటివారు - మేకొనునీకున్
హెచ్చుగుపాపమువినుమా! । గచ్చుకుపాలగుదుమనల - రాజన్యమణీ! 34

క. కీర్తిఁగొననెంచుఘనుఁడప । కీర్తికిమదివెఱపుఁగొనఁడు - కింజుఁడుధరణీ
భర్తవుసత్కృపచంబున । వర్తించుటమేలునీకు - వరగుణశీలా! 35

క. భక్తియువినయంబునునను । రక్తియుసౌజన్యమెఱిమ - రాజులకు పరి
త్యక్తము సేయఁగఁదగనివ । యుక్తంబగునట్టి నడత - యొప్పదవనికిన్. 36

వ. కావున సత్యంబుఁదప్పకప్రవర్తింపుమనినదరహసితవదనుండై విజయాశ్వుండతనికిట్లనియె

శా. భూగీర్వాణవరేణ్యా ! మీరలుమహా - పూజ్యుల్హరిప్రాయు లా
భోగజ్ఞాన విరాజితుల్ సుగుణ రూ - పుల్ గాన నన్నెంతయుం
ద్యాగింగా మదినెంచివేఁడితిరి మే - లయ్యెంగడున్మీకునా
హైగారాబము సంఘటిల్లెనగుటన్ - ప్రాకామ్యముల్ చేకుఱున్. 38

గీ. ద్వాపరమునొంద కొసఁగితిఁ-దాపసేంద్ర! । యడిగినవియెల్ల, ననుఁడుమేలయ్యెమాకు
మెచ్చితిని నిన్నునీవలె - నిచ్చినట్టి । పార్థివుఁడులేఁడు భువినిన్ను - పాల! నిజము. 39

ఉ. కోరినవెల్ల నిచ్చితివి - కొంటి నసౌఖ్యతపఃప్రవృత్తికిం
దూరుఁడనైతి నాత్మఁగల - దుఃఖమునేఁటితోఁ దీఱెనింకసం

సారమహాసుఖానుభవ - సక్తి మెలంగెడవంచుఁబల్కి యా
గారడపుం దపస్విత్రుటి - కాలము యోజనఁజేసి యంతటన్. 40

క. బెగడొందిమానసంబున । వగగదిరిన వానివలె వి - వర్ణ ముఖుండై
జగతీవరుఁగనియిట్లను । సెగయూర్పులునిగుడ, నోయి ! - చెడితిం జెడితిన్. 41

క. నేఁజడమతినై బాగుగ । యోజనఁగావింపనైతి - నోహో ! తెలిసెన్
వ్యాజము, వెతనొందుటకున్ । భాజనునిగఁజేయనీవు - పాల్పడితివయో ! 42

క. అనిపలికిననదియెట్లం । దునఁగీడుపొసంగునొకో - తోఁచదునాకున్
వినిపింపుఁడయ్యా ! యనియడి । గిననృపతింగాంచిమౌని - కినుకయెసంగన్. 43

క. అతనికినిట్లను, నోరీ ! । మతిహీనుఁడ ! యెఱుగనట్లు - మమ్మడిగెదవీ
చతురత కేమందును? నీ । సతినల్లను సిరులునొల్లఁ - జాలుంజాలున్. 44

చ. మముఁజెఱుపంగనెంచితివి - మాటలచేఁగడుబేలుపుచ్చి యా
శ్రమమునునగ్నిమాత్మవనమా - మాత్రమునెంచక యిట్లుపుణ్యపా
పములవిచారమున్ విడిచి - ప్రాసనిచేరఁగ వచ్చినంతన
క్రమమగుదుష్క్రియావిధులఁ - గారియపెట్టియలంచఁ బాడియే ? 45

ఉ. ఇచ్చెదనంటివన్నియును - నింపఱునున్ విసగొప్పగాఁగనీ
విచ్చనువేఱుగాఁదలఁచు - టిప్పుడెఱింగితినారా! నేవృథా
మెచ్చితిగానలేకనిను - మిక్కిలియోగ్యుఁడ వంచునమ్మి, యీ
తచ్చనమాటలుం క్రియలు - తాపసవర్యులచెంతఁజెల్లునే ? 46

ఉ. వృద్ధుఁడనాట బాగుగవి - వేచనఁజేయఁగలేమిఁజేసి నే
వృద్ధియుహానియుందెలిసి - వేఁడకపోయితి, నైన? నోరి ! య
శ్రద్ధనవర్ష్యదానము నొ - సంగుటమొప్పునెనీకు మేలుమే
లిద్ధరలోననీచెయిద - మెవ్వరుమెత్తురు ? పార్థివాధమా ! 47

క. నేనడుగుటకున్ మఱచిన । వానిని నీవైనఁదెలుప - వలదే? మమునె
ట్లేనియుఁగికురించుటకుం । బూనిననీకెటులబుద్ధి - బుట్టునలుకఁగన్ 48

క. తమమాటలు మృదుమధురము । లమితకఠోరంబుహృదయ - మజాతులుని
క్కముగఁదృణాచ్ఛాదితకూ । పములున్నృపులనమ్మరాదు - వారలనెపుడున్. 49

క. భూవరులతీరువేఱొక । భావంబునునొక్కమాట, - పలుకరునిజమిం
కేవిధమునఁగావింపఁగ । నీవెంచితివోయెఱుంగ - నేరంజుమ్మీ ! 50

క. వలదువలదునీదానము । వలనంబొలిలేదుమాకు - వసుధామరుఁజి
క్కులువెట్టఁదగునె ? యివ్వఁగఁ । దలపోదనకయున్నఁజెప్పఁ - దగదేమాతోన్. 51

క. అఱమరలేక గడిఁకఁ గడఁన | క్కఱఁ గొని వేఁడితి నొసంగఁ - గలవని, నీకుం
గఱదజనింపక యుండిన | మఱి యొక్కని నాశ్రయింతు - మర్మముఁ జెపుమా! 52

క. ఒవ్వని యీవి యనీవియె ? | నవ్వులపాలగుటె కాని - నలఁకువ మాకీ
చివ్వవలదింక ననవిని | నివ్వెఱపడి యతనితోడ - నృపుఁడిట్లనియెన్. 53

క. అయ్యా! నా నేరంబిపు | డెయ్యది? యడిగినవి వేడ్క - నిచ్చెదనంటిన్
నెయ్యంబు మాని యివ్విధి | నయ్యాయముగా నిందసేయ - నచ్చునె? నన్నున్. 54

మ. అనుఁడున్మౌనివరేణ్యుఁడోరి! వినుమా - యైశ్వర్యముల్లెంచె నే
ఘనతన్ బొందుదు నన్న నన్నునుసిరిన్ - గాఁగ సైన్యంబుగ
ల్గినఁ గాదే? సుఖముల్ప్రసంగున కటా! - లేకున్న విప్రుండు పెం
పెనమా కెంతనికొల్లలాపెరె? దురా - హంకారులౌ దుర్జనుల్. 55

శా. ఏమో మాటలఁ గంపడిన్ మఱచినే - నీకోరికం జెప్పతే
దామూలంబుగ సర్వసంపదలుఁ దా - నర్పించెనింకీ ఘట
స్తోమంబీతనికేమి సేయుటకు? యి - చ్చుంగా పుగానుంటకుం
చామోదించితి, సేనమీఁదనకనీ - వాసింపఁగాఁ జెల్లునే ? 56

చ. "పదుగురిలో నొసంగనని - పల్కుట గొప్పతనంబు గాదు యి
చ్చెదనని చెప్పెదన్ మునికిఁ - జిత్తములోఁ దమకించి యింతలోఁ
నెదవడరాదు కైకొనిన - నెల్లనుఁ గైకొనుఁగాక సైన్యమున్
వదలెని తండ్రు చాలు బల - వంతునకున్ సిరిగల్గకుండునే? 57

చ. పదరక యుండి పిమ్మట నె - పంబులు కొన్ని ఘటించి యెట్టులీ
ముదుకనిఁ బారఁదోలి సిరిఁ - బొందుదుఁ గాక బలంబులున్న నా
కిది యొక లెక్కగా" దనుచు - నెంచి యెఱుంగని వాని భంగి ప
మ్మదమునఁ జెప్పనైతివిటు - మాయ పెంజేయఁ దలంచుట ప్పునే? 58

క. కరిఁగొన్న నంతు శంకె | వ్వరిదోరి' వచింపుమిపుడు - ప్రకటంబుగనీ
సిరినంతయు నిచ్చియు భటు | నరుల నొసఁగవలయు ననుచు - భావింపవొకో ? 59

ఆ. అనుచుఁ గనలి పలికె, - నతనిఁ గన్గొని విజ | యాశ్వుఁ డిచ్చినాఁడ - ననియె సైన్య
ములను, మరల తపసి-తలయూఁచి యోజించి | యాడుఁగఱచి సంశ- యంబుఁ జెంది. 60

క. గజిబిజిపడి యిట్లనునో | యిజనాధిప! నామనమున - నింకను నొకయ
క్కజమగు శంక యొదవెనది | నిజముగఁ గావింతు ననిన - నీకెఱిఁగింతున్. 61

క. ఆలోపము పనయింపని | చో లేదు సుఖంబు మాకు - సుడివోవును నీ
చేలబ్ధమైనదంతయుఁ | జాలఁగ సంకటములొదవు - సత్యము సుమ్మా! 62

వ. దీనికేమియుపాయంబుఁ జెప్పెదనో యెఱింగింపుము. నేనడిగిన విధంబునఁ జేయఁజా లవేని దత్తంబొనరించిన సర్వంబును బెట్టుకొని నీవేసుఖంబులనుభవింపుము. నేనెందేని యుంజని యోగ్యులగు వదాన్యులనాశ్రయించివేఁడి వాంఛితార్థంబుఁగొని సుఖంబునొం దెద, ననిన నతనిమాటలకుఁ దలంకక రాజిట్లనియె. 63

క. మునివరమీకెయ్యదియై । ననునిర్వేదశంకమాని - నన్నడుగఁగనెం
చినదియునేఁజేయఁగవల । సినదియునుం జెపుఁడీ ! తామ - సింపకయింకన్. 64

గీ. అనినవాచంయమీశ్వరుం - డవనివిభునిఁ । జూచియిట్లను మోదించి - లోఁచెయిపడి
పలుకుమడిగిన - పిమ్మట కలఁతఁబడఁగఁ । దగదు నీయిష్టమింక నా - తప్పులేదు. 65

క. అనిగట్టిగఁ జెప్పిననగి । యనుమానంబేలనోమ - హాత్మా ! యేమై
ననుసరియైనడుగుఁడిచ్చెద । నని చెప్పితి నిన్నిమాట - లన నేమిటికిన్ ? 66

క. అఱిముఱిపడి మఱిలోనే । మఱియొకవిధమెంచికిఱుదు - మాటాడుదునే ?
వెఱవనుపలుకుఁడ ! యనవుఁడు । నెఱిఁగదనీమతము వినుమ - హీవర ! కోర్కెన్. 67

వ. అనిపలికి మునీశ్వరుండొక్కింతతడవు యోజనఁగావించి. 68

క. మాటికిమాటికినొక్కక । టేటికి వేఁడుటయుఁగొనుట - హీనంబదనే
నోటిల్లక పలసినయవి । ధాటిగనొకమారె యడిగె - దన్ వినుమధిపా ! 69

మ. గృహదారా ధనవస్తువాహనభట - క్రీడావనాదుల్ కృపన్
స్పృహదీఱంగనొసంగినాఁడవిఁకన - క్షీణోన్నతింగొంటినే
మహదైశ్వర్యముఁగల్గువాఁడఁగద ! నీ - మాడ్కిన్ మహీశత్వమున్
వహియింపందగునంచునెంచితిఁగడుం - బ్రఖ్యాతిశోభిల్లఁగన్. 70

ఆ. రాజుగా నున్న - రక్షించుకొను నెట్లు । బహుళమైనయట్టి - భాగ్యలక్ష్మి
నాధిపత్యమొసఁగి - యలరజేయుము నన్ను । ననిన, నిచ్చినాఁడ - నదియు మీకు. 71

క. మీరేనేఁడు మొదల్కొని । నారాజ్యంబంతటికిని - నాయకులనఘా !
కోరినవన్నియునిచ్చితి । గారవమున నెద్దిచేయఁ - గలదిఁక ననుఁడున్. 72

క. సంతసమునన్నృపుఁగని యొ । క్కింతవిచారించి విప్రుఁ - డిట్లనియెను నీ
యంతటివారిలఁగలరే ? । యంతయు నొసఁగితివి వేఁడి - నంతనె భూపా. 73

క. కొఱలేకసర్వమునుఁజే । కుఱగాని యొకింత తలఁపుఁ - గొని తలఁకకయి
త్తఱినీవుసేయవలసిన । చిఱుపనులొకకొన్ని గలవు - చెప్పెద వినుమా. 74

సీ. సర్వసర్వంసహా - చక్రప్రభుత్వోప - యుక్తమహాముద్రిక - నొసఁగవలయు
నొసఁగుటేకాకన - న్నొడయనిఁగాఁబ్రజ - ల్చేకొనులాగున - సేయవలయుఁ

జేయుటే కాకయే - చెట్టయుమనుఁ జెంద - కుందులాగునఁ గాచి - యుండవలయు
నుండుటే కాకమా - యొద్దనే సేవకా - వృత్తినినీవు జీ - వింపవలయు

ఆ. నినియనాయభీష్ట - మింతమాత్రముచాలు! నీకమీఁగనడుగ ! నెదియునిన్నుఁ
బొసఁగునెల్లగతుల - భోగంబులక్లైన ! నీమతంబదేమొ - నిజముఁజెపుమ ! 75

క. అనినిర్బంధముగానడి | గినమునికోరికలనాల - కించినరేంద్రుం
డనుమానముమదిఁగదురఁగఁ | దనలోనిట్లనుచునపుడు - దలఁపఁగఁదొడఁగెన్. 76

క. ఇవ్వసుధామరవర్యుని | నవ్వడిఁగననిక్కమైన - సంయమియనరా
దొవ్వనికోర్కులఁగోరుట | కువ్వాడమెఁగానియెందు - కొఱకివితనకున్. 77

మ. ఇతఁడాకైటభదైత్యమర్దనుఁడొభూ - తేశుండో చండాంశువో
శతమన్యుండొఘరాసురాకృతిని మ - త్సత్యంబునాదాన్యముల్
ధృతియుంభక్తియుఁగన్గొనంగనిటులే - తెంచెన్ నిజంబింతయుం
కితరుండైననసర్వపాసనకదా - నిర్భంగివాంఛించునే? 78

ఉ. ఆకులుకాయలుందినివ - నాంతరభూములనుండి కోరిక
లాపికడఁబెట్టిసంతతము - బుద్ధిఁజలింపఁగనీకనిల్పియ
స్తోకతపఃక్రియానియతిఁ - జొక్కుమునీంద్రుఁడు బాహ్యకాంక్షచే
వ్యాకులమొందనెంచియిటు - యాచనఁజేయఁగనింతునమ్మనే ? 79

క. ఏతపసిమున్నరాజ్యం | బీతనిపలెనేలుకోనెద - నిమ్మనితానే
భూతలపతినడిగె! నిదే | మోతంత్రముగాఁగఁదోఁచు - చున్నదినాకున్. 80

క. అడిగినవన్నియుఁదలఁకక | యొడఁబడియర్పింతుప్రపేము - నుడుగఁగఁజాలన్
జెడుగొదవినమేలొదవినఁ | గడపటనేగైనదైవి - కంబడిపోలఁపన్. 81

మ. అనియోజించిధృతిన్ వహించితన స - త్యాచారదాతృత్వము
ల్లనముల్మెచ్చఁగ సంశయింపకపుడా - సర్వంసహాభర్తయ
మ్మునినాధుంగని, యోమహాత్మ! కొనుఁడా ! - మోదంబుతో మీకు స
ర్పణముంజేసినవాఁడ రాజ్యమును స - ర్వస్వంబునుందృప్తిగాన్. 82

క. వినుఁడా! మఱియునుమీరడి | గిననాలుగువిధములైన - క్రియలునుఁగావిం
తునుతప్పకమదిసంశయ | మునుఁజెందఁగవలదుసత్య - మునుమీఁదునునే ? 83

క. అనిపలికియిచ్చుకేనియుఁ | దనలోలోశంకింపకతఁడు - తక్షణమునఁబూ
జనమొనరించెను మునిఁబరి | జనినికరానీతవస్తు - సమితింగొనితాన్. 84

క. పూతాక్షతాంబువులఁగొని | త్రాతాగంమాంమదీయ - దానేనహరి
ప్రీతోభవతనియమ్మని | చేతులలోధారవోసె - స్థిరముగుభక్తిన్. 85

క. ఈరీతిని నిజరాజ్య | శ్రీరూఢిగ నర్పణంబుఁ - జేసి తపస్విన్
గౌరవమున నిజపీఠస | మారూఢుఁ గొనర్చి మ్రొక్కి - యపుడిట్లనియెన్. 86

క. జయలోకచక్రవర్తీ! | జయ తేజోకలితమూర్తి! - జయ నుతకీర్తీ!
జయ పుణ్యభావ! పావన! | జయ, సద్గుణభవన! దోష - జలధరపవనా! 87

క. దేవా! కోరినభంగిం | గావించితి మేలునొందఁ - గంటిని నేమీ
సేవకుఁడనై మెలంగెద | నావనితయు మిమ్ముఁ గొలుచు - నయవినయములన్. 88

ఆ. సాధ్వి యగు మదీయ - జాయ బాలకజాలఁ | బ్రియము మెసంగ నుపచ - రింపుచుండ
నెందుఁ గొఱఁత లేని - యిచ్ఛాసుఖంబుల | ననుభవింపుఁ డింక - మునివరేణ్యా! 89

క. మీరే యాజ్ఞ యొసంగిన | గౌరముగఁ దలధరించి - కావింపుదునా
తీరున ననిమకలనమ | స్కారం బొనరించి మిగుల - సంతోషమునన్. 90

క. ధరణీపాలకుఁ డీముని | వరుఁ డిది మొదలితనిఁ గొలువ - వలయు ననుమిగల్
నిరతంబు ననుమనంతటఁ | బరువడిఁ జాటంగఁ బనిచెఁ - బ్రజలకుఁ దెలియన్. 91

ఉ. పౌరుల నెల్లరాఁ బనిచి - భక్తియు రక్తియు నగ్గలింపఁగా
మేర నెఱింగి మానినుఁడి - మీరక నామెడవోలె సంతతం
బారడ మొప్పఁ గొల్చి విన - యంబెసఁగంగ మెలంగఁగావలెన్
మీరలు మీరు మీరనుచు - మేకొనఁ జెప్పె నృపాలుఁ డేర్పడన్. 92

క. వారపుడు రాజుమాటకు | మారుం బలుకంగలేక - మర్యాదకునై
యూరక తలలూఁచి సరే! | యారీతిఁ గ మెలఁగువార - మనిర ప్రీతిన్. 93

గీ. ఇటుల సంయమివరుఁ డామ - హీశు నేఁచి | యతని పత్నిని మఱియును - నతిశయించు
సకలసామ్రాజ్యపదవిని - సంగ్రహించి | యుగ్రునకు సచివత్వంబు - నొసఁగి వేడ్క. 94

క. తనయిచ్ఛలాగు దుశ్శా | సనములఁ గావింపఁ గాంచి - జను, లెన్నఁడు నె
క్కని వాఁడు గుజ్జు మెక్కిన | వెనుకయ్యో నుముందటంచు - వికవికనవ్వన్. 95

క. వారల పరిహాసోక్తుల | తీరున్ బరికించి యక్కటై - తెక్కలిముని తా
పౌరులఁ గని కలుగని గం | భీరత వహియించి చిట్టి - వెఱపించుటయున్. 96

క. ఊఱ వెఱుఁగడు రాజనుటకు | గుఱుతా? యిది వీనికింత - కోపము దగునే?
యఱజాతియనుచుఁ జిఱ్ఱిన్ | జిఱచిఱలాడుచుఁ గలంగి - చీరికిఁ గొనకన్. 97

క. వీనికి వెఱచెడివారి | చ్చోనెవ్వరు గాని, రాజు - చూచినఁ గినియున్
బోనిండ నిమ్మారాడక | మానంబున నుండిరపటి - మాన్యులు సుఘనుల్. 98

క. ఆసమయంబున మాయా | భూసురుఁ డుల్లాసమెదను - బొదలఁగఁ దనకున్
దాసుండై నిజకల్పిత | శాసనసంబద్ధుఁడైన - జనపతిఁ గని తాన్. 99

వ. మందహాసవదనారవిందుండై యతనిం జేరంజీరి యిట్లనియె. 100

ఉ. ఓవిజయాశ్వ! నీవుమది - నోడక వేఁడినవాని నెల్లని
చ్చావిధి నిచ్చి లోకమున - శాశ్వతకీర్తికిఁ గర్తవైతివి
ట్లీవియు నీకీర్తియుం బ్రతియు - నెందును జూచియెఱుంగ నెప్పుడున్
నీవలె నిమ్మహిం గలుగు - నేతయొకం డొసంగెంగుం గాంగనన్. 101

ఉ. సంతసమయ్యె నాకుమది - సర్వముఁ జేకుఱెనట్లుగాఁగ నా
హింతును గాని, దైననిపు - డింకొక యోజనగల్గె వింటె? నీ
కాంతయనన్యయౌవనపి - కర్థనసుందరమూర్తియంతెగా
దెంతయుఁ గోమలాంగినిజ - మెన్నఁగ నేజరకుండఁ జాలఁగన్. 102

గీ. వయసుఁగలదానికి నిముది - నగ్గునరుసు | నెటుల పొత్తగు నెద్దుతా - నెండలోని
కీడుచునుదున్న నీడల - కీడ్చునెడి | జాడసరిపడదంతరం - బేడకేడ. 103

క. వినుమా! నా దేహస్థితి | మునుపటిలాగనఁగరాదు - ముదిసితిచాలన్
ననఁజిపుకుననుచు లెక్కఁజుం | గొనరెవరును నీకుభక్తి - కుదిరెను నాపై. 104

క. వయసుఁగల కాలమంతయు | వ్యయమె నరించితిని సుమ్ము - వ్యర్థంబుగ నేఁ
బ్రియమున నేఁటికి నీదగు | దయనొకసంసారినయ్యుఁ - దలఁకెద జరకున్. 105

సీ. బారెడు నడిచినఁ - బాదముల్తడఁబడు - సడలెమై బిగిసుంత - శక్తిలేదు
గట్టిగా మాటాడి - నట్టైన యలసట - జనియించు మునుపలె - వినవు చెవులు
దూరదృష్టి నశించెఁ - దొరకౌనెఁ బెరుకాస - వికృతిగాత్రములు - నెలిక్కిఁదోఁచెఁ
దువ్వలింపఁగసాగె - దవడలు వ్రేలెను - దంతపటుత్వంబు - దప్పిపోయె.

గీ. క్రమముగా యిట్లు ముదుకల - క్షణములెల్ల నొక్కటొకటిగఁ బొడమిన - నొంపఁదొడఁగె
నింతజరసుంపె శౌటఁడా - నేలిగొనక | నేయునే కాపురంబునీ - జాయచెపుమ! 106

క. ఇంతటివృద్ధుఁడనయ్యును | నింతులపై మమతమాత్ర - మెపుడును విడద
త్యంతంబదియగుటనెయి | ట్లింతయు నిను వేఁడికొంటి - నిపుడాసక్తిన్. 107

గీ. శౌర్యమైశ్వర్యమంతయుఁ - గొనియు నిష్ట | సిద్ధిగాఁ జాలదనియెడు - చింతదోఁచె
వనితనను మెచ్చదగుటనీ - వైభవంబు | లెల్లవలదింక మరలనీ - కిచ్చిచనెద. 108

గీ. అటులఁ గైకొనఁగానొల్ల - నందువేని | యడఁపుమెట్లైన నామనో - వ్యథయుఁ గొంకుఁ
జెట్టునాటితివదివృద్ధిఁ - జెందునటుల | నీరుఁబోయక మానుట - నీకుఁదగదు. 109

ఉ. పంబినవేడ్కఁ వేఁడితివి - భంబని నీబహుళార్థ రాజ్యభో
గంబులు సర్వమున్, మిగుల - గౌరవమొప్పఁగ నిచ్చినాఁడవై.

నంబొలిలేదనుమ్మా! జన - నాయక! బోధనఁజేసిమేము హా
ర్షంబును జెందుభంగినివ - శంబొనరింపుము మాకునీసతిన్. 110

క. ఆరీతిఁజేయఁదలంచిన । నారీమణివలచుననుచు - నమ్మఁగఁజాలన్.
భూరమణ కోరినాతోఁ । జేరివిడకఁగాపురంబుఁ - జేయ దలంచున్. 111

క. ఎంతటి నేర్పరి యైనను । నింతికిమదిగలుగకున్న - నెబ్భంగినిఁగా
వింతునుసంసారమునొక । సుంతైననుఁ గలదెచెపుము - సుఖమట్టితతిన్. 112

గీ. ఒల్లకలయించుచుండెడి - యువిదతోడఁ । గాపురముఁజేయుటెంతయుఁ -గష్టతరము
కొఱవిఁగొనినడితలగోకు-కొనినయట్లు । గాదె? సంతృప్తియెవ్విధిఁ-గలుగుగృహికి. 113

సీ. మోదితరో! నాకొక - ముద్దుబెట్టుమటన్న - ముదుకకేమిటికంచు - మోముద్రిప్పి
కాంతాశిరోమణీ! - కౌఁగలీవేయన్న - సదలించిబెదరించి - యవలికేగి
సకియనీమోవిపా - నకమాననిమ్మన్న - చుఱచుఱచూపులఁ - జూచితెగడి
చెలువనీగబ్బిచ - న్నులనంటనిమ్మన్న - వెగటొందినెటికలు - విటిచి నవ్వి

ఆ. పలుకవేయటన్న - సలిగిమాసముఁబూని । సరసముగవచింప - విరసమొంది
యలఁచుబోటిఁగూడి-యక్కటా! సంసార । మెవఁడొనర్పనేర్చు?-నేమిసుఖము? 114

ఆ. సతికిబురుషునకును - మతిమతిగలియక । యుండెనేనికష్ట - మెందునిజము
చుట్టుకొనెడిచాప - కట్టుడియాలునై । యున్నదృష్టిసెటుల - నొందుమగఁడు. 115

వ. కావున. 116

ఉ. వంచనవీడినీవుసని - వారిజగంధికిమత్ప్రభావము
గ్గించివచించిరక్తిమదిఁ - గీల్కొనురీతిని నీతులంబ్రబో
ధించికలంకమాన్పితగు - తీరునఁదోడ్కొనిరమ్మనీవుడిన్
మించిననేన వచ్చెదను - మీఁదటనెవ్విధినైననయ్యెడన్. 117

క. ఏమనునో, నీవువినం । గామానినితోడనేమ - ఖాముఖిఁదెలియం
గామాటలాడవలయున్ । మోమోటంబేల? యింక - మదమదయేలా? 118

క. ఆధవళాబ్జనయనమా । స్వాధీనంబై మదాజ్ఞ - జవదాటకని
ప్రోత్కథమతి మెలఁగుతత్వము । సాధించెడిదనుక నీవు - చనరాదెందున్. 119

క. అనియాజ్ఞాపించినమా । యనుమతిఁదలఁదాల్చిపోయి - హరిమధ్యనువే
గొనివచ్చెదమీచెంతకుఁ ! గనుడీకననుకూలవతినిఁ - గానొరింతున్. 120

క. అనిపలికిపిలువఁబనిచెన్ । మనుజేంద్రుండవలనేగి - మంజులవాణిన్
ఘనవేణిన్నమ్రశ్రోణిన్ । వనరుహసంకాశరమ్య - పాణిన్ రాణిన్. 121

చ. పతిపిలువంగఁ బంచుటయు - భామినిచాలఁగ సంశయించియీ
గతిఁ దనరాణివాసమునుఁ - గాదనకీయ్యనఁ దాసభాంతర
క్షితికిపుడేలరమ్మనియె? - శీఘ్రముగా, నటనంతసంకట
స్థితియదియేమిచేకురెను - దింగడుచిత్రముగాఁగఁ దోఁచెడిన్. 122

క. కారణములేకసభకే । లారావించున్? విభుండ - లంప్యుంబగును
స్త్రీరమణీనిశాసనమున్ । మీరిచరింపంగఁదరమె? - మృదునకునైనన్. 123

క. తెలియనివాఁడాతానే । తలఁపునరమ్మనియెనొక్కొ - తగదీకార్యం
బలఁతియనర్హంబనినేఁ । దలఁకినఫలమేమిగలదు? - తప్పదుచనకన్. 124

ఆ. అనుచునిశ్చయించి - యంతఃపురమునుండి । నెపతెఁగొలువుకరుగ - విద్రుమోష్ఠి
తనరమేఘమధ్య - మునసుండివెలువడి । మెఱయుసట్టికారు - మెఱుఁగువోలె. 125

మ. పతియాజ్ఞన్ శిరసావహించిపరువుం - బ్రహ్లాదమొప్పన్ యశో
వతియచ్చోటికి వచ్చెమత్తకరిరే - వన్ మందయానంబునన్
సతులిర్వంకలఁగూడిరాగవిల స - త్సౌందర్యసౌభాగ్యసం
యుత సమ్మోహనవిగ్రహంబనఁగఁదా - నొయ్యార మొప్పారగన్. 126

క. ఆరమణీమణిదవ్వ్యా । కారంబునుజగ్గునిగ్గుఁ - గనుఁగొనిసభ్యుల్
దారునతనువు లెఱుంగక । నేరకఁగూర్చుండిరట్టె - నిశ్చేష్టితులై. 127

చ. అతివనుఁగాంచిమానియుహ - హా! యిదిజూడఁగ మేఘమధ్యని
ర్గతమగుచంచలాలతయొ - కైరవబాణునిసాయకంబొయీ
రతియొకొజీవముల్గలుగు - రత్నపుబొమ్మయొలేకయామినీ
పతికళయోయటంచుమదిఁ - భావనఁజేయఁదొడంగె మెచ్చితాన్. 128

మ. అపుడాసుందరపూర్ణచంద్రముఖిడా - యన్ వచ్చిసందేహమున్
ద్రపయున్ భక్తియుసంభ్రమంబు వెలయన్ - దైవాఱు తేజంబుచే
త్రిపురధ్వంసినిఁబోలుహానికినిబ్బ - ళ్వీభర్తకున్ మ్రొక్కి-గా
ర్యపురీతిన్ వినమించిచెంతనొక యో - రన్ నిల్చియున్నంతటన్. 129

ఉ. రాజటుచూచియోమదమ - రాళగమానవిలాసయానన! న
న్నీజటిరాజ్యమున్ సిరులు - నిమ్మనినిన్నును వేఁడ వేఁడెడిన్
భాజనమైనకార్యమని - భక్తినొసంగితి మాటఁదప్పకన్
భూజనులెల్లమెచ్చుమని - పుంగవునింబరిత్ర్యపుఁజేయుమీ! 130

క. నియమంబువిడిచిసిరిపైఁ । బ్రియమున నెట్లొసఁగకుందు - వేఁడిన 'ధర్మో
జయతి' యనుమాటవినవే? । భయమొందునెసత్యసంధ్ర - పథవర్తిమదిన్. 131

ఉ. కావునరాజ్యముల్ మఱియుఁ - గాంచనవస్తుసమూహదాసదా
సీజనహర్మ్యసౌధచయ - చిత్రవిభూష రథద్విపాశ్వముల్
నీవును నేనుసర్వమును - నేఁడు మొదల్గనుఁడైన మౌనికిన్
గైవశమైనసొమ్ము గదొలఁ - గన్ జనదీతని యాజ్ఞ నెప్పుడున్. 132

క. నాయెడలనెటుల మెలఁగుదు | వోయటులనె మెలఁగితృప్తిఁ - బొందింపుముసా
ధ్వీ! యుక్తమునీకిదికడు | శ్రేయంబనితలఁపుమెదను - చేకుఱుశుభముల్. 133

క. మునినాథునియాజ్ఞనుమీ | రిననాదగుదానఫలము - రిత్తయగుంగా
వునసీపాతివ్రత్యం | బునుసంరక్షించుకొనఁగ - బోలుందరుణీ! 134

క. ఎప్పుడెట్లియ్యదిచెప్పిన | నప్పుడట్లయ్యదియొనర్పు - మరమరవిడెనీ
వపరాధమెదవెనా? భువి | నపకీర్తియు దూఱునఘము - నందుదుముబలా! 135

క. అనివల్లభుఁడాజ్ఞయొసఁగ | గిననివ్వెఱపాటుగదిరి - గిరిశుచమారా
డిననేమిచెప్పఁగలుగునో | యని కొంకునుజింతమీఱ - నప్పుడెదలోనన్. 136

మ. అకటా! మానివరుండువేఁడెననిప్రా - జ్యంబైన రాజ్యంబుతో
సకలంబర్పణఁజేసి చాలకనతన్ - సాధ్విన్ననున్ ధర్మమెం
చక సెఛ్ఛంగిన సంగయోగ్యమని తా - త్మీభర్త; యర్థాఁగిని
ట్లొకఁడాసించినవిచ్చువాఁడుఁగలఁడే? - యోజింపరాదే? మదిన్. 137

క. సతినితరునకొసఁగుట స | మ్మతినన్యుఁడు గొనుటతగునె? - మతిమంతులుస
త్కృతియందురె? దీనినియీ | క్షితినెందునువిననియట్టి - చిత్రముపొసఁగెన్. 138

క. పరపురుషులఁగనియెఱుఁగని | తరుణిఁబరాధీనఁగాఁగఁ - దలవ్రాసిన పం
కరుహాసనుననలెఁగా | గొరులనసంగాగ్యమేమి - యున్ లేదెన్నన్. 139

క. అనఘ! యిదికడుఁబతివ్రత | యనఁగానుతికెక్కుగోర - టన్యాయంబౌ
ననరాదె? నృపతి, దానం | బనఁగానిట్టిదియె? యిట్టి - యాజ్ఞయుఁగలదే? 140

చ. ఒడఁబడియెవ్విధింబరుని - యొద్దనొనర్పుదుఁగాపురంబునె
క్కడివికటంపుధర్మమిది, - కష్టముచేకుఱె నేమిసేయుదున్?
చెడుపనియంచుభూవిభుఁడు - చెప్పినమాటనుమీఱసాధ్యమే?
కడఁగినసుంచయీమతినిఁ - గావఁగలారెవరింకనీశ్వరా! 141

క. అడిగినదానినొసంగుట | విడుమంగా రానివ్రతము - పృథివీపతికి
ట్లడిగిన నేరంబిపుడీ | జడదారిదిగాకరాజ - చంద్రునిదగునే? 142

క. బాడబుఁడుజాయనిమ్మని | యోడకఁదగదనక నడిగె - యోగ్యంబనితా
తోడనెయొసఁగకమఱుమా | టాడు నృపతియతనినేర - మగునేయిదియున్. 143

క. సత్యాత్ముఁడనఘుఁడసదృశుఁ । డత్యర్థార్థప్రదుఁడుగు - ణాధారుఁడును
ప్రఖ్యాత్యవిదూరుఁడుదలఁపఁగ । నత్యంతీనుఁడనంగ - నగునే ? నృపతిక్. 144

క. అతఁడేమిసేయు ? నాదులి । ఖితమివ్విధినుం డెతపసి - కిక్ ననుగోరక్
మతిగలిగెదైవగతియా । క్షితినెవ్వరుగడువగలరు ? - చింతించినఁగోక్. 145

ఆ. ఇటకుదినదినంబు - నెందఱర్థులువచ్చి । కోరివలయువానిఁ - గొనుటలేదు
నేనెఱుంగనీమః - నింబోలుయాచకు । నెందునుండివచ్చె - నిందితండు. 146

క. వచ్చినవాఁడెదియడిగిన । నిచ్చుఁగదా ! యనుచుఁగోరె - నిమ్మనినన్నుఁ గ
మెచ్చి ; యనిచానమదిలో । హెచ్చుగఁజింతించిమరల - నిట్లనితలఁచెక్. 147

ఆ. అవనిలోనదాత - యర్థులఁబిలిపింప । వలెనె ? తమకుఁదాను - వత్తురెఱిఁగి
ఫలయుతంపుఁదరువు - పక్షులఁజీరునే ? । చెలఁగివానికవియ - చేరుఁగాని. 148

క. పతియాజ్ఞ మీఱినడచుట । సతికిక్ ధర్మంబుగాదు - చర్చింపఁగస
మ్మతమైననుగాకున్నను । ప్రతిపలుకక సెప్పినట్టి - పని సేయవలెక్. 149

చ. పతికిహితంబుఁగోరునది - భార్యయనంబడుఁగాని పూనిదు
ర్గతులఁజరించుచుండునది - కాదుకులాంగన, యట్టికాంతదు
ష్కృతఫల మొందఁబాలగుఁగు - శీలయనంబడునంద్రు; నేమదిక్
ధృతినివహించిమద్విభుఁడు - దృప్తినిఁజెందువిధిక్ మెలంగెదక్. 150

గీ. విభునకపకీర్తిఁగలిగించు - వెలఁదియును వె । లందియే ? యదిహాలాహ - లంబుగాని
నేనునాపతియానతిఁ - బూనిచేసి । యతనిఁగీర్తిభాజునిఁజే - యంగఁదగును. 151

క. అనిపెక్కువిధులఁదనలోఁ । గొనకొనియోజించుచున్నఁ - గోమలిఁగనియా
మునికోపాటోపంబున । జననాథునివంకఁజూచి - సహనగహీతుఁడై. 152

శా. ఓహోహో ! తెలిసెక్ భవత్కపటనీ - చోద్యోగమోసజ్జన
ద్రోహీ ! యానినసమ్మతింపకుమునీంద్రుంజేరఁగా, నంచునీ
వీహేమాంగికిసన్నఁజేసితివియిం - కెట్లిచ్ఛగించుక్ ? ఘనం
బీహేవాకమునీకుఁగాకకలదే ? - యింకొండ్లకెందుక్ ధరక్. 153

క. నిర్మలమతివై ప్రియమున । ధర్మాధర్మములఁదెలిసి - తగఁజెప్పినన
న్నార్మిలిఁజేకొనకుఁడునె ? । దుర్మతమునసుండి యొసఁగు - దువె ? నీదుసతిక్. 154

క. ఛీ ! నీకుంజెల్లదుయీ । దానవ్రతమింకవిడిన - దాన్యుఁడెననుటక్
మానుము మేలదియనికడు । హీనంబుగఁబలుకుటయును మ - హీపతిచింతక్. 155

క. కపటమెఱుంగనినాకుం । గపటకళంకంబునొకటిఁ - గలిగింపకుఁడా !
చపలాక్షికిఁగనుసన్నల । నెప్పుడొసరించితి ? మునీంద్ర ! - యిట్లనఁదగునే ? 156

గీ. దైవమెఱుఁగును నాయెడఁ - దప్పులేదు | మిమ్ము సేవింపకున్న ? యీ-మించుబోణి
చేకొనుఁడు మీఘనంబయ్యెఁ - జెలువనింకఁ | గోపమొందంగ మీకెందు-కొదువగలదు. 157

వ. అనిన నాగ్రహంబు మాని యొక్కింత దడవు యోజించి యాచంచలాక్షి నీక్షించి, మందహాసం
బొనరించి విజయాశ్వనకిట్లనియె. 158

క. గుణవతిగాఁ దోఁపదుదు | ర్గుణములకున్ నిలయమిది, య - గుంగాదనవీ
మణిగదనవీవు సెప్పిన | యణఁగిమణఁగి మెలఁగుచుండు-నా? యిఁకమీఁదన్. 159

గీ. దంతితనదుశిరంబుపైఁ - దానమన్నుఁ | జల్లుకొనినట్టులయ్యెనీ - చందమిపుడు
గన్న, నాచేతఁగలత్రాట - నన్ను నేన | గట్టుకొంటిని నిన్నన్నఁ - గలదె ఫలము? 160

క. మాకుఁదగదనుటఁ దెలిసియు | నీకాంతకు మించువార - లిఁకలేమిని నేఁ
జేకొనఁదలఁచితిఁ, గడపటు | నేకరణిం జేయునొక్కొ - యీచెడిపె, నృపా! 161

ఉ. ఇంతటిదుస్స్వభావయగు - తేగ్వడఁబల్కకకోరినంతయొ
క్కింతయుఁ గొంకులేకసతి - నిచ్చెదనంటివి మంచిదైనయ
ర్పింతువె? సత్యభాషియను - పేరువహించుటకిట్లు చేసితా
సంతసమయ్యె నీకపట - జాలమెఱింగితిఁ జాల మెచ్చితిన్. 162

క. తొలుతనిది చెడిపెయగుటం | బలికితిమా రాడకపుడె - పరువుగఁజనియ
న్యులవేఁడికొనవె? ననునీ | వలయింపఁదలంచి తెలుప - వైతివి కాదే? 163

క. కొఱగానిదానమును నే | నెఱుఁగకఁగైకొంటినింక - నేమనినఁనుఁజే
కుఱుకేమిగలదు? నేఁడు | యఱగొఱనాయందెపోసఁగె - నకటా! చెడితిన్. 164

క. అనిమానివగచి పలుకుట | వినికాంతునిఁజేయునట్టి - విధమెట్లనియా
జననాథుఁడెంచి మిక్కిలి | వినయంబునసిట్టులనియె - వెగటొందకతాన్. 165

చ. మిముఁగికురింపలేదుకడు - మీయెడలం బ్రియమొందియున్నదీ
రమణితలంకనేమిటికి? - రక్తినిఁగూడి యభీష్టయోగ్యభో
గము లెసఁగంగభూవరని - కాయముగొల్వఁగ రాజ్యపాలనం
బమరఁగఁజేయుఁడయ్యా! కృప - నారయుఁడయ్యా! మనుజ బుధాగ్రణీ! 166

క ఈసుదతి సాధ్వి మీఁదగు | శాసనమును మీఱినడువఁ - జాలదహితమున్
జేసిననాపైగలదా | దోసము, శిక్షింపఁదగుటలఁ - దోఁచిననన్నున్. 167

క. అని చెప్పినమంచిదికనుఁ | గొని యెదనుగదా! యిదెంత - గుణవతియోయిం
తనవేగిరపడియట్టి | ట్టనవలయునె? యెఱుఁగవచ్చు - నావివరంబున్. 168

ఆ. అతివయెట్టిదైన - నయ్యెనేఁజెప్పిన | మాడ్కిఁజేయుచున్న - మాకుఁజాలుఁ
గొయ్యపిల్లియైన - కొదువేమి? యెలుకల | నలమిపట్టెనేని - యదియమేలు. 169

చ. అనితలయూఁచి చూడ్కులున్న - పొంగనమైఁ బరింపఁజేయఁగ
న్గొని విజయాశ్వుఁడ త్తఱిని - గొబ్బుననింతికిఁ గన్నుసన్న స
ల్పినపతిభావముం దెలిసి - లేమతలంపును సంభ్రమంబునున్
మొనయఁగ నానతోఁ డముని - ముఖ్యునిఁ గన్గొని మానసంబునన్. 170

సీ. గాంగేయమయచేల - గాంగేయపరిపాల - సర్వేశచక్రహ - స్తాబ్జహార
భూదేవనయపక్ష - భూదేవసంరక్ష - పాపహృద్భవ్యరూ - పాబ్జహార
నాగేంద్రశయనిత్య - నాగేంద్రనుతసత్య - చారిత్రరమ్యావే - షాబ్జహార
పుష్కరహితభాస - పుష్కరనునివాస - సదమలానర్ఘభూ - షాబ్జహార

ఆ. దీనపోషనాప - తీవ్రతాత్వమునకు । భంగమొదవకుండు - భంగిఁ గరుణఁ
గావుమనుచుభక్తి - తోవినుతించియా । యతివతలఁకుమాని - ధృతివహించి. 171

ఉ. చన్నులవ్రేగు నెన్నడుము - సైఁచఁగలేక సియాడ భృంగపం
క్తిన్నగఁ జాలుముంగురులఁ - దీరుగనట్టిటుఁ బాయవీటు చుం
బన్నగఁదాఁగ రాంగుళులఁ - బయ్యెదఁ జక్కఁగ నొత్తుకొంచు నై
వన్నియు మీఱవచ్చి ముని - వర్యునకొయ్యన మ్రొక్కి యిట్లనున్. 172

క. వీడక నేఁడాదిగ మి । మ్మేడుగడగ నెంచిభక్తి - నెల్లప్పుడు నే
వేడుకతో మాటకుబదు । లాడక మెలఁగెదను సంశ - యము వలదనఘా ! 173

క. మీరలు కోపించినయె । వ్వారికి మమ్మాదరించు - వారలు ? మమ్మే
తీరునఁ జూచినఁ జూడుఁడు । నేరంబిదియనుచుఁ బలుక - నేర్తుమె యనఘా ! 174

క. నావుఁడు ముని యిట్లనునా । రా వింతలు నీ పలుకులు - రాజతఁడుండం
గా వగ్గు నేనొడయఁడఁ । గావలయునె ? యిట్టిపట్టి - కలికియునున్నే ? 175

క. కిగ్గాడి ముదుకఁడీతని । పగ్గియకుం గొదువరాజ్య - పాలనమా ? యం
చెగ్గాడి పరిహసించెద । వెగ్గాడఁగఁ దగునె ? ముదుల - నిపెయుంబోలియే ? 176

చ. తగదిటు పల్కఁగాననిసఁ - దాపసశేఖర ! మారవైరిసా
క్షిగనకలంకబుద్ధిని వచించితి నేమి ముగేలికొందు నే ?
తగనిఁక నన్నుఁ గూడి సుఖ - దంబగు రాజ్యము నేలుఁడయ్య ! పెం
పుగ, భవదాజ్ఞ డెందలను - బూని మెలంగెదఁ దృప్తి చేకుఱన్. 177

గీ. అనినవినిచాలఁగా ముద - మందితపసి । మంచిదట్లైన నేపమ్మ - తించినాఁడ
నీవు నాదానవిధి మొదల్ - నీకు మొదటఁ । జెప్పవలెనొక విషయంబుఁ - జెలువ వినుము. 178

క. తిలలుం దైలము పుష్పం । బులునుం దావియును దుగ్ధ - ములు నీరంబుం
బలెఁ గలిసియభేదముగా । మెలఁగం గావలయు నింక - మీదట మాతోన్. 179

క. చెప్పినపనిఁజేయుటకుం । దప్పఁగరాదలఁతిగొప్ప - తగుఁదగదనరా
దప్పగిది మేలెఁగకుండిన । ముప్పనుగలిగింతునీవి - భునకునునీకుక్. 180

క. హనుమంతఃపురమునకుం । జను దెంచెద నేనునవిన - చంద్రానన మే
లనియాజ్ఞఁగొనిరయంబున । పనివినియెదననిమెనాత్మ - పతిఁగనిభక్తిక్. 181

గీ. అతఁడొకింతయుళంకింప - కరుగుమబల ! । పావనాకారుఁడగుమౌని - భావమెఱిఁగి
యాజ్ఞఁదలఁదాల్చివర్తింపు-మదియకీర్తి।యనియె, వందన మొనరించి -యతివసనియె. 182

చ. అటులఁగులాంగనల్ బరున - కర్పణముల్ బొనరించిధీరతం
దటుకునరాజ్యముల్ సిరులు - దత్తమొనర్చిదరిద్రునట్లుసం
కటములనొందఁబొల్పడియుఁ - గన్న అఁజెందకయున్న రాజున
చ్చటఁగలసభ్యులట్టెఁగని - చాలఁగభీతిలిదుఃఖితాత్ములై. 183

క. కులసతులునుసుతులును మి । త్రులుధనముంబ్రాణములను - తుల్యములుసుఖం
బులకుంబాదీనాల్గును । గలవై ననువీనివిడువఁ - గాఁదగదనరే ? 184

క. ఇదియోగ్యమయోగ్యంబని । మదినెంచకశంకమాని - మక్కువపడియీ
ముదుకండడిగిననృపుఁడి । చ్చెదననఁగానగునె ? తాను - చెడుటనెఱిఁగియుక్. 185

ఆ. యాచకులకువాంఛి - తార్థంబులిచ్చిన । వారుఁగలరుగాని - వసుధలోన
నితనిభంగినాలి - నిచ్చినవారలే । రెందుఁగొనినవారు - నెందులేరు. 186

సీ. అగ్నిసాక్షిగఁబెండ్లి - యాడిన భార్యనే - మనిరాజుమునికిచ్చె - నసెడివారు
నడుగఁగాఁదగువాని - నడుగక్లాలినె - ట్లర్థించెనీవిప్రుఁ - డనెడివారు
వేఁడిననొసఁగెభూ - విభుఁడొల్లననలేక - యతనిసద్వ్రతమది - యనెడివారు
నిచ్చెదననినంత - నేకూడదనకఁదాఁ - గొనుటయీమునినేర - మనెడివారు.

గీ. వారెఱుంగనిధర్మము - ల్వసుధఁగలవె? । మనముపలుకంగరాదిపు - డనెడివారు
నిటులఁగోరుటఁదెలియలే - కీనృపాలుఁ । డక్కటా! మోసపోయెఁదా-ననెడివారు 187

క. ఇటువంటియీవిమున్నె । చ్చటనేనియుఁ గలదటంచు - జనులాడఁగమీ
రెట్లనైనవింటిరే? యని । కటకటపడువారు మిగులఁ - గలఁగెడువారల్. 188

ఆ. నీచుడనుచుమునిని - నిందించువారును । తప్పనృపతిదనుచుఁ - దలఁచువారు
నగుచుపెక్కుగతుల - నావేళగుసగుస । లొప్పుచుండిరెగ్గు - బుట్టెననుచు. 189

ఉ. అంతటతాపసప్రవరుఁ - డారడమొప్పఁగఁజెంతనుండుభూ
కాంతునిఁజూచి, యోయి' చనఁ - గావలెమేమిఁక తామసింపరా
దింతటనుండివేతనము - నిచ్చెదఁగైకొనినీవు భక్తిమా
చెంతనజస్రముల్ గొలువు - సేయుము పొమ్మిదియాజ్ఞ, చెప్పితిక్. 190

వ. అప్రమత్తుండవై ప్రవర్తింపుమని యాజ్ఞాపించి, మఱియుంగలుగు వారలకుం దత్కాలోచితంబుగా నేయవలసినపనులు నిర్ణయించి కొలువు చాలించి వెడలి, మహీవరార్హంబైన మహాడంబరంబు విలసిల్ల శిష్య సమేతంబుగా మెల్ల మెల్లనం జని, నిరుపమానమణి నికరశోభావిరాజితంబును బహుతరచిత్రవిచిత్రాలంకారకలితంబును, పురందరమందిర సదృశంబును నగు రాజగృహంబుఁ బ్రవేశించి, పరిజనంబులు సముచితోపచారంబు లొనరింపనిం పైనయున్నత హర్మ్యాంతర్భాగంబున నొక్క మనోజ్ఞప్రదేశంబునందు తమకై యునుపఁబడిన యుచితాసనంబులపై తానును గురుండును నాసీనులై, యిష్టాలాపంబులం బ్రసంగించుచున్న సమయంబున. 191

క. ఎవ్వరిపైఁ గోపించునొ । యెవ్వరిని శపించునో మ - హీసురుఁ డనితా
మవ్వగ్గ మగని భీతిలి । దవ్వుగఁ జని నిలిచిరపుడు - దాసీజనముల్. 192

ఉ. చంపకగంధి యోర్తు ముని - చంద్రుని సన్నిధి కేగుదెంచి భా
షింపఁగ నోడి జిల్లవడి - చీకురవంబున మజ్జనంబుఁ గా
వింపఁగ వేళ యయ్యెనని - విన్నవ సంతసమంది లేచి ముక్
గుంపుఁదోలఁచి పార్శ్వముల - కుంబరిచారిక లేగి నిల్వఁగన్. 193

క. ఇదె యిదె యిట్టిట్టని యొక । సుదతీమణి దారిఁ జూప - సుందర మగుత
త్సదనాంతర శిల్పంబుల । మది మెచ్చుచు వేగ నేగి - మజ్జనశాలన్. 194

ఉ. చేరినయంత నొక్కసర - సీదళసన్నిభ నేత్ర హూనికిం
గైరికరమ్య పీఠమిడి - కంకణఝుంకృతు లుల్లసిల్లగా
సౌరభతైలమంటె, నొక - చంద్రసమానన నల్గువెట్టెఁ జె
ల్వార నొకర్తె వేజలక - మార్చె సుఖోష్ణ సుగంధవారి చేన్. 195

గీ. అటుల మజ్జన మొనరించి - యా మునీంద్రుఁ । డపుడు పరిచారికానీత - మైన ప్రవిమ
లాంబరంబులు ధరియించి-యచ్చోటు వాసి । సంతసము మీఱ భోజన-శాలకరిగి. 196

మ. అతివల్ పెట్టిన కాంచనాసనముపై - నాసీనుఁడై భర్మని
ర్మితరంభాదళమందు షడ్రసములన్ - మింపొందురుచ్యంబు లా
ప్రతి లేనట్టి పదార్థముల్వరుసగాఁ - బద్మాక్షియొక్కర్తు స
మ్మతి వడ్డింపఁగ నారగించెఁ బ్రియమా - మాడ్కిన్ రుచుల్మెచ్చుచున్. 197

ఆ. అఖిలజీవులకును - నాహార మొసఁగు ప । రాత్పరుండు లోక - రక్షకుండు
వేడ్కఁ దన కొకర్తు - వెట్టినయన్నంబుఁ । గుడిచి తృప్తిఁ జెందెఁ-దడయకపుడు. 198

వ. ఇట్లు భుజించి లేచి, సుందరీకరారవింద సంభృతసువర్ణ కలశముఖ వర్జమాన వారిధారా క్షాళితకరచరణయుగళుండై, యున్న యతనిం గని యశోవతియును మఱి ప్రకారంబున. 199

క. కుసుమసుగంధులు కొందఱు । గుసగుసలంబోయి నవ్వ - కొనియిదెమీరీ
దెసఁజనుదెండని కొనిచని । యసదృశమగు కేళికాగృ - హముఁ జేర్చుటయున్. 200

ఉ. అందలిశిల్ప చిత్రమున - కచ్చెరువొంది నుతించి చాలనా
నందముతోడ యోగ్యశయ - నంబునఁ దానుపవిష్టుఁడై నృపా
లేందుని సత్యమీవిధృతి - హెచ్చుగఁదోఁచిన మెచ్చి యింక నే
సుందరి సాధ్వి మానిని య - శోవతి మానసశుద్ధిఁగాంచెదన్. 201

వ. అనియోజించుచున్న సమయంబున. 202

చ. రయమున నుగ్రుఁడుం దనతగ - రంబునకుం దిగినట్లు పోయి తాఁ
బ్రియమున మజ్జనంబు నొన - రించి భుజించి మునీంద్రుఁడున్న యా
శయనగృహంబు చెంగటికిఁ - జయ్యన వచ్చె గురుప్రచోదిత
క్రియలను నేర్పు మీఱఁగమ - కించియొసర్పఁగ నెంచి వేడుకన్. 203

క. అటువచ్చి మందిరముఁ జొ । చ్చుటకు మదిన్ సంశయించి - చూచుచునట వా
కిటనిలిచియున్న శిష్యునిఁ । దటుకునఁ దలయెత్తి కాంచి - దండనము నితాన్. 204

చ. సరసకు వచ్చియున్న పరి - చారికలన్ బెదరించి తిట్టియీ
చిరమరబుద్ధి మీకగునె ? - శిష్యుఁడు వచ్చిన వచ్చెనంచుఁ జె
ప్పరుగద! మంచిదయ్యెఁదగు - భంగినిఁ దత్ఫల మొందఁజేతు నా
తరము నెఱుంగరే మొకొ - దా ! యిఁకమీఁద నెఱుఁగవచ్చెడిన్. 205

క. అతఁడెల్ల భంగులను నా । మతి కెక్కిన వాఁడనియును - మంత్రియనియు మీ
మతిఁదోఁచదె ? సామాన్యుని । గతి నెంచితి రింతలోన - గర్వము దగునే ? 206

క. మంచిది కానిండింతనె । మించిన గెద్దియును లేదు - మీమదమునడం
గించెదనింకను జేయఁగ । నెంచినదంతయును జేయు - డిపుడరలేకన్. 207

క. ఆయంబోనాకడకున్ । మీయేలికసాని రాక - మిముఁబంచెనుగ
ర్వాయత్తమతి, నిసీ ! మీ । రీయెడనుండంగవలవ - దిఁకపొండవలన్. 208

చ. అనిభయమొందనార్చి యతఁ - డంతట శిష్యునిఁ జేరఁ జీరియి
ట్లనియెను, కంటె ? వీరలయ - నాదర దుర్మత మిట్టి చెడ్డవా
రినిఁదగునంచు నాకుపచ - రింపఁగఁ బంచెను యుక్తమే ? నృపాం
గనకిపుడెల్లి దంబయితిఁ - గల్గునె భక్తి ? దురాత్మపత్నికిన్. 209

క. అట్టిదినాతోయెవ్విధి । గట్టుగఁగాపురముఁ జేయఁ - గోరుంజెపుమా !
తుట్టతుదసబలతానే । కట్టడితనమునకుఁబూనఁ - గలదో యెఱుఁగన్. 210

చ. అదికడు మాయలాఁడి జర - తాంగుఁడనే నటుగాననేమి యా
పదఁగలిగించునొకపట - పద్ధతినొంటరి పాటుఁజూచి యా
సదనముకేళికా గృహము - చయ్యననిచ్చటి కన్యలెవ్వరుం
గొదకొని రారుచిక్కువడి - కూఁతలువెట్టినఁగానియుం ధృతిన్. 211

క. ఏవేళకెటులనగునో । భావింపఁగఁదరముగాదు - బాసటయిచ్చో
నీవే! కావున నెందుం । బోవకుమీ! కాచియుంట - పోలును నీకున్. 212

వ. అని యందఱును విసంబలికి యుగ్రునిఁబనిచి పిమ్మట. 213

క. మునికనలునఁదనపలుకులు । వినిభీతిలియున్నయచటి - వెలదులనెల్లన్
గనితిట్టికొట్టిమిప్ర! భ్వనివోడ్కొనిరండుపోయి - వేగమెయనినన్. 214

క. కొట్టుపడితిట్టుపడివా । రిట్టలమగుచింతతోడ - నేతెంచిపడిం
దొట్టినయలుకన్ భూపతి । పట్టపుదేవికి నెఱింగి - భర్తకిదలిర్పన్. 215

క. నటుఁడరుదెంచిన నేమటి । తటుకున నెఱిఁగింపమనెడి - తప్పునకై యా
దటమానితిట్టెఁగొట్టెన్ । కటికమునీంద్రుండు మమ్ముఁ-గాఱియపెట్టెన్. 216

క. నీపాలిటి పాపగ్రహ । మోపడతిరో! యతఁడు, తాపసోత్తముఁడనరా
దేపగిది వానితోనిఁకఁ । గాపురముండేయుదువో సు - ఖంబనియకటా! 217

క. నినునిపుడేయటకుం దో । డ్కొనిరమ్మనెనమ్మ! యతని - కోపంబింతిం
తనరాదు మాకునెఱుఁగ । య్యానుగండము తప్పెనేటి - కిందునిభాస్యా! 218

గీ. తడవుసేయకుమమ్మ! పోఁ - దలఁచియున్నఁ । నేమికీడెంచునో క్రూరుఁ - డింతలోన
వేగఁబోవమ్మ! పోయి సే - వింపవమ్మ! యచటికేఁక మేమురాఁజాల-మమ్మదేవి 219

గీ. అతనివలన సుఖంబులే - దమ్మ! నీకు । విమతుఁడేవేళ కెట్లుగా - వించునో కొ
యువిదరో! యేటిగట్టున- నుండు ద్రాని । కెన్నటికిఁ జేటుదప్పఁబో-దిదినిజంబు. 220

క. అనిసమునిచిత్తవృత్తిని । మునుదాఁగనియున్నదగుట - ముద్దియయతఁడే
మనునోజాగొనరించిన । ననుచుఁదలఁచివేగలేచి - యాసమయమునన్. 221

సీ. గొజ్జంగినీటను - మజ్జనంబొనరించి - రాజిల్లుచీనాఁబ - రంబుఁగట్టి
మణిగణస్థగితభూ - షణములుధరియించి - రాణించు మేలైన - రైకఁదొడిగి
సౌరభకాశ్మీర - చందనంబునలంద - కాటుకరేఖలు - గనులఁదీర్చి
పాలుపుమీఱఁగముఖం - బునదిలకముదిద్ది - తుఱుమునఁబూవులె - త్తులనుఁదుఱిమి
గీ. మద్రసోపేతహైసభో - జనమొనర్చి । తరళలోచనయొకతెకై - దండయిడఁగ
లలితమన్మథసామ్రాజ్య - లక్ష్మిపోలె । తరుణివెడలెను కేళికా - ధామమునకు. 222

గీ. అటులవెడలిలతాంగి జా - గయ్యెననుచుఁ । గినిసియేమనునోగదా! - మునివరుండు
నేరములఁబూన్పఁగాని మ-న్నించఁడెంత । చెప్పిననువినఁడనిభీతిఁ-జెందియపుడు. 223

క. తత్తఱపాటున నెంతయు । నుత్తలపడుచున్నయాఁటిఁగి - యువిదలుదైన్య
యుత్తమతులగుచుఁగనియా ! బిత్తరికిట్లనిరిమిగుల - వేసటతోడన్. 224

శా. ఓబింబాధర ! మేమునీచెలులమ - న్యూల్గామునుమ్మెద్దిగా
నీ, బాహాటముగావచింతుమెపుడున్ - నీబాగుమాబాగుగా
నాబాల్యంబుగనెంచువారలముమే - మాగాములూహించిగా
రాబంబొప్పఁగసర్వకార్యములు ని-ర్వర్తింతుమింపొందఁగన్. 225

ఆ. ఇట్టిమేమునీకు - హితమునుపలుకుదు । మెపుడుమానస్ఫమున - నేవపడక
మావచించుమంచి - మాటలనాలించి । నడుచుకొనుము మేలొ - నరులతాంగి ! 226

చ. వెఱవఁగనేటికామదుక - విప్రునకుంగొఱగానిదానమ
క్కఱపడికొన్నయంతనె సు - ఖంబదియంచుఁదలంచెఁగానిపై
తెఱఁగునెఱుంగఁడయ్యెవిను - తెల్పెదమేర్పడనీకుయోగ్యమౌ
తెఱకువ, బేల ! నేనను - తింపనుపొమ్మని చెప్పిపంపుమీ ! 227

ఆ. అటులనైనవిసికి - యతఁడుకైకొనిన స । ర్వమునువిడిచిపోవు - వచ్చినట్లె
యుండెనేనిచనక - యుండెఁబోమనకేమి ! పిదపనైనఁనేగు - నిదినిజంబు. 228

చ. అనియిటునెచ్చెలుల్పలుక - నయ్యళికుంతలమందహాసమా
ననమునఁజెన్నుమీఱనర - నాథునియాజ్ఞఁదలంచివారికి
ట్లనుఁ, గడుసాధ్వినాఁబరగి - నట్టిననున్ బతిమాటకన్యథా
గొనకొనిచేయుమంచనఁగఁ - గూడునె ? ధర్మమెఱుంగఁబాలకన్. 229

మ. మునికర్పించెనునన్నుభూపవరుఁడా - ముష్యాయణుండైనయా
ఘనునిన్ దుర్దశ మొందజేయుటకు సం - కల్పింపరాదమ్మ ! చె
ప్పినమాడ్కింబొనరించినేవిభునకున్ - విఖ్యాతిఁజేకూర్తునె
ట్లును, మానీశ్వరుఁడెట్టిడైననునొకం - డుంజెప్పరాదాతనిన్. 230

క. అతఁడేపతియతఁడే స । ద్గతికాధారంబురాజు - దైవమునతఁడే !
యతఁడేబంధువుపోషకుఁ । డతఁడే ! నాదేహమతని - దగుఁజెలులారా ! 231

ఆ. అనినయాశుభాంగి - యసమానదృఢబుద్ధి । కబ్బురంబునొంది - యతివయొకతె
మరలనిట్టులనియె, - మానిసంగతినీకుఁ । దగదుమానుమమ్మ ! - తరళనయన ! 232

క. ఓచెల్ల ! కపటహృదయుఁడు । వాచంయమిమిమ్మునేప - వచ్చెనుతానిం
కేచక్కయూరకఁబోవం । డేచెట్టలనింకఁజేయ - నెంచునొసుమ్మీ ! 233

ఉ. ఎక్కడనుండియీజరఠుఁ - డిచ్చటికీతఁడిదాపురించెనో
యక్కట ! పల్కఁబొంకని మ - హాగుణవంతునిధర్మమూర్తిఁ బెం
పెక్కినశాంతభావునవ - నీశ్వరశేఖరున ప్రసిద్ధమా
ఫక్కినివేఁడిరాజ్యమును - భాగ్యముఁ గైకొనియంతఁ బోవకన్. 234

శా. హేయంబై నదురాశఁ జెందితననో - రెట్లాడెనో కాని, నీ
జాయన్ దత్తముసేయుమంచడిగె, యా - సత్యవ్రతుండైనరా
జాయజ్ఞానునకిచ్చెఁ గూడదని సుం - తైనన్ విచారింప కీ
న్యాయం బెచ్చటనైననుంగలదె ? నీ - వాత్మన్ విచారింపుమా ! 235

చ. సకియరో ! పూనియోగ్యునికొ - సంగినదానముసార్థకం, బసా
ర్థకమగుఁ జుమ్మపాత్రునకు - దానమొసంగినవానినిట్లుత
ప్పక పడిమంచినీరగును - పల్లపునైకతభూమిలోన నిం
కొక యెడనుప్పనేలఁబడి - యెయ్యనఁదద్గుణ మొందునేకదా ! 236

ఉ. భావజమర్మకర్మపరి - వర్జితుఁడెంతయుఁ గాఁడసుండతం
డేవిధనిన్నుఁ గూడిసుఖి - యింపఁగ నేర్చును ? నీవటన్నఁ బృ
థ్వీవరపత్ని వందను భ - వించునదేమియులేదుచన్న, న
య్యో ! విపరీతకార్యమిది - యొప్పునె ? నీమదిమానుమీభ్రమన్. 237

ఉ. చిత్తరుబొమ్మవంటినినుఁ - జేకొనెనంతియకానివానికిన్
హత్తునె తృప్తి ? కాంతరో ! య - హర్నిశముం గొఱలేనిభోగసం
పత్తినెసంగుభూవరుని - పట్టపుదేవినినిన్ను సాధ్విని
ట్లొత్తినయాసఁ గూడియతఁ - డేమిసుఖంబునునొందుఁ జెప్పుమా. 238

క. ఆపాపపు విప్రుఁడుని ! న్నేపాటిగనింపుమీఱ - నేలఁగఁ గలఁడే
వ్యాపారముతగదమ్మా ! ! మాపలుకులువినగదమ్మ ! - మంజులవాణీ ! 239

గీ. ప్రకటవైభవకలితుఁడౌ-ప్రభునివిడిచి ! తపసితోఁ బొందుఁగోరుట-తగునె ? చెపుమ !
కల్పకంబునువిడనాడి - గచ్చపొదను ! బట్టుకొనఁబోవువిధమిది - పద్మగంధి ! 240

క. అతఁడొకరాజఁటవిభుఁడఁట ! యతనింబ్రియ మొప్పఁగలయ - నరిగెదవఁటభూ
పతిపత్ని వౌర ! వినమీ ! కతలెందునుఁ దపసికెంత - ఘనతఘటిల్లెన్. 241

క. వనితా ! యామునియెంతటి ! ఘనుఁడైనను నిట్టిపనికిఁ - గడఁగుదురే ? మే
లనిఘనపీఠికత్తియగునని ! కొనిపుత్తకసెవరుగొసి - కొందురు ? చెపుమా ! 242

ఉ. కానలలోననాకులును - గాయలునుందిని యూటనీటులం
భానముఁ జేసియుద్ధురత - పంబొనరించుధరామరుండుతా

నానని రాజ్యముం గొనిన - యంత నెపాలనఁ జేయ నేర్చునే ?
వీనుగ నాటి నీరిడిన - వేఁగిన విత్తన మంకురించునో ? 243

చ మతి చెడె నే మొవార్ధికపు - మానిసి గావునఁ, గాదటన్నదు
ర్గతిఁ గలిగించు నింద్యమగు - కార్యమటంచుఁ దలంకకంబతి
వ్రతని టుభంగ పెట్టుటకుఁ - బాల్పడునే? యెటులైననా నప
మ్మృతము నెఱుంగ సేయుమను - మానము మాని మదేభగామినీ! 244

ఆ. ఇటుల రాజ్యమతని - కిచ్చి మీరలు చెడు । టేమి ధర్మమమ్మ - కోమలాంగి!
కన్ను బోవునట్టి - కాటుకఁ బెట్టుకో । నంగనా నె? పొమ్మ - నంగరాదె ? 245

క. పతియాజ్ఞ మీఱరాదని । కొతికిన ఫలమేమి? నెఱవ - కుచునీకున్ స
మ్మతిగాని యకార్యము నే । గతిఁ జేయుమటంచుఁ బలుకఁ - గలరెవరైనన్. 246

చ. కొకిబికిరైన దంతములుఁ - గొంకిరిపోయిన వాఁడిగోళ్ళుఁ జూ
డ్కికి వెగటైన యెమ్ములును - గిల్లిన నెత్తురు లేని దేహమున్
వికృతపు రోమముల్ వడఁకు - వేఁటయు నమ్మదికంపు కాసలో
నికిఁ జని సట్టికన్నులును - నీమదికింప్రియమౌనె ? సుందరీ ! 247

సీ. కండయున్నల్లలే - కెండిదు స్వేదంబు - మించు చిత్తడి మేన - మేను సేర్చి
నిడుమీసములు మీఁద - నెఱసిన లొత్తలా - ముదుక చెక్కులనట్టె - ముద్దులాడి
రసహీనమైవిన - రానినీచపుఁ ఛాంద - సోక్తులు విని ముదం - బొంది మెచ్చి
వెరవెఱుంగకఁ జేయు - వికటంపుఁ జేష్టల - కేవఁ జెందకఁ జాల - నిచ్ఛయించి

గీ. వీడకీ వేళ ముదిముని - తోడఁ గూడి । మదన కేళీ విలాససా - మ్రాజ్య సుఖము
ననుభవించుట కెవ్విధి - నాత్మలోనఁ । దలఁచి పోయెదవమ్మ! యో - తలిరుబోణి. 248

సీ. సరససల్లాపము - ల్జరుపఁగా నేర్చునే? - సతతంబు మంత్రము - ల్జదువువాఁడు
చిన్నెలు శృంగార - చేష్టలు నెఱుఁగునే? - వైదిక క్రియలలో - వఱలువాఁడు
మొనసి కౌఁగిటఁ జేర్చి - ముద్దాడనోపునే? - వినువకహోమముల్ - వ్రేల్చువాఁడు
సురత కేళిఁ బెనంగి - సుఖమొందఁగల్గునే? - పరతత్త్వ వాంఛలోఁ - బరఁగువాఁడు

ఆ. పారుఁడతఁడు నీవు - పార్థివకులజాత । వతఁడు తపసి సాధ్వి - వగుదువీవు
జరఠుఁడతఁడు నీవు - జవ్వని వెవ్విధిఁ । బొసఁగునమ్మ! మీకుఁ - బొంతమబల! 249

సీ. క్రూరమౌనఖములఁ - గులుకు గుబ్బలనట్టె - గ్రుచ్చఁగా నెట్లోర్చు - కొందువమ్మ
కఱకు దంతంబులు - గాడఁగా కెమ్మోవిఁ - గొఱికిన నెటు తాళు - కొనెదవమ్మ
కఠిన బాహువులనీ - కడుమెత్తనగు మేను - బొదివిన నెటు తాల్మిఁ - బూనెదమ్మ
ముదివగ్గు కదిసి ప్రే - మడిఁ గూడి పెనఁగుచో - నెవ్విధి నింపువ - హింతువమ్మ

గీ. హరిహరీ! యీయసహ్యాకా - ర్యాభిలాష । వలననీకేమిలాభంబు - గలుగునమ్మ
పుణ్యమనియేటిలోఁబడ - బోవునట్లు । తోఁచుచున్నదినీలాగు - తోయజాక్షి! 250

ఆ. వ్రతముచెడినఁగలుగ - వలదటేసుఖమైన । నట్టునిట్టుగాని - యట్టికార్య
మెగ్గుగాదొ? కంటి - కింపైనమదికింపు । వానిపైనదెట్లు - వాంఛగలిగె? 251

మ. సరసాలాపములా, నఖక్షతములా - సంశ్లేషమాహావమా
వరబింబాధరపానచుంబనములా - వైదగ్ధ్యమాచేష్టలా
స్మరశాస్త్రోక్తములైన తక్కుపనులా - చాశీతిబంధంబులా
తరుణీ! దేనికెఱుంగునమ్ముదుకఁడే - తద్వాంఛయుక్ వాంఛయే? 252

ఉ. తిట్టినఁదిట్టుఁగాకకడు - దెప్పరమైనను నయ్యెఁగాకయీ
పట్టుననుండకెందయినఁ - బద్దున బొమ్మనినన్ గొఱంతయే?
పట్టిబికారిపో, యతని - వంటివికారపు వానిఁబోయిచే
పట్టుటకంటెనూతఁబడి - ప్రాణములన్ విడిపించు టొప్పగున్. 253

క. తగదమ్మాయీయత్నము । వెగటొందకచెప్పినట్లు - వినవమ్మా! మా
నగదమ్మాసంశయమో । మగువా! పోవలవదటకు - మరలుమున్నతితోన్. 254

క. ఈయలఁతిపనినితగునని । సేయఁగనీకెట్లునేఁడు - చేతఃప్రియమై
న్యాయమనితోఁచెనో నా । రాయణమాకిదితలంప - రాకున్నదమో' 255

క. మావలనఁదప్పులేదిఁక । నేపనుపునసీకుసేయు - టిపుడుహితవుగా
భావములోఁదోఁచెడినో । యావిధమునఁజేయవమ్మ! - యనిపలుకుటయున్. 256

క. వినివారలమాటలకుం । గినుకజనించియునుమీఁది - కిందోఁపఁగని
కనె, వెగటునగవునెమ్మొగ । మునఁదనరఁగ శాంతవనన - ములనిట్లనియెన్. 257

శా. యుక్తాయుక్తములెంచ కిప్విధిమహా - యోగ్యున్ దపస్విన్ ప్రథా
యుక్తున్ సన్నుతిఁజేయనొల్లకపవి - త్రోక్తుల్ వృథాబల్కినన్
ముక్తిశ్రేయుల రాదురిఁదజునుప - మ్మోదంబుమీఱంగస
ద్భక్తిన్ మీరలు గొల్వఁడాయనఘునిం - దానన్ గడున్మేలగున్. 258

గీ. హానివృద్ధులనెంచక - యవనిభర్త । యతనికర్పించెసర్వంబు - ననఁగఁదగునె?
యాచకుఁడువేఁడినపుడులే - దనగలండె । యసమసత్యవ్రతముఁగల - యట్టిదాత. 259

క. ఖేదపడియునువదాన్యుఁడు । లేదనఁగాఁజాలఁడొసఁగు - లేశంబైనన్
మేదినిలోనదివట్టియు । నీదే? తనయూఁటనీరొ - కింతజనులకున్. 260

క. ఒకనాఁడుకుడువకుండినఁ । దికమకయగు రెండునాళ్లు - తినుతిండినిఁదా
నొకనాఁడుతినఁగఁజాలఁడు । సకలవిధంబులనరసిన - సంకటమజుఁడీ! 261

క. ఎక్కడికిఁ గష్టమంతం । బెక్కడికి సుఖంబు, సమము - లెఱిఁగినరెండుం
లెక్కింపఁదగదు ధర్మము । దొక్కటియే తోఁడు జనుల - కుర్విం దలఁపన్. 262

క. మీ కిటులఁ దోఁచినను యిది । నాకుం బ్రియమగును చాల - నాథుని యాజ్ఞన్
గైకొని చేయుట యుక్తం । బాకర్ణింపుదు నెయ్యెట్టి - యహితవచనముల్. 263

క. రయమున సజ్జని మునికి మనః । ప్రియ మొనరించుట యమిగుల - పెంపగు మీరీ
క్రియఁ బలుకుట నుచితమునా । నియమము విడనాడ నేర్తు - నే యేమైనన్ ? 264

గీ. ఎన్ని కష్టంబు లొదవిన - నన్నియును స । హించి మానీంద్రుఁ గొలుతు నే - నెల్లవిధుల
వలదు వారింపఁగా నన్ను - వనితలార! । యనుచు వారలతోఁ బల్కి - యచ్చోటుఁ గదలి. 265

గీ. ఉరుతరద్విపకుంభయుం - గ్మ్రపమాన । కర్కశస్తనయుగళిచ - నట్టులోనఁ
గులుకుచుండఁగఁ బెనుపిఱుం-దులు జలింప । మునినిఁ జేరంగ వచ్చెన-మ్మ్రుద్దుగుమ్మ. 266

క. క్రూరగవ్యాఘ్రము గలపొదఁ । జేరిన లేడియును వోలె - చెలువయటకుఁ జే
ల్వారఁగ వచ్చిన నదిమం । జీరగవళివలన నెఱిఁగి - శీఘ్రము ముని తాన్. 267

క. మృదులంబగు పానుపుపైఁ । గదలక బవళించి కన్ను - గవ మోడ్చి కడున్
నిదురించుచున్న మనుజుని । పదురున గుఱ పెట్టుచున్నఁ - బరికించి నెఱిన్. 268

గీ. చెలఁగి నారాకకై ప్రతీ - క్షించుచుండి । తామసంబొటఁగినిసియా - ధన్యచరితుఁ
డుడుకువనుమానినిద్రించు-చున్నవాఁడు । మేలుకొనుటింక నెప్పుడో న-న్నేలు టెప్పుడో ?

ఉ. కూరుకు జెందియున్నపుడు - గొబ్బున మేల్కొనఁ జేయు టెంతయు
న్నేరము కిల్బిషంబొదవు - నీతి నెఱింగిన వారు నిద్రితున్
దారున మేలుకొల్పుటకుఁ - దాము తలంపరు, మిన్నకుందునో
చేరువ కేగి లేపుదునో - చీరిన నెవ్విధిఁ గోపగించునో. 270

చ. వలదని యున్న లేచి కని - వచ్చిన దాన వు వచ్చినప్పుడే
దెలియఁగ మేలుకొల్పదగ - దే ? యని నాపయిఁ దప్పఁ బూన్చి తా
నలుకవహించి చేకొనక - హోవడి పెట్టిన శాంతుఁ జేసి సా
యులుకును మాన్చువారెవరు ? - యుక్తము గావిది యుందలంపఁగన్. 271

మ. అనిసందేహముఁ జెందికొంతదడవ - భ్యగ్రస్థలిన్ నిల్చి యా
ఘనసంకాశవినీలరమ్యకచతాఁ - గర్తవ్యమూహించి మె
ల్లన మేల్కొల్పుదునంచు డాయఁ జనిత - ల్పంబం బెహస్తంబునం
దనలో భీతి యుదత్తఅంబొదవి యం-తన్ మేను కంపింపఁగన్. 272

ఆ. అటుల శయ్యనంటి - యటపార్శ్వమందుఁ గూ । ర్చుండ బోవ ను సిలి - యొడలు విఱిచి
గారడంపుదపసి - కాంతతనుస్పర్శ । మున కులిఱిచి సాధ్వి - యనుచు మెచ్చి. 273

చ. తటుకున మేలుకొల్పినవి - గంబునమై సడలంగనీల్గి తా
నటునిటుశయ్యపైఁబొరలి - యల్లనఁగన్నులు విచ్చియంగుళు
ల్జిటచిటనెట్టి కల్విటిచి - చేతులుఁగాళ్లు విదిర్చిలేచియం
తటనతఁడావులించికనెఁ - దచ్ఛయనాగ్రతలస్థఁగోమలిన్. 274

క. కనికినిసిపండ్లుగీటుచుఁ । గనుదోయిని నిప్పులొలుకఁ - గాభీతిలులా
గుననార్చియశోవతిపైఁ । దనయధికారంబునెఱపఁ - దలఁచియదయుఁడై. 275

ఆ. ఓసిదుష్టురాల! - యొప్పునొప్పదటంచు । కొంచెమైనమదినిఁ - గొంకకిపుడు
చేయరానిపనినిఁ - జేయంగఁజెల్లునె? । యాజ్ఞగొనకశయ్య - నంటఁదగునె ? 276

ఉ. అంటితివనంతఁబోకనను - నల్పునిఁగాఁదలపోసి నిన్నుఁజే
కొంటినటంచుగర్వమున - గొబ్బునఁదల్పమునెక్కఁబాడియే?
తుంటతనంబుగామదినిఁ - దోఁచదెనీకిది, మాయలాఁడి ? నీ
వంటిదురాత్మురాళ్లలదె? - పాపిని వీవుదలంచిచూడఁగన్. 277

శా. ఈసౌధంబుననిట్టలంకృతులు నీ - శృంగారముల్చిత్రముల్
పీఠంబుంగొఱగానివాసనలుది - వ్వోల్లివ్వోలీయందముల్
మాసంపత్తికిలోటువచ్చుననియే - మాత్రంబుయోజింపవా
రా ! సంసారులకిట్టివైభవముఁగో - రంబాడియే ? చెప్పుమా ! 278

శా. ఈకార్యంబులనేమిలాభమయయో - యిభ్భంగినావిత్తముల్
బోకార్పందలపెట్టుటేల ? నిదియిం - పోపెంపొయేమానొకో
నాకుంబోఁచఁగలేదునీదుమతము - న్యాయంపురాజెవ్విధిన్
నీకున్బోధనఁజేసిపంచెనొనను - న్నిర్భాగ్యునింజేయఁగన్. 279

క. ఇచ్చకములేకనినుమా । కిచ్చినవాఁడగుటవలన - నెల్లధనంబున్
వెచ్చింపుముజనునమ్మని । వచ్చినగతిననుచుఁజెప్పి - పనుపకయున్నే ? 280

క. ఈవిధమునమితిఁదెలియక । గావించినయెటులనెగ్గు - గాపురముగడున్
లావరియులొల్లెకాఁడై । పోవడె ? తానిటులవెచ్చ - ముంజేసినచోన్. 281

ఆ. ఆయమునకువెచ్చ - మధికమైయుండిన । కూలిమిత్రుఁడైన - జోగియగును
జగతినదివిలోమ - మగునేనితప్పక । యగునుజోగిరయైన - యక్షరాజు. 282

క. ఈరీతినియోజింపక । యారా ! వ్యయమునకుమూల - మగుపనులుమహా
గౌరవమనిభావించితి । వే ? రాజనటంచుఁగొట్టు - నెక్కినమనునే ? 283

చ. చెడుమనినన్నునిర్ధనునిఁ - జేసి, వివేకవిహీనుఁడైన యీ
గడుఁపరివిప్రుఁడిష్టతమ - కంబునఁగైకొనెరాజ్యమేలుమే

వడిదెలియంగలేకతడ - బాటును జెందిదరిద్రుఁడయ్యెనిం
కుడుఁగఁగరాదెయామతము - యుక్తముగాదనితోఁచలేదొకో. 284

గీ. భూమిఁబాలించుటనఁగదా - బుద్ధిలోన । సులభమనియెంచెఁగాఁబోలుఁ-దెలివిహీనుఁ
డాయెఁబోయింకఁ, బారుని-యధిపతిత్వ।మింతకాకెంత ? రాజొనె!-యిట్టిదేబె. 285

క. అనినలుగురుపరిహాసం। బునుఁజేయఁగఁజూచినీవి - భుండునునీవుక్
తనివిఁగొనిసంతసించుట । కొనరించినయత్నమిది, ప-యోరుహనయనా ! 286

గీ. వ్యర్థముగనిట్టితగనికా - ర్యములుసేయు । టంతెకాదించుకైననా - యందునీకుఁ
బ్రియముగలుగదునిక్క-ము-పేదతపసి । ననుచుఁదలచితివే ? రాజు-నగుటమఱచి. 287

క. నీరాకనిరీక్షింపుచు । కోరికతోనిచటనొంటిఁ - గొందలపడునా
వైరమణమానిచయ్యనఁ । జేరఁగరాకుంటనీకుఁ - జెల్లునె ? చెపుమా ! 288

చ. పగమదినుంచినీవుచెడు - పాము విధంబునఁబూనికీడుఁజే
యఁగమకముక్ పొనర్చిసమ - యంబును వేచిప్రియంబుతోఁపమం
చిగనటియింపవచ్చితివి - సీ ! తెలిసెక్ కపటాత్మురాల ! నీ
పొగరునడంచినీమగని - పూరిని మేయఁగఁజేతుఁజూడుమీ ! 289

ఉ. ఆలరివృద్ధుఁడీఖలున - కంగనయాకొఱ ? పుట్టిముగ్గెనా ?
నైశమబోవకున్న, పయి - వచ్చినదేమియులేదు; యింతలో
బాళిసహింపలేడొ ? యని - భక్తియుఁ క్తియువీడియుండియీ
వేళకుమెల్లగాపరిభ - వింపఁగవచ్చితివే నను ? బళీ ! 280

ఉ. ఏలిదమైన నొల్లనన - కింపుగనేర్పునెలి మాటలం
బ్రేలుటలేనిభక్తిఁ బచ - రించుటయొప్పునె ? యాటపాటలం
గాలముఁబుచ్చి నీకుమది - గల్గినవేళను వచ్చినంతనే
మేలని మెత్తునే ? కడుత - మింజను దెంచితి పంచునెంతునే ? 291

క. నీపతిపైఁగల మక్కువ । నాపైఁగలుగంగవలదె ? - నాధనమైనక్
బ్రాపెవ్వఁడింకనీకుక్ । భూపాలుఁడునేనొనీవి - భుండోచెపుమా ! 292

క. గౌరవమున నేఁజెప్పిన । తీరునవర్తింపుమనుచు - దృఢముగపతివే
మారునచింపఁడె ? పలుకం । గారాదే ? యపుడె మనసు - గలుగకయున్నక్. 293

క. ఇనుమున వైలముపుట్టిన । ముసిడికిఁ దీపొదవినను స - ముద్రోదకముల్
వినుమానముగా వట్టినఁ । బొసఁగదు మీజాతికమల - బుద్ధితలంపక్. 294

క. నినునొల్లను నీతోపొం । దునునొల్లను చాలుఁజాలు - తొలఁగుము వేగం
బుననని కోపంబున నిర । సన మొనరించుటయు వెఱచి - సంరంభమునక్. 295

క. కనకాంగి యపుడుమాయా । మునిపదములకెఱఁగి హస్తములుమోడ్చి మహా
వినయంబు మీఱఁగాని । ట్లనియెనతండట్టె విముఖుఁ - డై వినుచుండన్. 296

క. ఓదురితదూర ! నాయెడ । నేదియు నేరంబుగలుగ - దిదిసత్యముమీ
పాదంబులాన యివ్విధి । నాదటవిడినిందసేయ - నగునే ? నన్నున్. 297

క. గాటముగ నెన్నియిడుమలు । పాటిల్లిన నేనులేదు - బంతివచింపన్
నేటినియమంబుగాదిది । పాటింపుదు నీవ్రతంబుఁ - బాయక నెపుడున్. 298

ఉ. కోరిననుంగ్రహించి మతి - గొల్పదు నీపయినన్నయెవ్వనిం
జేరఁగఁబోదు దిక్కనుచుఁ - జిత్తమునందలపోసి ? యక్కటా !
మీరలెవల్కుఁడీనుతము - మేలగునోమఱియెట్టిదానొ యి
ట్లూరకనేపఁగాఁదగునె ? - యొద్దకువచ్చినవేళ మానినిన్. 299

క. మీరుదయమాని చేకొనఁ । గోరకపొమ్మనినపిదపఁ - గుఱఁగటికినునున్
రారమ్మను వారికను । న్నారా ? యీకోపమేల - నాపైమీకున్. 300

ఉ. పొమ్మనినంత నేమరలి - భూపతిచెంతకుఁ బోవుదానఁగా
నిమ్మగు నిమ్మగాకమఱి - యెవ్విధినైనను నయ్యెమీపదా
బ్జమ్ములు గొల్చుచుండెదఁ గృ - పారసమెప్పటికేనిఁగల్గదే ?
యమ్మెయిఁ గల్గకున్న ఫల - మంతియయంచు మదిందలంచెదన్. 301

ఉ. నావుఁడు మానిపుంగవుఁడు - నాతిమృదూక్తులు ధర్మశీలముల్
భావములోన మెచ్చియిది - భవ్యచరిత్రయటంచు నెంచి తా
నావిధమాత్మయందడఁచి - యంగనదిక్కు మొగంబుఁజేసి కో
పావిలదృష్టులంగనిని - రాదరణోక్తుల నప్పుడిట్లనెన్. 302

ఉ. నీజగజంత మాటలును - నీకపటప్రియమెట్లు నమ్ముదున్
రాజనిభాస్య ! నిన్ననఁగ - రాదది నాదగు నేరమేయగున్
నేజరతుండనయ్యుమది - నిన్నువరించుట తప్పుగాదె ? యే
యోజననుంగొనంగలవ - యోగ్యునిఁ దాజవరాలు మెచ్చునే ? 303

శా. నాపైమక్కువ గల్గియుండిననిసిన్ - నన్నొంటినిచ్చోటని
ట్లీపర్యంకముమీఁదఁజేర్చి వెసరా - కిందాకనీయిచ్చనే
వ్యాపారంబున నోర్కొయుండికపట - వ్యామోహముంజూపిన
స్నేపంబూనియె కాదెవచ్చితివి ? నీ - వీవేళకుంగోమలీ ! 304

ఉ. నీచతురత్వముల్ నృపుని - నేర్పునెఱుంగుదుమీరలెంతయున్
నీచగుణప్రయుక్తులరు - నిక్కము నన్నిపుడేమరింపఁగాఁ

జూచెదవిట్టిమాయలకుఁ - జోటునొసంగెడివాఁడఁగానుచే
రాచినయంతమాత్రమున - రాలరుగంగలవే? కరంబుజుక్. 305

చ. హితమతినెద్దివేఁడినను - నిచ్చెదనంచువచించినేనునీ
సతినిఁగొనంగఁగోరితినొ - సంగుమనంగనె కొంకెరాజునీ
పతనికిధర్మపత్నివఁట - యంతటికెక్కుఁడు బుద్ధిగల్గునే?
యతివరో! చెట్టునందొడిమ - నంటియయుండును కాయవీడకన్. 306

క. అనిమన్నింపకకోపం । బునఁబలికిన యబలమాని - పుంగవునిమదిం
గనలుడుపఁగఁదగునెఱవున్ । దనలోయోచించియపుడు - తగనిట్లనియెన్. 307

శా. క్రోధింపందగునే మునీశ్వర! మిముం - గొండాడెదన్ ధారుణీ
నాథుండెవ్వఁడు నాథుఁడెవ్వఁడిఁకపై - నాకున్ గనన్ మీరెకా
దే? ధారాళముగాననుంగలసి సం - తృప్తిన్ వహింపంగరా
దో? ధర్షించినయేమిసేయుదును సం-తోషంబుఁగావింపుఁడా. 308

మ. కదియంగానటువచ్చి యాకుమడుపుల్ - గ్రపంపుబాగాలొసం
గుదునో? గందముమైనలందుదునో? నే - గూర్చుండిపాదంబులొ
త్తుదునో? కౌఁగిటఁజేర్తునో? యిపుడునా - తోఁబల్కుఁడా! యిట్టిమె
య్యాదియోచేసెదనింతలోననుమీ - రట్టిట్టనంబాడియే? 309

క. పగదాననెదిగనాడఁగఁ । దగునా? నన్నునుచుమరల - దగ్గఱఁజనఁగా
మగువా! నిలునిలుమంతటి । తెగువా, మగవారియనుమ - తింగొనవలదే? 310

క. త్వరపడకునియమమొక్కటి । స్థిరపడినంగానినిన్నుఁ - జేకొననదియె
వ్వరికినిఁజెప్పఁగరాదో । కరిగమనాయబ్బురంబు - గాఁదోఁచుఁగడున్. 311

క. నానుడువుమీరినడువని । దానవుఁగడుప్రియముగలుగు - దానవునైనం
బూనియొనర్పుమతగుఁదగ । దౌనిదికాదనకఁజెప్పి - నట్లుగఁబనులన్. 312

క. తెలియఁగఁజెప్పినపిమ్మటఁ । దలఁకినశపియింతునిన్నుఁ - దప్పక, నాజ్ఞన్
దొలఁగకఁజేసినఁబడయం । గలవుమహాసుఖమునీవు - గట్టిగ, ననుఁడున్. 313

చ. అలికులవేణియిట్లనియె - నయ్యా! తలంపునసంశయింపఁగా
వలయునె? మాటిమాటికినిఁ, - బల్కుఁడె' యెవ్విధిఁనెద్దిసెప్పినం
గలఁగకఁజేయుదున్ వెగటు - గల్గునె? సేవకురాలఁగాదొ? నే
నలుగుదునే? యిదేమిపరి - హాసమొనిక్కమొపల్కుఁడా! తగన్. 314

క. ఈజజ్జరమాటలుమీ । కేజతపడుమిమ్ముమీర - లేమదినమ్మం
గాజంకెదరిఁకనమ్మదు । రాజడ్డనఁబరులఁ, బలుక - రాదేతలఁపున్. 315

వ. అనిపలికినయక్లేని శుభంబగుంగాకయని సంతోషించిమునివరుండు. 316

క. కనుమనియాపర్యంకం | బుననుండికృపాణమొకటి - పొలఁతికనఁగది
గ్గనఁదీసిపట్టినవ్వుచు | వినుమువెఱపుమానియొక్క - విషయంబబలా! 317

క. ఇదినీవుగైకొనుము జె | ప్పెదనటుపైఁజేయఁదగిన - విధమనియెనతం
డదిగనినివ్వెఱపడియా | పదవతియనుమానమపుడు - మదిఁగదురంగన్. 318

క. తాపసునిఁజూచిశిఙ్గం | బీపర్యంకమునకెటుల - నేతెంచెనుమున్
మీపాలఁగలుగదిదియే | పాపాత్మకులిచటనేమి - పనికిడిరొక్కొ. 319

చ. అరమరదోఁచెఁదెల్పుఁడని - యచ్చెరువొందెవిసంగఁగోరియా
గురుకుచవేగిరింపముని - కుంజరుఁడెల్లననవ్విదీనిసె
వ్వరుగొనివచ్చిరంచడుగ - వచ్చునె? సత్యమెఱింగియుంబళీ!
యొరులననేల? నీదగుని - యోగమెకాదె? సుధాకరాననా! 320

మ. అనుమానించియెఱుంగఁజాలడిగదే - లా? యీకుతంత్రంబునేఁ
గనుఁగొంటిన్మదినీర్ష్యఁబూనియనురా - గంబెంతయుంగల్గులా
గునవర్తింపుచునన్నునేమఱిచి - గొంకున్వీడిఖండింపదీ
నినినీవేయునిపించియుందువిదియే - నిక్కంబుయోచింపఁగన్. 321

మ. అనినన్గుండెలుఝల్లనంగనయయో! - యన్యాయమన్యాయమే
మనినేఁబల్కుదునింకనార! మునినా-థా! యింతపాపంపుయో
జనగావించుదురాత్మురాలనె? యిదే - చండంబునన్వచ్చెనో
యనిమిత్తంబుగనిందు, నేనెఱుఁగస - త్యంబింతయున్నమ్ముఁడా! 322

క. వింతలుమీమాటలునే | నంతటికిఁదెగించుదాన - ననితలఁపకుఁడా!
కాంతధృతిఁగందుననిజం | కింతురదేమోయెఱుంగఁ - గిటుకునిజముగన్. 323

క. మీపదములుసాక్షిగయిం | దీపట్టెముచేరినట్టి - హేతువదేమో
రూపింపరాకయున్నది | తాపసవరనిందమోపఁ - దగునే? నాపైన్. 324

ఆ. ఏమితలఁచియిచట - నిదియెవ్వరునిచిరో | గానిమత్కృతంబు - గాదుకాదు
నీళ్లులోతెఱుంగు - నిజముదేవుఁడెఱుంగు | నెవరుచెప్పనేర్తు - రిట్టులంచు. 325

క. అనినఁదలయూఁచియానా | ననువంచింపకుముకాన - నంబుననున్నం
తనెతెలివిహీనుఁడగునే? | ముని, చాలునుమానుమింక - మోసపుమాటల్. 326

వ. నీవుమాకపకారంబుఁజేయఁదలంచినను లెక్కింపకనీయెడంగలప్రియంబునఁజేసియానేరం
బులన్నియుమన్నించితి. ఇంకనిట్టిదుష్కార్యంబులనొనరింపఁదలంపకు మాయందుభక్తి

గలిగి ప్రవర్తింపుచు మదీయశాసనంబుఁ దప్పక నడుపుచుండుమని చెప్పినయతని పలుకులకు
సమ్మతించియున్న యావన్నెలాడిం జూచి మరలనతండిట్లనియె. 327

ఉ. మదకలయానవింతయగు - మంచిరహస్యపుమాటనీకుఁ జె
ప్పెదవినుమీకృపాణముల - ఖండించుటచేయొక మేలుగల్గెనిం
దిదియెవరుంచినం జెడిన - దేదియులేదిపుడించుకైన నా
యుదిలతోలంగుఁబోమఱచి - యుండినదొక్కటితోఁచెనామదిన్. 328

క. అదియేమిమాటయని యడి । గెదవేనియుఁ జెప్పెదన్ సుఖించుటకదియా
స్పదమగునుగానతగదని । పదరకునీవలననొక్క - పనిగానలయున్. 329

శా. శ్రద్ధాభక్తులెసంగనుగ్రమగుని - స్థంబూని నేమున్నసం
తద్ధారాళనిపాతపర్వతఝరీ - ధారాంతరాళస్థలిన్
శుద్ధాంభఃకణముల్భుజించిధృతిమై - శోషిల్లకీశున్ త్రిలో
కోద్ధర్తన్ మృడుఁగూర్చిచేసితిదపం - బొండొండమూడబ్దముల్. 330

గీ. అటులఘోరనిష్ఠనుదప - మాచరించు । నన్నుఁజాలగ మెచ్చిపి - నాకపాణి
కరుణఁబొడసూపియడుగుము-వరమటన్న । యపుడుశంకరుఁడాదేవుఁ-డని నుతింగి. 331

చ. మదిముదమందిభక్తిని న-మస్కృతిఁజేసినుతించిదేవనే
మదిమినిఁజెందకుండువర - ముంగృపసేయవెయంచు వేఁడితిన్
మదనవిరోధినన్నుఁగని - మంచిదిగాని, యశేనినీకు నేఁ
డదిసమకూఱదింకపయి - నవ్విధిఁగల్గెడు నెట్టులన్నచోన్. 332

వ. ఇంకఁగొంతకాలమునకు జరాభారంబుసంభవిల్లినపుడునీవుతత్త్వవిచారాసక్తి నుజ్జగించి
సంసారసుఖంబుల ననుభవింపఁ గోరికపడి చనియొకపురుషమిథుని నర్థించియతని రాజ్యం
బును భార్యనుఁబరిగ్రహించిప్రభుత్వంబుఁజేయఁగలవాఁడవు. ఆసమయంబునభవదిచ్ఛా
ప్రవర్తినియైన యారాజపత్నింబురికొలిపిభీతిల్లక యాపల్లవాధరచే నిశాకాలంబునశయనా
గారంబునందు ఖండింపఁబడితివేని, తత్క్షణంబున నవయౌవన సుందరాకారుఁడవై పునర్జీ
వితుండవు గాఁగలవు. అటుమీఁదటనీకువార్ధిక్యంబు సంప్రాప్తింపదు. పొమ్మనినిర్దేశించి
తిరోహితుండయ్యె. అంతసంతసించిపరమేశ్వరుని సంస్తుతించియదిమొదలు జరాసం
భవకాలంబుఁబ్రతీక్షించుచుండ, ప్రావృట్కాలవిద్యుల్లతా సంకాశంబై నచతుర్థవయో
వస్థయావేశించెనప్పుడు. 338

మ. గిరిజావల్లభుఁడానతిచ్చిన జరా - క్లేశాపనోదప్రకా
రరహస్యంబు మదిందలంచినుతపో - రక్తిన్ విసర్జించి స
త్వరనిచ్చోటికివచ్చినీవిభునినే - బ్రార్థించికై కొంటినీసుం
దరిపొనిన్ననురాజ్యమున్ యిదియథా - ర్థంబోవినీలాలకా! 334

క. అగజాపతివాక్యము పా । ల్లగునే? పుడమియును మిన్ను - నట్టిట్టైనన్
మగువరో! కోరికిసఫలం । బగుటకుశతటియొదవెనిచట - నన్నియుఁగూడన్. 335

చ. ముదుకఁడనాఁటచేమఱచి - మూన్నెరహస్యపు మచ్చరిత్రమున్
విదితముసేయనైతినిది - వెఱ్ఱితనంబగుఁబో, లతాంగిరో!
యదిమదిఁదోఁచెనిప్పుడు శి - తాసినినిన్నుఁ జూచినంతనే
ముదిమిఁదొలంగినేనుసుఖ - మున్ బడయంగల నింకనెంతయున్. 336

క. వలిఫలితాంగుఁడనగునా । వలనన్ సుఖమొందనీవు - భావించినచోఁ
గలుగదుమే, లగజాపతి । దెలిపినపనిఁజేసినన్వ్య - దేహముఁగొందున్. 337

చ. అరమరమానియీసునిశి - తాసినిఁగైకొని పూనినీవుతీ
వరముననుద్ధళింబుఁదెగు - వందెగ్రవేయుము నాకుఁగల్గు సుం
దరనవయౌవనాకృతిపి - నాకివరంబిదిభీతిలేదునా
సరసకురమ్మునమ్ముముని - జంబగునింతయుఁ గీరభాషిణీ! 338

క. ఈపనినొనరింపంగా । నోపననఁగరాదుసౌఖ్య - మొందెడుమార్గం
బోపద్మనయన! యిదియీ । పాపపువార్ధక్యబాధ - బాయున్నన్నున్. 339

క. నీపతిదానవ్రతమున్ । నీపాతివ్రత్యమహిమ - నేఁడుఫలించెన్
నాపలుకులువినుముత్తమ । రూపముఁగైకొందునిపుడె - రూఢంబబలా! 340

వ. నామాటలనాలకించిచెప్పినభంగిఁజేయకమదీయాజ్ఞోల్లంఘనంబుఁగావింతువేని, యనంతం బగుపాపంబు సంఘటిల్లునంతియకాక నిన్నునీభర్తనుంగడువరానియిడుమలనొందఁ బాల్పడంజేయుదుసుమీ! ఇన్ని సంకటంబులకులోనుగానేల ? నామేలుఁగోరుదానవైన, మచ్ఛాసనం బతిక్రమింపకచెప్పినకార్యంబు నెఱవేర్చి నవయౌవనశోభాకారుండనైన నన్నుంగూడి సమస్తభోగంబులననుభవింపుము. మనకిక మేలుకాలంబగుంగావున సంశయభయంబులుమానుము. తరుణీమణీ! ఇదెకైకొనుమనియాఖడ్గంబు నయ్యంబుజవదనచే నొసంగిన, నెసంగినతత్తఱంబునమారాడనోడి ఖడ్గహస్తయైనపరాశక్తియుం బోలెనిలిచియున్నయశోవతింజూచి వాచంయమియిట్లనియె. 341

మ. అనుమానించెదవేలనే? విధుముఖీ ! - యాలస్యముంజేయకో
య్యనఖండింపుముమత్స్వరూపమిపుడె - గ్లౌనోవిలోకింతువిం
తనెనేనేవచియింపనేమిటికి? సిద్ధ - స్తుత్యుఁడీశుండొసం
గినమేలైనవరంబుదప్పదుజరా - క్లేశంబువీడున్ ననున్. 342

క. త్రుటిలోననీవునన్నిపు । డిటుగనుచుండఁగనెనేవ - హింపుదుఁకడుము
చ్చటయగువినుతాకృతినిం । కిటురా! నిస్త్రింశమెత్తు - మేయుమటన్నన్. 343

క. నుడువులుతడఁబడఁబదములు । గడగడయనివడఁకుచుండఁ - గాభయపడియా
జడదారివేగిరంబున । నుడుగనిపూనికయుఁగాంచి - యువిదవెఱపునన్. 344

క. ఓపుణ్యమూర్తి! కటకట! । కాపట్యమొనిజమొయెందు - గలదీపాప
వ్యాపారమవనిఁదగునని । ప్రాపగుమిముసంహరింపఁ - బాడియె? నాకున్. 345

క. మైచలియించెదువిన్నఁనె । యోచెల్లి! యకార్యమనక - యోజింపకయి
ట్లేచెలువనీయనేర్పున్? । యాచించినయట్లొసంగె - హరుఁడీవరమున్. 346

ఉ. మున్నెవరైననిట్టివర - ముంగొనిరే? భువిలోననెన్నఁడుం
గన్నదిలేదులోకులనఁ - గామతివిన్నదిలేదుచాలఁజా
వన్నజనుల్దలంకుదుర - యారె! మిముంబలెఁజావఁగోరువా
రెన్నఁగనెందులేరిఁకము - నీశ్వర! చిత్రముగాఁగఁదోఁచెడిన్. 347

క. నామానసమెఱుఁగుటకొఱ । కీమాడ్కినిఁబలికినార - దేమోయారా
రా! మిమ్మునమ్మియుండెడి । భామినినగునన్నుఁగలత - పఱపందగునే? 348

ఉ. చెచ్చెఱనింపుమీఱనను - జెంతకుఁజేర్పఁగరాదొ? చేరఁగా
వచ్చినయంతలోనెయొక - వాదముఁగల్పనఁజేసినారు మీ
రిచ్చకమైనమాటయొక - టేనియుఁబల్కకయంటనీకనేఁ
డిచ్చనెఱుంగనోమతియ - డీలనొయివ్విధినుంటఁజెప్పఁడా! 349

ఆ. కత్తియొకటినిచ్చి - కుత్తుకఁగోయుమం । చనెదరిదియుధర్మ - మగునె? మీకు?
మిమ్ముఁదునిమియేమి - మేలొందఁగలదాన । నెటులనేఁదెగింతు - నిట్టిపనికి. 350

గీ. కోరినను రాజునడిగికై - కొంటిరింత । లోననాయందువెగటేలఁ - బూనవలసె?
మీకుమ్రొక్కెదఁగాని, యీ-వ్యాకులంపు। మాటలనుమానుఁడా! విన-మనసురాదు. 351

క. మీవిషయంబునలోపముఁ । గావించినదానఁగాను - కలిగిననదియే
దోవివరింపుఁడ! కోమలి । నీవిగమునవలఁచఁదగునె? - యెడఁదఁగలంగన్. 352

వ. అనినశిరఃకంపంబొనరించియాచంచలాక్షినీక్షించిపారికాంక్షియిట్లనియె. 353

క. లోపములెంచఁగఁబూనినఁ । జూపట్టకయున్నె? ముగుద! - సురులందైనన్
నీపలుకులుచిత్రంబులు । లోపవిహీనుండుగలఁడె? - లోకములోనన్. 354

క. 'వినిపింపుమునానేరం' । బనియంటివినేరమిట్టి - దనితెలిపినయే
మనియెదవో, నాశాసన । మునునడుపకయుంటనేర - మోమతికాదో. 355

క. ఇదినీయెడఁగలనేరమె । గద; యింతటికెక్కుడేమి - గావలయును? నీ
మదియొప్పదేనియూరక । వదరకపొమ్మింకపెక్కు - పచియింపకుమీ! 356

క. కోరినపని నెరవేర్పఁగ । నేరనటుచు వలుకరాదు - నీవని నేము
న్నేరూఢిగఁబలుకఁగలే । దే? రాజీవాస్య! చెపుమ; - యిట్లనఁదగునే? 357

ఉ. అతులితపుణ్యలక్షణ శు - భాంగి నొకర్తుఁబరిగ్రహింపఁగా
వ్రతమును బూని పల్లెలును - పట్టణముల్ బలుమాఱు రోసి నే
వెతలు సహించి సుంతయును - వేసట నొందక సంచరించి, యీ
సతి తగునంచు తుష్టుఁడ - సమ్మతి మైనినుఁ గొంటి వెఱ్ఱినై. 358

క. నీవలన నాయభీష్టం । బీవేళ ఫలించుననుచు - నెంచితి నిదియే
మోవెగటుగ నీవు మదిన్ । భావించి యొనర్పననుచుఁ - బల్కితివి కదా! 359

క. ఈపని జేయమిచే నగు । పాపంబట్లుండ యింక - పైఁ బొసఁగెడిమ
తోక్రపాసలోగ్రకీలా । తాపక్లేశంబు నీకుఁ - దప్పునె కుమతీ! 360

క. పొమ్మనుట యుభయమునఁ బా । దమ్ములు గడగడవడంకఁ - దత్తరమున నే
నెమ్మెయి నిమ్మని మదిఁ గో । పమ్మునదోలఁగింతు ననుచుఁ - భామినియంతన్. 361

క. కరమునఁగల కరవాలము । ధరనిడి తనగుండెలపుడు - దటతటఁబదరన్
బిరుసుదనంబు మునింగని । త్వరయు న్వెలిమోఱనోటఁ - దడియాఱంగన్. 362

క. కురులెమ్ముల నెగయఁబాపుచు । నరముడి నరదోఁచుచనుల - కటు పైపైఁటన్
సరినొత్తుకొనుచు నించుక । సరసకుఁజని మ్రొక్కి భక్తి - సంధిల్లంగన్. 363

ఆ. నిరపరాధినినగు - నెలఁతను నామీఁదఁ । గోపగింపఁదగునె - తాపసేంద్ర!
మిమ్ముబోంట్లకీడు - మేలు నెంచకయున్నఁ । జెడుదుమంతకంటెఁ - జేయగలమె? 364

క. ధనకనకవస్తుచయవా । హనరాజ్యయుతంబు గాఁబ్రి - యంబుననన్నుం
గొని యనుభవింపకివ్విధి । నను'రా! ఖండింపు'మనుట - న్యాయమె? చెపుఁడా! 365

క. ఈపని నిజేయుమని యా । జ్ఞాపింతురటంచుఁ దెలియఁ - జాలక ధృతినే
నేపద్ధతి నెది సెప్పిన । నాపద్ధతిఁజేయుదాన - నంటి మహాత్మా! 366

క. తెలిసినవారలు మీరీ । కొలనాయొడిఁగట్టఁదలఁపుఁ - గొనుటరయంగా
తొలిబామున నేఁజేసిన । కలుషముగా వలయునొండు - గాదు మునీంద్రా! 367

ఉ. ఒల్లనివారలొల్లకయె - యుండక నన్నును రాజ్యమున్ సిరుల్
వెల్లివిరిన్ ధరాపరుని - వేఁడికొనంగ తమేమి? కోరియి
ల్లెల్లఁబరిగ్రహించినపు - డిష్టము దీఱఁగ సర్వభోగము
ల్బెల్లుకొనంగ మీరనుభ - వింపకఁ జాఁదలపోయుటొప్పునే? 368

వ. అనియిటు దైన్యవాక్యముల - నవ్వరగాత్రి వచింపుచున్న మిం
చినకినుకన్ మునీశ్వరుఁ 'డిఁసీ' యని మెచ్చక రూక్షదృష్టులం

గనియదలించియిట్లనియె - గారవమెల్ల నెఱుంగనయ్యెనీ
చనవులు జెల్లవింకనను - సంకటపెట్టకుపొమ్ము పల్కకన్. 369

క. సత్యమువిడిచిననీసాం | గత్యముకొఱగాదుమాకు - గాదెఱుఁగవునీ
వత్యంతధర్మవేదివి | హత్యయొనర్పుదువె? పుణ్య - మారడిఁబోదే? 370

క. న్యాయాన్యాయములెన్నికఁ | జేయంగలదానవైనఁ - జెప్పుమునాతో
నీయాజ్ఞమీఱననలే | దా? యిపుడేమయ్యెమాటఁ - దప్పటకాదో? 371

క. కానిమ్ము నేఁడురేపటి | లోనీమదమడఁపకున్న - లోలాక్షిరో! నే
మానినిఁగానటుమీఁదట | హీనంబగుమారుపేరు - నిడుమీనాకున్. 372

చ. ముదుకఁడనాటచేఁగలిసి - ముచ్చటఁ దీర్చుకొనంగలేకయా
మదనవిరోధిమాటయును - మర్మముఁజెప్పి 'వధింపుమీననున్
ముదమునయౌవనాకృతినిఁ - బొందుదునిత్తటి' నన్నునాకు మే
లొదవుటకిచ్ఛయింపకదు - రుక్తులువల్కెదవౌర! చెల్లునే? 373

ఆ. వయసువాఁడనైన - వదలకనినుఁగూడి | యుందునని తలంచి - యూఱడిలక
యొనరనన్నునొల్ల - కుందుదానవుగాన | యదియకృత్యమొప్ప - నంటివిపుడు. 374

క. నాపలుకులొల్లకుండినఁ | బోపొమ్మిటనుండవలగు - భూపాలుండౌ
నీపతిచెంతకుఁజనిస | ల్లాపంబులనాడుమనిన - లలనచిడిముడిన్. 375

క. బెదరితననాల్కతుదితో | పెదవులఁదడుపుచునిదేమి - విపరీతమునేఁ
డొదవె? నిఁకనేమిసేయుదు | మదిఁదోఁచదటంచునెంచి - మానింగనితాన్. 376

ఉ. మీరలునాపయింగినిసి - మిక్కిలినిర్దయులై మనంబునన్
వైరముఁబూనియింకనెటు - వంటివెతల్గలిగించి చెంతకుం
జేరఁగనీకవిద్వరముఁ - జేసినఁజేతురుగాక బుద్ధియీ
క్రూరపుకార్యమున్సలుపఁ - గొల్పదునిక్కముగాఁగఁ జెప్పెదన్. 377

క. తిట్టిననిలువెడలంగా | నెట్టినఁగోపించియెంత - నిందించినన్
గొట్టిననోర్చెదనేనీ | కట్టిడిపనిఁజేయఁజాలఁ - గటకట! వెఱతున్. 378

వ. మీరు జరాయుతులరై యుండినను నామదికింబ్రియంబ సర్వవిధంబులవెగటొందక మీ
యిచ్ఛానుసారంబుగా మెలంగుచుండఁగలదాన యౌవనాకారంబుసంప్రాప్తించుననిచే
జేతమిమ్ముఖండించుటకెట్లొడంబడుదు? నిదితప్పుగానెంచకమన్నింపుఁడు. 379

క. అనిఖండితముగఁ బల్కినఁ | దనలో యోజించి మౌని - తలయూఁచి దలం
చిన కార్యము నెరవేరఁగ | ననువగుమార్గంబునెంచి - యపుడిట్లనియెన్. 380

గీ. ఏలఁబో, నిన్నుఁ బ్రార్థించు-టీవిధమున । నేనెఱుంగనె ? యిఁక నల-యించులాగు
నింతదనుకను మీకుఁ గీ-డెంచరాద । టంచునా మదిలో నిశ్చ-యించియుంటి. 381

క. మేలైనం గీడైనను । వాలాయంబెట్టి బెదద - వచ్చినవచ్చున్
పోలవుమీమాటలు వినఁ । జాలను నేఁ, నంటివదియ - చాలును సుమ్మీ ! 382

క. నీవుగనుచుండఁగానిదె । చేవపసర నెవ్విధమునఁ - జేసెదనో యా
పై వేడుక లెట్టివియో । తీవరపడకుండు మిపుడె - తెలియఁగవచ్చున్. 383

వ. అనిదగ్గునఁ దల్పంబుననుండి డిగి యిదెభయంకరంబైన పాపంబు నాపాదిల్లఁ జేసెదనటుమీఁద
నీవు పడుపాటులు దైవంబెఱుంగుఁ గాక, యనియుగ్రుండై యావిరిబోణియంతకుపూర్వ
మునేలఁబడవైచియున్న వాలుఁ గేలఁగొని ఝళిపించి కోపంబున నిట్లనియె. 384

క. నెతఁబడి కొన్నవరంబును । వితఁ జేసితి నేఁటనీకు - వేదనయును దు
ర్గతియుం బొరయించుటకుఁ । బ్రతినంగావించుకొంటిఁ - బాపెదనేఁపున్. 385

క. పతియాజ్ఞయు నామాటయు । మతి నెంచక నీవుధర్మ - మార్గము విడి దు
ర్మతమును బూనితివి పతి । వ్రతవే ? నీవెన్నకపట - భాషిణివిగదా ! 386

క. లలనా ! ననుఖండించుట । బలితంబగుదోషమనుచు - పలికితివిదె; నే
తలఁద్రుంచు కొనెదనిపుడీ । కొలనీకుం గాక యొరుల - కుం జెందెడినే ? 387

క. చూడుమని మునికృపాణముఁ । దోడనె ఝళిపించి మెడను - దునుముకొనంగా
యోడక యెత్తెండటుకునఁ । జేడియతనచేతులడ్డుఁ - జేసిభయమునన్. 388

ఆ. వలదువలదు వలదు - వాచంయమీశ్వర ! । త్వరపడంగఁదగునె ? - తాళుఁడయ్య !
సకలధర్మములును - జక్కఁగా నెఱిఁగియు । నాత్మహత్యదోష - మనితలఁపరె ? 389

క. అనిపలికి పట్టఁబోయిన । మునియాముద్దియను జూచి - పూనికచెడునో
ననబోణి ! చేరరాకుము । తనువెన్నటికైనఁబోవుఁ - దలఁకేమిటికిన్. 390

క. పలుకఁగవలదిఁక నీ నీ । తులువిందునె ? యాత్మహత్య - దోషంబనుటం
దెలియనివాఁడనె ? యన్యుల । నలయించుటకైన, పాప - మనియేలయగున్ ? 391

సీ. నన్నిపుడడ్డగింపకుము - నానుడిఁగైకొనకుండి మాన్పరాఁ
జన్నె ? భవత్ప్రియోక్తులకు - [illegible] ముందడివాఁడఁగాను నే
నెన్నిదకార్యమిట్టి తఱిఁ - నేలరొనర్పక మానుదున్ ? మఱే
మన్నను నిష్ఫలంబనుచు - నవ్వలికిం జనినిల్చెధీరతన్. 392

చ. మదవతి పెక్కులానలిడి - మాయలమారి మునీంద్రు మార్ఖ్యమున్
మదినిఁదలఁచి మాన్పినను - మానఁడిలెండు నిజప్రయత్నమున్

బ్రిదిలెడు ధైర్యమేమివెతఁ - బెట్టఁదలంచిన వాఁడొయంచుఁ బె
ల్లొదవుమనోవ్యథన్ వగచి - యోజనఁజేయఁదొడంగె నివ్విధిన్. 393

క. ముని సెప్పినపనిఁదప్పక । యొనరింపుమటంచుఁబలికె - నుర్వీశ్వరుఁడీ
తనిపనుపులుదలపోసిన । వినఁగూడనివయ్యెనేమి - వెరవిపుడెంతున్. 394

క. తగునీపనియని సేతునొ । తగదనిమానుదునొ యెవ్వి - ధంబుశుభంబో
తెగువకుఁబూనెను నేఁడితఁ । డగచాట్లకుఁబాలువడితి - నకటా ! తుదకున్. 395

మ. తగదీదుర్వ్యవసాయమన్నఁదనకుం - దానైనిజగ్రీవమి
వ్వగఖండించుకొనంగఁబూనెనిదియుం - బాపంబ, దానెట్లునుం
బగతోఁజావఁగసిద్ధుఁడయ్యెనిఁక నా - వాక్యంబులాలించునే ?
తెగి నేఁజంపినఁజంపకుండిననునొం - డించుంగదా ! దోషమున్. 396

వ. కావున నేతద్వ్యాపారంబుదగదని వెఱచి నేనొర్పకమానినను, నితండుకంఠంబునుఖండించుకొనుటనిక్కువంబు. మదీయవల్లభుండితనికి నన్నుసమర్పించుసమయంబున నెట్టికార్యంబుఁజెప్పినను నితనిమాటకుమారాజకయాజ్ఞానువర్తినివై ప్రవర్తింపుమని శాసించియున్నవాఁడు సత్యసంధుండైనపతిశాసనంబునతిక్రమించుటయుక్తంబుగాదు. కానమునీంద్రునియాజ్ఞ ప్రకారంబునడుచుకొనుటయుక్తంబుగాఁదోఁచుచున్నయది. సర్వంబును భగవత్సంకల్ప ప్రకారంబునఁబ్రవర్తిల్లుచుండు. నీవిషయమైచింతించుటవలనఁ బ్రయోజనంబుగలుగదు. ఇంకనుఁగొంతయితనికడంకమాన్పఁ బ్రయత్నించిచూచిపట్టువీడకున్నచో నేనఖండించి భూపాలునికట్టడి నుల్లంఘింపక మెలంగినదాననయ్యెద. నిమ్మునీంద్రుండు సెప్పినలాగున యౌవనరూపంబునొంది పునర్జీవితుండయ్యెనేనిసంతోషంబ. కాదేనికాఁగలరీతినిఁగాఁ గలదనివిచారించి, తొలుతనతనియూఁకువనుడుపనిశ్చయించినిస్త్రింశంబెత్తి వ్రేసికొన గమకించుచున్నయతనిఁగాంచివారించియిట్లనియె. 397

క. తగునయ్యా ! యిట్టిపనికిం । దెగువవహించుటయు, మీకుఁ - దెలుపఁగఁగలవా
రుగలరె ? లోకములోనన్ । మగువను నేననఁగనెంత - మాత్రముచెపుఁడా ! 398

క. వలదుడుగుఁడనిన, యతఁడీ । వలవనిమాటలనువిడుము - వారింపగనీ
వలనంగాదూరకయా । వలఁబొమ్ముభయంబులేదు - వనితరో ! మాకున్. 399

క. శాసనముమీరినఫుడే । నీసవ్వడిఁదెలిసికొంటి - నికున్ మాపై
వ్యాసంగమేల ? చావం । గాసన్నద్ధుండనైన - కాలములోనన్. 400

సీ. అనతివీటిఁబుచ్చియిపు - డొసనికాదనివల్కుచున్నని
స్నినిశితాసి నేసిపాలి - యింపుదుఁగాని, యమైనగిన్కనా
లోనఁదొలంగదింకఁ ద్రుటి - లోకొలనీయొడిఁగట్టియేపఁగాఁ
బూనితి, నాటు వేఁబ్రతికి - పోవఁగఁగల్గెనునీకుపాపినీ ! 401

చ. పుడమియురాజ్యముల్ భటస - మూహమునింకనుఁగల్గుసర్వమే
ర్పడఁగొఅలేకఁగైకొనిన - వాఁడనుభూపతినైనవాఁడనా
నుడువునులెక్కసేయవు గ - నుంగొనుమయ్యోడిలాగు, నెత్తబో
యెడిబరువిద్దుతోఁదొలుత - నింతనిచెప్పనదేటికింజుమీ! 402

గీ. అనుచుమునివల్కుటయు, నింతి - యైనమీర । లేమిగావింపుమనియెద - రిపుడునన్ను
తెలుపుఁడా! యంచునడిగె; నేఁ- దెలుపలేదె। యవ్విధంబునునీతోడ-ననియెనతఁడు. 403

వ. ఇట్లువచియించి ముని తనమనంబున,నిప్పడీకప్పురగంధినాప్రయత్నంబు ననుసరించినడు చుకొనునదియునుబోలె తోఁచుచున్నది. యటులనగునేని నాయుద్దేశంబునెఱవేఱంగల దనిసంతసించుచుండ నయ్యింతియొక్కింత విచారించియతనింజూచి. 404

క. అన్నియుఁదెలిసినమీరే । సన్నిదుష్కార్యమిపుడో - నర్పుమనెదరే
మున్నదిఁకననఁగయీకోల । కున్నెనెటుబాలుపడుదు? - ఘోరంబక! 405

క. మీమాటనువినకుండిన । నేమోమఱివిన్ననేమొ - యేకీడిపుడిం
దేమాడ్కిఁగలుగునోనా । లోమిక్కిలికొంకువెఱగ - లుగఁగాఁదొడఁగెన్. 406

క. ఎటుల ? ననుముఖుఁడైయా । జటియిట్లనుసబల! వలదు - సందేహమునీ
విటురమ్ముకొనుమువాలుం । దటుకునఖండింపుమపుడె - తరుణుఁడనగుదున్. 407

క. పిమ్మటజరతుఁడననియెడి । పిమ్మటవర్జించిచాలఁ - బ్రియమునఁబలుచం
దమ్ములనింపగునయ్యె । దమ్ములదొరకేళిలోన - నలరింతునినున్. 408

క. చేలా! వ్యర్థంబుగనే । నేలాచావంగనెంతు? - నిందుననాకున్
మేలొదవకయుండెడిపో, । నాలోచింపకుమదీని - కైయనివేడ్కన్. 409

మ. మునినిస్త్రీరంశమొసంగినంగొనియథా - పూర్వంబుగానాత్మయం
దునసెంతేనియుభీతినొందియుపుడీ - దుష్కార్యముల్ సాహసం
బుననేనేవిధిఁజేయనేర్తునకటా! - పూన్కిన్ నివారింపనెం
చినయత్నంబుఫలింపదయ్యోనసుర - క్షింపంగదేయీశ్వరా! 410

గీ. ఇంకతగదన్నమునివరుం - డింగలమున । నేయిఁజిలికినయట్లుగు - నిశ్చయంబు
చెల్లరే! యిపుడేనేమి - సేయుదాన । నిట్టిపాపంబునెట్లోడిఁ - గట్టుకొందు. 411

గీ. అనుచుఁజింతింపుచున్నల - తాంగిఁజూచి । యతఁడువేగిరపెట్టియి - ట్లనియెనహహా!
వనిత! యెంతసేపయ్యెనే - వాలునొసఁగి । సంహరింపుమువేవేగ - జాగువలదు. 412

ఆ. లేశమైననీకులేదుపాపము, సత్య । మిదియధర్మమనుచు - నెంచుకొనకు
నేనెఱింగనట్టిఁనీతిలేదెందుస । ర్వజ్ఞుఁడంద్రుడుదాని - వలనన్ను. 413

చ. తలకకుమింక భాపము - దా! యని మానసమందుసర్వముం
దెలియఁగవచ్చునీకువిను - తింపఁగఁజాలినరీతిమీఁదటన్
కొలమొనరించుటెట్లనుచు - గుండెదుబేల! భయంబుగల్గునే?
యలఘుతపఃప్రభావయుతు - లైనమునీంద్రులొనర్చునేతలన్. 414

క. కావునసత్కార్యంబని । భావంబునఁనెంచియొండు - భావింపకల
క్ష్మీవిభునిరూపమేర్పడ । వేవేగంద్రుంచియనుభ - వింపుముసుఖమున్. 415

క. అనిచెప్పినృపతిపత్ని౦ । ద్వరఁజేసినయతనియాజ్ఞఁ- గదప్పఁగలేమిన్
కరమునఁదాఁబట్టినయా । కరవాలముఁజూచిమునినిఁ - గనిమైపడఁకన్. 416

చ. పరమకృపాలవాలుబుధ - భావవిలోలుసుశీలుసద్గుణా
కరుసుకపాలునీలతనుఁ - గాంచనచేలునిశాటకాలునుం
దరసుకపోలుభూధరుని - తామరసాక్షుని భక్తజాలునిన్
శరధిసుతానుకూలునెద - సంస్మరియించి నమస్కరించితాన్. 417

ఉ. ఓకమలోద్భవారమణ! - యోసుజనావన! యోపరాత్పరా!
యోకలుషాట వీదహన! - యోమురమర్దన! యోజనార్దనా!
యోకరిపాల! యోవిమల! - యోసకలాత్మక! యోదయాకరా!
యోకమనీయవేష! కుధ - రోద్ధర! నామొరనాలకింపవే! 418

సీ. నీలాంబుదశ్యామ - నీరామనఃకామ - శ్రితజనపాల పో - షితకుచేల
నాగభూషణమిత్ర - నాగరాణ్ణుతిప్రా - విమలాంతరంగ దు - ర్విషయభంగ
విశ్వకల్పాధార - విశ్వేశసుకుమార - ప్రకటవైరివిరామ - భవ్యనామ
సామజాహితకాల - సామగానవిలోల - రాజితహార స - ర్వజ్ఞధీర

గీ. సన్నుతశుభాంగ యోగిహృ - జ్జలజభృంగ । తరణికోటి ప్రకాశ సం - తాపనాశ
యాదిమధ్యాంతరహిత వి - ఖ్యాతచరిత । కలుషముల నొందనీయక - గావువరద. 419

శా. నీవేదిక్కిఁకదుష్టసంహర జగ - న్నిర్మాణ పాండిత్య పూ
ర్ణా! వేదాంతపద స్వరూప! నిరతా - నందా! ముకుందా! యుపేం
ద్రా! వాణీపతి ముఖ్యవందిత! యనం - తా! శాంత! సత్యప్రియా!
దేవా! నామొరనాలకించి మదిసం - దేహంబు వారింపవే! 420

ఉ. ఈమునితల్లజుండు ధృతి - నిత్తఱిఁ 'జంపుమునన్న'టంచు నా
చేమొగినిచ్చె ఖడ్గమును - చెల్లరె! యింతటి ఘోరకృత్యమున్
భామిని సేయఁగాఁదరమె? - పాపమునిట్లొడిఁగట్టి పోవఁగా
నేమొకొపూనెనేఁడితఁడు - హేపరమేశ్వర! గావవేననున్. 421

మ. సభలోదాయలు కోకనూడ్చుతఱిన్ - శౌరీ! జగన్నాయకా!
నభసంకాశవి నీలవర్ణ! వరదా! - నారాయణా! శ్రీధరా!
శుభదా! కావుమటంచు కృష్ణమదిలో - స్తోత్రంబుఁగావింప, వే
గభయంబున్ దొలఁగించి ప్రోచినవిధిన్ - గాంతన్ననుఁగానవే! 422

క. ఖండింపననిఁ దానే । ఖండించుకొనంగఁ బూనెఁ - గడుకోపముతో
నొండనఁగలేక నే నీ । దుండగ మొనరింప ధృతినిఁ - దొడరఁగనలసెన్. 423

ఉ. ఆడినమాటచెల్లునని - యాజ్ఞయొసంగెను మారువల్కఁగా
నోడియకార్యమయ్యె నిపు - డొప్పితిఁ జంపకదీఱదింకఁ జే
యాడినవాడకున్న; మది - యందునినున్ స్మరియించి పూనినేఁ
గూడునుగూడదంచనకఁ - గొంకకమానిని సంహరించెదన్. 424

గీ. అనిజనార్దను నతిభక్తి - నాత్మనెంచి । భయమువర్జించి ధైర్యంబుఁ - బాదుకొలిపి
వెలఁదికరవాలమును ఝళిపించియెత్తి । యనఘ! కర్తవ్య మెఱిగింపుఁడనినమాని. 425

క. లలనా! మాటికిమాటికిఁ । బలుకంగావలెనె? యిన్ని - పలుకులుగలవే?
తలఁపున సందేహింపక । వెలయఁగఖండించి పిదప - వేడుకఁగనుమీ! 426

క. ఇదెకుత్తుకఁ జాచితిని । య్యెదవదతో బ్రొద్దువోయె - నాలస్యముఁజే
సెదవేలా? యొకవ్రేటునఁ । బదరకఁద్రుంపుము శుభంబుఁ - బడయుదుమనినన్. 427

చ. కలికికరంబునందుఁగల - ఖడ్గముతద్గృహ దీపకాంతిచేఁ
దళతళలాడ ముంగురులు - దాపలిచే నెడఁబాపు కొంచుఁదాఁ
దొలఁగిన పైఁటకొంగుఁ జను - దోయిపయిన్ సవరించుకొంచు ని
శ్చలమతినిల్చి వేలుపులఁ - జాలఁగభక్తిఁదలంచి యాత్మలోన్. 428

క. నావలనలేదు నేరము । గావింపఁగరానిపాప - కార్యంబును నేఁ
గావింపవలసెనో భూ । దేవీ! ద్యోవాణి! మీరు - దీనికిసాక్షుల్. 429

సీ. సృష్టిస్థితిక్షయ - సిద్ధసంకల్పులై - కీర్తింపఁబడుయోత్రి - మూర్తులార
ప్రజ్ఞావిశేషులై - భవపరిపూర్ణులై - ప్రథితినివెలయుది - క్పాలులార!
ప్రాప్తానుకూలసం - పద్విపత్ఫలదులై - ఘనతఁజెందిన నవ - గ్రహములార!
మానితోన్నతసత్య - మార్గసంచారులై - చాలభాసిలుసూర్య - చంద్రులార!
గీ. తపసియాజ్ఞను నేఁడలఁ - దాల్చియిపుడు । కొలయొనర్పఁగమదినియ్య - కొంటినన్నుఁ
గలుష మొందఁగనీయకఁ - గావరయ్య! । మిగులవేఁడెదమిముమిము - మిమ్ముమిమ్ము. 430

వ. అనిసంస్మరించిసాహసంబునఖండానురసంహారోద్యుక్తయైన సమయంబునఁదోఁచినచా
ముండియుంబోలెయప్పుడు. 431

క. ఆలీఢపాదయైకర । వాలమునంకించి యెత్తి - వనితామణి యా
భీలగతి నేసె మునితల । నేలపయిం దునిసి పడఁగ - నిమిషార్థమునన్. 432

శా. ఆనారీమణియవ్విధంబుననిజా - జ్ఞాధీనయై ద్రుంప, య
వ్వ్రా నేఁజచ్చితిఁజచ్చితిం జెడితి పెన్ - ఖండింపఁగాఁబూనెఁగ
మ్మా! నన్గావుము! యంచుఁజచ్చునపుడా - మారీచుఁడెట్లార్చెనో
తానాలక్ష్మణుఁజీరి, యట్లఁబిచియం - తం గ్రిందఁగూలెన్ వెసన్. 433

ఆ. మునివరుండు వచ్చి - భువిమీఁదఁబడుట యుఁ । గాంతవెఱఁగుఁజెంది - చింతమీఱ
నేమి సేయుదాన - నీఁకనంచు పెగ్గ్భమ । మడరినిలిచి కనుచు - మిడుకఁదొడఁగె. 434

వ. అని చెప్పిన, యవ్వలివృత్తాంతం బెట్టిదని యడుగుటయు. 435

ఉ. దారుణవహ్నిభక్షణ! ము-దప్రద! తాపసలోకరక్షణా!
భూరుహయుగ్మభంజన! సు - భూషణశోభిత! భక్తరంజనా!
సారసమిత్రకోటిసమ - సన్నుత తేజ! హరీ! కిరీటివం
ద్యా! రిపుజాలభీకర! జ - యంకర! భూరమణా! దయాకరా! 436

క. పంచాయుధధర! పావన! । పంచాయుధజనక! దాన - వద్వేపపటలీ
పంచానన! కమలాసన । పంచాననముఖ్యవినుత! - పావనచరితా! 437

భుజంగప్రయాతము

త్రిమూర్తిస్వరూపా! స - తీపుష్పచాపా!
రమాలోలభూపా! ప - రా! సుప్రతాపా!
సమీచీనభావా! ప్ర - శస్తప్రభావా!
రమాకాంతపాలా! ని - రూఢార్థమూలా! 438

గద్య.

ఇది. శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాద లబ్ధానర్గళచతుర్విధ కవిత్వమహాత్త్వాభి
రామ, భూసురకుల క్షీరపారావారపర్వశర్వరీసోమ, శ్రీవత్సగోత్ర
పవిత్రాపస్తంబసూత్ర, సావిత్రీలక్ష్మీనృసింహార్యపుత్త్ర,
సుకవిజనవిధేయ, పిచ్చయనామధేయ ప్రణీతంబగు
విజయాశ్వచరిత్రంబను ప్రబంధంబున నుత్తర
భాగంబునం ద్వితీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీమద్వేంకటేశ్వరార్పణమస్తు.

శ్రీరస్తు.

# విజయాశ్వచరిత్రము

## ఉత్తరభాగము

---

### తృతీయాశ్వాసము.

క. శ్రీవత్స! దేవకీవసు । దేవస్తుత! పావనాభి - ధేయ! చిదానం
దా' విశ్వంభర! ఫణిరా । డ్గిర్యగ్రస్థలనివాస! - రాజవిలాసా! 1

వ. దేవా! అవధరింపుము. సద్గుణగణవిశారదులగు శౌనకాదులకు, సన్నుతపుణ్యకథాశతాం
గసూతుండగుసూతుండిట్లనియె. నవ్విధంబునఖండితంబైన మునికళేబరంబునుగాంచి
యశోవతివిభ్రమాకులమానసయైక ర్తవ్యంబుదోఁపక ఖడ్గహస్తయైయట్టెనిలిచి యుండ
నయ్యవసరంబున. 2

ఉ. వాకిటనున్న యుగ్రుఁడుక - వాటముచెంతకుఁ బోయిచూచివా!
చీకుమునిన్ వృథాయిటులఁ - జెండుదురే? తగునే? దురాత్మరా
లా! కలుషంబుగట్టుఁడ - లంపవె? ధర్మమె? నీకటంచు బెన్
వ్యాకులమొందికేకలిడి - యారటమొప్పఁగఁ జిందులాడుచున్. 3

క. కలదే యీయన్యాయం । బిల; భూపతిధర్మపత్ని - యివ్విధమునఁదాఁ
గొలసేయఁదగునె? యెవ్వరు । గలరిచ్చటమాకుదిక్కు - గాఁగలవారల్. 4

మ. జరఠుఁడున్ సుగుణాన్వితుండునుమహా - శాంతాత్ముఁడున్ సద్వ్రతా
చరణాసక్తుఁడు నుత్తమోత్తముఁడునా - జ్ఞానాధికున్ బూజ్యుమ
ద్గురునింద్రుంచిన పాపరూపిణినిలో - కుల్మెత్తురే? సంపదల్
స్థిరమైయుండునె? దుస్వభావులకుసం - సిద్ధించునేభద్రముల్. 5

క. ఇటువంటిదానినెందును । గటకటనేఁజూచియెఱుఁగఁ - గడపటనిట్లి
చ్చటఁ జెడిపెచేతనిసిఁజ । చ్చుటకున్ విధియుండెనేమొ - చూడఁగనయయో ! 6

ఉ. మాయలమారియివ్వనిత - మానినిఁగూడుకఁగాపురంబుఁదాఁ
జేయుటకిచ్చలేకచెడు - చెయ్యికిఁబాల్పడిమచ్చరంబుతో
బాయఁగలేనిరక్తిఁగల - భంగినటించినిశీథివేళన
న్యాయముగావధించెసమ - యంబునుగన్గొనియిట్లు; చెల్లరే! 7

ఉ. దాతయువో లెసర్వమును - తాపసవర్యునకిచ్చి మించువి
ఖ్యాతినిఁగాంచిపిమ్మటఁగు - లాంగనతోఁ 'దతిఁజూచి రేయిని
వీతనిజంపు'మంచువచి - యించియొకండు నెఱుంగనట్లుగా
భూతలభర్తరాజ్యమును - బొందుటకై తతిఁ వేచి యుండెడున్. 8

ఆ. నృపతికెఱుకలేక - నెలఁతయీదుష్కార్య । మెటులసేయనేర్చు? - దిటవుగాఁగ
యతనికృత్రిమంబె - యగునింతయునునమ్మి । ప్రాణములనుగోలు - పడియెవాని. 9

ఉ. ఇప్పురిలోనయోగ్యుఁడొకఁ - డేనియులేఁడె? మహాత్ముఁడౌమునిం
గప్పురగంధిజంపినయ - కార్యము వేగ మెపోయి రాజుతోఁ
జెప్పఁగజాలఁడే? యిటుల - సేయుటపాడియె? రాజపత్నియే
తప్పొనరించినందగిన - దండనశాస్త్రములందుఁ గల్గదో? 10

ఉ. ఓపురవాసులార! వినుఁ - డుత్తములార! వినుండుమద్గురున్
బాపమటంచుఁ గొంకక నృ - పాలునిపత్ని వధించెఁ జూడుఁడా!
యోపిన జీవనౌషధము - లుండినవే బ్రతికింపుఁడయ్య! సం
తాపముఁబాపుఁడయ్య! సుకృతంబునుఁ గీర్తియు మీకుఁ గల్గెడిన్. 11

ఉ. ప్రాపగు వారలెవ్వరికిఁ - బాయకపుత్త్రిని భంగిఁ బెంచి యెం
తోపరితోష మొప్పనను - దూఱకఁగొట్టక యించుకేనియున్
గోపముఁ జూపకెల్లపుడు - నుందయనారయు తండ్రివంటి యీ
తాపసవర్యునిందునిమె - ధర్మమధర్మముఁ జర్చసేయుఁడా! 12

ఉ. కానలలోననుండి కల - కాలముఁ గష్టములొందలేక 'యే
మైనను నయ్యొనైహిక సు - ఖాప్తిమెలంగెద, నంచునచ్చియీ
మానవనాథు వేఁడిముని - మండనుఁడెల్లసిరుల్ గడించెనే
చానసహింపలేకిపుడు - చంపెను నిర్దయనేమి సేయుదున్? 13

ఉ. కోరినృపాలు రాజ్యమును - గొన్నపు 'డింతయె చాలునింతిపైఁ
గోరికియున్నచోఁదగిన - కోమలినెచ్చటనైనఁ దెచ్చిసం
సారముఁజేయవచ్చు'నని - సమ్మతినుండకరాజపత్నిపై
నేరకవాంఛ నించెనది - నేరముగానిపు డేర్పడెఁగనన్. 14

ఉ. చిత్తలెఱుంగఁ డీచెడిపె - సెప్పిన మాటలు నిక్కమంచుఁ దాఁ
జిత్తములోన నెంచెను గు - శీలల మాటలుదు స్వభావమున్
బత్తియు నమ్మఁజెల్లునె? వి-పత్తినిఁజెందఁగఁ బోవువేళ యే
యుత్తముఁడేనియుం దెడును - యోజనసేయఁగ నేరఁడెన్నఁగన్. 15

ఆ. ఇంతి తెగునకత్తె - యింతటి దిటుబుట్టె । రాచకులమునందు - రామరామ !
పారికాంక్షి వరుని - ప్రాణాపహరణార్థ । మవతరించె నొక్క - యవనిలోన. 16

ఆ. వినదయ్యొ మాని - యాయువింతియయింక । యురకదీనివిడిచి - యరుగరాదు
కట్టుకున్నఁదేలు - కుమ్మరపురుగంద్రు । తెలియఁజేతు నేమ - దీయశక్తి. 17

క. నమ్మించిగొంతుఁగోసిన । దిమ్మారియలమారి దీని - నెల్లజనంబుల్
నమ్మఁగరాదని తిట్టఁగ । నమ్మించెదనొక్కరూక - కంగడివీధిన్. 18

ఆ. మౌని వరుఁడు జన్న - మాకుబాగ్యతలేదె ? యతనిశిష్యుఁడను మ-హాప్రియుండ
నదియుఁగాక మంత్రి - సగుదునుగావున । రామనలఁతుఁగొందు - రాజ్యమెల్ల. 19

చ. అనికడునుగ్ర వాక్యముల - నాడుచునల్లరిసేయ, యుగ్రుఁడే
లనొనడు రేయినిట్లు జను - లంబెనుకూతలువెట్టి చీరితా
గనలుసఁబల్కుచుండెడిని - కారణమెద్దియొ యంచుమౌనిశా
సనమునఁగాఁపుగాఁగ మెఁగ - సాలఁజరించునృపాలుఁ డెంచితాన్. 20

ఆ. అంతకంత కధిక - మైన యుగ్రునికేక । లాలకించి తపసి - కట్టివేళ
నేయుపాయ మొదవె - నోయంతిపురమున । నెఱుఁగవలయునుచు - నేగుదెంచె. 21

ఆ. అటులవచ్చికేళి - కాగార సామీప్య । మందునిలిచియున్న - యట్టియుగ్రు
నుగ్రమూర్తిఁజూచి-యొయ్యనఁ దాఁమ్రొక్కి । భయముభక్తిమీఱఁ-బలుకరించి. 22

క. ఓవిప్రోత్తమ! యిట్లిపు । డీవెగటగు కేకలిడుట - కేమినిమిత్తం
బోవివరింపుడ, విని నేఁ । గావింపఁగఁదగినరీతిఁ - గావింతుఁదగన్. 23

ఆ. ఈనిశీధివేళ - నిచటనొంటిగనిల్చి । యుండుటయునుఁజాల - యుగ్రమైన
మాటలాడుటయును-నేటికి? వచియింపుఁ । డయ్యా! మదినిసంశ-యంబువొడమె. 24

క. జనసన్నుతుఁడైనతపో । ధనునకునేదేనియిచటఁ - దక్కువపడెనే ?
వనితామణిచెప్పినలా । గునమెలఁగుటలేదో? మీకు - కోపంబేలా ? 25

క. ఆరమణినేరమోనా । నేరంబో హేతువెద్ది? - నిజమెఱుఁగుటకుం
గోరిచనుదెంచినాఁడను । భూరిగుణాధార! విషయ - ముందెలుపుఁడొగిన్. 26

వ. అని ప్రార్థించిన విజయాశ్వునింజూచి. 27

మ. అపుడుగ్రుండుపుటత్రయీహరిణకా - లాత్యుగ్రకోపోజ్జ్వల
త్త్రిపతాకాననుఁడైనదర్పకవిరో - ధింబోలె రూక్షంబుగా
నృపతింగన్గొనివల్కె నోరి! కుమతీ! - నిర్దోషియుంబోలెన
న్నిపుడీకారణమేమటంచడుగనా - నే? తోఁచదోనీమదిన్. 28

చ. అడిగినవాని నెల్లనుగు - ణాఢ్యుని భంగి నొసంగి చాలఁగా
నడఁకువమాటలాడి హృద - యంబున మచ్చర మొప్ప మద్గురున్
మృడసమునిం దపోధనుని - మేలునుఁ గీడును నెంచకీనిసిన్
ముడుఁగక నీవు నీ తరుణి - మూలముగాఁ గడ తేర్చి కానవే? 29

ఆ. అన్ని కార్యములును - సన్నద్ధమై సరించి । మిన్నకెలుఁగనట్లు - నన్ని దేమి
హేతువంచు నడుగు - టెంతయుఁ జిత్రంబు । మెచ్చవచ్చు నిన్ను - మేటిపహహ. 30

ఉ. ఉత్తముఁడైన మానివరు - నోడక పాపము నెంచకయ్యయో!
రిత్తకు రిత్త చంపుమన - కేచెనె? బుద్ధివివేకదూర! యీ
మెత్తని మాటలుం బ్రియము - మిక్కిలి భక్తియుఁ జాలుఁ జాలు నీ
చిత్తమెఱుంగనయ్యెనుయి - నీ! నినుఁ జూచిన రోత పుట్టెడిన్. 31

క. ఇంతటికిఁ దెగించినసీ । నెంతటికిఁ దెగింపకుందు - విఁకనోరి! ధరా
కాంతుఁడపకారియైనన్ । వంతకు పాల్గాక జనులు - పర్థిల్లుదురే ? 32

క. తెలియని వారలు నిన్నున్ । బలుకుదురు ఘనుఁడవనుచుఁ - బ్రజ్ఞారహితుల్
తలపంగా వాగలు; కడుఁ । గలుషాత్ముఁడవీవు బాగు - గాఁ గనుఁగొంటిన్. 33

గీ. విప్రుఁ జంపుట యగ్రజు - వెలఁదితోడ । గలయుటయు సాధువుల గేలిసలుపుటయును
గడఁగి యొరుల గేహంబులు - గాల్చుటయును । హోగ్రకిల్బిషసంసిద్ధి - నొందఁజేయు.

క. దయమాని సంశయింపక । భయమొందక సత్పురుషుల - భంజించినని
శ్చయముగ సిరిచెడు వంశ । క్షయమగు; దుర్ణయున కేలఁ - గల్గు? శుభంబుల్. 35

ఆ. తపసియడిగినపుడు - ధనరాజ్యములసతి । నొసఁగయిచ్చలేక - యన్నఁ దెలియఁ
జెప్పియనుపరాదె? - తప్పేమి? లేదన్న । నిచ్చి, చంపికొనన - దేల? చెపుమ? 36

క. మాకరయఁగ హితశత్రుఁడ । వై కపటముగా నటించి - యన్యాయముగాఁ
జీకుమునిం జంపించితి । వీకార్యము తగునె? నృపతి - వే? నీవెన్నన్. 37

క. నాశక్తి నింకఁ జూడుము । నీశర్మం బడఁగునటుల - నిర్ఘాతసమం
బౌ శాపమొసఁగి యిపుడే । నాశనమొనరింతు విడతు - నా? నేనురకన్. 38

క. అనినటుఁ డాగ్రహమునఁ బ । ల్కిన, యాశ్చర్యంబు భీతి - కించయుఁ గదురన్
జనపతి కడుశాంతోక్తుల । వినమితుఁడై యిట్టులనియె - వివరమెఱుఁగకన్. 39

మ. జగతీనిర్జరవంశభూషణ! భవ - చ్ఛాపోగ్రదావాగ్నికో
ర్వగిరీశుండును నోపఁడో పుదునె ? నే - భవ్యాత్ముఁడౌ మానినె
వ్వగఁ దామానిని చే వధింపఁబడెనో - వాదంబుఁ గల్పించి యా
మృగరాణ్మధ్యయ దేలఁ జంపెనో శోత - ద్వృత్తాంతముం బల్కుఁడా! 40

క. ఇంగితముఁ దెలియనినావిం | దంగనలిన నేమిఫలము ? - తగనవ్విధమే
బ్భంగి యొవినఁ గోరితిఁ దీ | ర్పంగ దెసంశయము వేగఁ - బ్రవిమలహృదయా ! 41

క. సూచింపక నాపైనిటు | నీచంబగు నింద మోపి - నిందించెద రే
హో చిత్రమనిన, సైఁపక | వాచంయమిశిష్యుఁ డపుడు - వారనికినుకన్. 42

మ. విజయాశ్వావనిభర్తకిట్లనియె నీ - విశ్వాసమున్ ధర్మమున్
నిజమున్ దేవుఁ డెఱుంగుఁ బొమ్ము ; చనిమా - నింజంపిరమ్మంచునీ
రజపుత్రాక్షి నిమున్ను బంచినను జే - రన్ వచ్చినాతోడన
క్కజపుంబల్కులు పల్కెదేల ? యిదినీ - కార్యంబుగాదే ? నృపా ! 43

మ. చనవున్ భక్తియు నింకఁ జాలుమదిలో - సంకల్పసంసిద్ధియ
య్యెను రాజ్యంబు లభించెఁ జచ్చెఁ గద మా - నీంద్రుండు నాపత్నిఁ జే
కొని జీవింపఁగ నేర్చునే ? యిపుడు చి - క్కుల్ దీఱెఁబో, యంచునీ
వనుమానింపక కేలి సేయుటిది, యా - హా ! తోఁచె నాబుద్ధికిన్. 44

చ. తలఁచిన నాదుకార్యము వృ - థాయగునో యగునో యటంచు న
గ్గలమగు సందియంబున వి - కారము నొందుచుఁ గూర్కుమాని వీ
థులఁ జరియించుచుండి వగ - తోఁ యిట నే మొరపెట్టినంత నే,
తెలియని వాని భంగిఁ జను - దెంచితివీస్థితిఁ గాంచి పోవఁగన్. 45

క. లేకున్న ? నిన్నుఁ జేరితి | నే ? కడువడి నింతరాత్రి - నిచ్చోటికినీ
వేకారణమున వచ్చితి | వాకస్మికముగ ; వచింపు - మాకూతంబున్. 46

ఉ. మించెను కార్య, మాతపసి - మిమ్మెటకేనియుఁ బోఁపఁబంచియా
ర్జించిన రాజ్యసంపదలఁ - జెల్లుబడిందన యిచ్చలాగుగా
వించుకొనంగరాదె ? యవి - వేచనకున్ ఫలమిట్టిదయ్యెఁ దా
వంచితుఁ డయ్యెఁ బోతుదకు - వాంఛ నొందక వీడె జీవముల్. 47

క. నీయాజ్ఞగాక యుండినఁ | దోయజముఖి యింత పనికిఁ - దొడరునె ? తానై
చేయంగఁ దలఁచినంతయుఁ | జేయించితి వింక నేమి - జేసెదు ? చెపుమా ! 48

క. తిట్టినొ కొట్టినొ నిర్దయఁ | బెట్టంగారానిబాధఁ - బెట్టినొ ? నిన్నుం
జట్టనద్విజుఁ డనియెంచకఁ | గట్టడివై యిట్టిపనికిఁ - గడఁగందుగునే ? 49

గీ. ఇచ్చితివి రాజ్యమడిగిన - నిచ్చగలుగ | నిచ్చినది కొన్నఁ గైకొందు - వెగ్గులేదు
గానినిష్కారణంబుగా - మానివరుని | నింతితోఁ జెప్పి చంపించు - టేల ? యనిన. 50

ఆ. నృపతి యిట్టులనియె - నేనుమీఱనెడి వృ | త్తాంతమందు లేశ - మైన నెఱుఁగ
వంచనయు నెఱుంగ - వాచంయమినిఁ జంపఁ | దలఁచు టెఱుఁగ మీపదంబులాన. 51

మ. హరికిం బ్రీతిగ రాజ్యముల్ సిరులు నే - నర్పించితిన్ మానికిం
దరుణిన్ గోరినపంతసంబమరఁగా - దత్తంబుఁగావించితిన్
గురువుం దైవముఁదానె యంచు భయభ - క్తుల్గల్గి సేవించితిన్
పరమార్థంబుగ నిన్ని సేసితుదఁ జం - పంబుద్ధి నేనెంతు నే ? 52

చ. స్మరహరతుల్యుఁడైన ముని - చంద్రున కర్పణ జేసియున్న యా
సిరినిఁగొనంగ నేమరలఁ - జిత్తమునందలపోసి చంపిత
ద్దురితము నొందఁగాఁగడఁగు - దుర్మతిఁగాను, గుణాఢ్య ! యింత దు
ష్కరమగునట్టి కార్యమును - చానయొనర్చుటకేమి హేతువో. 53

చ. సగసిజనాభు పాదములు - సాక్షిగఁ జెప్పెదనయ్య ! మానిశే
ఖరుఁడు వధింపఁగాఁబడిన - కారణమెట్టిదియో యెఱుంగనే
హరిహరి ! కృష్ణకృష్ణ ! దురి - తాత్ముఁడనంచుఁ దలంచినన్ముని
ష్కరుణను దూఱరాదువినఁ - జాలను కర్ణములందదుక్తులన్. 54

ఉ. ఆవసుధామరేశ్వరుని - యానతిఁబూని హజారమందు నేఁ
గావలియుండి మీరిచట - గట్టిగఁగూతలు వెట్టుచున్న యా
రావము నాలకించి యిటు - రాత్రినిఁదాముని శిష్యుఁడట్టివా
పోవఁగనేల ? యంచెఱిఁగి - పోవుటకై యరుదెంచితిన్ వడిన్. 55

క. ఇంతకు మిక్కిలి నేనొ । క్కింతయు నెద్దియు నెఱుంగ - నిదిసత్యం బీ
వింతయగు ఘోరకృత్యముఁ । గాంతయొనర్చుటకుఁదగిన - కతముం జెపుడా ! 56

క. కనలు డిగియావిశేషము । వినఁదగినదియైన వేగ - వినిపింపుఁడు న
న్ననవల దేమియు నేత । ప్పును నాయెడ లేదటన్న - బూమెవడుగుతాన్. 57

గీ. కొంతశాంతి వహించి భూ-కాంతుఁజూచి । పరుషభాషలుమాని య - చ్చెరువుగాఁగఁ
జెప్పఁదొడఁగెను మానిజ-చ్చిన విధంబు । నెంతయును దైన్యమున దుఃఖ-మినుమడింప.

క. వినవోయి నీకులాంగన । మునినొల్లకయతఁడు చాల - మోహవశుండై
తనకోర్కెఁ దీర్పుమనఁగాఁ । గనలునఁగడురోతఁజెంది - గర్వముమీఱన్. 58

సీ. బాగాలనిమ్మన్నఁ - బండ్లుగీటుచునంత - యధికారమానీ క - టంచుఁగసరి
మడుపులందిమ్మన్న - బడుగునకిదికొంత - విభవమా ? యనితిట్టి - విసరివైచి
ముద్దుఁబెట్టుమటన్న - మూతిఁద్రిప్పిబికారి - కదియొకటా ? కొఱ-యనుచునవ్వి
కౌఁగిలింతునటన్నఁ - గావరంబడఁతు నీ - వవలఁబొమ్మంటకు - మనియదల్చి

గీ. కేళిఁగలయంగరమ్మన్న - గేలిఁజేసి । వినయమున వేఁడుకొన్నఁదా-వెగటుఁజెంది ?
సరసముగ మాటలాడిన - విరసమొంది । యంటఁబోయినఁజీ ! యని - యవలికేగి. 60

గీ. కనికరములేక వెతఁబెట్టె-మువిదయుంచు | నన్నుటుకుఁ జేరివనిత దు-ర్ణయముఁదెలిపి
వెలఁదిననుకూలవతినిఁ గా - వించుకొనఁగఁ | దగిన సదుపాయమెట్లన్న-వగచి నేను. 61

ఉ. గురువరుఁడట్లుకష్టమున - కుంగురిదైనసుఖమింతలేకవం
దురటఁదలంచియేమియును - దోఁచక యోజనఁజేసిచేసిపి
రిదుపురునుంబ్రియంబునయ - ధేచ్ఛనుగూడిమెలంగుటెంకనె
ప్పరుసుననోయటంచుఁదెలు - పందగుమాటఁదలంచియంతటన్. 62

వ ఎడఁగలుగఁబిలిచి యాకాంతకువినఁబడక మెల్లననిట్లనిచెప్పితి. 63

గీ. అయ్యా! నేనెంతవాఁడ? మీ - యంతవారి | కాత్మఁదోఁచనియుక్తి నే - నరసిపలుకఁ
గలనె? యైననునడిగిన - కారణమున | విన్నవించెదనొకమాట - వినుఁడుమీరు. 64

క. త్వరపడకమంచిమాటల | విరసంబగుబుద్ధిఁదొలఁచి - విరిబోఁణినిఁజా
తురిమీరనేలుకొనవలెఁ | బురుషుండని ఘనులుమిమ్ముఁ - బోఁట్లనవిందున్. 65

ఉ. వలనగుపల్కులంగ్రియల - వాంఛితవస్తు సమర్పణంబునం
గలిమినిమించుమైత్రినొడి - కంబుననీవినిబాంధవంబునం
జెలువవసంబగుంబురుషుఁ - జేకొనివేడుకఁ గూడుఁజాలఁగా
వలపుననంచునేర్పుఁగల - వారలువల్కుదు రోమునీశ్వరా ! 66

ఆ. మీకుఁజెప్పనేల ? - మీరెఱుంగనివిష | యంబులేదుగాని - యతివచిత్త
మనుసరించిమెలఁగి - యనుకూలవతినిఁగాఁ జేసికొనుఁడటంచుఁ - జెప్పినేను. 67

క. అటనుండితొలఁగియప్పుడు | జటియునునీసతియుఁజేయు - సంభాషణమె
ప్పటిచోటనుండిచెవియిడి | దిటవుగవినుచుంటినంత - తెఱఁగువమీఱన్. 68

క. మునిపతిసరసోక్తులచే | వనితనులాలించుచుండ - వైరస్యమునం
గనలొందికసరితిట్టుచు | ననాదరముగాహసించి - యపుడిట్లనియెన్. 69

క. ఓరి బికారీ! ననుమదిఁ | గోరినమాత్రమునఁగోర్కి - కొనసాగునె? నీ
కేరీతిలభించున్నృపు | దారాసంగమసుఖంబు - దగుననికొన్నన్. 70

క. ఊరకిటన్ బ్రేలకుచని | కారడవులలోనఁగాయ - కసరులుదినిమేల్
నీరానికైదికవ్వా | పారంబుననుండుమదిశు - భంబగునీకున్. 71

క. చేవచెడయోగధారణఁ | గావింపుముజీవయాత్రఁ - గడపక యోరా!
జీవచ్ఛవముంబోలిన | నీవుననుంగోరుటొప్పు - నే? యవివేకి! 72

సీ. అధ్వరహోమార్హ - మైనపురోడాశ - ములభించునేశ్వాన - మునకుఁదినఁగ
మానసకాసార - మంజులవీచికాం - దోళనసుఖమునొం - దుసెబకంబు

సన్నుతనిర్జర - తన్మాధుహ్రపవనా - రభ్యంబుఖలునకే - రహింఘటిల్లుఁ
బ్రవిమలోజ్జ్వలతర - ఫణిశిరోరత్నంబు - దొరకునేభువిదరి - ద్రునకుఁదలఁప

ఆ. నిరుపమానభోగ - నిరతయుజవ్వని । రాయనన్నృపతిపత్ని - నభిలషించి
సంతనిన్ను బోలు - నఘమునకివ్విధిఁ । గలయుపుణ్యాఘఫలము - గలుగుఁజెపుమ. 73

క. కట్టా! నీకీకోరిక । పుట్టంగాఁదగునె? తపముఁ - బోవిడుచుటయా
గిట్టనిపనికిందొడరుట । చెట్టనుమూలంబునీకుఁ - జెప్పితినుమ్మా !  74

క. తగఁబరిహాసమునకునను । జగతీపతిమోసఁగెనీకు - సత్యమగునె? యే
మగవాఁడుభార్యనింకొక । మగవానినసంబుఁజేయు? - మహినిజమైనన్. 75

క. పతిపరిహసించెనమ్మని । కుతుకంబునఁబని చెనన్ను - గొబ్బననీతో
రతికేళింబెనఁగఁగవ । చ్చితినని తలపోసిబుద్ధి - చెడిపలుకకుమా ! 76

క. ఏపాటివాఁడవనినే । నీపొందునకిచ్చయింతు ? - నీచాత్మా ! ఛీ!
పో ! పొమ్మనినిరసించినఁ । దాపసపతివింతఁజెంది - తానిట్లనియెన్. 77

క. ఎట్టెట్టూ ? యింకొకపరి । గట్టిగవచియింపుమేమి - గాయొసఁగెనో ? తా
నిట్టిదియా ? కథ ; మంచిది । యెట్టునుమీ ! నిజముఁబలుక - కుండినన్నీకున్. 78

క. ఈనడవడినింతకును । నేనెఱుఁగనునమ్మియుంటి - నిక్కమెయని, యా
క్ష్మోనినను గేలిఁజేయఁగఁ । దానెవ్వఁడు? నేనెవండు ? తటమటతగునే ? 79

క. వాచంయమిననితలఁపక । నీచునిఁగానెంచియిట్లు - నిందించితివో
రా ! చేదుకాయనైతినె ? । యాచెనురాజునకునీకు - నంబుజవదనా ! 80

క. రాజింతటిపనిఁజేయఁగ । యోజించునె? నమ్మజాల - యొడబడితానే
లాజాయనొసఁగునొల్లని । నో, జిత్తులుగానె ? నీవు - సెప్పెడిమాటల్. 81

ఆ. నిసమననురాని - దేకారణముగాని । యొండుగాదునుమ్మ - యువిద ! నిన్ను
వేఁడుకొనెదనింక - విపరీతచర్యలు । విడిచికొఁగలిమ్మ - తడయవలదు. 82

క. తిట్టినఁగొట్టిననీవిపు । డెట్టాడిననోర్చియుందు - నిట్టట్టనఁజే
పట్టితమీఁదిర్పకివ్విధి । నట్టేటంబుట్టిముంచ - నాయమె ? చెపుమా ! 83

ఆ. ఎపుడునిన్నుఁగొందు.- నెపుడబ్బునీపొంద । టంచుఁదలఁచుచుండి - నట్టినన్ను
నవనిశాల్మలీఫ - లాసక్తిఁగాచిన । చిలుకవంటివానిఁ - జేయదగునె ? 84

క. అపుడిచ్చయించిపలికితి । విపుడిట్లనుటేమిమాట ? - యిదిధర్మముగా
దపుడేయసమ్మతంబును । కపటంబునువీడిచెప్పఁ - గారాదె ? ధృతిన్. 85

ఆ. కానిపోనిపట్టి - కలహంపుఁబల్కులే । కాని, యింకనేమి - గలదుఫలము ;
కోరికొంటినిన్ను - గుణవతివనియెంచి । యకట ! యలఁచెదేల ? - యబల ! యనిన. 86

క. కడుఁగనలిగిమిట్టిమీఁదై । పడిపటపటఁబండ్లుగీటి - పడఁతుక, యోరీ !
జడదారీ! చెడుబుద్ధిన్ । విడువవుగద ; నుంతయును వి - వేకములేదే ? 87

సీ. నెఱసిజారినయట్టి - నిడుదలౌజటలును - రోతఁగాఁదోఁచువి - భూతిపూఁత
శిథిలంపుచిఱునార - చీరకౌపీనంబు - నేహ్యంపుమోముమే - నెల్లవళులు
లొట్టచెక్కిళ్లను - లోవంపుపెనుగోళ్లు - రోహిమంబునువోలె - రోమరాజి
పాలలేకశుష్కించి - పోయినదేహంబు - తలవడంకునుమించు - దగ్గునలఁత

గీ. పెనుశివాక్షసరంబులుఁ - ఓచుదాడి । కలిగిదుష్టపిశాచంబు - కరణినుండు
నిన్నుఁగూడిపెనంగువ - నితయుఁగలదె ? । ఛీ ! పలుకకుమివ్విధినింకఁ-సిగ్గుచేటు. 88

క. సరివాఁడవొసరనుఁడవో । పరువోప్రాయంబొలేక - బాంధవ్యంబో
పరికింపఁగనీపైనే । మరులొందఁగఁగారణంబు - మసలకఁజెపుమా ! 89

క. తెలివిచెడినిష్ఫలంబగు । తలఁపుఁదలంచితివి, యోరి ! - తరమా ? నాతోఁ
గలయఁగ, నాకున్నీకును । గలయంతరమెన్నవలదె ? - కైకొనువేళన్. 90

క. పోపొమ్మిటనుండకుమని । కోపమునదిరస్కరించె - కోమలి, మునిసం
తాపంబునదీనుండై । యోపికచెడిడిల్లవోయి - యువిదంగనితాన్. 91

క. ఇదిరాజునియోగమెయౌ । మదవతి కాకున్నయిటుల - మాటాడునె ? యం
చెదనెంచియువిదపైఁదన । మదివలపుంబాయలేక - మఱియిట్లనియెన్ 92

చ. కుమతియుదుశ్చరిత్రుఁడును - గ్రూరుఁడునైనభవద్విభుండు స
త్యముగనొసంగెభక్తినిను - నంచుఁదలంచితి, మోసపుంబ్రయ
త్నమునునెఱుంగనైతిఁగల - దా ? యిటువంటిదురాకృతంబిలన్
క్రమమునునక్రమంబును జ - గంబయెఱుంగునుగాకఁదప్పకన్. 93

ఆ. ఉండనిమ్మురాజు - కండక్రొవ్వడఁగింతు । నింతలోనఁజెడిన - దేమికలదు ?
కాని, యైనదయ్యెఁ - గరుణఁజూడుమటంచు । మౌనికాఁగలింపఁ-బూనుటయును. 94

క. మించినకినుకంగని యిది । మంచిదిగాదోరి ! నీకు - మదముననాతోఁ
పంచాస్త్రకేళిఁగలయఁగ । నెంచుటకర్హుఁడవె ? నీవు - హీనుఁడవుగడున్. 95

క. నాపతినినిందఁజేయుచుఁ । బాపాత్ముఁడ ! యింతపనికిఁ - బాల్పడితివిగా ?
తాపసుఁడవౌదువే ? నీ । కీపంతంబేల ? చెడక - యిఁకమనఁగలవే ? 96

క. పోతరమడఁగించెదనా । చేతంజిక్కితివిలొలఁగఁ - జేసెదమరులున్
భీతిలకఁబట్టవచ్చెద । వీతఱినీపాటుఁజూడు - మేమగునొక్కో. 97

క. అనితానువెంటఁదెచ్చిన । నునిశితఖడ్గంబుఁగొని బ్ర - సూనాంగివచిం
చిననినునేఖండించెద । ననుటయుమునివరుని మోహ - మాగ్రహమయ్యెన్. 98

క. ఆరీతిఁగినిసిరౌద్రా | కారంబుననతివఁజూచి - కటములదరఁదాఁ
నీరీతిననియె, నోసీ! | కూరిమిఁగైకొనవు మేము - కొఱయే? నీకున్. 99

చ. వలచియనూనమోహమున - వాంఛనుఁదీర్పుమటన్న యివ్విధిన్
వలవనిమాటలాడెదవు - వాయికొలందినివారివీరితోఁ
బలికినలాగునందగునె? - భామినికింతటిగర్వమొప్పునే?
తెలిపెదనాప్రభావమల - తిన్ విడరాదిఁకనిన్ను నావుఁడున్. 100

ఉ. అమదిరాక్షిభీతిలక - యంత మహత్త్వముఁగల్గియున్ననీ
వేమియొనర్పనేర్తువోము - నీంద్రుఁడవేనియొనర్పుమంచును
ద్దామగతిందటాలునవి - తాపితమానిగళంబుఁద్రుంచెనిం
కేమనిపల్కుదున్? నృవర! - యెవ్వరుదిక్కిటమాకుఁగావఁగన్. 101

ఆ. వారివాదమెఱిఁగి - వారించుటకునేను | బోవునంతలోనఁ - బోలఁతియతని
జంపినన్నులోనఁజననీకవచ్చినఁ | జావుసిద్ధమనుచు - సాటిచెప్పె. 102

వ. తటాలునకవాటంబుబంధించె. కావునలోపలంజొచ్చుటకువలనుగాక ధైర్యంబు సాలక దుఃఖాక్రాంతుఁడనై యిటనుండి మొఱఁబెట్టదొడంగితి. కార్యంబుమించిపోయినపిమ్మట నేనరిగియుంజేయునది యెద్దియును లేదుగదా! 103

క. ఇంతదయలేకయివ్విధి | నెంతటిదుష్టులునుజేయ - రెంచరుధరణీ
కాంత! మముబోంట్లఁజంపుట | సంతసమోపుణ్యమోయ - శంబోమీకున్. 104

క. దాతవుధర్మజ్ఞుఁడవని | భూతలమునఁజాలఁబేరుఁ - బొందితివాపి
ఖ్యాతితొలంగదె? నీకుం | బాతకముఘటిల్లదే? నృ - పాలా! యనినన్. 105

గీ. అధిపుఁడామాటలాలించి - యాత్మవెఱచి | హరిహరీ! శివశివ! యని - కరయుగమునఁ
గర్ణములు మూసికొని యెంత - కార్యమయ్యె | నెంతమాటను వింటి? నిం - కేమిగలదు.

క. ఇంతటిపనిఁ గావించుట | కింతటిదుర్బుద్ధియతివ - కేలఁగలిగెనో
వింతగఁదోఁచెడినార! యి | దెంతయు సాహసముచేతు - లెట్లాడెనొకో. 107

క. అనిపలికి మానసంబున | ఘనమగుదుఃఖంబుఁజెంది - కడుదైన్యము మో
మునఁదోఁపగవటుకునిఁదా | గనుఁగొనికోపంబుబొదలఁ - గానిట్లనియెన్. 108

చ. గుణవతియౌనటంచుముని - కుంజరుఁడింతినిఁ గోరెనాఁగదా!
గుణవతి యంచు నెంచిముని - కుంజరువాంఛనుఁ దీర్పనిచ్చితిన్
ఘృణయునుధర్మమున్ విడిచి - కీడనియెంచక భక్తిమానిమా
రణమొనరించెఁదాపసుని - రాతిరివేళఁదెగించి, మాయురే! 109

శా. పాతివ్రత్యము వీడకెల్లపుడునా - పల్కుల్విధానంబుగాఁ
బ్రీతిందానినిభక్తిపై మెలఁగుఁబ్రు - థ్విన్ సాధ్వినాఁ జెందవి
ఖ్యాతిన్, నమ్మితి, నిట్టిదా తెలిఁయఁగన - న్యాయంబుగా విప్రుఁ జేఁ
జేతంజంపి మహోఘమిద్విధమునం - జేకూర్చె నేఁడక్కటా! 110

ఆ. అహహా! యెంతక్రూర - మతివలహృదయంబు । వారిసాహసంబు - వారితలఁపు
నెఱుఁగఁదరముకాదు - యెంతదుష్కార్యంబు । నైనఁజేయుదురుమ - హాప్రియమున.

ఉ. ఆశకు మేరలేదు, పను - లక్రమముల్ ధృతియెక్కడశ్మసం
కాశముమానసంబుదయ - గల్గదుమందునకైన సత్యమో
లేశముగా నివారియెడ - లేదుతలంకను మాటసున్నయా
కాశముమీఁదఁ గూలినను - కాంతలుభీతినిఁ జెందరెప్పుడున్. 112

క. సుతుఁగోయించెనొకర్తుక । పతినింగికురించివేశ్యఁ - బరపురుషునితో
రతిఁకేళిఁగలిసెనొక్కతె । మతినొల్లక విభునివిడిచె - మగువయొకతెతాన్. 113

గీ. ఇంతులిటువంటివారౌట - నెఱిఁగియునుమ । నమునని పెసాధ్వియగుశాస - నంబుమీఱి
నడువదని నేను మిక్కిలి - నమ్మియుంటి । లలనవిడదయ్యెఁ దనజాతి - లక్షణంబు.114

క. అనికొంత వడివిచారం । బునుఁ జెందుచు నుండిపిదప - భూసురపుత్రుం
డునుఁదనలోఁ రాఁజనియె । య్యానదలుపునుఁ దీయుమని ల - తాంగిన్ బిలిచెన్. 115

క. పిలిచియటనిరుత్తరుఁడై । బలిమిఁగవాటంబు నెడలఁ - బాపిన శేంద్రుం
డలుకువమీఱఁగఁ గేళీ । నిలయంబునుఁ జొచ్చియచట - నిబ్బరమొప్పన్. 116

సీ. ఎండివట్టులుగట్టి - యుండునెత్తురుచాఱ - లొప్పఖడ్గముఁబూని - యున్నదాని
తానొనర్చినయకృ - త్యము నెంచి వెఱనొంది - నిలిచికన్నులనీరు - నించుదాని
సత్యంబెఱుంగక - జనులునన్నెంతనిం - దింతురోయనుచుఁజిం - తించుదాని
ముని సెప్పిననుధర్మ - మునుఁదలంపకఁబోతి - ననుచుఁబశ్చాత్తాప - మందుదాని
గీ. వెట్టిచందానమిక్కిలి - విభ్రమించి । సొంపుచెడి యాట్టెదిక్కులు - సూచుదాని
నడలుమదిమించిగడగడ - వడఁకుదాని । దనసతిని ఖండితుండైన - తపసిఁగాంచె. 117

మ. కనికోపాతిశయాన్వితాత్ముఁడునను - ద్గాఢోగ్రభీతాపహా
ననుఁడున్ నిష్కరుణావలోకనుఁడునై - నారీమణిన్ డాయఁగాఁ
జనితద్భీకరలోకసంహరణ చి - చ్ఛక్తిస్వరూపంబుఁగ
న్గొనియాశ్చర్యముఁ జెందియిట్లనుచు సం - కోచించియోజించెఁదాన్. 118

చ. విరియొకశేనియున్ నలిగి - వీడఁగలేదు, ముఖంబునందుముం
గురులువికీర్ణతంబొరసి - కొండొకయైనను సొంపుఁబాయలే

దరయఁ జెమర్పలేదు, సొగ - టందఁగలేదు, వరాంగరాగముల్
గరఁగఁగలేదలంకృతినిఁ - గల్గదు లోపమొకించుకేనియున్. 119

క. ఈలక్షణములు గాంచిన । చోలలన మునీంద్రుఁ గూడి - సురతక్రీడం
దేలమి నిజమని తోఁచెడి । నాలంభముఁ జేసె యెల్ల - దానిది తపసిన్. 120

ఆ. ఇష్టమొదవకున్న - నిష్టంబులేదని । పలుకరాదె ? చంపఁ - బాడియగునె ?
తునిమినంత నతని - తోడుసు పాయునటంచుఁ । దనకు శుభమటంచుఁ - దలఁచెనొక్కొ ? 121

చ. పరమగుణాఢ్యుఁ డీవటువు - పల్కినదంతయు సత్యమయ్యెయీ
తరుణి విధంబుఁ గన్న విశ - దంబగు మూఢునకైనఁగాని, య
ద్దిర ! కయిలాటకత్తెయిది - దీనిముఖంబునుఁ జూడరాదుయీ
గుణమెఱుంగనైతిఁ దడడి - గుడ్డలగొంతులు గోతురంగసల్. 122

క. దిట్టతనంబునఁ దనచేఁ । బట్టిననిష్టంబు విడకఁ - బట్టిమునికినై
పుట్టిన రాక్షసియో యన । నిట్టనిలిచియున్న దెంత - నిశ్చలమహహా ! 123

క. ఇంతటి కార్యముఁ జేసిన । కాంతను మన్నించుటెట్లు ? - కటకట ! వినిసై
రింతురె ? లోకులు దీనిం । గాంతయనం దగదు శక్తి - కాఁబోలు బళీ ! 124

చ. ఇలమలినాన్వితంబయిన - హేమముఁ గైకొని ధర్మకారుఁడు
త్కలికఁ బుటంబుఁ బెట్టికడుఁ - గాంతిని నొందఁగఁ జేసినట్లుయీ
కలుషమతిన్ వధించితల - కొన్న యరిష్టమడంచియింక మ
త్కులమకలంకమై వెలయు - కోపుఁ దలంచుట యుక్తమెన్నఁగన్. 125

క. అనివిజయాశ్వమహీపతి । యనుపమకోపోగ్రలక్ష - ణానుఁడై యో
జన సేయుచుండు సమయం । బున మునివర్యుం దలంచి - పొరిఁ జేర్కొనితాన్. 126

క. మునిశిష్యుఁడు కడుదుఃఖం । బున నిల్వఁగలేక నేలఁ - బొరలుచు నయయో
వనజాసనసన్నిభ ! మీ । కొనరునె ? దుర్మరణమిచట - నొకభామినిచేన్. 127

క. ఇవ్విధమున నడురేయిని । జవ్వని చేఁ జావుమనుచు - జతురాస్యుఁడు తా
నెవ్వగ వ్రాసెనొ జచ్చితి । యెవ్వరు ధర్మం బధర్మ - మెఱిఁగెడివారల్. 128

చ. పలుకరదేమి ? సన్నిపుడు - బాయనిసత్కృపనాదరింపఁగాఁ
దలఁపరదేమి ? మీనుడువుఁ - దప్పక జెప్పినయట్టి కార్యముల్
సలుపఁగలేదొ ? మీయెడలఁ - జాలఁగభక్తి జరింపలేదొ ? హా !
తెలుపఁగరాదె ? యట్లయిన - తేటపడంగ మునీంద్రశేఖరా ! 129

ఉ. భామినులన్నచో విరస - భావమునం గడుఁ గంటగించుమీ
కీమదిరాక్షి పైవలప - దేటికిఁ గల్గెనొ కానరాదుని

స్కాములుమీరు నేఁడుపర - కాంతనుఁగోరినదోషమివ్విధిఁ
సోముఁడొలంచిచంపెనొయ - జుండిటుమీనుదుటన్ లిఖించెనో. 130

ఉ. వేడుకమీఱఁగా యనుభ - వింపఁగఁగోరినవైన యిట్లుయీ
చేడియనిర్దయందొడరి - చెండునె? మిమ్ముఁవధింపఁజేతులె
ట్లాడెనొకాని నేఁదలఁచి - నంతనెగుండెలు తల్లడిల్లెడిన్
వీడనిచింతనిట్లుపల - వింపఁగమాన్పగదయ్యా! ధీమణీ! 131

శా. ఓసుజ్ఞానవిశారదా! గుణనిధీ! - యోసత్కృపాధార! యో
వ్యాసక్తవ్రత! యోమునీశ్వరసమా - హస్తుత్య! నేనుగ్రుఁడన్
మీసేవాప్రియ మానసుండనెపుడున్ - మీశిష్యుఁడన్సత్కృపన్
నాసంతాపమడంపవే వలదువై - న్యంబంచు నూరార్చవే. 132

క. ఎక్కడ మరణంబాశ్రమ । మెక్కడ? తపమెందుఁబోయె? - నిపుడుమహాత్మా!
దిక్కెవ్వరింకనాకున్ । మిక్కిలి మిమునమ్మియుంటి - మేరువునుబలెన్. 133

క. ననునుగ్రా! యిటురమ్మని । చనవునఁ జెంగటికిఁబిలిచి - సద్విషయంబుల్
గనికరమునబోధించెడి । ఘనులెవ్వారింకఁగలరు? - కలుషవిదూరా! 134

సీ. అరుణోదయంబయ్యె - నదెచూడుఁడా! స్నాన -మునకుఁబోదమురండు - మునివరేణ్య!
యాహ్నికంబున కర్హ - మైనట్టివస్తువు - ల్గలవొలేవొ చూచి- తెలుపుఁడయ్య!
తేటగానిన్న బో - ధించినపాఠంబు - నప్పగింపుమటంచు - నడుగరేమి?
సతతంబుహరినామ - సంస్మరణంబుఁగా - వింపుదురిపుడేల - విడువవలసె ?

గీ. మీరుకావించుపూజలు - మీజపంబు । మీమహాభక్తినిష్ఠయు - మీతపంబు
నెటులమఱచితిరయ్య! యూ - హించినేను । చేయఁగావలసినపను - లెప్పరాదె? 135

గీ. తరుణికిష్టంబులేకున్న - తగదుపొమ్మ । టనుచుపచియింపఁగూడదె? యనసుశీల!
తెంపునకుఁజొచ్చి మిమ్ముఁదాఁ - జంపనేల? । తలఁపఁదనకేమిలాభంబు - గలిగెనిపుడు

శా. ఏలావచ్చితి మీపురంబునకు మీ - రీకాంతనిమ్మంచు నేఁ
డేలావేఁడితిరయ్య! మోహమునభూ - మీశున్కటా! కీడటం
చాలోచింపక; హానివృద్ధులనుము - న్నాత్మన్విచారింపరా
దే? లోకస్థితిమీరెఱుంగరె? మహా - ధీమంతులై యుండియున్. 137

క. మిమ్మెల్లననినయపుడే । పొమ్మనఁగారాదెలేని - పోనికువాదం
బమ్మెయినొనర్పదగునో? । కొమ్మలతోమించిపలుకఁ - గూడునె? తండ్రీ! 138

మ. పరులందిట్టఁగలేదు లగ్గనియొన - ర్పన్ లేదుదుష్కృత్యముల్
పరిహాసంబుగఁ బల్కలేదొరులదు - ర్భావంబుతోఁబూనియె

ప్వరిసొమ్ముల్ హరియింపలేదుగద; కో - పంబేల? చేకొన్నమీ
ఱరితిం జెంతకుఱమ్మటన్న యవిత - ప్పయ్యోక్ వధింపెద మిముక్. 139

క. మిమువిడిచియెచటికేగుదు? । భ్రమదంబున నిఱుపురమును - వచ్చితిమిపుడే
నుమఱలియొకఁడం బోవుట । కుఱునను రాదయ్యో మాని - కుంజర! లెండా! 140

క. అనిపనవిపన వివనితం । గనిమసలెడి నూనెమీఁదఁ - గంకణములఁ జి
ల్కినభంగినై యతఁడు తగ । దని యెంచక దూఱఁదొడఁగె - నతికోపమునన్. 141

గీ. అతనిదుఃఖంబుఁగని - విజయాశ్వనృపతి । జాలిపడినిజపత్నిపైఁ - జాలఁగినిసి
పండ్లుగీటుచుఁ దారుణ - భాషణములఁ । దర్జనముఁజేసి యిట్లనుఁ - దలఁకుగదుర. 142

ఆ. ఓసి! దుష్టురాల! యీసంయమీశ్వరుం । డేమికీడొనర్చె - నిపుడునీకు
పాపభీతిమాని - పావనమాననుఁ । గరుణలేకఁ జంపఁ - గానదేల? 143

క. నాయాజ్ఞమించి మెలఁగం । గా యోగ్యంబగునె? యెంతఁ - గావించితివే
మాయలమారీ! యెవ్విధిఁ । జేయాడెను? నీకు మాని - శిరమును దునుమన్. 144

క. నినునితని కొసఁగుకాలం । బుననాయెడ వోలెభావ - మునుదెలిసినయం
బున మెలఁగుచుండుమని చె । ప్పనె? నామాటలను మఱవఁ-బాడియె? నీకున్. 145

క. పతికపయశముంగూర్చెడి । సతియుండిన నేమిఫలము? - సర్వవిధములన్
సతిగాదది శత్రువుపో । పతికిందగదట్టిదాని - పైఁబ్రియమిడఁగన్. 146

క. అనిగద్దించి విభుండడి । గినభయమునఁ జేతివాలుఁ - గ్రిందవయిచియా
వనితామణి యపుడెంతయు । వినయంబున నిట్టులనియె - వివరముగాఁగన్. 147

ఉ. నేనుమునిన్ వధించినది - నిక్కము వల్లభ! రైన యొక్కనుం
తేనియులేదు నాయెడల - నిందున నేరము; యావనాకృతిన్
బూనుదుఁజంపుమంచుననుఁ - బూన్చెమునీంద్రుఁడి దేటిమాటయి
ట్లేనొనరింపలేననిన - యేలభయంబు వధింపుమీనన్. 148

గీ. నేపునర్జీ వినగుదును - నిశ్చయంబు । మదిమితొలఁగను పిమ్మట - ముదమువీఱ
నవయమును నిన్నుఁగూడి పెం- పొనరనుభ । వింతుసౌఖ్యంబుననియెనే- వినకయున్న.

గీ. ఎంతసెప్పిన వినక యిట్లిపుడునీవు । సలుపకుండిన శపియింతుఁ - జత్తుఁబిదప
ననిశపింపక ఖండించు-కొనఁగఁబూనెఁ । దనకుఁదానదిగనిదిగు - ల్గొనిమనమున. 150

క. ఈమునియాజ్ఞను మీఱిన । నేమగునో సేయుటొప్పు - నెదిరైననగున్
భూమీశుడితని మాటల । కేమాత్రమునడ్డువలుక - కిపుడునుననియెన్. 151

వ. ఎట్లునునితఁడుఖండించుకొనుటకు సిద్ధపడియున్నవాఁడుచెప్పినభంగిఁబ్రవర్తింపని నేరంబుఁ
బైఁదెచ్చుకొననేల? యనిచింతించి పరమేశ్వరునిమనంబునధ్యానించియొట్టకేలకుధైర్యం
బువలంబించి ఖండించితి. 152

క. ఘాతుకురాలనటంచుం | బాతకురాలనుచు మది - భావించి మనః
ప్రీతిగనిఁకనైపిమీరే | రీతినొనర్చినను సంహ - రించినవగవన్. 153

క. ఇదిసత్యమనిన యుగ్రుం | డపివిని యదలించి, కల్ల - లాడకుమిదిన
మ్మదురా ? లోకులు తనకున్ | ముదిమితొలఁగుఁ జంపుమనెడి - మూర్ఖుండున్నే ? 154

ఉ. నెప్పరివాదువార ! యిది - నిక్కమె ? తన్నువధింపు మంచుఁదాఁ
జెప్పెనె? బాసచేయుము ? కు - శీల ! మముంగికురింపఁబూనినీ
విప్పటికిప్విధిం బలుక - నిచ్చదలంచితివొక్కొ ? నీవు నీ
తప్పునదేలఁదెల్పుదువు ? - దైవమెఱుంగు నిజంబుఁగల్లయున్. 155

క ఇతఁడు నినువేఁడుటయునీ | వితనిని నిరసించి తెగడి - యెట్లాడినయు
ద్ధ్రుతియును బిమ్మటనడిచిన | గతియును నాకెఱుక లేదె ? - గట్టిగఁజెపుమా! 156

గీ. ఎంతవేఁడిననీవిచ్చ - యింపకున్న | మునినముంజేరి మొరఁబెట్టు - కొనఁగలేదె?
యబ్బయుండంగతికిఁబెట్టె - నతనికనిన | భంగిఁబలికెద వెఱఁగిన - వానియెదుట. 157

క. నీవిభునకిపుడునమ్మికఁ | గావింపఁగఁ దలఁచిపలుకఁ - గానెంచిననీ
వేవిధమునననిననునను | మీవిపరీతంపుమాట - లేవిననొల్లన్. 158

గీ. ఆవులించినయంతనె - ప్రేవులెంచు | వాఁడుభూపతియెఱుఁగని - వాఁడుగాఁడు
నీవువేయునచించిన - నిజముకల్లఁ | దెలిసికొననేర్చుఁ జెప్పుము - వలసినట్లు. 159

ఆ. కడఁగియింతనేర్పుగా బొంకలేనివా | రెటులసాహసింతు - రింతపనికి
ధూర్తవీవునిన్నుఁ - దొడరిమాటాడరా | దనియె నతనిపలుకు - లాలకించి. 160

మ. జగతీనాథుఁడు వారిభాషణములున్ - సందర్భముందామదిం
దగయోజించి, కుశీలగాదతివయే - తత్పూర్వమీబ్రహ్మచా
రిగురుండేరకుఁ దూఱినాఁడననిదు - ర్వృత్తాంతముం జెప్పెఁద
ప్పుగుమాటల్వచియించు నీతఁడెపుడున్ - వ్యాజ్యంబుఁబుట్టించెడిన్. 161

చ. అపుడటువల్కెనాటయిపు - డవ్విధినేవచియించునంటకుం
దపసివధింపఁగాఁబడియెఁ - దానువధించితినంచుఁజెప్పెని
క్కపుతెఱఁగీపెగాననిది - కల్లయనంజనదొర ! కాంతతాఁ
గృపవిడిచంపుమంచుముని - కేలికిఁజెప్పినఁజంపఁబాడియే. 162

క. మునియాజ్ఞనుమీఱఁగరా | దనిచెప్పిన, యంతెచాలు - ననిమానింజం
పెనుయోగ్యాయోగ్యక్రియ | లనుఁదెలిసియొనర్పఁగావ - లయునకధృతిన్. 163

క. కావునపావనుఁడగుభూ | దేవునిసాహసముతో వ - ధించిననేరం
బీవెలఁదియెడలఁగలదెఁక | నేవిధిజంపిననుపాప - మేగద ; తలఁపన్. 164

వ. అని తలంచి యా చంచలాక్షి యొనరించిన దుష్కృత్యంబునకాగ్రహంబు వహించి యాతండు.

మ. కుటిలభ్రూకుటి దుర్నిరీక్షణ మహా - క్రూరారుణాస్యుండును
త్కటకోపజ్వలనస్ఫులింగజనితో - ద్యద్భీకరాక్షుండునై
చటులానేకపతుండసన్నిభకర - స్థస్వచ్ఛశాతాసివి
స్ఫుటరోచుల్ మిఱుమిట్లు గొల్పనపుడ - స్తోకప్రతాపంబునన్. 166

ఆ. నీతిలేనిదాన! - నిర్భాగ్యురాల! హా! స్వామునకితఁడుజంపు - మనినఁదోడరి
చంపఁజనునె? నిన్నుఁ - జంపినఁగాని యీ! దోషమొండుపగిదిఁ-దొలఁగదిపుడు. 167

క. పెదవులఁదడిపెదవేలా? బెదరునఁబరువిడిన నెంత - వేఁడిన విడఁజం
పుదు ననుటయు నుగ్రుండా! మదవతిపైనలుక మించి - మహీపతిఁగనితాన్. 168

చ. విడువకుమయ్య! దీనిఁబల - వించిన వేఁడిన శంకమానిచ
క్కడఁపు ములోకమందుభవ - దన్వయ మెంతయు నిర్మలంబగున్
గడునిదిమాయలాఁడిదయ - గల్గు విధిన్ నటియించు దీనయై
యొడికమెఱింగి పల్కునన్న - తోడరినామము దీనికిందగున్. 169

ఆ. నిరపరాధియౌము - నిన్ వధించినయట్టి | దోసకారి విడిచి - దూఱుఁజెందఁ
జనదు చనదు నీకు - చంపి సత్కీర్తినిఁ | గాచికొనుము భూప! - కరుణవలదు. 170

క. ఫణిపడఁచియనర్ఘంబగు | మణిఁగైకొను భంగిఁగపట - మానసయును దు
ర్గుణకలితయునగు దీనిం | దృణముంబలె నెంచి తునిమి - తృప్తిం గొనుమా. 171

క. అనిబోధించిన సావని | మనుజేశుఁడు పత్నిమీఁది - మమతను విడిచ
య్యానఁ జంద్రహాసమునియొడు | తన కైదువు నెత్తి వ్రేయఁ - దమకించుటయున్. 172

క. వ్రేయుము వ్రేయుము భూవర! పోయెం బోయెం బొలంగి - పోయెం బోయెన్
జాయయనితలఁపకుమునీ | శ్రేయంబుం గోరి యిటులఁ - జెప్పెఁద జామ్మా! 173

చ. తటుకున నెందు నేనిఁజని - దాఁగినయీనిసి వేళ నిట్టిచోఁ
కటితటి దీనిఁగన్గొనుట - కష్టము కార్యముఁ దప్పిపోవునం
తట నెటు సేయునో మిగుల - దండనకర్త్రియ, నేనువోయివా
కిటఁజననీక నిల్చియిరు - గేళ్లనుఁ దడ్డదనీవు ద్రుంపుమా! 174

క. అనిపలికియుగ్రుఁడొయ్యనఁ | గను మొఱఁగెన్ మానితనువుఁ - గరవాలంబున్
గనిపింపదయ్యో విడువకు | వనితను వధియింపుమనుర - వము వినఁబడియెన్. 175

ఆ. అటుల మాయమైన - యాచిత్ర మెఱుఁగక | ధర్మచరితుఁడైన - ధరణివిభుఁడు
వింతనొందియట్టె - కొంతసేపరసితా | నింటిఁ దునుమ మరల - నెత్తెవాలు. 176

క. ఎత్తియపుడించుకేనియుఁ । జిత్తంబునసంశయంబుఁ - జెందకధర్మా
యత్తమతినైవధించెద । నిత్తరుణినటంచుఁబూనె - నేయుటకంతన్. 177

క. వలదువలదుడుగుముడుగుము । కలికిరొయొడన్ లేదుతప్పు - ఖండింపంగాఁ
దలఁపకుముమానవేశ్వర ! । చలమునజాయన్ వధింపఁ - జను నే? నీకున్. 178

క. అనియెత్తిననిజకరమున్ । ఘనబలుఁడొక్కండుగట్టి-గాఁబట్టినలా
గునఁదోఁచిననివ్వెఱపడి । జననాథుఁడునిలిచి నలుదె - శల్గనుచుండెన్. 179

క. దిగ్గనవొక్కమహాప్రభ । దృగ్గోచరమయ్యెనాస - తీపతులకునా
నిగ్గటులగలిగెననివా । రగ్గలముగసంభ్రమించి - రాసమయమునన్. 180

సీ. ఇంద్రనీలంబుల - కెనయైననెమ్మేని - కాంతులుమించిన - ల్గడలఁబర్వ
సుందరవదనార - విందంబుమందహా - సస్ఫూర్తి నెంతయు - జానుమీఱ
జలదంబునందలి - చంచలాలతవోలె - డంబైనరుక్మచే - లంబు మెఱయ
సదమలమణిగణ - స్థగితవిభూషణ - స్తోమంబుమిక్కిలి - శోభిల్లఁగ
గీ. శంకచక్రద్వయంబు హ - స్తములవెలయ । సమరఖగవాహనారూఢుఁ - డైరమాస
హితముగావారిరక్షింప - నెంచియపుడు । కంజనాభుండుశౌరిసా-క్షాత్కరించె. 181

క. శారదనీరదరాజ్జ । క్షీరమరాళోగ్రితుల్య - సితదేహుండా
నారదుఁడునుఁబొడసూపెన్ । శ్రీరమణున్ దనమదిన్ స్మ - రింపుచునచటన్. 182

వ. అటులజగదీశ్వరుండైన రమానాథుండుప్రత్యక్షంబగుటయు,నఖండమార్తాండకోటి ప్రభా మండితతనుండును, పుండరీకదళలోచనుండును, సుందరతరేందుధరశతానందపురందరాదిబృందారకబృందవందిత పాదారవిందయుగళుండును,దుష్టజననిగళుండును,నకలంక నిరుపమమణిగణనికరసంఘటితానర్ఘ విభూషణభూషితాంగుఁడును, సజ్జనసంగుండును, భానురమందహాసకలితవిలాసపరిపూర్ణకోమలవదనుండును, సద్గుణసదనుండును, సకలభువన సంరక్షణదీక్షాసత్సంకల్ప ప్రమోదనిరంతరహృదయుండును, నిత్యసదయుండును, భక్త పోషుండును,ముక్తదోషుండును,దీనపాలుండును,గానలోలుండును, పరమశాంతుండును, విరహితాంతుండును,నగునప్పరమేశ్వరు, వేదవేద్యు, నిందిరేశు,భుజంగతల్పు,నాదిమధ్యాంతరహితుఁ, జిదానందస్వరూపుం, గాంచితదీయశుభలక్షణంబులవలన వైకుంఠుండని యెఱింగి,పులకితగాత్రుండైవిజయాశ్వనరేశ్వరుండు భార్యాసహితుండై సాష్టాంగదండ ప్రణామంబులాచరించి భయభక్తివినయంబులు ముప్పిరిఁగొన, కరంబులుముకుళించి యిట్లనిస్తుతించె. 183

దండకము.

శ్రీమత్పయఃకంధిజాహృత్సరోజాతసంచారమత్తద్విరేఫం, లసత్సుస్వరూపం, సుర జ్యేష్ఠముఖ్యామరశ్రేష్ఠసంస్తూయమానప్రసిద్ధప్రభావం,మహానుస్వభావం,గిరిద్విట్ద్విషత్కుం

భికుంభస్థలోద్ఘాటనాటోపగంభీరపంచాస్యవర్యం,మహాశౌర్యధుర్యం,సర్వసర్వంసహాభారనిర్వా
పణోద్యోగ సంకల్పసంసక్తచిత్తం, సుఖాధారవృత్తం, ముముక్షుప్రియస్వాంత సంయుక్త
యోగీంద్రసందోహవాంఛాప్తిమూలం, నవస్వర్ణచేలం, విపన్నవ్రజక్లేశదూరీకృతాయోగ
నిత్యాను విద్ధప్రమోదం-వినిర్ముక్తఖేదం-బలివ్యాసగాంగేయభీభత్సదాల్భ్యాదిసద్భక్తజాలా
ర్చిత శ్రీపదాబ్జద్వయం, భవ్యతేజోమయం, నిర్మలానర్ఘసద్రత్నసంకల్పితానూనశోభాభిరా
మోల్లసత్కంఠహారం, సుధీహృద్విహారం,జగత్సృష్టిసంరక్షణధ్వంసకార్యత్రయాక్షీణ పూర్ణ
స్వతంత్రాధికారం, యశోదాకుమారం,గదాశార్ఙ్గనిస్త్రింశచక్రాబ్జముఖ్యాయుధోపేతరక్తార
విందోపమానప్రభాభవ్యహస్తం,త్రిలోకప్రశస్తం,దయాసంయుతాపాంగసద్వీక్షణాసాదనా
త్యంతకౌతూహలాయత్తసాధుప్రతానం,పవిత్రాభిధానం, మునిస్తోమపోషం, సమస్తంసు
వేషం,చిదానందతత్వం, విదీర్ణారిసత్వం, శుభాధారవక్షం,విభుం దైత్యశిక్షుం,గతాభీలతాపం
జితాహిపప్రతాపం,ప్రబుద్ధంప్రసిద్ధం,నిరీహం, నిరంతం, ప్రశాంతం, మదీయేష్టసంధాయకం,
సర్వదాభావయామ్యచ్యుతంత్వాంప్రభోపాహిమాంపాహిసర్వేశ్వరా నిర్వికారా నమస్తేన్న
మస్తేన్నమః. 184

సీ. జయజయ నగధీర - సకలలోకాధార - పాకారనుతమిత్ర - పద్మనేత్ర
జయజయబుధపాల - శత్రుదానవకాల - సన్నుతదరహాస - సత్యవాస
జయజయనిర్మోహ - జలదసన్నిభదేహ - హర్యక్షగంభీర - హతవికార
జయజయశివబాణ - శరణాగతత్రాణ - రవికోటిభాసదు - ర్జననిరాస

గీ. జయజయహరీసదానంద - జయముకుంద । జయజయ రమామనఃకాంత - జయయనంత
జయజయపరేశయక్షర - జయసుచరిత । జయజయ జనార్దనామార - జనకధీర. 185

ఉ. పావనభక్తపోషమధు - భంజనపాపహరా నమోస్తుతే
భావభవారిమిత్రభవ - బంధవిదారసదానమోస్తుతే
దేవసమూహసేవ్యవసు - దేవకుమారసుఖీనమోస్తుతే
స్థావరజంగమాదిసము - దాయభరావసదానమోస్తుతే. 186

క. వందేముచుకుందావన । మందనగరసుందరాంగ - మంజులభాషా
బృందారకసందోహ । నందప్రదరహితకోప - నయగుణరూపా. 87

ఉ. శ్రీరమణీయధామతుల - సీపళహారయుతేంద్రగోపికా
జారమురాదిదైత్యహర - సత్వరజస్తమరూపఘోరసం
సారమహార్ణవోత్తరణ - సర్వసమానశుభప్రదానమ
స్కారమునీకునిందిరకుఁ - గామితదాయక లోకనాయకా. 188

రగడ.

వందనముహారీ - వరదముకుందా | సుందరవేషా - సుజనానందా
దామోదరగుణ - ధామసుశీలా | క్షేమంకరల - క్ష్మీహృల్లోలా
లోకేశార్చిత - లోకాతీతా | వైకుంఠాధిప - వైరివిజేతా
నీరజనాభము - నిస్తుతపాదా | కౌరవకులహర - కంసచ్ఛేదా
సింధుగభీరవి - జితషడ్వర్గా | సింధురపోషా - శ్రితసంసర్గా
మణిమకుటాస - న్మానితకుబ్జా | ఫణితల్పశ్శుభ - ప్రదహస్తాబ్జా
మధురాపురచర - మారాకారా | విధుహరిలోచన - విశ్వాధారా
నిత్యధరాధర - నీళాకాంతా | సత్యాప్రియని - స్వాకమప్రశాంతా
పురుషోత్తమవర - ఘోషపవిత్రా | స్థిరవైభవవం - జితసుచరిత్రా
బలివిధ్వంసక - భాస్కరతేజా | బలభద్రానుజ భక్తసమాజా
ధర్మవివర్ధన - తత్వాధారా | నిర్మలకరుణా - న్వితసుకుమారా
గరుడధ్వజసం - కటహరశౌరీ | పురుషోత్తమజ - భూధరధారీ
అక్రూరాశ్రయ - యజ్ఞోద్ధారా | నక్రవిఖండన - నందకుమారా
మంజులదేహా - మాయాతత్వా | కుంజరభంజన - గురుతరసత్వా
సృష్టిస్థితిలయ - చిత్రోద్యోగా | దుష్టభయంకర - దుఃఖత్యాగా
నిను నెరనమ్మితి నిగమవిహారా - ననుఁగృపఁగనుమా - నందవిహారా
మొక్కెదనీపద - ములకసమానా | దిక్కని నేవిను - తింతుననూనా
జయజయజయజయ - జయసద్భావా | జయజయజయజయ - జయజయదేవా. 189

ఉ. క్షీరసముద్రవాసబుధ - జీవనజీవనజారిహస్తదే
వారికుమారపాల పర - మాత్మచరాచరవర్గరక్షకా
భూరివివేకధామసుర - భూసురపూజితపాదయోగిమం
దారయుదారభావసుకృ - తప్రదకావుమునన్ను మాధవా ! 190

ఉ. దీనుఁడమూఢుఁడక్షలుఁడ - దేవగణాశ్రయయోగ్యమైసదా
మానులుభక్తిమైనిగమ - మంత్రములందగఁబూజసేయు నీ
జ్ఞానదభవ్యరూపమునుఁ - గాంచికృతార్థుఁడనైతిసత్కృపక్
బూనిసముద్ధరింపుమహీ - భృగ్వరవాహనలోకమోహనా ! 191

చ. సనకసనందనప్రముఖ - సంయములైననునాత్మయోగసా
ధనములఁబూనినిత్యమును - తత్వవివేచనఁజేసికొనఁజా
లనిభవదంఘ్రులక్గను ఫ - లంబుఘటిల్లెనునన్నువంటి య
ల్పునకిదిపూర్వజన్మకృత - పుణ్యమటంచుఁదలంతునచ్యుతా ! 192

మ. తొలఁగెఁ గా దోషము లెల్ల నేఁడు కడుసం - తోషంబువాటిల్లెనా
కులముల్ పావనమయ్యెఁ జింతలడఁగెం - గోర్కుల్ఫలించెల్ శుభం
బులు చేకూఱెఁ గొఱంత లేదికభవ - త్పుణ్యస్వరూపంబుఁ గ
న్నులఁ జూడంగ నెసర్వమున్ బొసఁగెఁ ధ - న్యుండఁ గడుఁ జేసిలన్. 193

క. శరణాగతావనా నిను । శరణంటింగావుమంటి - సమయంబంటిన్
కరుణాకర భవసాగర । తరణానుజనార్తిహరణ - ధర్మాచరణా. 194

నిరోష్ఠ్యకందము.

క. సురరాజరక్షకాసా । గరతనయాహృదయశైలజ - కంజహితాకం
ధరనీలదేహకరుణా । కరనారాయణయనంత - ఖలహరణహరీ ! 195

చతుర్విధకందము.

క. చింతావిదూరభవ్య । స్వాంతావరచేలదురిత - సాగరతరణా !
కాంతేయసౌఖ్యదాయక । శాంతాకరిపాలయోగి - సన్నుతచరణా ! 196

గోమూత్రికాబంధము.

క. భూనుతహారసఖయనిభా । జ్ఞానదధర్మజవిజయవ - శంవదకృష్ణా !
ధేనుకహరసదయశుభా । ఖ్యానగధరజయజయాన - హేవరకృత్యా ! 197

నాగబంధము.

చ. రవిసమతేజపావనస - రాధరనిత్యశకుంతవాహమా
నవసురజాలసేవితసు - నాఘనవర్ణజయాంకమానిపై
భవనుతకాశలావనజ - భఁజన నిర్మలనామదేవకీ
భవసకలేశదేవకుల - పాలమహాత్మవిశవీరధీనిధీ ! 198

ద్వ్యక్షరకందము.

క. నిను నేమ్మనమున నమ్మిన । ననునోముము నెమ్మినీమ - ననమును నేమా
ననుమా ననమా మిమనో । న్మనమన్న ననిమ్ము నిమ్మ - నానానామా ! 199

మ. భవదీయప్రకట ప్రభావనుగుణ - ప్రజ్ఞావిశేషంబు లా
దివిజజ్యేష్ఠున కేనియుం దెలియఁగాఁ - దెల్పంగరాదండ్రు మా
నవమాత్రుండ నెఱుంగనాకుఁదరమే ? - నాళీకపత్రాక్ష । నే
నవివేకింగడుఁ దోఁచినట్టిపుడు ని - న్నాసక్తి వర్ణించితిన్. 200

ఉ. ధారుణి నెండవేఁడిమికిఁ - దాసయిరించి మహీరుహంబు వి
స్ఫారము దాసహాంబరయిన - ఛాయను మర్త్యుల కిచ్చునట్లు నీ

వారలు నొందుకష్టములు - వారిని నీవవహించి వారి నొ
ప్పారఁగఁబోర్చితు వెల్లపుడుఁ - నాదట సౌఖ్యములిచ్చిభూధరా! 201

చ. అని విజయాశ్వభూపతి ర - థాంగధరుౕ భయభక్తులేర్పడౕ
వినుతియొనర్చుచున్నఁగని - విశ్వమయుండు ముదంబుఁజెంది యి
ట్లనియెగభీరభాషల; జ - నాధిపనీవసమాన ధర్మవ
ర్తనుఁడవు జాలమెచ్చితి ధ - రౕ మతిలేరు నృపుల్భవాదృశుల్. 202

క. ఘనుఁడవు నీవివ్విధిఁ బ | ల్కినిజంపఁగఁ బూనఁజనునె? - తెలుపుము? మదియో
జనఁజేయకెట్టికార్యం | బు నొనర్పఁగరాదటంచు - బుధులనవినవే? 203

గీ. అనుచు పల్కినిరుత్తరుం - డైయతండు | విన్నదై నిల్చి భక్తిమైఁ - దన్నుఁజూచు
చున్నఁగనినవ్వి, వెఱవకు - మోనృపాల | లేదు నీదోషమించొక - లేశమేని. 204

ఉ. పూర్వభవంబునౕ వినుము - పుణ్యజనేశ్వరుపట్టి వీవుయీ
పర్వసుధాకరాస్యనినుఁ - బాయఁగఁ జాలనిరంభనుమ్ము! మీ
రిర్వురు మానిశాపమున - నివ్విధి బుట్టితి రయ్యజంతుమి
మ్మర్వినిఁగూర్చెఁ జాల్రబియ - మొప్పసతీపతులై మెలంగఁగౕ. 205

వ. మున్ను మునీంద్రుండు మిమ్ముశపించుకాలంబునఁ ద్రిమూర్తులకుఁదక్కఁదక్కినవారికి మీచరిత్రింబొకింతయుం దెలియకుండఁగలదనియు, మీకుమదీయదర్శనంబుసంప్రాప్తిం చుననియుం జెప్పియున్నకతంబునఁ బ్రత్యక్షంబయితి మీవృత్తాంతంబెఱుంగఁజాలమిచే నారదుండుసామాన్యమానవులనుగాఁదలంచి నాతోడ మిమ్ముపర్ణించియుగ్గడించె, నది నేనెఱింగియుండియుఁ దెలియనివానివలెయాకర్ణించి, యొకవినోదనాటకముంగల్పించి మీసత్యశీలంబులు లోకంబున సుస్థిరమైనిలుచునట్లు సేయనెంచి యిన్నివిచిత్రకార్యం బు లొనరించితి. ఇంకమీకెట్టియాపదలును బొసంగనేరవు. అని పూర్వజన్మవృత్తాంతం బాదిగా సర్వవిషయములుం జెప్పిన వినియాశ్చర్యంబుఁ జెందుచున్న విజయాశ్వనకును, నారదునకునుఁ దక్కినవారికిని ముకుందుఁడు స్వకీయమాయంగవియించిన దత్క్షణంబునవా రలు పామరత్వంబువహించిరంతసర్వజ్ఞుండైన జనార్దనుండు విజయాశ్వునింజూచి మరల నిట్లనియె. 206

శా. నీసత్యంబును ధర్మబుద్ధిగుణముల్ - నీయీవినీధైర్యము
ల్లాసంబొప్పఁగఁగాంచి మేలొసఁగవా - లాయంబుభావించినే
నాసక్తిౕ భవదంగనౕ సిరులమా - యామానినై వేఁడినీ
చేసర్వంబునుఁ గొంటినారదుఁడునా - శిష్యుండుగానుం డెతౕ. 207

క. ధనదారాగేహాదులఁ | గనికరమును మానియడిగి - కైకొన్న మహా
మునివరుఁడనేనయుగ్రుం | డనుసతఁడీనారదుఁడన - రాధిపవింటే! 208

శా. ఆరీతిన్ సకలంబునీవలననే - సర్థించియాజ్ఞించియీ
సారంగాక్షినలంచి తద్గుణములున్ - శాంతంబుసంకల్పమున్
తీరున్నీతియు సత్ప్రవర్తనముఁబా - తివ్రత్యముంగాంచఁగా
నారూఢిందలపోసి పోయిమృగుప - ర్యంకంబుపైఁజేరితిన్. 209

ఉ. మానినిభక్తిమీఱనను - మానమొకించుకయైనలేకస
మ్మానమెలప్పఁగాశయన - మందిరమున్ నడిచేరిశయ్యపై
దానుపవిష్టయైమదన - తంత్రములం బొసరింపనెంచెనే
నానియమంబెఱింగినను - నంటకుమీ! యనియానఁబెట్టితిన్. 210

గీ. అపుడు నాయానకీగజ - యానవెఱచి । యట్టెనిలిచినమాయాసి - నతివకొసఁగి
చంపుమీనన్నుదీనితో - జగతొలంగు । యౌవనమునొందిజీవింతు - నంతెనంటి. 211

ఉ. కోమలియాదురుక్తివిని - కొంకుచుఁదత్తఱపాటుమీఱఁగా
పేర్మిఁదలంకిదుఃఖమునఁ - బెక్కువిధంబుల 'దుష్కృతంబునే
నేమనిసేతు? మీయెడల - నెంతయుఁగూర్మి మెలంగెదన్ మహా
త్మా! మదిలోనమీముదిమి - మాటఁదలంపను సత్యమింతయున్. 212

క. ముదిసినవారైననునే । యదవదయునులేదునేబ్రి - యంబొందితియీ
కొదుకేల? మానుఁ,డనిమొన్ । బెదరించిశపింతునంటేఁ - బిమ్మటనతివన్. 213

గీ. ఎంతబెదరించిననుఁజంప - నిచ్చలేక । యున్నఁగనినేను సౌఖ్యంబు - నొందుటరయఁ
జాలవైతివినను నేన - చంపుకొనెదఁ । గలుగునీకీశునీకని - ఖడ్గమొడిసి. 214

క. కొనిగొంతుకనేనేది । గ్గనసంగనసూచుచుండఁ - గోసీకొనంబూ
నినభీతిలిమానిచినా । యనుమతిఁదామీఱలేక - యడలుచుఁదునిమెన్. 215

వ. పిమ్మట యుగ్రుండువాపోవుటయు, నార్తధ్వనివిని నీవు సనుదెంచి విచారించుటయు, నతఁడీరమణీమణిమునీంద్రునింజంపెనని యసత్యంబైననేరంబుంబూన్చినీతోడఁ జెప్పుటయు, నతనివాక్యంబులు సత్యంబులనిభావించియగర్మప్రవర్తనంబునకువెఱచినిర్దోషియైనయీసాధ్వీరత్నమును దోషింగానెంచినీవుసంహరింపఁబూనుటయు, నిత్యాదివిషయములునీవెఱింగినవియ, మీయిరువురిచిత్తశుద్ధియుంబరిశీలింపఁదలంచినేనిట్టికపటనాటకంబుఁబ్రదర్శింపందలంచి సాంతంబుగానిర్వహించితి. విజయాశ్వనృపాలా! నీవుధర్మస్వరూపుఁడవు సత్యసంధుండవు దయాశాలివి శాంతచిత్తుండవు నిన్నుసామాన్యునింగాఁదలంపరాదు. ఈవనితామణికిసమానమైన సాధ్వీమల్లోకములయందునుఁగలుగదు. సద్గుణగణమతల్లియు, జగద్వందితపరిశుద్ధచరిత్రయునైనయీమెయందెపుడును నెట్టికళంకంబును గలుగనేరదు, మిమ్ము మెచ్చిసర్వవిధంబులను శుభంబులొందింపనెంచితిఁగావున. 216

క. నరవరమీకుఁ బలసిన । వరములొసంగెదనుశంక - వలదనుచు ముని
త్వరముగ నటుటయు వినితాఁ । బరమానందంబునొంది - భక్తిపరిస్ఫుట్. 217

ఉ. పాణియుగంబు మోడ్చినిజ - ఫాలతలంబునఁ జేర్చి దీనపం
- త్రాణన మోన్న మోసకల - తాపవిదారణ మోన్న మోజగ
త్ప్రాణన మోన్న మోపరమ - పావనరూప నమోన్న మోఖల
క్షీణన మోస్త్వటంచునుతిఁ - జేసినమస్కృతిసల్పిరాజుతాన్. 218

ఉ. ఓగజరక్షకా! పరమ - యోగులకైననుఁ దోఁచనట్టినీ
యాగమవేద్యమూర్తిఁగను - నంతటిభాగ్యము గల్గినంత నా
లోఁగుది గొన్న కోరికలు - లోపములేక ఫలించెపద్ధతిన్
వేగవొసంగవే వరద - వేఁడితినన్యమునొల్ల నెద్దియున్. 219

క. ఈవరము దక్కవలఁదిఁక । యేవరమునటంచు మాన - వేంద్రుఁడడిగినన్
దావినిహారియిట్లనియెద । యావిలసిత మతినిమంద - హాసముదనరన్. 220

క. సంతోషించితినవనీ । కాంత ! భవద్వాంఛయిపుడు - గలుగదు సుమి ! నీ
శ్చింతనిఁకఁ గొన్నివాళులు । కాంతిగరాజ్యంబునేలఁ - గావలయుఁ భువిన్. 221

క. అటుపిమ్మట పద్ధతిఁ జెం । దుటకర్హుఁడవగుదువింత - తొందరపడనే
మిటికదియొదటఁ గలుగును । దిటవుగనీకీర్తిమించు - దిగ్దేశములన్. 222

క. ఇంకనువలసినవరముల । శంకింపక వేఁడుమనిన - సంభ్రమమువయా
పంకజదళలోచనుఁడగు । శంకరునతుకరుణాకలరి - జనపతిమరలన్. 223

మ. అమితస్వాంతుననంతునింబొగడిసా - ష్టాంగంబుగాఁ దాఁ బ్రణా
మముఁ గావించిపరేశ ! యట్లయిన స - న్మార్గంబునన్ బుద్ధిని
త్యమువర్తిల్లననుగ్రహించియొక పు - ణ్యాపస్తుఁడౌ పుత్రువం
శమువర్ధిల్ల వొసంగవేయనుచు వాం - ఛంజెంది ప్రార్థించినన్. 224

చ. అతనిమురాసురాతిసద - యామృతదృష్టులఁ గాంచిపల్కెనో
క్షితివర ! నీకుపుత్రులనుఁ - జెందెడియోగము లేదుసుమ్మియా
శతధృతినిర్ణయంబిది వి - చారముఁ జెందకుమింక సద్గుణ
ప్రతతినిమించియొప్పునుత - భవ్యచరిత్రనుకూతునిచ్చితిన్. 225

ఉ. అంకిలిలేకసత్యపథ - మాత్మఁదొలంగక ధర్మమొప్పఁగా
వింకనుఁగొన్నివాళ్లవని - నేలిజనంబులు మెచ్చసత్క్రియల్
గొంకకొనర్చిసాధుబుధ - కోటులరక్షణఁ జేసియంతపైఁ
బొంకమొలర్పమోక్షమునుఁ - బొందెదవీవుసతీయుతంబుగన్. 226

ఆ. పరమసాధ్వియైన - భవదీయపత్నినిఁ । గడుఁబవిత్రచరితఁ - గాఁదలంచి
మున్నువోలెతప్పు - లెన్నక చేపట్టి । రాజ్యమేలుమయ్య ! - రాజచంద్ర ! 227

వ. మఱియొక్క విశేషంబుఁ జెప్పెద నాకర్ణింపుము. 228

చ. ముద మొదవంగ నీచరిత - మున్ బ్రియ మొప్పఁగ నెవ్వరుర్విలోఁ
జదివినవిన్న నాయువును - శాశ్వతకీర్తియు పుత్రపౌత్రసం
పదయును భోగభాగ్యములుఁ - బన్నుగఁ బొంది సుఖించియంత మ
త్సదనముఁ జేరనేర్తురిది - సత్యముసత్యము మానవేశ్వరా ! 229

క. అనుచురమారమణీపతి । జనపతి కానతి యొసంగఁ - జల్లనవర్షిం
చెను పుష్పవర్షమంబర । మున నుండి సుపర్వసమితి - ముదమొందెఁగన్. 230

ఉ. చల్లఁగవీచె మారుతము - శాంతివహించిరి సజ్జనుల్ ల స
త్పల్లవితంబులుం గుసుమి - తంబులునయ్యెను భూజముల్ విరా
జిల్లెను దిక్కులన్నియును - సింధువులెంతయుఁ బొంగ జీవకో
ట్లెల్ల ముదంబుఁ జెందెను తి - యించిరి సిద్ధులు పారికాంక్షులున్. 231

ఆ. ఆడిరప్సరసలు - పాడిరి గంధర్వు । లమరకోటి జయజ - యధ్వనులు సె
లంగె నారదుండు - పొంగి గంతులు వైచెఁ । బొగడెఁ జాలహరిని - భూవిభుండు. 232

క. తనరయశోవతిభక్తిం । దనశక్తికొలంది బొగడెఁ - దామరసాక్షున్
వినుతమహాశుభవక్షున్ । కనకాంబరు సుజనపక్షు - గజసంరక్షున్. 233

వ. తత్సమయంబున క్రొక్కారు మెఱుంగునుం బోలె దిగ్గున నొక యద్భుతకాంతితోఁ జెనంతట.

సీ. దిశలెల్ల వెలిఁగించు - దివ్యతేజముతోడ - రమణీయభర్మాంబ - రంబుతోడ
శంఖచక్రగదాది - సాధనంబులతోడ - డంబైనమణికిరీ-టంబుతోడ
వాహనంబైనట్టి - వైనతేయునితోడ - రాజిల్లుభార్గవీ - రమణితోడ
చెంగటఁగల సుర - జ్యేష్ఠాత్మజునితోడ - పరివారపరిషద - ప్రతతితోడ

గీ. యట్టివిజయాశ్వ నృపతియు-సతనిసతియు । వింతపడి చూచుచుండఁ బృ-శ్వధరుండు
వేదవేద్యుండు వైకుంఠ-విభుఁడజుండు । దిచ్చు మొగమయ్యె మోదంబు-దీటుకొనఁగ. 235

క. కలహాశనుఁడురమేశుని । విలసితకరుణా సమృద్ధి - వీక్షించి మదిన్
దలఁచి నుతియించి భక్తిన్ । వెలయఁగ సేవించి చాల - వేడక మీఱన్. 236

వ. అనుజ్ఞఁగొని నిజేచ్ఛం జనుచుండి యాత్మగతంబున. 237

చ. తొడరి మురాసురాంతకుని - తో విజయాశ్వనరేంద్రు సత్కథన్
నుడివితి నాలకించెను వి - నోదముగా నతఁడంతె కాదుతాఁ

జడిముడిపెట్టి భూవిభుని - శీలము లెంగఁదలంచి యప్పుడే
వెడలెను మాయవేషమున - వెంటనెపోయితి నేను సంగఁడన్. 238

ఆ. తలఁచుకొనననగవు - దట్టిడుసటుపోయి । చేయవలసినంతఁ - జేసినార
మిరువురమునుతుడను - నగపతిగుణపులు । మెచ్చివరములిచ్చె - లచ్చిమగఁడు. 239

క. ఇదినా నేరుపు కాదా? । పదిలంబుగ నెపుడునిట్టి - పనులకు నెపముల్
వెదకుచు నావ్రతమిట్టిద । కద; కడఁక ఫలించెఁ దృప్తి - గలిగెన్ మనకెన్. 240

ఉ. మూడుజగంబులందునను - మున్ను వినంబడనట్టిదైనయీ
వేడుకమించు సత్కథను - విన్నజనుల్ నను మెచ్చిచాలఁగాఁ
బోరిడఁడు నారదుండనరె? - భోగిశయానునుతింపకుందురే?
యాడినఁదప్పనట్టివిమ - లాత్ముఁడు గాంచు సమస్తసౌఖ్యముల్ 241

క. అనితెలపోయుచుగానం । బునుఁజేయుచుహరినిమనని - బొగడుచునృత్యం
బొనరించుచుమీఁదటియో । జనఁగావింపుచునతండు - సనియెనిజేచ్ఛన్. 242

క. అంతటధాత్రీపతినిజ । కాంతాయుతుఁడై రమేశుఁ - గరుణాకరు స
ర్వాంతర్యామినిఁబొగడుచు । చింతలుమఱివిడిచి తుష్టిఁ - జెందివెలయఁగన్. 243

క. హరియానతి లాగునఁదాఁ । బరమానందమునరాజ్య - భారముఁబూనెన్
నరపతులువొగడఁదొల్లిటి । కరణిన్ భోగంబులెల్లఁ - గడలుకొనంగన్. 244

క. జనులకుమిక్కిలిసుఖమగు । వినుతిక్రమవిధులు దెలిసి - విజయాశ్వుఁడు రా
మునివలెధర్మంబుగమిం । చినకడిమిని రాజ్యమేలెఁ - జిరవత్సరముల్. 245

క. గురుదేవతాధరిత్రీ । సురులందాభక్తిఁగొలుచు - చుందోడరిమహా
ధ్వరములు పెక్కులొనర్చెన్ । స్థిరముగనిజకీర్తిపకల - దిక్కుల నెరయన్. 246

క. అనుపమమగునీసత్కథ । వినినఁజదివినను నిత్య - విభవములొదవున్
దనరినకష్టములడఁగుం । గనకాంబరుఁడిచ్చు నెల్ల - కామ్యార్థంబుల్. 247

క. అనివిజయాశ్వచరిత్రం । బును సూతుఁడు శౌనకాది - మునులకు వినిపిం
చినవినివారలు మునమున । వినుతించిరి । మొనసి పెక్కు - విధముల నతనిన్. 248

క. విశ్వధరాంబుధిశశిహరి । దశ్వులుఁదారకములుండు - నంతటిదనుకన్
శాశ్వతమై యీసత్కృతి । విశ్వంబులవెలయుఁగాత - వినుతంబగుచున్. 249

శా. లోకారాధ్య! యభేద్యశక్తియుత! ని - ర్లోపప్రభావాన్వితా!
పాకారిప్రముఖామరప్రియకరా! - పద్మామనోనాథ! సు
శ్లోకా! వేంకటశైలవాస! సుజన - స్తోమావనా! పావనా
స్తోకానందమయస్వరూప! గుణసం - దోహాశ్రయా! సుస్థిరా! 250

క. గాంగేయాంశుకశోభిత ! । గాంగేయాకూ్రరసరశు - కప్రిముఖనుతా !
సంగీతప్రియ ! మాయా । సంగీ ! తత్త్వప్రధాన ! సత్యనిధానా ! 251

కృతికర్తృనామగర్భితగథబంధము.

క. శ్రీగోపికావియచ్చర । యోగీంద్రాశ్రయ ! పగోరు - హోదగ ! రవితే
జా ! గజరాజవినుత ! పు । ణ్యా ! గతతాపా ! యనూన - నామ ! నమస్తే ! 252

మంగళమహాశ్రీవృత్తము.

సుందరశుభాంగ ! పరి - శుద్ధ ! సనకాదిముని - శోధితచరిత్ర ! సురలోకా
నంద! ముచుకుందనుత - నామ! కరుణాకర! స - నాతన! శుభస్కర । వివేకా
మందగుణబృందయుత! మందరనగోద్ధరణ! - మంజులకలాప! వరదా! శ్రీ
మందిర! జనార్దన! స-మస్తసుఖపూర్ణ! పర - మప్రవణ! మంగళమహాశ్రీ.

గద్య.

ఇది. శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాద లబ్ధానర్గళచతుర్విధ కవిత్వమహాత్మ్యాభి
రామ, భూసురకుల క్షీరపారావారపర్వశర్వరీసోమ, శ్రీవత్సగోత్ర
పవిత్రాపస్తంబసూత్ర, సావిత్రీలక్ష్మీనృసింహార్యపుత్త్ర,
సుకవిజనవిధేయ, పిచ్చయనామధేయ ప్రణీతంబగు
విజయాశ్వచరిత్రంబను ప్రబంధంబున నుత్తర
భాగంబున తృతీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీమద్వేంకటేశ్వరార్పణమస్తు.



**Printed at The India Printing Works, Madras.**